# ఆంధ్రప్రదేశ్‌లో మునిసిపాలిటీల, మునిసిపల్ కార్పొరేషన్ల కరదీపిక

# A Hand Book of Municipalities & Municipal Corporations in Andhra Pradesh

రచన

టి. వెంకటేశ్వరరావు

నగరపాలక సంస్థ మాజీ మేయరు

విజయవాడ

ప్రచురణ

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

ఆబిడ్స్, హైదరాబాద్

# ఆంధ్రప్రదేశ్‌లో

# మునిసిపాలిటీల, మునిసిపల్ కార్పొరేషన్ల

# కరదీపిక

**A**

**Hand Book of Municipalities &**

**Municipal Corporations**

**in Andhra Pradesh**

రచన

టి. వెంకటేశ్వరరావు

నగరపాలక సంస్థ మాజీ మేయరు

విజయవాడ

ప్రచురణ

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

ఆబిడ్స్, హైదరాబాద్

ప్రచురణ నెం 2266

ప్రథమ ముద్రణ జులై, 2001

ప్రతులు 1000 కాపీలు

వెల . రు 100/-

ప్రతులకు

**విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్**

ఆబిడ్స్, హైదరాబాద్ - 500 001

**విశాలాంధ్ర బుక్‌హౌస్**

ఆబిడ్స్/సుల్తాన్‌బజార్, హైదారాబాద్,

విజయవాడ, విశాఖపట్నం, కాకినాడ,

గుంటూరు, హన్మకొండ, అనంతపురం,

తిరుపతి

---

ముద్రణ : నాగార్జున ఎంటర్‌ప్రైజెస్. విజయవాడ - 4 ఫోన్ : 430302

# విషయసూచిక

# నా మాట

దేశాభివృద్ధిలో భాగంగా, జనాభాలో 30 శాతంపైగా ప్రజలు నివసిస్తున్న నగరాలు, పట్టణాల అభివృద్ధి అత్యంత ప్రధానాంశంగా వుంది మన రాష్ట్రంలో సుమారు 2 1/2 కోట్ల జనాభా నివసిస్తున్న పట్టణాలు, నగరాలు ఆశించిన మేరకుగాని లేదా అవసరమున్న మేరకు గాని అభివృద్ధి సాధించలేకపోతున్నాయి ఈ అర్బన్ స్థానిక సంస్థలకు సరిపడినంత ఆదాయాలులేక, ప్రజాప్రతినిధులకు స్వయంపాలక సంస్థలుగా వ్యవహరించటానికి అవసరమైన అధికారాలు బదిలీకాక అనేక సవాళ్ళను ఎదుర్కోవటం చూస్తున్నాం

మన దేశంలో బ్రిటీష్‌వారి పరిపాలన కాలంనుండి మునిసిపాలిటీలు ఏర్పర్చబడి చట్టాలు రూపొందించారు చట్టాలలో వివిధ సెక్షన్లననుసరించి రూల్సు, బైలాలు తయారయి, అమలులోవున్నాయి

మన రాష్ట్రంలో - ఆంధ్రప్రదేశ్ అవతరణకు ముందు మద్రాసు మునిసిపాలిటీల చట్టం - 1920 ఆంధ్రప్రాంతంలోను, తెలంగాణా ప్రాంతంలో తెలంగాణా చట్టం వేరు వేరుగా వుండేవి 1965 నుండి రెండు చట్టాల స్థానంలో ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టం రాష్ట్రవ్యాపితంగా అమలుజరుగుచున్నది అలాగే రాష్ట్రంలో 1979 వరకు ఒకే ఒక మునిసిపల్ కార్పొరేషన్ - హైద్రాబాద్ వుంది 1955 హైద్రాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ చట్టం అమలులో వుంది పై రెండు చట్టాలకు పలుసార్లు అనేక సవరణలు చేయబడ్డాయి ఈ కాలంలో మరికొన్ని మునిసిపాలిటీలు ఏర్పడ్డాయి అలాగే 1979లో విశాఖపట్నం, 1981లో విజయవాడ, 1994లో గుంటూరు, వరంగల్, కర్నూలు, రాజమండ్రిలను కార్పొరేషన్‌లుగా స్థాయి పెంచారు హైద్రాబాద్, రాజమండ్రి, తిరుపతిలలో ఎన్నికలు నిర్వహించలేదు

అయితే, మునిసిపాలిటీల, మునిసిపల్ కార్పొరేషన్ల చట్టాలు ఇంగ్లీషులోనే వున్నాయి ఆ చట్టాలననుసరించి చెసిన రూల్సు, బైలాలు గూడ ఇంగ్లీషులొనే వున్నాయి

1981, 1987 1995లలో ఎన్నికలు జరిగాయి వేలాదిమంది కౌన్సిల్సులోను, కార్పొరేషన్లలోను ప్రజాప్రతినిధులుగా, ఛైర్‌పర్సన్స్‌గా, మేయర్లుగా ఎన్నికైనారు అందులో చాలామందికి ఇంగ్లీషు భాషాపరిజ్ఞానం లేనందున, రోజువారి పరిపాలనా వ్యవహారాల్లో పాల్గొనటం వారికి అసౌకర్యంగానూ, చాల యిబ్బందిగా వుంది నేను 1981లో మొదటిసారిగా పరోక్ష ఎన్నిక ద్వారా విజయవాడ నగరపాలక సంస్థకు మొదటి మేయరుగా ఎన్నికైనాను అలాగే 1995లో ప్రత్యక్ష ఎన్నిక ద్వారా మేయరుగా ఎన్నికైనాను ఈ పది సంవత్సరాల కాలంలొ కార్పొరేషన్ పరిపాలనలో 'తెలుగు'లేని లోటును, యిబ్బందులను గమనించాను 1995 జూన్‌లొ, విజయవాడలో మేము నిర్వహించిన మేయర్ల, ఛైర్‌పర్సన్స్ సదస్సులలో

పాల్గొన్న చాలామంది ఛైర్‌పర్సన్స్ వెలిబుచ్చిన అభిప్రాయాలు, బాధలు విన్నాను ఆ సదస్సులోనే చట్టాలు, రూల్సు, బైలాలు మరియు యీ సంస్థల్లో దైనందిన వ్యవహారాలన్నీ తెలుగులోనే వుండాలని, సభ్యులు ఏవైనా ఫైల్సు చూచినా, వారికి ఆ సబ్జక్టు పూర్తిగా అవగాహన కావాలని కోరాం

గతంలో విషయం స్పష్టంగా తెలియకపోయినా, ఇటీవల కాలంలో మునిసిపల్ పరిపాలన గురించి తెలుగులో ప్రచురణలు లేవు - నా దృష్టికి వచ్చినంతవరకు 1989లో డేటా న్యూస్ ఫీచర్సు, హైద్రాబాద్‌వారు ప్రచురించిన "ఆంధ్రప్రదేశ్ పురపాలక దర్శిని", అదే సంవత్సరంలో తెలుగు అకాడమీవారు ప్రచురించిన ఆచార్య టి అప్పారావుగారు రచించిన "పురపాలక సంస్థలు" మాత్రం తెలుగులో వచ్చాయి "ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల మాన్యువల్" - 1965 చట్టాన్ని, చట్టంక్రింద చేసిన రూల్సు, బైలాలను ఏషియా లా హౌస్ హైద్రాబాద్‌వారు తెలుగులో ప్రచురించారు మునిసిపల్ కార్పొరేషన్ల విషయంలో తెలుగులో ఎలాంటి ప్రచురణా లేదు

అర్బన్ స్థానిక సంస్థల్లో ప్రజాప్రతినిధులుగా బాధ్యతలు నిర్వహించుచున్న వారికి తెలుగులో చట్టాలు, రూల్సు లేకపోవటం సమర్ధవంతంగా పరిపాలన చేయటానికి ఆటంకంగానే వుంది నాకైనా సంపూర్ణ, సమగ్ర పరిజ్ఞానం లేకపోయినా, పది సంవత్సరాలలో స్వయంగా పొందిన అనుభవం దృష్ట్యా అంతా గాకున్నా కొంతమేర్కైనా ఆ లోటును పూడ్చటం అవసరమని గట్టిగా నమ్మాను ఫలితమే యీ కరదీపిక (Hand book)

మునిసిపల్ ఆక్టు, కార్పొరేషన్ ఆక్టులలో కొన్ని ముఖ్యాంశాలను పరిపాలనలో నిర్వహిస్తున్న ప్రజాప్రతినిధులకు ప్రయోజనకరంగా వుండేవాటిని (Selective)గా తెలుగులో వ్రాయటమేగాక, వాటి అమలులో ఎదురౌతున్న సమస్యలు, వాస్తవ స్వయంపరిపాలనా సంస్థలుగా అవి పనిచేయలేని పరిస్థితులను విశ్లేషణపూర్వకంగా తెలియజేయుటకు ప్రయత్నించాను అంతేగాక స్థానిక సంస్థలకు వరప్రసాదాయినిగా నేను భావించిన 74వ రాజ్యాంగ సవరణ చట్టం, స్థానిక సంస్థల ఆర్థిక పరిపుష్టికి రాజ్యాంగం ఏర్పర్చి, మన రాష్ట్రంలో ప్రభుత్వంచే 1994లో నియమించబడిన ప్రధమ ఆర్థిక కమీషన్ 1997లో చేసిన సిఫార్సులు, అవి అమలైన తీరు, పరిపాలనలో మరింత ప్రజాస్వామికంగాను, వాస్తవ స్వయంపాలనకు వీలైన నూతన విధానాన్ని మేయర్ ఇన్ కౌన్సిల్, ఛైర్మన్ ఇన్ కౌన్సిల్ విధానాల వివరాలను గూడ చేర్చటం జరిగింది బాధ్యతలు నిర్వహించేవారు ఆ విధానాల అమలుకు మన రాష్ట్రంలో కృషి చేయాలనే బలమైన అభిప్రాయంతో విశదీకరించాను

పన్నులు, చార్జీలు, ఫీజులు వగైరా ఆదాయ వనరుల గురించి, సర్వీసులను క్రమక్రమంగా ప్రైవేటీకరణవైపుగా పయనిస్తున్న ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వంవారి ఆలోచనలు తెలియచేయ ప్రయత్నించాను అర్బన్ ఏరియాల పరిపాలనతో సంబంధం వున్న మరి

కొన్ని చట్టాల ముఖ్యాంశాలను, అర్బన్ ఏరియాల అభివృద్ధికి దోహదం చేస్తున్న పట్టణాభివృద్ధి సంస్థల (Urban Development Authorities) కార్యకలాపాల గురించి, ఇటీవల కాలంలో పట్టణాలు, నగరాలలో పెరిగిపోయిన మురికివాడలను అభివృద్ధిచేసి, అందులోని లక్షలాది మంది పేదలకు మెరుగైన సౌకర్యాలు - సామాజికంగా, ఆర్థికంగా - అభివృద్ధికి కృషిచేస్తున్న DF 1D సంస్థ గురించి, నేడు దాదాపు అన్ని మునిసిపాలిటీలు, కార్పొరేషన్లలో అనేక మౌలిక అభివృద్ధి కార్యక్రమాలకు ఆర్థిక సహకారం అందించుచున్న "హడ్కో" సంస్థ గురించి - వివరాలు యివ్వటం ప్రజాప్రతినిధులకు మరింత ప్రయోజనకరంగా వుంటుందని బావించి వాటిని యీ రచనలో చేర్చాను

ఇవిగాక పరిపాలనల్లో విజృంభించిన అవినీతిని నిర్మూలించడానికి, ఎన్నికలు జరుగుతున్న తీరు, అందులోని లోపాలు, ఉద్యోగుల, అధికార్లకు సంబంధించి కాడర్ పాలన లాంటి ఆసక్తికర అంశాలు కూడ పొందుపరచబడ్డాయి

మన ఫెడరల్ రాజ్యాంగ విధానంలో కేంద్ర ప్రభుత్వం నుండి నిధులు, అధికారాలు రాబట్టడం రాష్ట్ర ప్రభుత్వాలకు ఎంత అవసరమో, అలాగే అర్బన్ స్థానిక సంస్థలు ప్రజలకు కనీస సౌకర్యాలు కల్గించటానికి, అభివృద్ధిపరచటానికి, ఆధునిక యుగంలో నూతన సవాళ్ళను ఎదుర్కొనటానికి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల నుండి పరిపాలనపరమైన అధికారాలు, ఆర్థికపరమైన సహాయ సహకారాలు పొందటం అత్యంత ఆవశ్యకత వుంది ఈ పరస్పర సంబంధాన్ని ఎవ్వరూ కాదనలేరు అది రాజ్యాంగబద్ధమైనది నేనాశించిన లక్ష్యం కొంతమేరకైనా యీ గ్రంథం ద్వారా నెరవేరినట్లయితే, నా శ్రమ ఫలించిందని సంతసిస్తాను

ఈ గ్రంధ రచనకు నన్ను ప్రోత్సహించిన అనేకమంది నా సహచరులకు, నేను కోరగా సమాచారాన్ని పంపిన గౌరవ మేయర్లకు, ఛైర్‌పర్సన్స్, కమిషనర్లకు, సమాచార సేకరణలోనేగాక, యితరత్రా యీ గ్రంధ రచనకు ఇతోధికంగా తోడ్పడిన హైదరాబాద్ విశాలాంధ్ర మేనేజరు శ్రీ కె లక్ష్మణరావుకు, విలేకరి ఫాజిల్‌కు, విశాలాంధ్ర దినపత్రిక ఎగ్జిక్యూటివ్ ఎడిటర్ శ్రీ యం సుబ్బారావుగారికి, వివిధ ప్రాంతాల రిపోర్టరులకు, హడ్కో, DF 1D, Unicef, Urban Development Authorities అధికారులకు నా కృతజ్ఞతాభి వందనలు

ప్రింటింగ్ విషయంలో విశేషంగా తోడ్పడిన విశాలాంధ్ర విజ్ఞాన సమితి జనరల్ మేనేజర్ శ్రీ గూడవల్లి నాగేశ్వరరావు, చీఫ్ ఎక్కొంటెంట్ శ్రీ కె వి శర్మకు, ప్రెస్ మేనేజర్ శ్రీ వై వెంకటేశ్వరరెడ్డికి, డి టి పి ఆపరేటర్లు శ్రీమతి కుమారి, పద్మావతి, ప్రూఫ్‌రీడర్లకు, తమ ప్రచురణగా స్వీకరించిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ మేనేజర్ శ్రీ పి రాజేశ్వరరావుకు, ముందుమాట వ్రాసిన శ్రీ బి పి ఆర్ విఠల్ IAS (రిటైర్డ్) గార్కి నా కృతజ్ఞతలు

**- టి. వెంకటేశ్వరరావు**

# ముందుమాట

శ్రీ టి వెంకటేశ్వరరావుగారు ప్రజాసేవకు తమ యావజ్జీవితాన్ని అంకితం చేసిన పాతతరం రాజకీయ నాయకులలో ఒకరు కొన్ని నిర్దిష్టమైన సాంఘిక, ఆర్థిక లక్ష్యాల సాధనకొరకు వారు ప్రజలను సంఘటితం చేశారు వారు ఆ లక్ష్యాలను తమ స్వంత ఆకాంక్షనుబట్టిగాక న్యాయమైన సామాజిక, ఆర్థిక వ్యవస్థ దార్శనికతతో నెలకొల్పుకున్నారు గత శతాబ్దం ప్రథమార్థభాగంలో మనదేశంలోనే కాదు, యావత్ ప్రపంచంలోనూ జరిగిన రాజకియ పోరాటాల తరహా అదే పశ్చిమ దేశాలలో ఇప్పుడు రాజకీయాలు ఒక భావజాల సాధనంగాగాక వృత్తిగా మారాయి కాగా మన దేశంలో అత్యధికులకు అలాకూడా కాకుండా దోపిడీ చేయడానికి లేదా హోదా పెంచుకుని సంపద ప్రోది చేసుకోవటానికి ఒక మార్గం అయినాయి శ్రీ టి వెంకటేశ్వరరావులాంటి వ్యక్తులు ఆ మహోజ్వల గతానికి ప్రతినిధులు అదృష్టవశాత్తు, యువతరంలొ అటువంటి నాయకత్వం మళ్లీ రావటాన్ని ఇప్పుడు మనం చూస్తున్నాం వీరికి వారు ఆదర్శంగా నిలుస్తారు

శ్రీ టి వెంకటేశ్వరరావుకు ఎంతో వైవిధ్యంగల రాజకీయ అనుభవం వుంది ఆయన రైల్వే కార్మికుల ట్రేడ్ యూనియన్ నిర్మించారు కార్మికోద్యమంనుండి విశాలాంధ్ర విజ్ఞాన సమితి నిర్వహణ బాధ్యతలలోనికి మారారు విజయవాడ 1981లో మున్సిపల్ కార్పొరేషన్‌గా అప్‌గ్రేడ్ అయిన తదుపరి ఆయన ప్రథమ మేయర్ 1995లో తిరిగి మేయర్ అయినారు మన రాష్ట్రంలో విజయవాడ సాంస్కృతికంగా, ఆర్థికంగా ముందుపీఠినవున్న నగరం ఆ నగరానికి తగినట్లుగా శ్రీ టి వెంకటేశ్వరరావు మేయర్ పదవికి వన్నె తెచ్చారు

శ్రీ టి వెంకటేశ్వరరావు ఈ పూర్వరంగంతో స్థూలంగా పురపాలక పాలన గూర్చి, ముఖ్యంగా నగరపాలకసంస్థల (మున్సిపల్ కార్పొరేషన్‌లు) గూర్చి ఈ చక్కని పుస్తకం రచించారు పురపాలక పాలన చరిత్ర స్థూల సమీక్షతో ప్రారంభమైన ఈ రచన పురపాలక సంఘాలు నగరపాలక సంస్థల చట్టాలు, సంబంధిత రూల్స్ విషయంలో ఉపయుక్తమైన గైడ్‌గా ఉపకరిస్తుంది పురపాలక సంస్థల మౌలికాంశాలనేగాక, వాటితో సంబంధమున్న రాజకీయాలగూర్చి శ్రీ వెంకటేశ్వరరావు ఇందులో చర్చించారు మన రాష్ట్రంలో రాష్ట్ర ప్రభుత్వాధికారాన్ని చేపట్టిన వివిధ రాజకీయ పార్టీల క్రింద స్థానిక స్వపరిపాలన తీరు తెన్నులను విశ్లేషించటానికి ఆయన ఎంతైనా తగినవ్యక్తి ఆ తదుపరి రెండు ప్రధానమైన అంశాలను - మున్సిపల్ ఆర్థిక వనరులు, మున్సిపల్ సేవలను ఆయన సవివరంగా చర్చించారు

కేంద్రం నుండి అధికాధికంగా వనరులు, అధికారాల పంపిణీని గట్టిగా కోరుతున్న

రాష్ట్రప్రభుత్వాలు స్థానికసంస్థల విషయంలో అదే పని చేయటానికి ఎలా సంకోచిస్తున్నాయో శ్రీ వెంకటేశ్వరరావు చూపారు స్వాతంత్ర్యం సిద్ధించిన నాటినుండి, కేంద్రం నుండి రాష్ట్రాలకు ఆర్థికవనరుల పంపిణీ క్రమానుగతంగా పెరుగుతూ వస్తున్నది కేంద్రం వసూలు చేసే పన్నుల్లో చట్టబద్ధమైన వాటా రూపంలో అది జరుగుతున్నది అయితే తమ స్వంత పన్నుల ఆదాయాలలో నిర్దిష్టమైన శాతాన్ని స్థానిక సంస్థలకు యివ్వడానికి ఏ రాష్ట్రప్రభుత్వమూ సుముఖత చూపడంలేదు స్థానిక సంస్థలు తమకు నిర్దేశించిన పన్నులపైన లేక గ్రాంటులపైన ఆధారపడివున్నాయి గ్రాంటుల్లో ఎక్కువభాగం ఉద్యోగుల జీతాల రూపంలో లభిస్తున్నాయి అందువల్ల తమ సిబ్బందిపై మున్సిపాలిటీలకు ఎటువంటి అజమాయిషీ లేదు 73వ, 74వ రాజ్యాంగ సవరణల అనంతరం నియమించబడిన ప్రథమ రాష్ట్ర ఫైనాన్స్ కమిషన్ తొలుత ఆశించినట్లుగా ప్రయోజనకారి కాలేకపోయింది రాజ్యాంగ సవరణ రూపకల్పనలోవున్న లోపం కూడా ఇందుకు కొంత కారణం రాష్ట్ర కమిషన్‌ల సిఫారసులను జాతీయ ఫైనాన్స్ కమిషన్ పనితో సంధానించటం జరగలేదు

"ప్రతి ఐదవ సంవత్సరం ముగియటంతో లేదా అంతకుముందుగా" ఫైనాన్స్ కమిషన్ నియామకం జరగాలని రాజ్యాంగంలోని ఆర్టికల్ 280 నిర్దేశిస్తోంది కాగా రాష్ట్ర ఫైనాన్స్ కమిషన్ నియామకానికి వీలు కల్పిస్తున్న ఆర్టికల్ 243(1)లో "లేదా అంతకు ముందుగా" అన్న మాటలను తొలగించటంవల్ల పాత కమిషన్ పదవీకాలం ముగిసి కొత్త కమిషన్ నియమించే మధ్యకాలం వెసులుబాటు లేకుండా తయారవుతున్నది ఈ లోపాన్ని ముసాయిదా బిల్లు తరుణంలోనే నేను కేంద్రమంత్రుల దృష్టికి, పార్లమెంట్ జాయింట్ సెలెక్ట్ కమిటీ దృష్టికి తీసుకెళ్లాను అయినా వారెవరూ దానిని పరిగణనలోకి తీసుకోలేదు స్థానిక సంస్థల ఆర్థిక సమస్యలను రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు హేతుబద్ధంగా విశ్లేషించటానికి ఇప్పుడది అవరోధంగా నిలుస్తున్నది రాష్ట్ర ఫైనాన్స్ కమిషన్‌ల కనీస సిఫారసులను కూడా ఏవిధంగా ప్రభుత్వం అమలు చేయటంలేదో శ్రీ వెంకటేశ్వరరావు ప్రస్తావించారు ఇందుకు భిన్నంగా, రాష్ట్రాలకు వనరుల బదలాయింపుపై జాతీయ ఫైనాన్స్ కమిషన్‌ల సిఫారసులను జాతీయ ప్రభుత్వాలు ఎల్లప్పుడూ ఆమోదిస్తున్నాయి

శ్రీ టి వెంకటేశ్వరరావు మన దృష్టికి తెస్తున్న మరో సమస్య పరిపాలనా వ్యయం, స్థానిక సంస్థలకు తమ సిబ్బందిపై అజమాయిషీ లేకపోవటం రాష్ట్ర ప్రభుత్వానికి సుమారు 300 మంది ఐ ఎ ఎస్ అధికారులున్నారు వారు కేంద్ర ప్రభుత్వ అజమాయిషీ క్రింద వున్నట్టు లెక్క పూర్తిగా రాష్ట్రప్రభుత్వం క్రింద పనిచేసే ఉద్యోగులు 6 లక్షలకు పైగా వున్నారు కాగా స్థానిక సంస్థలకు సంబంధించి తమ సిబ్బందిలో అత్యధికులు వాటి అజమాయిషీ క్రింద లేరు స్వాతంత్ర్యం సిద్ధించిన నాడు ఇటువంటి పరిస్థితిలేదు స్థానిక

సంస్థల సిబ్బంది ఆనాడు రాష్ట్ర సర్వీసులలో భాగంకాదు స్వాతంత్ర్యానంతరం కొంత కాలానికి ప్రావిన్షియలైజేషన్ అని పిలవబడుతున్న దాని ఫలితంగా స్థానిక సంస్థల సిబ్బందిపై అసలు అజమాయిషీ రాష్ట్ర ప్రభుత్వం క్రిందకు మారింది ఈ సమస్యను పరిశీలించటం అవసరం - తన వేతనాల బిల్లు తగ్గించుకోవాలని రాష్ట్రప్రభుత్వం ఆతృతతోవున్న ఈ సమయంలో దీన్ని పరిశీలించవచ్చు అయితే శ్రీ వెంకటేశ్వరరావు చేస్తున్న ఒక సూచన స్థానిక సంస్థలకు తన సిబ్బందిపై ఇతోదిక అజమాయిషీ వుండాలన్న తన స్వంత ప్రతిపాదనకు విరుద్ధంగా వుంది సిబ్బందిని ఒక మున్సిపాలిటీనుండి మరో మున్సిపాలిటీకి బదిలీ చేయాలని ఆయన సూచిస్తున్నారు ఈ పని చేయాలంటే ప్రావిన్షియల్ కేడర్స్ అవసరం అందువల్ల ఈ సమస్యను ఏ దిశలో పరిష్కరించాలో మనం నిర్దిష్టమైన అభిప్రాయానికి రావాలి స్వయం ప్రతిపత్తికి కొంత మూల్యం చెల్లించాల్సి వుంటుంది ఇది ఎంతయినప్పటికీ, ముఖ్యమంత్రి తన ఛీఫ్ సెక్రటరీపై అజమాయిషీ కలిగివుండే రీతిలో ప్రజలచే ఎన్నుకొబడిన స్థానికసంస్థ అధిపతికి తన కమీషనర్‌పై లేక ఛీఫ్ ఎగ్జిక్యూటివ్‌పై అజమాయిషీ లేకపోవటానికి సమర్ధనీయత లేదు

రాష్ట్రప్రభుత్వం నుండి తోడ్పాటు కొరవడటం గూర్చి శ్రీ వెంకటేశ్వరరావు కొన్నిసార్లు వ్యక్తం చేసిన బాధలో స్థానిక సంస్థలకు ఎన్నుకొబడిన వారందరూ పాలు పంచుకుంటారు మరొకరికి అధికారం యివ్వటానికి లేక అధికారం పంచుకోవటానికి ఎవరిలోనైనా వుండే సహజ సిద్ధమైన అయిష్టత రాష్ట్రప్రభుత్వాల వైఖరులకు కొంతమేరకు కారణం అయితే గమనించవలసిన వ్యవస్థాగత రాజకీయ సమస్యకూడా వుంది 73వ రాజ్యాంగ సవరణలో పొందుపరిచిన సబ్జెక్టులన్నిటినీ రాష్ట్రప్రభుత్వం స్థానిక సంస్థలకు బదలాయిస్తే ఇక మంత్రులు పనిచేయిటానికేమి మిగులుతాయి అప్పుడు రాష్ట్రప్రభుత్వానికి లా, హోం, ఫైనాన్స్ మంత్రులు మాత్రమే అవసరమవుతారు కేంద్రం విషయంలో పరిస్థితి ఇదికాదు కేంద్రానికి వదిలిపెట్టిన స్పష్టమైన, ముఖ్యమైన రంగాలున్నాయి ప్రపంచీకరణ తదుపరి ఇది మార్పుకు గురికావచ్చు ఒక స్థానిక సంస్థ సమర్ధవంతంగా పనిచేసినట్లయితే, ఒక ఎం ఎల్ ఎ తదుపరి పర్యాయం ఏ కారణాలతో నెరుగా ఓట్లు అర్ధించగలడు? స్థానిక నాయకుని భుజాలపై ఎక్కి లేదా తమ పార్టీల పేరుతో అతడు ప్రజలవద్దకు వెళ్లాలి అందువల్లనే, కార్యకర్తలు ప్రాతిపదికగా గలిగిన కమ్యూనిస్టుపార్టీలు స్థానిక సంస్థలను పటిష్టం చేశాయి ఇతరులు ప్రజల వద్దకు వెళ్లటానికి ఎం ఎల్ ఎ లేక ఎం పి నియోజకవర్గ నిధులు కోరుతున్నారు లోగడ వున్న చట్టాలు జిల్లాపరిషత్ చైర్మన్‌లుగా ఎం ఎల్ ఎ లను అనుమతించటంద్వారా ఈ సమస్యను అధిగమించాయి అటువంటి ఛైర్మన్లు శాసనసభ లోపల స్థానికసంస్థల పక్షాన శక్తివంతమైన లాబీగా వుండేవారు ఈరోజు మనకు అటువంటి లాబీ లేదు

అందువల్లనే మంత్రులు గాని, లెజిస్లేటర్లుగాని, బ్యూరోక్రసీగాని స్థానిక సంస్థలకు అధికారాలు వనరుల బదిలీని కోరుకోవటంలేదు కేవలం స్థానిక సంస్థల నియోజకవర్గాలతో మనం శాసనమండలిని పునరుద్ధరించాలని చాలా పర్యాయాలు నేను సూచించాను పంచాయతీ, మండల, జిల్లా పరిషత్ సభ్యులు శాసనమండలి సభ్యులను ఎన్నుకుంటారు స్థానిక సంస్థలకు సంబంధించి ఏ శాసనంకూడా ఈ శాసనమండలి ఆమోదం లేకుండా పాస్ కాదు అనగా, కేంద్రంలో రాష్ట్రాలకు కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్ (రాజ్యసభ) వున్నట్లే కొత్త శాసనమండలి స్థానికసంస్థల కొరకు పనిచేస్తుంది

శ్రీ వెంకటేశ్వరరావు తన విస్తృతమైన పరనం, గొప్ప అనుభవంతో ఈ పుస్తకంలో అనేక యితర విలువైన సూచనలు చేశారు ఇవన్నీ శ్రద్ధగా పరిశీలించదగినవి ఈ సమగ్రమైన పుస్తకం రచించటంద్వారా మంచి మున్సిపల్ పరిపాలన లక్ష్యానికి శ్రీ వెంకటేశ్వరరావు ఎనలేని సేవ చేశారు ప్రజల వలస కారణంగా నిరుద్యోగం, దారిద్ర్యం వంటి సమస్యలు గ్రామాలనుండి పట్టణాలకు తరలుతున్నాయని అన్ని సర్వేలూ తెలియజేస్తున్నాయి గ్రామస్వరాజ్యం గూర్చిన గాంధీజి దార్శనికత, మావో కమ్యూన్‌లు రెండూ విఫలమైనాయి తక్కువ స్థాయిగల ఈ తరం ఎటువంటి మెరుగైన పరిష్కారం చూపబోవడంలేదు అందువల్ల మనం ఈ సమస్యలను పట్టణ సమస్యలుగా చేబట్టాలి ఈ విషయంలో ఈ పుస్తకం వంటివి ప్రయోజనకారిగా వుంటాయి మన జాతీయ నాయకులలో గొప్పవారికి మున్సిపల్ పరిపాలనతో సంబంధం వుంది చిత్తరంజన్‌దాస్, వల్లభ్ భాయి పటేల్ జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్, టంగుటూరి ప్రకాశం వంటివారు తమ స్వస్థల నగరాలలో మున్సిపాలిటీలు లేక కార్పొరేషన్‌లకు నేతృత్వం వహించారు పరిపాలన సమస్యలు, లొటు పాతులగూర్చి వారు తొలి అనుభవం సముపార్జించుకుంది ఇక్కడే స్వతంత్ర భారతంలో వారి వారసులు తమ స్వంత ప్రభుత్వాల నుండి పొందుతున్న సహకారంకన్నా మిన్నగా వారికి నాటి బ్రిటిష్ ప్రభుత్వంనుండి, బ్రిటీష్ అధికారుల నుండి సహకారం లభించటం చిత్రంగా లేదూ! ఛైర్మన్‌లు లేక మేయర్లు రెండు రంగాలలో - ఒకటి తమ స్వంత పాలనా యంత్రాంగం, సభ్యులతో, రెండోవైపున రాష్ట్రప్రభుత్వంతో పోరాటం సాగించాలి ఈ మహా వ్యక్తులకన్నా శ్రీ వెంకటేశ్వరరావుకు మరింత ఇబ్బందికరమైన, భిన్నమైన అనుభవం వుండి వుండవచ్చు అందువల్ల ఈ గ్రంథ రచనకు ఆయన ఎంతగానో తగిన వ్యక్తి శ్రీ వెంకటేశ్వరరావు ఔదార్యంతో కోరారని తప్పితే ఈ ముందుమాట వ్రాయడానికి నాకు అర్హతలు లేవు

**- బి.పి.ఆర్. విఠల్,** ఐ ఎ ఎస్

(రిటైర్డ్)

# ఉపోద్ఘాతం

నూతన సహస్రాబ్దిలోనికి ప్రవేశించాం భారతదేశ జనాభా 102 కోట్లు దాటింది ఇందులో పట్టణాల జనాభా 30 5% అనగా 30 కోట్ల 70 లక్షలకు చేరింది భారతదేశం గ్రామాల్లోనే జీవిస్తుంది అనే పూర్వపు నానుడి క్రమక్రమంగా మార్పుచెందుతుంది 2025 నాటికి 40%, 2050కి 50% జనాభా పట్టణాలు, నగరాలలోనే వుంటారని నిపుణుల అంచనాలు

1951 నాటికి మన దేశంలో 2843 పట్టణ ప్రాంతాలుండగా, పట్టణ జనాభా 6 కోట్ల 20 లక్షల మంది మాత్రమే కాగా, 50 ఏండ్ల తర్వాత నేడు 4000కు పైగా పట్టణ ప్రాంతాలు, జనాభా 30 కోట్ల 70 లక్షలకు పెరగటంతో పట్టణాలు, నగరాలు ఊహించనిరీతిలో అనేక సమస్యలను ఎదుర్కొంటున్నాయి గ్రామీణ ప్రాంతాలలో ఉపాధి సౌకర్యాలు క్షీణించటంతో, వేలు, లక్షలమంది గ్రామీణులు ఉపాధి కొరకు పట్టణాలు, నగరాలు చేరుతున్నారు అలాగే చిన్న పట్టణాల నుండి పెద్ద నగరాలకు వలసలు జరుగుతున్నాయి వర్తక, వాణిజ్య, విద్య, వైద్య సంస్థలు, అలాగే లఘు, మధ్య, భారీ పరిశ్రమలు పెరగటంతో, పట్టణాల జనాభా అనూహ్యంగా పెరగటం చూస్తున్నాం

పెరుగుతున్న పట్టణ విస్తీర్ణాలు, జనాభాలు, పట్టణ, నగరాలలో మంచినీటి సరఫరా, రోడ్లు, లైటింగ్, శానిటేషన్, వ్యర్ధపదార్థాల నిర్మూలన, పర్యావరణ రక్షణ, కాలుష్య నిర్మూలన, ట్రాన్స్‌పోర్టు, గృహవసతి, మురికివాడలు ఉధృతి, పేదరికం, నిరుద్యోగం లాంటి మౌలిక సమస్యలు పరిష్కారం కోరుతున్నాయి

పట్టణాలు, నగరాలలో ప్రాధమిక, మౌలిక సదుపాయాల ఏర్పాటుకు దిగువ భారీ పెట్టుబడులు అవసరమని నిపుణుల అంచనాలు

| | | |
|---|---|---|
| రక్షిత మంచినీటి సరఫరాకు | 64,125 | కోట్ల రూపాయలు |
| శానిటేషన్ పథకాలకు | 72,970 | ” |
| వ్యర్థపదార్థాల నిర్మూలనకు | 12,950 | ” |
| డ్రయినేజి పథకాలకు | 22,860 | ” |
| గృహవసతి కల్పనకు | 5,08,920 | ” |
| మొత్తం | 6,81,825 | కోట్ల రూపాయలు |

ఇవిగాక, దారిద్ర్య నిర్మూలనకు ఉద్దేశించిన వివిధ పథకాలకు - ఉపాధి, విద్య, వైద్యం, రవాణా, అక్షరాస్యత, మురికివాడల అభివృద్ధి లాంటి పథకాలకు భారీమొత్తంలో లక్షల కోట్ల రూపాయలు వ్యయం అవసరం అవుతుంది

అయితే, పురపాలక సంఘాలు, నగరపాలక సంస్థలు పైన పేర్కొన్న మౌలిక, ప్రాధమిక సౌకర్యాలు తమ ప్రజలకు కలిగించే స్థితిలో వున్నాయా - అవకాశాలున్నాయా పరిశీలించితె, నిరుత్సాహ వాతావరణమే కనబడుతుంది స్థానిక సంస్థలు తమ సాంప్రదాయ ఆదాయంతొ ఏ ఒక్క సమస్యను సంతృప్తికరంగా పరిష్కరించలేవు వాటికి వచ్చే ఆదాయాలు చాలా సంస్థల్లో వాటిలో పనిచేసే ఉద్యోగులు, కార్మికుల జీతభత్యాలు కూడా సక్రమంగా చెల్లించ లేకుండా వున్నాయి పెరిగిన జీతభత్యాలు, విద్యుత్ ఛార్జీలు, తరిగిన గ్రాంట్లుతో సతమత మవుతున్నాయనేది వాస్తవం

అందుచేత, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు భారీగా ఆర్థిక సహాయ సహకారాలు అందించితేనే, ఆయా పట్టణాల, నగరాలలో అభివృద్ధి సాధ్యం గత కొన్ని సంవత్సరాలుగా అనేక విదేశాలు, విదేశీ సంస్థలు మౌలిక సదుపాయాలకు అప్పులు, గ్రాంట్లు అందించుచుండ టంతో, కొద్దిగా యీ రంగంలో వెసులుబాటు కనపడుతుంది కేంద్ర పట్టణాభివృద్ధి పథకాల వాస్తవ అవసరాల వ్యయంతో పదవ వంతు కూడా ఏర్పాటు చేయటం లేదు రాష్ట్ర ప్రభుత్వాలు - అనేకం ఆర్థికలోటు, సంక్షోభంలో వుండటంతో, చట్టబద్ధంగా స్థానిక సంస్థలకు యివ్వవలసిన గ్రాంట్లు సకాలంలో పూర్తిగా విడుదల చేయకపోవటంతోపాటు, కేంద్రం యిచ్చే కొన్ని గ్రాంట్లను కూడా స్థానిక సంస్థలకు యివ్వకుండా, పక్కదారి పట్టిస్తున్న ఆక్షేపణీయ విధానాలకు దిగటం గమనిస్తున్నాం ఉదా పదవ ఫైనాన్స్ కమిషన్ గ్రాంట్లు పట్టణ, నగరాల తక్షణ సమస్యలు కొండంత వాటి పరిష్కారానికి వున్న అవకాశాలు ఆవగింజంతగా వున్నాయనేది కఠోర వాస్తవం పై కారణాలవల్ల నగరాలు, పట్టణాల అభివృద్ధి క్రమం నత్తనడక తప్పదు

పట్టణాల, నగర ప్రజలకు ఆమాటకువస్తే లక్షలాది గ్రామాల్లోని మొత్తం 102 కొట్ల మంది ప్రజలకు ప్రాధమిక పౌరవసతి సౌకర్యాలు కల్పించవలసిన బాధ్యత యీ స్థానిక సంస్థలమీదనే వుంది అనగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు దేశాభివృద్ధికి అన్నిరంగాలలొ ఎంత కృషి చేయాలో, అంతే కృషి - స్థానిక స్థాయిలో యీ స్థానిక సంస్థలు నిర్వహించాలి

అయితే భారత రాజ్యాంగం ప్రకారం స్థానిక సంస్థలు, స్థానిక పరిపాలన రాష్ట్ర ప్రభుత్వ పరిధిలో వుండటంతో, స్థానిక సంస్థలకు దేశవ్యాపితంగా ఒకే విధమైన, కేంద్రీకృతమైన చట్టాలు లేవు రాష్ట్రాలు తమ తమ రీతిలో స్థానిక సంస్థల ఏర్పాటు, వాటి విధులు, బాధ్యతలు, వీటిని పరిపాలించు ప్రజాప్రతినిధులకు కల్పించిన అధికారాలు, వీటి ఆర్థిక వనరులు, వీటి నిర్వహణపై అజమాయిషీలు భిన్నభిన్నంగా వున్నాయి పంచాయతీలకు ఒక చట్టం, మునిసిపాలిటీలకు ఒక చట్టం, మునిసిపల్ కార్పొరేషన్లకు వేరొక చట్టం అన్ని రాష్ట్రాలలోను వున్నాయి

బ్రిటిష్ పరిపాలనా కాలంలో ఏర్పడిన స్థానిక సంస్థలు - మొదట నామినేటెడ్ సభ్యులతోను, దరిమిలా పాక్షిక నామినేటెడ్ - పాక్షిక ఎన్నికైన ప్రజాప్రతినిధులతోను

ఏర్పడ్డాయి వీటికి మొదటిసారిగా 1882లో లార్డ్ రిప్పన్ వైస్రాయిగా వున్న కాలంలో విస్తృత అధికారాలు, ఆదాయ వనరులను ఏర్పర్చగా, నేటి స్థానిక సంస్థలకు అవే మూల సమస్య లుగా వున్నాయి ఆయా స్థానిక సంస్థలకు వారి గ్రామ, పట్టణాలలోని ప్రాధమిక సౌకర్యాలు ఏర్పాటు బాధ్యతలు, పన్నులు వసూలు చేసుకునే విధానాలు, రాష్ట్ర ప్రభుత్వాలు యీ స్థానిక సంస్థలకు ఆర్థికపరమైన సహాయ సహకారాలు యిచ్చే వీలు లార్డ్ రిప్పన్ తీర్మానం లోనే పొందుపరచబడినవి ఈనాడు అన్ని స్థాయిలలోని స్థానిక సంస్థలు - రెండు ప్రధాన అంశాలను కోరుతున్నాయి ఒకటి ఎన్నికైన ప్రజాప్రతినిధులకు స్వయం పాలనాధికారాలు కల్పించటం - వారికప్పగించిన బాధ్యతలు నిర్వహించటానికి చాలినన్ని నిధులు చేకూర్చాలి ఇవే కోర్కెలు గ్రామ పంచాయతీ నుండి, మునిసిపాలిటీలు, కార్పొరేషన్ల వరకు - స్వాతంత్ర్యం సిద్ధించిన నాటినుండి కోరుతూనే వున్నాయి

స్థానిక సంస్థల సుదీర్ఘ పరిణామ చరిత్రలో 1992 ఒక సువర్ణాక్షరాలతో లిఖించదగిన 74వ రాజ్యాంగ సవరణ చట్టం పార్లమెంటు ఆమోదించి, 1993 నుండి అమలుజరిగింది కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలతోపాటు, స్థానిక ప్రభుత్వ స్థాయి రాజ్యాంగ రీత్యా గుర్తించబడింది మునిసిపాలిటీల, కార్పొరేషన్ల పదవీ కాలపరిమితి 5 సంవత్సరాలుగా నిర్ణయించి, క్రమం తప్పకుండా ప్రతి 5 సం॥లకు ఒకసారి విధిగా ఎన్నికలు జరిపించుటకు, మహిళలకు, బడుగువర్గాలకు, షెడ్యూల్డు కులాలు, జాతులకు రిజర్వేషన్లు - ఎన్నికలు నిర్వహించటానికి ప్రతి రాష్ట్రంలో ఎన్నికల కమిషనర్ల ఏర్పాటు - ప్రజాప్రతినిధులకు స్వయం పరిపాల నావకాశాలు కల్పించుటకు పూర్తి అధికారాలు, ఆర్థికపరమైన పరిపుష్టిని కల్పించటానికి రాష్ట్రాదాయంలో సమంజసమైన శాతం విధిగా స్థానిక సంస్థలకు బదలాయింపులకు రాష్ట్ర ఆర్థిక కమిషన్ల ఏర్పాటు - ఏదైనా కారణంవల్ల ఎన్నికైన స్థానిక సంస్థలను రద్దుచేసినా, తిరిగి 6 నెలల్లోగా విధిగా ఎన్నికలు జరిపించి, ప్రజాప్రతినిధుల పాలన నెలకొల్పుటకు రాజ్యాంగబద్ధంగా యీ చట్టం వీలుకల్పించింది అలానే షెడ్యూలు 12 ద్వారా అర్బన్ సంస్థలకు మరిన్ని బాధ్యతలు కల్గించింది

అయితే, దేవుడు వరమిచ్చినా, పూజారి అడ్డుకున్న చందంగా, స్థానిక సంస్థలు రాష్ట్ర పరిపాలనా పరిధిలో వుండటంవల్ల, చాలా రాష్ట్ర ప్రభుత్వాలు 74వ రాజ్యాంగ సవరణ చట్టం ప్రకారం స్థానిక సంస్థలకు అదనంగా అధికారాలు బదలాయించలేదు కమిషనర్ల కున్న విపరీత అధికారాలను తగ్గించలేదు షెడ్యూలు 12 ప్రకారం విధులను, నిధులను అన్నింటిని బదలాయించలేదు మన రాష్ట్రంలో జిల్లా, రాష్ట్ర, మెట్రోపాలిటన్ ప్లానింగ్ కమిటీలు ఏర్పాటు చేయబడలేదు

మన రాష్ట్రంలో మునిసిపాలిటీల ఏర్పాటు, దశాబ్దాలుగా పరిణామాలు తెలుసుకుందాం

# 1. మునిసిపాలిటీలు - పుట్టుపూర్వోత్తరాలు

పట్టణవాసం అన్న మాటలు మనకు క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దంనుండే ఉన్నట్లు చరిత్రను పరిశీలిస్తే అర్ధం అవుతుంది నాగరికులు, స్థానికులు, గోపలు అని మూడు రకాలుగా ప్రజలను వారు నివసించే ప్రాంతాన్ని బట్టి వర్గీకరించినట్లు అర్ధశాస్త్ర సృష్టికర్త కౌటిల్యుడు పేర్కొన్నాడు పట్టణ ప్రాంత జనాభాను పరిపాలించే విధానాలను కూడ ఇతడు పేర్కొన్నాడు భవంతుల నిర్మాణం, రోడ్ల నిర్మాణం, ప్రాంతాలను 'జోన్'ల క్రింద విడదీయటం లాంటి విషయాలు, శుక్రనీతి, వాస్తుశాస్త్రాలలో ప్రస్తావించారు

ఇటీవల చరిత్రను పరిశీలిస్తే, 1814లోనే ప్రాధమిక అవసరాలకుగాను రెగ్యులేషన్ 16 ప్రకారం వార్డు కమిటీలు ఏర్పాటుచేసుకునే హక్కును బ్రిటిష్ ప్రభుత్వం స్థానికులకు కల్పించింది ఈ కమిటీలు చౌకీదార్లకు (వాచ్ అండ్ వార్డు) జీతం యిచ్చేందుకు, స్థలాలు, ఇండ్లపై పన్ను విధించే అధికారం పొందాయి 1837లో చేసిన పదిహేనవ చట్టం ప్రకారం పట్టణాలలో పారిశుద్ధ్య కార్యక్రమాలను అమలుపరచటానికి కమిటీలను ఏర్పాటుచేయాలని నిర్ణయించింది 1842లో బెంగాల్ చట్టం 'పది' ప్రకారం పట్టణ లక్షణాలుగల ఏ ప్రాంతాన్నైనా, ఆ ప్రాంతంలోని రెండింట మూడువంతులు ప్రజలు కోరినట్లయితే, దానిని మునిసిపాలిటీగా ప్రకటించే అవకాశం కల్గించింది అయితే, ఈ పాలనకు అవసరమైన నిధులన్నింటిని ప్రజలపై, ప్రత్యక్ష పన్నులద్వారానే పొందాలనే ప్రభుత్వ ప్రతిపాదనను ప్రజలు తిరస్కరించారు దీనితో 1850లో మరో 26వ చట్టాన్ని ప్రవేశపెట్టారు దీని ప్రకారం కూడ ప్రజల కోరికపై మాత్రమే మునిసిపాలిటీల ఏర్పాటు జరగాలని నిర్ణయించారు

అప్పట్లో మునిసిపాలిటీలలో జిల్లా మేజ స్టేట్, స్థానికులు కమిషనర్లుగా వుండేవారు ఈ విధానాన్ని కూడ ప్రజలు ఆమోదించలేదు ఇందులోని కొన్ని లొసుగులను తొలగించి, 1865లో పట్టణాభివృద్ధి చట్టాన్ని చేశారు ఈ చట్టం ప్రకారం మునిసిపల్ కౌన్సిలులో ముగ్గురు ఎక్స్ అఫీషియో సభ్యులు, అయిదుగురు యితర సభ్యులను ప్రభుత్వం నియమించుతుంది స్థానిక మేజిస్ట్రేటు, ప్రజాపనుల శాఖ రేంజి ఆఫీసరు, జిల్లా మేజిస్ట్రేటు ఎక్స్ అఫీషియో సభ్యులుగాను, జిల్లా కలెక్టరు కౌన్సిల్ ఛైర్మన్‌గా వ్యవహరించేవారు స్థానిక పోలీసులకు జీతభత్యాలు చెల్లించటం, విద్యుత్ సరఫరా, నీటి సరఫరా, రోడ్ల నిర్మాణం, ఆరోగ్యం, పారిశుద్ధ్యం మొదలగు కార్యక్రమాల అమలుకు పన్నులు విధించే అధికారం మునిసిపాలిటీలకు కలుగచేసింది పోలీసుల ఖర్చులో నాల్గవవంతు ప్రభుత్వం ఇచ్చేది అయినా, యీ చట్టాల సు ర్పులపట్ల ప్రజలు పెద్దగా ఆకర్షితులు కాలేదు ఎక్కువ పని భారంతోవున్న కలెక్టర్లకు 1860-70ల మధ్య ఆర్థిక యిబ్బందులు ఎదుర్కొనటంతో - వారికి రెవిన్యూ వసూళ్ళపై ప్రత్యేక బాధ్యతలు ప్రభుత్వం అప్పగించింది స్థానిక పరిపాలనా విభాగాలు ప్రభుత్వానికి పన్ను వసూలు చేసే సంస్థలుగా మారాయి ఈ సమయంలో

లార్డ్ మేయో గవర్నర్ జనరల్‌గా నియమితులయిన తర్వాత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఆర్థిక అధికారాలను వేరుచేశారు ఇందుకు అనువుగా ఆనాడు ప్రావిన్షియల్ ప్రభుత్వాలుగా పిలువబడిన రాష్ట్రాలకు కొన్ని అధికారాలను అప్పగించారు 1871లో పట్టణాభి వృద్ధి చట్టాన్ని ప్రవేశపెట్టారు ఇందులో కూడ ఎన్నికయ్యే సభ్యులకంటే, నామినేటెడ్ సభ్యుల సంఖ్యే అధికంగా వుండేది కలెక్టర్ కౌన్సిల్ ఛైర్మన్‌గా వుండేవారు

తర్వాతకాలంలో లార్డ్ రిప్పన్ భారతదేశానికి వైస్రాయిగా వచ్చారు ఆయన అనేక మౌలిక సంస్కరణలు ప్రవేశపెట్టారు 1882లో ఇంగ్లాండులోని సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు పంపిన నివేదికలో యిలా వ్రాశారు

బారత ప్రజల్లో నూతన చైతన్యం పెరుగుతూంది యూరోపియన్ సంస్కృతి ప్రభావం, రైల్వేలు టెలిగ్రాఫ్, విస్తరణ విద్యాధికుల సంఖ్య గణనీయంగా పెరిగిన చైతన్యస్ఫూర్తిని మంచిమార్గంలో నడిపెంచాలి మేధావంతులు సంస్కారవంతుల పెరుగుదలతో క్రమ క్రమంగా పాత చాందసభావాలు, కులాల, మతాల విభేదాలు తగ్గిపోతున్నాయి ఈ నూతన ధోరణులను ప్రభుత్వం నిర్లక్ష్యం చేయరాదు అందుచేత, భారతీయులకు వారి వ్యవహారాలపై వారికే అజమాయిషీ భాగస్వామ్యం కల్గించటం ఉత్తమ మార్గం"

ఆయన ప్రతిపాదించిన సంస్కరణలు

1 భారతీయులకు స్వపరిపాలనలో హెచ్చు భాగస్వామ్యం కల్గించి, తమ వ్యవహారాలను తామే నిర్వహించుకునేందుకు అవకాశం కల్గించాలి

2 దేశవ్యాపితంగా స్థానిక సంస్థలను (Boards) విస్తరింపచేయాలి వాటి విస్తీర్ణం సాధ్యమైనంత పరిమితిగా వుండాలి

3 ఆ బోర్డుల్లో అనధికార సభ్యులు హెచ్చుసంఖ్యలో వుండాలి మూడవవంతుకు మించి అధికార సభ్యులుండరాదు

4 సాధ్యమైనంతవరకు ఎన్నికల ద్వారా సభ్యుల నియామకం జరగాలి అలా ఎన్నికైన వారినుండే ఛైర్మన్ నియమించబడాలి

5 ఆయా బోర్డులకై నిర్దేశించిన నిధుల వినియోగానికే పరిమితం కాకుండా, స్థానిక వనరులను సమీకరించాలి

6 జిల్లా ఇంజనీర్లు యజమానులుగాకాక, ప్రజాసేవకులుగా వ్యవహరించి తోడ్పడాలి

7 అంతర్గత అజమాయిషీకే ప్రాధాన్యత యివ్వాలి పై అధికారుల జోక్యం తగ్గించాలి

పై సంస్కరణలవల్లనే, స్థానిక సంస్థల పరిణామచరిత్రలో లార్డ్ రిప్పన్ పేరు చిరస్థాయిగా మిగిలింది నేటి మద్రాసు (చెన్నై) మునిసిపల్ కార్పొరేషన్ ప్రధాన కార్యాలయం ఇప్పటికి రిప్పన్ బిల్డింగ్స్‌గానే పిలువబడుతుంది ఈయన ప్రవేశపెట్టిన 'జిల్లా మునిసిపాలిటీల చట్టం ప్రకారం ఛైర్మన్‌లు ముఖ్య కార్యనిర్వహణాధికారిగా కూడా వ్యవహరించారు దీనితో మునిసిపాలిటీల పాలన అర్థవంతంగా తీర్చిదిద్దారు

ఆ తరువాత 1906లో రాయల్ వికేంద్రీకరణ కమిషన్ నియమించబడింది 1909లో యీ కమిషన్ మరింత ప్రయోజనకరమైన సిఫార్సులు చేసినా, 1914లో ప్రారంభమయిన ప్రపంచయుద్ధం కారణంగా, ఎట్టి నిర్ణయాలు చేయబడలేదు 1919లో వచ్చిన Indian Act ప్రకారం స్థానిక సంస్థలు పూర్తిగా కేంద్ర పరిధినుండి తప్పించి, రాష్ట్ర ప్రభుత్వ అధీనంలోకి మార్చారు లార్డ్ రిప్పన్ పెట్టిన 1884 మునిసిపాలిటీల చట్టం స్థానంలో 1920లొ మద్రాసు జిల్లా మునిసిపాలిటీల చట్టం అమలులోనికి వచ్చింది ఇందులో ఎక్స్ అఫీషియో సభ్యులను రద్దుచేశారు అధికారులు నాల్గవవంతుకు మించి వుండరాదని, నామినేటెడ్ సభ్యులను తొలగించి, మైనారిటీలకు రిజర్వేషన్లు కలిగించారు పన్ను చెల్లింపుదార్లందరికి ఓటుహక్కు కల్గించారు 1950 నాటికి మునిసిపాలిటీలు పూర్తిగా ప్రజాస్వామీకరించబడినవి 1953లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు కూడ 1920 చట్టాన్నే కొన్ని సవరణలతో అమలుజరిపారు

ఈ చట్టంలో పరిపాలనా సంబంధమైన అధికారాలన్ని ఛైర్మన్లకు కట్టబెట్టారు ఉద్యోగ నియామకాలు, పన్నుల విధింపుపై ఫిర్యాదులు విని పరిష్కరించటం, రోజువారీ పరిపాలనపై నిర్ణయాలు తీసుకునే అధికారం ఛైర్మన్లకు వున్నది అయితే, యీ విధానం ఎక్కువకాలం కొనసాగలేదు అందుకు ఒక కారణం ఎన్నికైన ఛైర్మన్లు జాతీయ పోరాటానికి మద్దతు తెల్పటం, బ్రిటిష్ పాలనకు వ్యతిరేక కేంద్రాలుగా మారాయి అదీగాక, రోజువారి పరిపాలనా బాధ్యతలు నిర్వహించటానికి వీరికి హెచ్చు సమయం దొరికేదికాదు పరిష్కారంకాక సమస్యలు వాయిదాపడేవి ఇవిగాక, పన్నుల విధింపు, తగ్గింపులలోను, లైసెన్సుల మంజూరులో కొంతమంది ఛైర్మన్లు పక్షపాతంతో, బంధుప్రీతితో వ్యవహరించేవారని అభియోగాలు హెచ్చుపెరిగిపోయాయి అందుచేత, 1933లొ ఛైర్మన్‌లకుగల అనేక అధికారాలను తగ్గించి, పూర్తికాలం పనిచేసే ప్రభుత్వ ఉద్యోగిని కమిషనర్‌గా నియమించటం జరిగింది అప్పటివరకు సర్వాధికారాలు చలాయించిన ఛైర్మన్లు, నిర్వహణాధికార బాధ్యతలు తొలగించటంతో, ఆనాటి ఛైర్మన్లు తీవ్ర నిరసనను తెలుపుతూ సభలు నిర్వహించి, ప్రభుత్వంపై వత్తిడి తెచ్చినా, ప్రభుత్వం కమిషనర్ల నియామక విధానాన్ని కొనసాగించింది

నూతన విధానంవల్ల, ఎన్నికైన కౌన్సిల్సు నిర్ణయాలు చేయటం, వాటిని అమలుపరిచే బాధ్యత కమిషనర్లకు అప్పగించారు అయినా, కమిషనరు ఛైర్మన్ నేతృత్వంలోనే పనిచేయాలి అలాగే, స్థానిక సంస్థలన్నింటిపై రాష్ట్ర ప్రభుత్వ అజమాయిషీ, కంట్రోలు ఏర్పాటుచేశారు ఈ అధికారం ద్వారా కౌన్సిలు చేసిన నిర్ణయాలను ప్రభుత్వం రద్దుచేయవచ్చు

1950లో మన దేశం సర్వసత్తాక ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యంగా ప్రకటించుకుంది కౌన్సిలు ఎన్నికలు, ఛైర్మన్ అధికారాలు, పాలనా, నిర్ణయాధికారాల మధ్య సంబంధాలు, మునిసిపాలిటీల స్వయం ప్రతిపత్తి, వీటిపై రాష్ట్ర ప్రభుత్వ అజమాయిషీలు మొదలైన

అంశాలు ఆంధ్ర ప్రాంతంలోని మునిసిపాలిటిలముందు పరిష్కారంకొరకు నిలిచాయి

అయితే, కొన్ని సంవత్సరాలు జస్టిస్ పార్టీ ప్రభుత్వాలు, తర్వాత దీర్ఘకాలం కాంగ్రెస్ ప్రభుత్వాలు రాష్ట్రంలో అధికారంలో కొనసాగాయి మహాత్మా గాంధీ ఆశించినట్లు స్థానిక సంస్థలను బలోపేతం చేసే విధానాలకంటే, వారి వారి మురాకక్షలవల్ల అసలే 3 సంవత్సరాలే వున్న పదవీకాలంవరకు పూర్తికాలం పనిచేసిన స్థానిక సంస్థలు తక్కువ ఎన్నికైన కౌన్సిలును పదే పదే ఏవో కారణాలతో రద్దుచేయటం, తిరిగి ఎన్నికలు నిర్వహించకపోవటం, ప్రత్యేకాధికారుల పరిపాలనా కొనసాగటం పరిపాటయింది

ఉదా ఆంధ్రప్రాంతంలో 1972 నుండి ఏకంగా 1981 వరకు స్థానిక సంస్థలకు ఎన్నికలు నిర్వహించకుండా, అధికారుల పరిపాలన కొనసాగించారు తిరిగి 1992 నుండి 1995 వరకు ఎన్నికలు జరపలేదు కారణాలు ఏమీ లేవు అధికారపార్టీలో ఏకాభిప్రాయం లేకపోవటం, తమ పెత్తనాన్ని ప్రత్యేకాధికారులద్వారానైతే సులువుగా కొనసాగించవచ్చునని, ప్రత్యర్థి వర్గాలకు అవకాశం లేకుండా చేయటం లాంటి ప్రజాస్వామ్య వ్యతిరేక, సంకుచిత ధోరణులు ప్రబలాయి

ఈ కాలంలోనే అప్పటివరకు 1920 జిల్లా మునిసిపాలిటీల చట్టం క్రింద ఆంధ్ర ప్రాంతంలోని మునిసిపాలిటీలు అదే చట్టాన్ని 1965 వరకు అమలుజరిపారు 1965లోనే ఇటు ఆంధ్ర ప్రాంతంలోని మునిసిపాలిటీలకు, అటు తెలంగాణా ప్రాంతంలోని మునిసిపాలిటీలకు వర్తించే విధంగా ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీలు చట్టాన్ని ఆమోదించి అమలుజరిపారు

ఇక, తెలంగాణా ప్రాంతంలో, ఆర్థికపరమైన లాభాలకోసం హైద్రాబాద్ నగరం మునిసిపాలిటీగా మారిందనవచ్చు 1933లో స్థానిక సెస్ చట్టం క్రింద నైజాం ప్రభుత్వం మునిసిపాలిటీలను ఏర్పర్చింది మునిసిపాలిటీలకు నిధులు సమకూర్చుకునేందుకు రూపాయికి అణా సెస్సును విధించే అధికారాన్ని 1933 చట్టం యిచ్చింది

మొదట్లో అంటే తెలంగాణా ప్రాంతంలో మునిసిపాలిటీలు బాల్యావస్థలో వున్నప్పుడు గ్రామీణ, పట్టణాల మధ్య పన్ను విధింపులో తేడా వుండేదికాదు జిల్లా, తాలూకా బోర్డులు మునిసిపల్ సేవలను అందించే సాధనాలుగా ఉపయోగించేవి 1921లో మొదటిసారిగా జిల్లా, పట్టణ ప్రాంతాలకు వేరువేరుగా బడ్జెటులను రూపొందించే ఆలోచనలు చేశారు అయితే జిల్లా మునిసిపాలిటీలు మాత్రం నిధులులేక ఎప్పుడూ మూలుగుతూనే వుండేవి 1937 వరకు యీ పరిస్థితి ఇలాగే కొనసాగింది కాని ఆ సంవత్సరంలో దివాన్ బహదూర్ అహ్మద్ అయ్యంగార్ అధ్యక్షతన మునిసిపల్ సంస్కరణలకోసం ఒక ఉన్నతస్థాయి కమిటీ ఏర్పాటుచేసింది నైజాం ప్రభుత్వం ఈ కమిటీ సిఫార్సులు పాలనాగతమైన మార్పులు తీసుకురావటానికి ఎంతగానో దోహదం చేశాయి.

## అయ్యంగారి కమిటీ సిఫార్సులు

మునిసిపల్ అధికారులు, కౌన్సిలులో ప్రాతినిధ్యం, మునిసిపాలిటీల విధులు, వాటి ఆర్థిక స్థితిగతులు, వాటిపై ప్రభుత్వం అజమాయిషీ మొదలగు విషయాలపై నివేదిక ప్రస్తావించింది

పట్టణాలను వర్గీకరించటానికి జనాభాను ప్రాతిపదికగా తీసుకుంది 15000పైగా జనాభా వున్న పట్టణాలను మునిసిపాలిటీలుగా, 5000-15000 జనాభాగల పట్టణాలను పట్టణ కమిటీలుగా గుర్తించారు కౌన్సిల్సులో ప్రాతినిధ్యం గురించి - కొంతమందిని ఎన్నుకునే అవకాశం కల్పించినా, కొంతమందిని నామినేట్ చేసే అవకాశం యిచ్చింది మునిసిపల్ కమిటీలో 13మంది ప్రతినిధులుంటారని, వీరిలో 8మంది ఎన్నికద్వారా వుండాలని, పట్టణ కమిటీల్లో 10మందిలో ముగ్గురు మాత్రమే ఎన్నికద్వారాను, మిగతా వారిని నామినేట్ చేయాలని సూచించారు కౌన్సిలు పదవీకాలం 3 సంవత్సరాలు కౌన్సిల్ అధ్యక్షులుగా జిల్లా కలెక్టర్లు, రెవిన్యూ అధికార్లను నియమించారు మునిసిపాలిటీలు నిర్వహించవలసిన దిగువ విధులను కూడ నిర్ణయించింది

1 రోడ్ల నిర్మాణం, నిర్వహణ
2 ప్రజారోగ్యం, టీకాలు వేయటం, పారిశుద్ధ్యం, మురుగునీటి పారుదల, త్రాగునీటి సరఫరా, అంటువ్యాధుల నివారణ
3 ప్రాథమిక విద్య
4 ప్రజాసౌకర్యాలు, రక్షణ, ఆరోగ్య విషయాలలో జాగ్రత్త వహించటం

**మునిసిపాలిటీల, పట్టణ కమిటీల ఆదాయానికిగాను .**

1 భూములు, భవంతులపై ఆస్తిపన్ను
2 వృత్తి, వ్యాపారాలపై పన్ను
3 వాహనాలు, జంతువులపై పన్ను
4 సేవలపై వచ్చే ఆదాయం, లైసెన్సుల ద్వారా ఆదాయం
5 స్థానికంగా యితర అంశాలపై పన్ను
6 ప్రభుత్వం నుండి వచ్చే గ్రాంట్లు

ఆయా మునిసిపాలిటీ, పట్టణ కమిటీలపై ప్రభుత్వ అజమాయిషీతోపాటు తీర్మానాలను, కమిటీలను రద్దుచేసే అధికారం కల్గివుంది 1941లో హైద్రాబాద్ మునిసిపల్ పట్టణ కమిటీ చట్టాన్ని అమలుజరిపింది

కార్యనిర్వహణ అధికారం పై చట్టం ప్రకారం మునిసిపల్, పట్టణ కమిటీ అధ్యక్షులు కార్యనిర్వాహక అధికారం కలిగివుంటారు

# నరసింహం కమిటీ

నవంబరు 1970న రాష్ట్ర ప్రభుత్వం స్థానిక సంస్థల ఆర్థిక పరిపుష్టికి తీసుకోవలసిన చర్యలపై కీ॥శే॥ సి నరసింహం అధ్యక్షతన ఉన్నత స్థాయి కమిటీని నియమించింది ప్రొఫెసర్ ఎం ఎ ముతాలబ్ ఉస్మానియా యూనివర్శిటీ ప్రొఫెసర్, ఇద్దరు మునిసిపల్ ఛైర్మన్లు, పురపాలకశాఖ డైరెక్టర్, జాయింట్ సెక్రటరీలతో యీ కమిటీ ఏర్పాటయింది

ఆనాటికి మన రాష్ట్రంలో 82 మునిసిపాలిటీలున్నాయి ఒక్క మునిసిపల్ కార్పొరేషన్ - హైద్రాబాద్‌లో వుంది అన్ని మునిసిపాలిటీల పరిస్థితి అధ్వాన్నంగా వుండేది పట్టణ జనాభా 1961-71లలో పెరుగుదల రేటు 38 29% పెరిగింది (భారతదేశ సగటు పెరుగుదల 25 9% మాత్రమే ) 1971-91 వరకు పట్టణాలలో జనాభా లక్షలకొలది పెరుగుదలతో రోడ్లు, గృహాలు, విద్యాలయాలు, ఆసుపత్రులు, మంచినీటి సరఫరా, డ్రయినేజి అవసరాలు గణనీయంగా పెరిగాయి అత్యధిక జనాభా కేంద్రీకరణ తదనుగుణ్యమైన సమస్యలను అనగా శానిటేషన్, ట్రాఫిక్, అత్యధిక నేరాలు, కాలుష్యం - లక్షలాది జనాభాకు ఎదురవుతున్న సమస్యలు వీటికితోడు గ్రామాలనుండి పేదలు ఉపాధికొరకు విద్య, వైద్య వసతులకుగాను పట్టణ ప్రాంతాలకు వలసల కారణంగా పరిస్థితి మరింత జటిలంగా మారింది

స్వాతంత్ర్యానంతరం, స్థానిక పరిపాలన రాజకీయంగా దిగజారుడు ప్రారంభమయింది - సమర్థులు, నిజాయితీపరులు ఎన్నికల్లో పాల్గొనటానికి ఇష్టపడటంలేదు మునిసిపల్ పరిపాలన స్థాయి దిగజారింది ప్రజల్లో అసంతృప్తి, నిరసన, పట్టించుకోనితత్వం బాగా పెరిగింది

ఈ పరిస్థితులను చక్కదిద్దేందుకు జరిగిన కృషి స్వల్పం అధికార లేమి, న్యాయ పరమైన చిక్కులు పెరిగాయి

ఈ కమిటీ రాష్ట్ర వ్యాపితంగా అనేక పట్టణాలను స్వయంగా పరిశీలించింది పరిస్థితులను నేరుగా తెలుసుకోగలిగింది పట్టణాలలో రోడ్ల అధ్వాన్నస్థితి, మంచినీటి సరఫరా లోటుపాట్లు, మార్కెట్లు, స్కూల్సు, పార్కులు, ఆసుపత్రులు, మురికివాడలు అన్నీ పరిశీలించిన తదుపరి దిగువ ఏకగ్రీవ సిఫార్సులను ప్రభుత్వానికి సమర్పించింది

1963లో ఏర్పాటయిన స్థానిక శాఖామంత్రుల సిఫార్సులు కొంతమేర అమలుజరిగాయి ఆనాటి పరిస్థితుల్లో 82 మునిసిపాలిటీలలోను నీటి సరఫరా, డ్రయిన్లు, రోడ్ల అభివృద్ధి, మురికివాడల అభివృద్ధి వగైరాలకు తయారుచేసిన అంచనాలు రు 150 కోట్ల రూపాయలు మాత్రం వాటి మరమ్మతులు, రుణాల చెల్లింపు వగైరాకు రు 22 కోట్లుగా అంచనా ఈ మొత్తాలను మునిసిపాలిటీలకు ప్రభుత్వ అప్పుగా అయిదు సంవత్సరాల కాలంలో అందించారు 1969లో అన్ని మునిసిపాలిటీల రెవిన్యూ ఆదాయం 11 65 కోట్ల రూపాయలు అందులో సగానికిపైగా జీతభత్యాలకే సరిపోయేది మిగిలిన సొమ్ము పౌరవసతులకు ఏమాత్రం చాలదు

## కమిటీ సిఫార్సులు

1 ఇంటింటికి తిరిగి పన్నులు వసూలు పద్ధతిని ఆపాలి పన్ను వసూలు కేంద్రాలలో పన్ను చెల్లింపుదార్లు తామే వచ్చి చెల్లించాలి

2 బిల్లులు సంవత్సరానికి రెండుసార్లు యివ్వనక్కరలేదు

3 కనీసం 95% పన్నులు, లైసెన్సులు వసూలుకావాలి

4 కనీస ఆస్తిపన్నును నిర్ణయించాలి

5 కేంద్ర ప్రభుత్వ ఆస్తులపై రైల్వేలతో సహా పన్ను విధించేందుకు చట్టంలోని 285 సెక్షను సవరించాలి

6 అమ్మకం పన్ను, మోటారు వాహనాల పన్నుల నుండి, ఎక్సైజు ఆదాయం నుండి సమంజసమైన వాటాను స్థానిక సంస్థలకు యివ్వాలి

7 వినోదపు పన్ను 95 శాతం స్థానిక సంస్థలకు యివ్వాలి

8 ప్రాథమిక, ఉన్నత విద్యాలయాల మొత్తం ఖర్చును రాష్ట్ర ప్రభుత్వం భరించాలి

9 మౌలిక సదుపాయాల ఏర్పాటుకు రాష్ట్ర ప్రభుత్వం కనీస వడ్డీతో అప్పులు ఏర్పాటు చేయాలి

ఇందులో హెచ్చు సిఫార్సులను దరిమిలా ప్రభుత్వం అమలుజరిపింది విద్యాలయాల నిర్వహణా ఖర్చును ప్రభుత్వమే భరించుతుంది

కాంగ్రెస్ పాలనలో స్థానిక సంస్థలు పదే పదే రద్దులకు గురయ్యేవి కాంగ్రెస్ పార్టీలోగల విభేదాలు, గ్రూపుల కారణంగా, వారి వారి ప్రాబల్యం ద్వారా ఏమాత్రం సమర్థనీయంకాని కారణాలతో ఎన్నికైన కౌన్సిల్సును రద్దుచేయటం పరిపాటయింది అందుచేత ఎక్కువకాలం ప్రత్యేకాధికారుల పాలన మన రాష్ట్రంలో జరిగిందంటే అతిశయోక్తి కాదు ఒక్కొక్కసారి యీ ప్రత్యేకాధికారుల పాలన సంవత్సరాల తరబడి కొనసాగేది ఉదా 1972-81 వరకు 9 సంవత్సరాలు స్థానిక సంస్థలకు ఎన్నికలే లేవు రాష్ట్ర ప్రభుత్వ నిరంకుశ విధానాలు తప్ప వేరే కారణాలు లేవు ఎట్టకేలకు శ్రీ టంగుటూరి అంజయ్యగారు ముఖ్యమంత్రి అయిన తర్వాతనే, ధైర్యంచేసి, 1981లో స్థానిక సంస్థలకు ఎన్నికలు నిర్వహించారు న్యాయంగా అయిదు సంవత్సరాలు నిండుతూనే ఆ కాలం పూర్తికాకముందే, కొత్త కౌన్సిల్సుకు ఎన్నికలు జరగాలి కాని ఒక సంవత్సరం వాయిదా వేశారు 1987లో ఎన్నికలు జరిగాయి 1992లో తిరిగి ఎన్నికలు జరగాలి కాని ఆశ్చర్యకరంగా 1992 నుండి 1995 వరకు మరల ప్రత్యేక అధికారుల పాలనే విధించారు అదీ కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలోనే

1983లో రాష్ట్రంలో శ్రీ నందమూరి తారక రామారావుగారి నాయకత్వాన తె దే ప్రభుత్వం అధికారం చేపట్టింది 1983 మే నెలలోనే మేము వారికి విజ్ఞాపన పత్రాన్ని సమర్పించి మేయరు, ఇతర ప్రజాప్రతినిధుల అధికారాలు, గ్రాంట్లు విడుదల గురించి చర్చించాం వారు తక్షణం స్పందించి 13-6-1983 గల నెం 451 ఉత్తర్వుల ద్వారా మేయర్లు, ఛైర్మన్లు అధికారాల విస్తృతికి, మునిసిపాలిటీలు - ప్రభుత్వానికి మధ్య వుండవలసిన సంబంధ

బాంధవ్యాల గురించి ఆరునెలల్లోగా తగు సిఫార్సులు చేయవలసిందిగా త్రిసభ్య కమిటీ నొకదానిని ఏర్పాటు చేశారు కాని ఆ కమిటీ ఏమీ చేయకుండానే కాలగర్భంలో కలిసింది

తిరిగి మేయరు, కౌన్సిలు అధికారాలు, మేయరు ఇన్ కౌన్సిల్ విధానం అమలుపరచ వలసిందిగా, నేటి ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబునాయుడుగారితో చర్చించగా, 14-6-99 తేదీగల 275 నెం దిగువ అంశాలను అధ్యయనంచేసి సిఫార్సులు చేయవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు యిచ్చింది

1) 74వ రాజ్యాంగ సవరణ చట్టం ప్రకారంగా ప్రజాప్రతినిధులకు అదనంగా యివ్వ వలసిన అధికారాలు, బాధ్యతలు కల్పించటానికి ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టం 1965కు, హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్నం కార్పొరేషన్ చట్టాలలో చేయవలసిన సవరణలు గురించి

2) కలకత్తా కార్పొరేషన్‌లో అమలు అవుతున్న మేయర్-ఇన్-కౌన్సిల్ విధానాన్ని అధ్యయనం చేసి మన రాష్ట్ర పరిస్థితులకు అనుగుణ్యంగా మన చట్టంలో చేయవలసిన చేర్పులు, మార్పులు సూచించుట

3) ఆంధ్ర రాష్ట్రంలోగల అన్ని మునిసిపల్ కార్పొరేషన్‌లకు వర్తించేలాగ, ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ కార్పొరేషన్ చట్టాన్ని రూపొందించవలసిన అంశాల గురించి

ముగ్గురు క్యాబినెట్ మంత్రులతో కూడిన యీ కమిటీ ఎన్నడూ సమావేశం కాలేదు అది నిరుపయోగం అయింది దీనినిబట్టి, ఎలాంటి ప్రయోజనకరమైన సంస్కరణలు చేయటానికి యీ ప్రభుత్వం ఉత్సాహం చూపలేదు

అధికారాలు, ఆర్థిక వనరులు అదనంగా కల్పించకపోగా, 1987లో కార్పొరేషన్ చట్టానికి ముఖ్యమైన సవరణలు చేస్తూ, భారతదేశంలో ఏ కార్పొరేషన్ చట్టాలలో లేనివిధంగా మేయరును, డిప్యూటీ మేయరును, స్థాయీసంఘాన్ని, ఏకంగా కార్పొరేషన్, కౌన్సిల్ను రద్దు చేసే అధికారాన్ని హస్తగతం చేసుకుంటూ చట్టాలలో మార్పు చేయటం గమనార్హం

అదే విధంగా కాంగ్రెస్ ప్రభుత్వం (1989-94)లో కూడ మునిసిపల్ చట్టాలకు మరింత తీవ్రమైన సవరణలు చేస్తూ, కమిషనర్లకు విశేషాధికారాలు, ఛైర్మన్‌లకు కాంట్రాక్టు అగ్రిమెంట్లు చేయుటకు, ఉద్యోగుల నియామకానికి వున్న అపాయింట్‌మెంట్, కమిటీలలో ఛైర్మన్‌ల అధికారాలను కమిషనర్లకు బదిలీ చేశారు కార్పొరేషన్ చట్టంలో కమిషనర్లకు రు 20 లక్షల వరకు అంచనాలు మంజూరుచేయుటకు, స్థాయి సంఘం వారి అధికారాలను కొన్నింటిని కూడ కమిషనర్లకు బదిలీ చేశారు

ఇవిగాక, 1994లో చేసిన మరొక సవరణద్వారా ఉద్యోగాల నియామకాలపై నిషేధం విధించి, ఎవరైనా కమిషనరు యీ నియమాన్ని ఉల్లంఘించి కొత్తగా ఏ ఉద్యోగినైనా నియమించినట్లయితే ఆరునెలలు జైలుశిక్ష విధించబడుననే కఠినమైన నిర్ణయం చేశారు

అదే విధంగా పన్ను చెల్లింపుదారులు బకాయిపడిన సందర్భాలలో వారింటికి వున్న మంచినీటి కుళాయిని కూడ తొలగించేందుకు అవకాశం కల్పించారు

# ౨. ఆంధ్రప్రదేశ్‌లో మునిసిపల్ చట్టాలు

1965లో ప్రవేశపెట్టిన ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ చట్టం రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోని మునిసిపల్ సంస్థలను చట్టబద్ధం చేసింది అప్పటివరకు రాష్ట్రంలోని ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో అమలులోవున్న చట్టాలు వేరువేరుగా వుండటంచేత, కౌన్సిలుకు నేరుగా ఎన్నికయ్యే ప్రతినిధులకు పాలనా వ్యవహారాలలోను, నిర్వహణలోను మరింత ప్రాముఖ్యత కలిగించటానికి పాలనా విషయాలలో ప్రభుత్వ ప్రమేయాన్ని సాధ్యమైనంతగా క్రమబద్ధీకరించటానికి ఈ చట్టాన్ని రూపొందించారు ఇది 1965 ఏప్రిల్ 2 నుండి అమలులోకి వచ్చింది

ఈ చట్టంలో ఏడు భాగాలు, 391 విభాగాలున్నాయి ఇందులో మునిసిపాలిటీ కావటానికిగల అర్హతలు, అధికార్లు, వారి అధికారాలు, ఆదాయ వనరులు, బాధ్యతలు, నియంత్రణాధికారాలు మొదలైన అంశాలు పొందుపరిచినారు మునిసిపాలిటిల వర్గీకరణ కూడా యిందులో సూచించారు

**చట్టంలోని కొన్ని ముఖ్యాంశాలు .**

1 ఏదేని స్థానిక ప్రాంతంలో మునిసిపాలిటీని రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటుచేయవచ్చు

2 మునిసిపాలిటీలు దిగువ ముఖ్య కర్తవ్యాలను నిర్వహించాలి

1 మంచినీటి సరఫరా 2 మురుగునీటి పారుదల 3 చెత్తాచెదారాన్ని తొలగించడం 4 పారిశుద్ధ్య నిర్వహణ 5 అంటువ్యాధులు అరికట్టడం 6 దిక్కులేక చనిపోయినవారి అంత్యక్రియలు నిర్వహించటం 7 ఆహార పదార్థాల కల్తీ నిరోధించుట 8 రోడ్ల నిర్మాణం, నిర్వహణ 9 విద్యుత్ సరఫరా 10 ముఖ్య గణాంకాల సేకరణ 11 మార్కెట్ల ఏర్పాటు, నిర్వహణ 12 కబేళాల నిర్వహణ 13 ప్రాధమిక, సెకండరీ విద్యగరపటం 14 నిర్మాణ వ్యవహారాలు, పరిశీలన

పై చెప్పిన విధులలో ఏది నిర్వహించకపోయినా ప్రజలు అనారోగ్యానికి, ఇబ్బందులకు గురయ్యే అవకాశాలు మెండుగా వున్నాయి ప్రజారోగ్య నిర్వహణ అభివృద్ధిచెందే దేశాల ప్రధమ కర్తవ్యం అన్న విషయం మనకు తెలుసు అయితే గ్రామాలనుంచి పట్టణాలకు ప్రజలు విపరీతంగా వలసరావడం పట్టణాభివృద్ధిని అనుకున్న విధంగా సాధించడానికి కొంత అవరోధంగా వుందన్న విషయం మనం గుర్తించవలసివుంది రోజురోజుకు ఇలా వలసవస్తున్న వారి సంఖ్య ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోవడంతో పరిస్థితి గాసట బీసటగా తయారవుతుంది కొన్ని మునిసిపాలిటీలలో అనారోగ్య నివారణ కోసం కనీస చర్యలు తీసుకోవడం కూడా వీలుకాకుండా పోతున్నది దీనికి కారణం పెరుగుతున్న అవసరాలకు సరిపడా ఆదాయం మునిసిపాలిటీలకు లేకపోవడం దేశంలోని మునిసిపాలిటీలన్నీ దరిదాపు ఈ సమస్యను ఎదుర్కొంటూనే వున్నాయి

1965 చట్టం సక్రమంగా అమలుజరపడానికి స్థానిక పరిపాలనా రాజ్యాంగంలోనే కౌన్సిలర్లు, ఛైర్మన్, కమిషనర్ మొదలైన పదవులను సృష్టించారు

## మునిసిపల్ కౌన్సిల్ నిబంధనలు

విధానాలను రూపొందించే నిర్ణాయక సంఘం ప్రతి ప్రభుత్వంలోనూ వుంటుంది ఇందులో అందరూ నేరుగా ఎన్నికైనవారే వుంటారు ప్రతి మునిసిపాలిటీకి ఒక మునిసిపల్ కౌన్సిల్ వుంటుంది ఇందులో నేరుగా ఎన్నికైన సభ్యులతోపాటు ఎక్స్-అఫీషియో సభ్యులు కూడా వుంటారు జనాభానుబట్టి వీరి సంఖ్యను నిర్ణయించడం జరుగుతుంది అందుకు సంబంధించిన వివరాలు దిగువ విధంగా వున్నాయి

**1981 జనాభా లెక్కల ప్రకారం కౌన్సిలర్ల సంఖ్య :**

| | |
|---|---|
| 25,000 పైన 30,000 లోపు | 20 |
| 30,000 పైన 40,000 లోపు | 24 |
| 40,000 పైన 50,000 లోపు | 28 |
| 50,000 పైన 1,00,000 లోపు | 32 |
| 1,00,000 పైన 2,00,000 లోపు | 36 |
| 2,00,000 పైన 3,00,000 లోపు | 44 |
| 3,00,000 పైన | 50 |

ఎన్నికల నిమిత్తం మునిసిపాలిటీలను వార్డులుగా విభజించారు ఒక్కో వార్డు నుంచి ఒక్కో కౌన్సిలర్ ఎన్నికవుతాడు షెడ్యూలు కులాలు, తరగతులవారికి, వెనుకబడిన తరగతుల స్త్రీలకు సీట్లను ప్రత్యేకంగా కేటాయిస్తారు ప్రతి మునిసిపాలిటీలోను మునిసిపాలిటీల చట్టంలోని ఐదవ విభాగం ప్రకారం ఆరు శాతం షెడ్యూలు జాతులకు, పదిహేను శాతం షెడ్యూలు కులాలవారికి, మొత్తం సీట్లలో 33 1/3 శాతం స్త్రీలకు, ఇరవై శాతం వెనుకబడిన తరగతులవారికి సీట్లు కేటాయించవలసివుంటుంది

## ఎక్స్-అఫీషియో సభ్యులు

1965 చట్టం ఎక్స్-అఫీషియో సభ్యులగురించి ఏవిధమైన సూచనలు చేయలేదు చట్టం అమలులోకి వచ్చిన కొంతకాలం అలాగే కొనసాగింది అయితే ఆల్డర్‌మాన్‌కు మాత్రం ప్రావిజన్ వుండేది 1971లో ఈ చట్టానికి సవరణ ఫలితంగా ఆల్డర్‌మాన్ పదవిని రద్దు చేశారు దీనికి ప్రత్యామ్నాయంగా ఆయా మునిసిపాలిటీలు వున్న ప్రాంతానికి ప్రాతినిధ్యం వహిస్తున్న శాసనసభ, శాసనమండలి సభ్యులను ఎక్స్-అఫీషియో కౌన్సిలర్లుగా వుండవచ్చని ఆ సవరణ సారాంశం ఆ తరువాత 1981లో ఆ ప్రాంత లోక్‌సభ సభ్యుని కూడా ఎక్స్-అఫీషియో కౌన్సిలర్‌గా అర్హత కలిగివుంటారని మరో సవరణలో పేర్కొన్నారు కౌన్సిల్ పదవీ కాలం ఐదు సంవత్సరాలుంటుంది

## కౌన్సిల్ విధులు

మునిసిపాలిటీ తన విధులను నిర్వహించే క్రమంలో మున్సిపల్ కౌన్సిల్ కీలకమైన పాత్ర నిర్వహిస్తుంది మునిసిపల్ పాలనాధికారం మునిసిపల్ కౌన్సిల్‌కే వుంటుంది మునిసిపాలిటీ స్థాపనోద్దేశాలను సాధించటానికి అమలుచేయవలసిన పథకాలను, ప్రణాళిక లను ఈ కౌన్సిల్ ప్రతిపాదిస్తుంది మునిసిపల్ కమిషనర్ అందచేసే ప్రతిపాదనలను అంగీకరించడం, తిరస్కరించడం మొదలైన బాధ్యతలన్నీ, ప్రాధమిక నిర్ణయాధికార విభాగ మైన కౌన్సిల్‌కు వుంటాయి వార్షిక ప్రణాళికను కౌన్సిల్ ఆమోదించవలసి వుంటుంది సామాన్య మానవునికి సాధ్యమైనంత సహకారాన్ని, సౌకర్యాలను అందజేయటమే ధ్యేయంగా వున్న ఈ కౌన్సిల్ మునిసిపల్ పాలనాసంబంధమైన అన్ని కార్యాలయాల అధికార్ల పనితీరును పరిశీలిస్తూ, సమీక్షిస్తూ, విశ్లేషిస్తూ, అదుపుచేస్తూ వుంటుంది వార్షిక పాలనా రిపోర్టుపై చర్చించడం ద్వారా పాలనా విధానంలోని లొసుగులను కౌన్సిల్ సరిదిద్దుతూ వుంటుంది మునిసిపల్ అధికారులవద్ద నుండి ఎలాంటి సమాచారాన్నైనా కౌన్సిల్ పొందవచ్చు పాలనా వ్యవహారాలలో అవకతవకలు చోటుచేసుకున్నాయనే అనుమానం కలిగిన పక్షంలో వీటిని విచారించటానికి ఒక కమిటీని ఏర్పాటుచేసే అధికారం కౌన్సిల్‌కు వుంటుంది చట్టబద్ధమైన అన్ని వ్యవస్థలలాగానే చైర్మన్‌పై అవిశ్వాస తీర్మానం ప్రకటించి అతనిని తొలగించే అధికారం కూడా కౌన్సిల్‌కు వుంటుంది అయితే ప్రభుత్వం నియమించే అదికారులను తొలగించే అధికారం దీనికి లేకపోయినప్పటికీ, ఆ అధికారి బదిలీ చేయమని కోరే అవకాశం వుంది

కౌన్సిల్స్ రానురాను పెద్దవిగా మారి సభ్యుల సంఖ్య కూడా పెరుగుతూ వచ్చింది దీనితో ప్రతి ప్రణాళికను, కార్యక్రమాన్ని క్షుణ్ణంగా పరిశీలించే ఉద్దేశంతో అవకాశం సన్నగిల్లింది ఈ సమస్యను పరిష్కరించే ఉద్దేశంతో వివిధ విషయాలను, సమస్యలను పరిశీలించడానికి ప్రత్యేక కమిటీలను ఏర్పాటుచేయడం ప్రారంభించారు దీనితో కమిటీ విధానం స్థానిక ప్రభుత్వాలకు ఒక ముఖ్యమైన లక్షణంగా రూపుదిద్దుకుంది ఈ కమిటీలు చిన్నవి కావడం వలన, కౌన్సిల్‌లా కాకుండా, తరచూ వీటి సభ్యులు కలుసుకొని సమస్య లను చర్చించే అవకాశం ఏర్పడింది సాంకేతికపరమైన సలహాలకు కమిటి నిపుణులతో చర్చలు జరుపుతుంది అవసరమైతే సభ్యులను పిలిచి సమస్యను పూర్తిగా వివరిస్తాయి ఈ కమిటీ విధానం మంచి ఫలితాలనే యిచ్చినట్టు చరిత్ర చెబుతోంది

## వార్డు కమిటీలు

మూడు లక్షలకు మించిన జనాభాగల మునిసిపాలిటీలలో వార్డుకమిటీలు ఏర్పాటు చేయవలయును ప్రతి కమిటీకి 5వార్డులకు తగ్గకుండా వార్డులను కలిగియుండవలెను 3 లక్షల తక్కువ జనాభాగల మునిసిపాలిటీలలో గూడ పరిపాలనా డైరెక్టరు వార్డు కమిటీల ఏర్పాటుకు అనుమతించవచ్చును

వార్డు కమిటీ సభ్యులు తమలో నుండి ఒకరిని ఛైర్‌పర్సన్‌గా ఎన్నుకుందురు వార్డు కమిటీల ఏర్పాటు, ఛైర్‌పర్సన్స్ ఎన్నిక, అధికారములు మరియు విధులు రూల్సు 1995 ప్రకారం నిర్వహించబడును

## కమిటీ విధానం

మునిసిపల్ స్థాయిలో ప్రస్తుతం రెండు కమిటీలు పనిచేస్తున్నాయి అవి నియామకాల కమిటీ, కాంట్రాక్టుల కమిటీ

## కాంట్రాక్టుల కమిటీ

ఇది కాంట్రాక్టులను కేటాయించడంలో కీలకపాత్ర వహిస్తుంది ఇందులో ఆ మున్సిపల్ ఛైర్మన్, కమిషనర్, ముగ్గురికి తక్కువ కాకుండా, ఏడుగురికి ఎక్కువ కాకుండా కౌన్సిలర్లు సభ్యులుగా వుంటారు ఈ కౌన్సిలర్‌లను కౌన్సిల్ నియమిస్తుంది రెండవ, మూడవ శ్రేణి మునిసిపాలిటీలలో వుండే కాంట్రాక్టు కమిటీలు మూడువేల రూపాయల నుంచి పదివేల రూపాయల వరకు విలువగల, కాంట్రాక్టులను కేటాయించవచ్చు అలాగే ఇతర మునిసిపాలిటీ కాంట్రాక్టు కమిటీలు మూడువేల రూపాయల నుంచి ఇరవైవేల రూపాయల వరకు విలువగల కాంట్రాక్టులను కేటాయించవచ్చు

## నియామకాల కమిటీ

ప్రతి మునిసిపాలిటీ వివిధ విభాగాలలో ఉద్యోగులను నియమిస్తుంది నియమితు లయ్యే అధికారులలో కొంతమందిని రాష్ట్ర ప్రభుత్వం నియమిస్తుంది మిగిలిన వారిని నియామకాల కమిటీ సిఫార్సులను అనుసరించి మునిసిపల్ ఛైర్మన్ నియమిస్తాడు నియామకాల కమిటీలో కూడా ఛైర్మన్, కమిషనర్‌లతోపాటు ముగ్గురికి తక్కువ కాకుండాను, ఏడుగురికి మించి ఎక్కువమంది లేకుండాను కౌన్సిలర్లు సభ్యులుగా వుంటారు 1965 మునిసిపాలిటీల చట్టం ప్రకారం వంద రూపాయలకు పైబడి జీతం ఇచ్చే ఏ ఖాళీనైనా ఈ కమిటీ సిఫారసు ననుసరించి భర్తీ చేయవలసి వుంటుంది 1982లో చేసిన సవరణ ప్రకారం ఎక్స్-అఫీషియో కౌన్సిలర్లు కూడా ఈ కమిటీలలో సభ్యులుగా వుండవచ్చు ఈ అధికారంవల్ల మునిసిపల్ పాలనపై ఈ కమిటీ ఎక్కువగానే అధికారాన్ని చెలాయిస్తుంది

## మునిసిపల్ ఛైర్‌పర్సన్

మునిసిపల్ ఛైర్‌పర్సన్ పదవి అత్యంత కీలకమైనది ఛైర్‌పర్సన్ అధికారాలు, పలుకుబడి రాజకీయ ప్రాధాన్యత, ఈ పదవిని మరింత ముఖ్యమైనదిగా రూపొందించాయి

ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టం ప్రకారం ప్రజలే నేరుగా ఛైర్‌పర్సన్‌ను ఎన్ను కుంటారు అతని/ఆమెకి 21 సంవత్సరాలకు తక్కువ కాకుండా వయసు వుండాలి పదవీకాలం ఐదు సంవత్సరాలు మొత్తం మునిసిపాలిటీలలో 50 శాతం ఛైర్‌పర్సన్ పదవులను ఎస్ సి , ఎస్ టి , బి సి లకు ప్రత్యేకించారు అదే విధంగా మొత్తం మునిసిపాలిటీలలో 33 1/3 శాతం మహిళలు ఛైర్‌పర్సన్స్‌గా ఎన్నుకోబడాలి

## ఛైర్‌పర్సన్ అధికారాలు

ఛైర్‌పర్సన్ అధికారాలను నాలుగు భాగాలుగా విభజించవచ్చు

1 చట్ట సంబంధమైన

2 పాలనా సంబంధమైన

3 ఆర్థిక సంబంధమైన

4 అత్యయిక అధికారాలు

## చట్ట సంబంధమైన అధికారాలు

ఇతడికి కౌన్సిల్ సమావేశాల నిర్వహణకు సంబంధించి అన్ని అధికారాలు వున్నాయి కౌన్సిల్ సమావేశాన్ని ఏర్పాటు చేయడంతోపాటు ఉపాధ్యక్షుని ఎన్నిక కూడా నిర్వహించే అధికారం వుంది కౌన్సిల్ సమావేశాలకు అన్నింటికీ ఇతడే/ఈమె అధ్యక్షత వహిస్తారు

## పాలనాధికారాలు

మునిసిపాలిటీ పరిపాలన అంతా ఛైర్‌పర్సన్ పేరుమీదుగా జరుగుతుంది మునిసిపల్ సంస్థలు - ప్రభుత్వానికి మధ్య జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఛైర్‌పర్సన్ పేరుమీద మాత్రమే జరగాలని 1965 చట్టం ఆదేశిస్తున్నది మునిసిపల్ పాలనను సమీక్షించడమేగాక కార్యాలయ నిర్వహణ, విస్తరణకు సంబంధించి ఛైర్‌పర్సన్‌కు ముఖ్యమైన అధికారాలున్నాయి మునిసిపల్ కమిషనర్ ఈయన నేతృత్వంలో పనిచేస్తాడు ఛైర్‌పర్సన్ సరఫరా చేసే సమాచారాన్ని ఆధారం చేసుకొని మునిసిపల్ పాలనా విభాగం వార్షిక నివేదికలను రూపొందిస్తుంది నియామకాల కమిటీ అధ్యక్షుడు కావడంచేత నియామకాల విషయంలో కూడా ఛైర్‌పర్సన్ కీలకపాత్ర నిర్వహిస్తాడు

## ఆర్థికాధికారాలు

నియమిత పరిధిలోబడి పాలనా సంబంధమైన ఖర్చులపై ఛైర్‌పర్సన్ నిర్ణయం తీసుకోవచ్చు ఈ ఖర్చు రెండు, మూడు శ్రేణులకు చెందిన మునిసిపాలిటీలలో వెయ్యి నుంచి పదిహేనువందల రూపాయల లోపు వుండవచ్చు మొదటి శ్రేణి, స్పెషల్ గ్రేడ్, సెలక్షన్ గ్రేడ్ మునిసిపాలిటీలకు ఇది మూడువేల రూపాయలు దాటకూడదు అలాగే ప్రథమ, ద్వితీయ శ్రేణి మునిసిపాలిటీ ఛైర్మన్‌లు మూడువేల రూపాయలకు మించని కాంట్రాక్టులను వ్యక్తిగతంగా కేటాయించవచ్చు స్పెషల్ గ్రేడ్, సెలక్షన్ గ్రేడ్, ప్రథమ శ్రేణి మునిసిపాలిటీలలో ఐదువేల రూపాయల విలువగల కాంట్రాక్టులను ఛైర్‌పర్సన్ కౌన్సిల్ ఆమోదం తీసుకోకుండా కేటాయించవచ్చు

## అత్యయిక అధికారాలు

అత్యవసర పరిస్థితిలో ఏపనైనా ఖర్చుతో నిమిత్తం లేకుండా చేపట్టవలసిందని ఆదేశించ

వచ్చు అయితే ఆ తరువాత దానికి కౌన్సిల్ ఆమోదం పొందవలసి వుంటుంది

స్థానిక సంస్థలలో అతి ముఖ్యమైన అధికారాలు ఉన్న వ్యక్తి ఛైర్‌పర్సన్ అని చెప్పవచ్చు

## కమిషనర్

ఇతడు మునిసిపల్ పరిపాలనాశాఖ అధిపతి 1933లోనే కమిషనర్ పదవిని ఏర్పరచారు అప్పట్లో ఇతడు కూడా మునిసిపల్ ఛైర్‌పర్సన్‌తో దీటుగా అధికారం గల ప్రభుత్వాధికారిగా రూపొందాడు కానీ 1965లో అంటే ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టం అమలులోకి వచ్చిన ప్రారంభంలో నేరుగా ఎన్నికైన అభ్యర్థులకు నిర్ణయాధికారాలపై ఎక్కువ పట్టు వుండాలనే ఉద్దేశంతో కమిషనర్ పదవిని రద్దుచేసి పరిమిత అధికారాలు గల మునిసిపల్ కార్యదర్శి పదవిని సృష్టించారు

అయితే 1971లో తిరిగి ఈ సెక్రటరీ పదవిని కమిషనర్ పదవిగా మార్చి, అతడికి పూర్వం వున్న అధికారాలన్నింటిని కల్పించారు దీనితో ఛైర్‌పర్సన్ తరువాత అంతటి అధికారాలు గల వ్యక్తిగా ఇతడు మారాడు

కమిషనర్‌ను రాష్ట్ర ప్రభుత్వం నియమిస్తుంది ఇతడు ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ కమిషనర్స్ సర్వీస్ లేదా ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ సబార్డినేట్ సర్వీసులకు చెందిన వాడు పాలనాధిపతిగా ఇతడికి అనేక అధికారాలు సంక్రమించాయి

కౌన్సిల్ ఆమోదించిన అన్ని తీర్మానాలను అమలుచేసే బాధ్యత ఇతనికీ వుంటుంది పరిపాలనా సంబంధమైన అన్ని విషయాలను సమీక్షించడం, నిర్దేశకత్వం వహించడం, మునిసిపల్ ఉద్యోగులను అదుపుచేయడం ఇతడి ముఖ్యమైన విధులు మునిసిపల్ బడ్జెట్ రూపొందించడం, నిధులు సేకరించడం, అకౌంట్లు నిర్వహించడం, నిధుల మంజూరు కూడా ఇతడి అధికార పరిధిలోకి వస్తాయి మునిసిపల్ పాలనా సంబంధమైన రికార్డులను నిర్వహించడంతోపాటు పాలనా వ్యవహారాలలో ఛైర్‌పర్సన్‌కు సహకరిస్తాడు

## మునిసిపాలిటీలు - ఆర్థిక స్థితి

పందొమ్మిదవ శతాబ్దపు మధ్య భాగంలో మునిసిపాలిటీలను ఏర్పాటుచేసిన విషయం మనకు తెలుసు బ్రిటిష్ రాజరికంపై పడిన ఆర్థిక వత్తిడే ఇందుకు కారణం అందుచేతనే బ్రిటిష్ ప్రభుత్వం స్థానిక ప్రభుత్వాలకే పన్ను విధింపు అధికారాన్ని వదిలివేసింది

1965, ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టం మునిసిపాలిటీలు పన్ను విధించదగ్గ విషయాలను కూడా విశదీకరించింది దీని ప్రకారం ఆస్తిపన్ను, వృత్తిపన్ను, వాహనాలు, జంతువులపై కూడా పన్ను విధించవచ్చు అయితే ప్రకటనలపై పన్ను విధించే విచక్షణను మునిసిపాలిటీలకే వదిలివేశారు మునిసిపాలిటీ విధించే పన్నులలో ఆస్తిపన్ను ముఖ్యమైనది నివాస భవనాలపై విధించే పన్ను సాలుకు అద్దెకింద వచ్చే మొత్తంలో ఇరవై ఐదు శాతానికి మించి వుండకూడదు అలాగే ఇతర భవనాలపై విధించే పన్ను సాలుకు వచ్చే అద్దెలో

ముప్ఫై శాతానికి దాటకూడదు ఎక్కువ మునిసిపాలిటీలు ఆస్తిపన్ను ద్వారా వచ్చే ఆదాయం పైనే ఆధారపడివుంటాయి

ఆ తరువాత స్థానం వృత్తిపన్ను ఆక్రమిస్తుంది ఈ పన్ను ప్రభుత్వ వాణిజ్య పన్నులశాఖ వసూలుచేసి, 95 శాతం మునిసిపాలిటీలకు యిస్తుంది దరిమిలా వృత్తిపన్ను రేట్లను బాగా పెంచారు అందుచేత, యీ పద్దుక్రింద ఆదాయం బాగా పెరిగింది

వాహనాలపైన, ఎడ్లబళ్ళపైన, జంతువులపైన విధించే పన్నుద్వారా ఆదాయం చాలా తక్కువగా వుంటుంది రవాణాకు సంబంధించినంత వరకు పట్టణ ప్రాంతాలలో ముఖ్యమైన మార్పులు చోటుచేసుకున్నాయి జంతువులు పట్టణ ప్రాంతాల్లో చాలా తక్కువగా వుంటాయి

అయితే ప్రకటన పన్నుపై కొంత ఆదాయం సంపాదించవచ్చు ప్రకటన పన్ను వసూళ్ళు పట్టణాభివృద్ధిపై ఆధారపడి వుంటుంది బాగా అభివృద్ధిచెందిన పట్టణాలలో ప్రకటన పన్ను ద్వారా అధిక మొత్తాలు సాధించవచ్చు మన రాష్ట్రంలో ఆ అవకాశం తక్కువ ఎందుచేతనంటే మొత్తం మునిసిపాలిటీలలో డెబ్భై శాతం రెండు లేదా మూడవ శ్రేణికి చెందినవి

మునిసిపల్ కౌన్సిళ్ళు ఆస్తి బదలాయింపులపై పన్ను విధించవచ్చు స్టాంపు డ్యూటీపై సర్‌చార్జిని రిజిస్ట్రేషన్ శాఖ వసూలుచేసి, ప్రతి మూడునెలలకొకసారి మునిసిపాలిటిలకు ఆ శాఖ యిస్తుంది

ఇక రాష్ట్ర ప్రభుత్వం మునిసిపాలిటీలకిచ్చే ఆర్థిక సహాయంలో వినోదం పన్ను ముఖ్యమైనది 1939 ఆంధ్రప్రదేశ్ ఎంటర్‌టైన్మెంట్ టాక్స్ చట్టం క్రింద వినోదం పన్నును రాష్ట్ర ప్రభుత్వం విధిస్తుంది దీనిని వాణిజ్య పన్నులశాఖ వసూలుచేస్తుంది ఇందులో 95 శాతం మునిసిపాలిటీలకు గ్రాంటుగా అందుతుంది

పై చెప్పినవిగాక మాతా, శిశు సంక్షేమానికి, ఆరోగ్యం, విద్య, ఫైలేరియా, మలేరియా మొదలైన వ్యాధుల నివారణకు, కుటుంబ నియంత్రణకు సంబంధించి, మునిసిపల్ ఉద్యోగుల జీతాలకు సంబంధించి కూడా గ్రాంటుల రూపంలో మునిసిపాలిటీలు ఆర్థిక సహాయం పొందుతాయి అంతేగాక షాపింగ్ కాంప్లెక్సులు, మార్కెట్లు, కబేళాలు, నీటి సరఫరా పథకాలు, మురికినీటి పారుదల పథకాలకు రాష్ట్ర ప్రభుత్వం ఋణాలు యిచ్చే అవకాశాలున్నాయి

ఇకపోతే పలురకాల వ్యాపారాలు, వృత్తులనుండి సంస్థల నుంచి లైసెన్స్ ఫీజు కూడా వసూలు చేస్తారు

ఇన్ని ఆర్థిక వనరులు వున్నట్టు కనిపిస్తున్నప్పటికీ ఆంధ్రప్రదేశ్‌లో మునిసిపాలిటీలు ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటూనే వున్నాయి ప్రతి మునిసిపాలిటీ తన ఆదాయంలో సుమారు 60 శాతం సిబ్బంది జీతాలకే వెచ్చించవలసివుంటుంది కాగా, ఐదు నుంచి పది

శాతం ఋణాలను తీర్చడానికి, తీసుకున్న ఋణాలపై వడ్డీ చెల్లించడానికి కేటాయిస్తారు అతి ముఖ్యమైన సేవలు అందించడానికి కూడా మిగిలిన మొత్తం సరిపోదు సమాజాభివృద్ధిలో స్థానిక ప్రభుత్వాలు నిర్వహిస్తున్న కీలక పాత్రను దృష్టిలో వుంచుకొని రాష్ట్ర ప్రభుత్వం మరిన్ని నిధులను మునిసిపాలిటీలకు కేటాయించాలన్న ప్రతిపాదనలు చాలాకాలం నుంచి విన్పిస్తున్న విషయం మనకు తెలుసు

## సిబ్బంది

పాలనా సంబంధమైన ఏ సంస్థ విజయమైనా సిబ్బందిపై ఆధారపడి వుంటుంది మునిసిపల్ సేవలను అందించడానికి, పరిపాలనా నిర్వహణకు సంబంధించి సిబ్బంది నిర్వహించే పాత్ర అత్యంత ముఖ్యమైనది

మునిసిపల్ పాలనలో మనకు రెండు స్థాయిలు కన్పిస్తాయి మొదటి స్థాయిలో యాజమాన్యానికి సంబంధించి కమిషనర్, ఇంజనీర్లు, ఆరోగ్య అధికారి, టౌన్ ప్లానింగ్ అధికారి, రెవిన్యూ అధికారి వుంటారు వీరిని రాష్ట్ర ప్రభుత్వం నియమిస్తుంది పాలనా నిర్వాహక సిబ్బంది అంటే శానిటరీ ఇన్‌స్పెక్టర్, టాక్స్ ఇన్‌స్పెక్టర్, బిల్లు కలెక్టర్, శానిటరీ బంట్రోతులు, అసిస్టెంట్లు, క్లర్కులు రెండవ స్థాయిలో కనిపిస్తారు వీరు ఎక్కువగా స్థానికులై వుంటారు

స్థానికులైన సిబ్బంది, స్థానిక రాజకీయ నాయకుల మధ్య మంచి సంబంధాలు వుంటాయన్నది ఒక పరిశీలనలో వెల్లడైన విషయం ఈ కారణంగా స్థానిక ఉద్యోగులను అదుపుచేయడం అధికారులకు చాలా కష్టసాధ్యమైన విషయంగా పరిణమించింది నియామకాల సంఘం అధ్యక్షునిగా మునిసిపల్ ఛైర్‌పర్సన్ వుండడం, దీనిలో సభ్యులుగా కౌన్సిలర్‌లు చేరడం, వీరందరూ స్థానికులు కావడం, ఉద్యోగ నియామకాలలో కమిటీ నిర్ణయం శిరోధార్యం కావడం వలన క్రిందిస్థాయి ఉద్యోగులు పై అధికారులతో అంతగా సహకరించకపోవడం కద్దు మునిసిపాలిటీలు మన్నికైన సేవలు అందించలేకపోవడానికి ఇది ఒక కారణం కావచ్చు

## స్థానిక ప్రభుత్వాలపై ప్రభుత్వం అదుపు

అవసరమైన స్థాయిలో స్థానిక సంస్థల స్వయం ప్రతిపత్తిని నిలపడానికి రాష్ట్ర ప్రభుత్వ ప్రమేయం, అజమాయిషీ కొంత వరకు అవసరం అన్నది అందరూ అంగీకరించిన విషయమే స్థానిక ప్రభుత్వాలు తమ సేవలను కనీస నిర్దేశిత స్థాయిలో నిర్వహించవలసి వుంటుంది దీనికితోడు రాష్ట్ర ప్రభుత్వం చెప్పుకోదగ్గ మొత్తాలను గ్రాంటుల రూపంలో అందచేయాలి ఋణాలనిస్తుంది అందజేసిన సహాయం ఉద్దేశించిన కార్యక్రమాలపై ఖర్చు పెడుతున్నారో లేదో చూసుకోవలసిన అవసరం వుంది ఎందుకంటే ప్రభుత్వం అలా పట్టించుకోని పక్షంలో అధికారం, నిధులు కూడా దుర్వినియోగం అయ్యే అవకాశం వుంటుంది అందుచేత రాష్ట్ర ప్రభుత్వం అజమాయిషీ అవసరమైంది

మునిసిపాలిటీలను అదుపుచేయడంలో రాష్ట్ర ప్రభుత్వం నాలుగు రకాల అధికారాలను కలిగివుంది

1) నిబంధనలను రూపొందించడం ద్వారా

2) పాలనాగతమైన ఆడిట్ సంబంధమైన నియంత్రణ

3) స్థానిక కౌన్సిల్ కార్యకలాపాలపై నియంత్రణ

4) కౌన్సిల్‌ను రద్దు చేయడం

## నిబంధనలు - నియంత్రణ

అవసరమైన నిబంధనలను రూపొందించడం ద్వారా మునిసిపాలిటీలను రాష్ట్ర ప్రభుత్వం నియంత్రిస్తుంది ఆరోగ్య, రక్షణ, నిర్మాణం, టౌన్ ప్లానింగ్, పన్ను విధింపు, కార్యాలయ నిర్వహణ, కౌన్సిల్ కార్యకలాపాల నిర్వహణకు సంబంధించి ప్రభుత్వం కొన్ని మార్గదర్శక సూత్రాలను రూపొందించింది దీనివలన అధికారుల నియంతృత్వ ధోరణులను నియంత్రించడం సాధ్యమవుతుంది

పాలనాపరమైన అజమాయిషీని ప్రభుత్వం వివిధ సంస్థల ద్వారా చలాయిస్తుంది ప్రభుత్వ ప్రతినిధిగా వుండే జిల్లా కలెక్టర్ అన్ని విషయాలను సమీక్షిస్తాడు అత్యవసర పరిస్థితిలో మునిసిపాలిటీకి అవసరమైన ఆదేశాలను ఇచ్చే అధికారం కలెక్టర్‌కు వుంటుంది మునిసిపల్ ఇంజనీరు, ఆరోగ్య అధికారి, టౌన్‌ప్లానింగ్ అధికారి విధులను సమీక్షించడానికి సాంకేతిక నిష్ణాతులు వుంటారు మునిసిపాలిటీ బడ్జెట్‌ను జిల్లా కలెక్టర్, రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించవలసి వుంటుంది అమలులో వున్న నిబంధనలకు వ్యతిరేకంగా ఏవైనా విషయాలు వుండే పక్షంలో వాటిని సరిచేయమని ఆదేశించే అధికారం ప్రభుత్వానికి వుంటుంది మునిసిపాలిటీల వార్షిక పాలనా నివేదిక వివిధ స్థాయిలలో సమీక్షించబడుతోంది

ఆడిటింగ్ కూడా మరో విధమైన నియంత్రణగా పనిచేస్తుంది లోకల్ ఫండ్ అకౌంట్స్ ఎగ్జామినర్ మునిసిపాలిటీ అకౌంట్లను పరిశీలిస్తాడు మునిసిపల్ అధికారుల అవినీతి ఏదైనా వుండే పక్షంలో ఈ లెక్కలలో బయటపడుతుంది మునిసిపాలిటీ నష్టాలను భర్తీచేసుకోవడానికి అనుసరించవలసిన విధానాలను కూడా ఎగ్జామినర్ ప్రతిపాదించవచ్చు ఇలాంటి పాలనా, ఆర్థిక సంబంధమైన నియంత్రణ మాత్రమే కాక కౌన్సిల్‌పై కూడా ప్రభుత్వానికి పూర్తి ఆధిక్యత కలదు రద్దు చేయవచ్చు ఛైర్‌పర్సన్, ఉప-ఛైర్‌పర్సన్‌లను కూడా ప్రభుత్వం తొలగించవచ్చు అయితే తమ చర్యలను సమర్థించుకునే అవకాశం వారికి ఇచ్చిన తరువాత ప్రభుత్వం ఈ చర్య తీసుకుంటుంది మునిసిపల్ కౌన్సిల్ తరచూ అధికారాన్ని దుర్వినియోగం చేసే పక్షంలో కౌన్సిల్‌నే రద్దుచేసే అధికారం ప్రభుత్వానికి వుంది

---

★ 1 నుంచి 17వ పేజీవరకు హైద్రాబాద్ డేటా న్యూస్ ఫీచర్సు ప్రచురణవారి "ఆంధ్రప్రదేశ్ పురపాలక దర్శిని" నుండి, వారి అనుమతితో చేర్చబడినది

ఇదంతా పరిశీలించిన వారికి ప్రభుత్వం మిక్కుటమైన అధికారాలను చలాయిస్తుందన్న విషయం తేలికగానే బోధపడుతుంది అయితే మునిసిపాలిటీలు తమ స్వయం ప్రతిపత్తిని నిలబెట్టుకుంటూ, అధికార దుర్వినియోగం చేయకుండా అదపు చేయడానికి ప్రభుత్వం ఏరకమైన అధికారాలు కలిగి వుండాలి అన్నది సమస్యగానే వుండిపోయింది

పట్టణాలు, నగరాలు గత యాభై సంవత్సరాల కాలంలో అధికంగా పెరగటం ప్రారంభించాయి వ్యాపార, వాణిజ్యాలు, విద్యా, వైద్య సౌకర్యాల కేంద్రీకరణ, చిన్న, మధ్య పరిశ్రమల ఏర్పాటు మూలంగా, ఉపాధికొరకు వందలు, వేల కుటుంబాలు గ్రామాల నుండి బ్రతుకుతెరువు కొరకు రావటం - యీ కారణాలవల్ల జనాభా బాగా పెరిగింది అసలే అంతంతమాత్రంగావున్న పౌరసౌకర్యాలు మరింత దిగజారుతున్నాయి పెరిగిన జనాభా, ప్రాంతాలకు చాలినంతగా పౌరసౌకర్యాలు కల్గించటంలో మునిసిపాలిటీలు వైఫల్యం చెందుతున్నాయి దీనికితోడు, మురికివాడల పెరుగుదల, తత్ఫలితంగా శానిటేషన్ మరింత దిగజారటం, కాలుష్యం, ట్రాఫిక్ రద్దీ - అనేక సమస్యలు మునిసిపాలిటీలను చుట్టుముట్టు చున్నాయి

రాష్ట్రంలోని సుమారు 7 5 కోట్ల జనాభాకు - గ్రామాల్లో, పట్టణ, నగరాలలోగాని - వీరందరికి కనీస ప్రాధమిక పౌరసౌకర్యాలు ఏర్పాటుచేయటం అసాధ్యం అవుతుంది ముఖ్య కారణం నిధులకొరత పట్టణాలు, నగరాలనుండి వేలకోట్ల రూపాయలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వసూలు చేసుకుంటున్నాయి అమ్మకం పన్నులు, ఎక్సైజు పన్నులు, మోటారు వాహనాల పన్నులు, ఆదాయం పన్నులు, మద్యం అమ్మకాల పన్నులు - అనేక రకాలయిన పన్నులు వసూలుచేస్తున్నా, అందులోనుండి సమంజస వాటాను స్థానిక సంస్థలకు యివ్వాలనే కోరికకు రాష్ట్ర ప్రభుత్వం నుండి స్పందనలేదు

ఇటీవల కాలంలో పెరుగుతున్న ద్రవ్యోల్బణం కారణంగా, మునిసిపాలిటీలు తీవ్ర ఆర్థిక యిబ్బందులు ఎదుర్కొంటున్నాయి పౌరసౌకర్యాల కొరకు నిర్మించే రోడ్లు, డ్రయిన్లు, విద్యుద్దీపాలు, మంచినీటి సరఫరా, మురుగు పారుదల సౌకర్యాలు వగైరాల వ్యయం యిబ్బడిముబ్బడిగా పెరుగుతూంది ఇదేకాలంలో ఉద్యోగుల జీతభత్యాలు - యీ గత 20 సంవత్సరాల కాలంలో దాదాపు 15 రెట్లు పెరిగాయి ఇటీవల మరల PRC నిర్ణయంవల్ల, మునిసిపాలిటీలపై అదనపు ఆర్థిక భారం - దాంతోపాటు ఇటీవల పెంచిన విద్యుత్ ఛార్జీలు మూలిగే నక్కపై తాటికాయ పడిన చందం అయింది వ్యయాలు,· ఖర్చులు, జీతాలు వగైరాలు పెరిగినంత దామాషాగా మునిసిపాలిటీల ఆదాయాలు పెరగటంలేదు అందువల్ల చాలా హెచ్చు మునిసిపాలిటీలు జీతాలు కూడ సకాలంలో చెల్లించుకోలేని పరిస్థితి వుండగా, యింకా అభివృద్ధి కార్యక్రమాలను గురించి ఆలోచించటానికి అవకాశం వుండటంలేదు

74వ రాజ్యాంగ సవరణ చట్టం మూలంగా రాష్ట్ర ప్రభుత్వం 1994లో ఏర్పాటుచేసిన

రాష్ట్ర ఆర్థిక కమిషన్ 1997లో రాష్ట్రాదాయంలో 39% స్థానిక సంస్థల వాటాగా యివ్వాలని చేసిన సిఫార్సును రాష్ట్ర ప్రభుత్వం దాదాపు త్రోసిపుచ్చింది

1993 జూన్‌లో 74వ రాజ్యాంగ సవరణ చట్టం అమలులోకి వచ్చింది ఆ రాజ్యాంగ సవరణ చట్టంలోని అంశాలను రాష్ట్ర శాసనసభలు తమ మునిసిపల్ చట్టంలో పొందుపరచ వలసివుంది 1994లో మన రాష్ట్ర ప్రభుత్వం 1965 మునిసిపాలిటీల చట్టం, 1955 హైద్రాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ చట్టాన్ని కొన్ని మినహాయింపులతో సవరణలు బిల్లుద్వారా ప్రవేశపెట్టింది

1965 మునిసిపల్ చట్టానికి 1994లో చేసిన సవరణల ద్వారా 1) కౌన్సిల్ కాలం 5 సంవత్సరాలుగాను 2) మహిళలకు, బలహీనవర్గాలకు, షెడ్యూల్డు తరగతులు, జాతులకు రిజర్వేషన్లు 3) ఎన్నికల నిర్వహణకు ఎలక్షన్ కమిషనరు నియామకం 4) రాష్ట్ర ఆర్థిక కమిషను నియామకం 5) కౌన్సిలులోవుండే సభ్యులు, ఎక్స్ అఫీషియో సభ్యులు, మునిసిపల్ వ్యవహారాల్లో అనుభవం వున్న వారిని కో-ఆప్షన్‌కు, మైనారిటీ వర్గాలనుండి ఒకరిని - ఓటు హక్కులేకుండా చట్టం అనుమతిస్తుంది అలాగే ఇద్దరు పిల్లలకంటే ఎక్కువమంది కల్గినవారు ఎన్నికల్లో పోటీకి అవకాశం లేదు

1994లో మరో సవరణ చట్టం ద్వారా - అప్పాయింట్‌మెంటు కమిటీ, కంట్రాక్టు కమిటీలలో అప్పటివరకు ఛైర్మన్‌కున్న అధికారాలను తొలగించి, వాటిని కమిషనరుకు కల్గించటం ద్వారా ఛైర్‌పర్సన్స్ అధికారాలు తగ్గించబడినవి కమిషనరు అంతకుముందుకంటే మరిన్ని అధికారాలతో ఆధిక్యత పొందటం దురదృష్టకరం

ఈ నేపథ్యంలో 1995 మార్చిలో ఎన్నికలు జరిగాయి రిజర్వేషను రూలు ప్రకారం మన రాష్ట్రంలో 35 మంది మహిళలు ఛైర్‌పర్సన్‌గా ఎన్నికైనారు అలాగే బలహీనవర్గాలను, షెడ్యూలు తరగతులు, జాతులకు చెందినవారు దామాషాగా ఎన్నికై పదవీ బాధ్యతలు చేపట్టారు

కాని 1992 నుండి ఎన్నికలు జరపకుండా, మూడు సంవత్సరాలు స్పెషల్ ఆఫీసర్లు పరిపాలన చేశారు ప్రత్యేకాధికారులుగా, వారు ఛైర్‌పర్సన్, కౌన్సిలుకున్న అన్ని అధికారాలు వారే చెలాయించటంతో, కమిషనర్లు సర్వాధికార్లు అయ్యారు ఎన్నికలు జరిగి కొత్తవారు బాధ్యతలు చేపట్టగా, మునిసిపాలిటీలలోని పరిస్థితులు ఛైర్‌పర్సన్స్‌కు దిగ్భ్రాంతి కలిగించాయి అధికారాలు లేవు సర్వం కమిషనర్లు వ్యవహారం చేస్తున్నట్లుగా గ్రహించిన ఛైర్‌పర్సన్ దిక్కుతోచని స్థితిలో పడిపోయారు ఆ పరిస్థితుల్లో - విజయవాడ నగరపాలక సంస్థ అధికారాన్ని పొందిన వామపక్షాల కార్పొరేషన్ ఆధ్వర్యంలో రాష్ట్రస్థాయి, ఛైర్‌పర్సన్స్, మేయర్ల సదస్సును 1995 జూన్ 18న విజయవాడలో నిర్వహించి, అందులో మునిసిపల్ సంస్థలు ఎదుర్కొంటున్న నిధులు, అధికారాలు, బాధ్యతలు గురించి తీర్మానాలు చేశాయి

అదే సంవత్సరం అక్టోబరులో నెల్లూరు మునిసిపల్ కౌన్సిలు ఆధ్వర్యంలో రెండవ సదస్సు జరిగింది ఆ సదస్సులో నాటి రాష్ట్ర పురపాలక శాఖామాత్యులు శ్రీ తమ్మినేని సీతారాంగారు రెండురోజులు సదస్సులో పాల్గొనటం విశేషం నిధులు, అధికారాల విషయంలో రాష్ట్ర ప్రభుత్వం సానుకూలంగా స్పందించగలదని మునిసిపల్ ఛైర్‌పర్సన్, మేయర్లు ఆయా పట్టణాల, నగరాల ప్రథమ పౌరులుగా ప్రధాన వ్యక్తులుగా వుంటారని హామీ యిచ్చారు ఆ సదస్సులో ఆమోదించబడిన కొన్ని తీర్మానాలు

1) రాష్ట్ర ఆర్థిక కమిషన్ సిఫార్సులు చేయటంలో ఆలస్యం జరుగుతున్నందున, స్థానిక సంస్థలకు తక్షణ సహాయంగా రు 150 కోట్లు గ్రాంటుగా మంజూరు చెయ్యాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరింది

2) 1965 ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టంలోని సెక్షన్ 43 క్రింద రు 5000 నుండి 25000 వరకు కాంట్రాక్టులు యిచ్చే అధికారాలు ఛైర్మన్‌లనుండి కమిషనర్లకు మార్చటం పట్ల నిరసనను తెలుపుతూ అంతకుముందున్న అధికారాలను పునరుద్ధరించాలి

3) అదే విధంగా, అత్యవసర పరిస్థితుల్లో పనులను నామినేషన్ పద్ధతిపై లోగడ ఛైర్మన్‌కున్న అధికారాన్ని రద్దుచేసినందున, దానిని కూడ పునరుద్ధరించాలి

4) మునిసిపాలిటీల సవరణ చట్టం 3/94 అమలుజరుగకముందు సెక్షను 77 క్రింద అధికారులు, ఉద్యోగులపై క్రమశిక్షణా చర్యలు తీసుకునే అధికారం ఛైర్మన్‌లకు వుండేది అయితే, అట్టి అధికారాన్ని కమిషనరుకు దఖలుపరచారు తిరిగి ఛైర్మన్‌లకు లోగడ వున్న అధికారాలను కల్గించాలి

5) అధికారుల బదిలీ విషయంలో - అతడు చేరిన సంవత్సరం తర్వాతనే బదిలీ కోరుతూ తీర్మానించాలని చేసిన సవరణను కూడా రద్దు చేయాలి

6) సాధారణంగా లోగడ సాంప్రదాయం ప్రకారం ప్రత్యేకాధికార్లుగా వ్యవహరించిన కమిషనర్లను ఎన్నికలు కాగానే వేరొకచోటకు బదిలీచేసి, కొత్తవారిని నియమించేవారు ఆ సాంప్రదాయానికి భిన్నంగా, 1995 మార్చిలో వున్న ప్రత్యేకాధికార్లనే కమిషనర్లుగా కొనసాగించటం సక్రమం కాదుగనుక, వారిని బదిలీలు చేయాలి

7) ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టంలోని సెక్షన్ 73 క్రింద ఛైర్మన్, కమిషనరు మరియు కౌన్సిల్‌చే ఎన్నుకోబడిన ఒక కౌన్సిలరు సభ్యులుగావున్న ఉద్యోగ నియామక కమిటీ ఉద్యోగులను ఎంపికచేయగా, ఛైర్మన్ అప్పాయింటింగ్ అధికారిగా వుండేవారు కాని 1994 సెక్షన్ 74 ప్రకారంగా కమిషనర్‌లను అప్పాయింటింగ్ అథారిటీగా నిర్ణయించారు అలాగే విద్యాలయాల్లో ప్రధానోపాధ్యాయుల నియామకం, ఉపాధ్యాయుల పోస్టుల్లో ఖాళీలను నింపే అధికారం ఛైర్మన్‌కు వుండేది దానిని తొలగించి, కమిషనర్‌ను అప్పాయింటింగ్ అథారిటీగా నిర్ణయించి, ఉపాధ్యాయ పోస్టుల్లో ఖాళీలను భర్తీచేయుటకు కలెక్టర్ అధ్యక్షతన

గల జిల్లా సెక్షన్ కమిటీకి అప్పగించటం ద్వారా ఛైర్మన్‌కున్న అధికారాలు తీవ్రంగా కుదించబడినందున వాటినన్నింటిని లోగడవలెనే పునరుద్ధరించాలి

8) ఉద్యోగులకు పెన్షన్ చెల్లింపు దీర్ఘకాలం సర్వీసుచేసిన తర్వాత, రిటైరైనవారికి పెన్షను చెల్లింపుకు రిటైరైన సంస్థలో నిధులులేక, వారికి సకాలంలో చెల్లించుటలేదు పర్యవసానంగా రిటైరైన ఉద్యోగులు తీవ్ర ఆర్థిక యిబ్బందులకు లొనవుతున్న దృష్ట్యా రిటైరైన ఉద్యోగుల పెన్షన్లు రాష్ట్ర ప్రభుత్వమే ట్రెజరీద్వారా చెల్లించాలని తీర్మానించారు

9) వినోదపు పన్ను రాష్ట్ర ప్రభుత్వం అప్పుడప్పుడు వివిధ కారణాలవల్ల, సినీరంగాన్ని కాపాడాలనే కారణంగా, వినోదపు పన్నులో రాయితీలు యివ్వటంవల్ల, స్థానిక సంస్థల ఆదాయం తగ్గి ఆర్థిక యిబ్బందులు ఏర్పడుతున్నందున, రాయితీలకు సరిపడిన సొమ్మును రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక గ్రాంట్లుగా యివ్వాలని కోరటమయింది

10) మోటారు వాహనాల పన్ను రాష్ట్ర ప్రభుత్వం ఆదాయం యీ పన్నుల ద్వారా గణనీయంగా పెరుగుచున్నా, 30 సంవత్సరాల క్రితం నిర్ణయించిన మోటారు వాహనాల పన్ను నష్టపరిహారం గొర్రైతోకలాగా ఏమాత్రం పెంపుదల కాలేదు లారీలు, బస్సులు, యితర వాహనాల రద్దీవల్ల పట్టణాలలోని రోడ్లు త్వరగా పాడయిపోవటం, వాటిని పునరుద్ధరించేందుకు నిధులు లేకపోవటంతో ప్రజలు నానాయిబ్బందులకు గురవుతున్నారు

మూడు దశాబ్దాల క్రింద నిర్ణయించిన నష్టపరిహారాన్ని యిప్పటికి కొనసాగించటంపట్ల తీవ్ర ఆక్షేపణను తెలుపుతూ ఆయా పట్టణాలనుండి వసూలవుతున్న మోటారు వాహనాల పన్నుల నుండి 25% నష్టపరిహారంగా రాష్ట్ర ప్రభుత్వం యిచ్చి మునిసిపాలిటీలను ఆదుకోవాలని తీర్మానించటమైంది

11) తలసరి గ్రాంటు పెంపు గతంలో ఉద్యోగుల కరువుభత్యం పెంచినప్పుడల్లా, 50% రాష్ట్ర ప్రభుత్వం గ్రాంటుగా యిచ్చేది తర్వాత యాక్షన్ ప్లాన్ గ్రాంటుక్రింద మాచింగ్ గ్రాంటుగా అభివృద్ధి కార్యక్రమాలకు రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక గ్రాంటు యిచ్చేది కాని యీ రెండు గ్రాంట్లు యిప్పుడు రాష్ట్ర ప్రభుత్వం నిలుపుదల చేయటంపట్ల అసమ్మతిని తెలుపుతూ కనీసం ప్రస్తుతం 4 రూపాయలుగా వున్న తలసరి గ్రాంటును 8 రూపాయలకన్నా పెంచవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతున్నారు

12) ఎ) ప్రజలకు మంచినీటి సరఫరాకుగాను, నదులనుండి నీరు తీసుకొని, హెచ్చు ఖర్చులతో శుద్ధిపరిచి సరఫరా చేస్తున్నాయి సముద్రంలో కలిసే నీటికి గూడ స్థానిక సంస్థల నుండి సెస్సు వసూలును తక్షణం నిలిపివేయాలని -

బి) మంచినీటి సరఫరాకు వినియోగించే విద్యుత్‌కు గ్రామపంచాయతీలకు యిస్తున్న రాయితీని మునిసిపాలిటీలకు విస్తరింపచేయాలని తీర్మానం చేయబడింది

13) కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వసూలుచేస్తున్న పలు పన్నులలో సమంజసమైన వాటాను స్థానిక సంస్థలకు యివ్వాలి

1 రాష్ట్ర ప్రభుత్వం వసూలుచేస్తున్న అమ్మకం పన్నునుండి

2 మునిసిపాలిటీల పరిధిలో క్వారీలు, యిసుక ఆదాయాలనుండి వాటా

3 ఓడరేవులపై వచ్చే ఆదాయంనుండి

4 కేంద్ర ప్రభుత్వం వసూలుచేసే ఆదాయపు పన్ను, ఎక్సైజు పన్నుల నుండి

5 రాష్ట్ర ప్రభుత్వంవారు వసూలుచేసే ఎక్సైజు పన్ను

14) ఎ పి ఎస్ ఎస్ ఐ డి సి , లిడ్‌క్యాప్, ఆప్కో వగైరా సంస్థలనుండి విధిగా మెటీరియల్ కొనుగోలు చేయాలనే ఉత్తర్వులను రద్దుచేయాలి పై సంస్థలు సరఫరా చేస్తున్న వస్తువులు సరైన నాణ్యతలేకపోవటం, సకాలంలో సరఫరా చేయలేకపోవటం, ధరలు అధికంగా వుండటంవల్ల మునిసిపాలిటీలు యిబ్బందులు ఎదుర్కొంటున్న కారణంగా కావలసిన నాణ్యమైన మెటీరియల్ బహిరంగ టెండర్ల ద్వారా కొనుగోలుకు ఉత్తర్వులు యివ్వాలని తీర్మానించటమైంది

15) ఇటీవల చేసిన మార్పువల్ల 'ఛైర్‌పర్సన్'గా వ్యవహరించటం సవ్యంగాలేదని, అనాది నుంచి వున్న 'ఛైర్మన్' పేరునే పునరుద్ధరించాలని తీర్మానించటమయింది

## ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ ఛైర్మన్ల మండలి 1996-97లో రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించిన కొన్ని ప్రధాన డిమాండ్లు :

1 సెక్షన్ 43 క్రింద కాంట్రాక్టు అగ్రిమెంట్లపై కమిషనర్లకున్న అధికారాన్ని తొలగించి ఛైర్‌పర్సన్స్‌కు పునరుద్ధరించాలి

2 ఉపాధ్యాయుల ఖాళీలను భర్తీచేసుకొనుటకు విధించిన నిషేధాన్ని తొలగించాలి

3 ప్యానల్ కమిటీవారి సిఫార్సుల మేరకు అసిస్టెంటు ఇంజనీర్లు, టౌన్‌ప్లానింగ్ ఉద్యోగులు, శానిటరీ సూపర్‌వైజరు సీనియర్ అసిస్టెంటు, జూనియర్ అసిస్టెంటు, టైపిస్టు వగైరా ఉద్యోగ నియామకానికి ఛైర్‌పర్సన్‌కు అధికారం కల్గించాలి

4 అంతర్గత బదిలీలు చేసే అధికారాన్ని ఛైర్‌పర్సన్స్‌కు కల్గించాలి

5 భవన నిర్మాణ ప్లాన్లు, లే-అవుట్లు అప్రూవల్, ఆక్రమణ తొలగింపు ఉత్తర్వులకు ఛైర్ పర్సన్ అనుమతి కూడా పొందాలి

6 ఛైర్‌పర్సన్స్, వైస్ ఛైర్‌పర్సన్స్, కౌన్సిలర్ల గౌరవ వేతనం పెంచాలి

7 జిల్లా ప్లానింగు కమిటీలలో ఛైర్‌పర్సన్‌కు సభ్యత్వం యివ్వాలి

8 సినిమా ధియేటర్లను తనిఖీచేసే అధికారం వుండాలి

9 కేబుల్ టి వి ల మీద పన్ను విధించేందుకు అనుమతివ్వాలి

10 ఆర్థిక పరిస్థితి ఆధారంగా శానిటేషన్, మంచినీటి సరఫరాకు, అదనపు వాహనాలు కొనుగోలుకు అనుమతివ్వాలి

11 ఛైర్‌పర్సన్ల గౌరవప్రదమైన ప్రోటొకాల్ నిబంధనలు ఖచ్చితంగా అమలుపరచాలి

12 మునిసిపల్ కౌన్సిలు ఏదేని అధికారిని ఉపసంహరించాలని కోరేందుకు విధించిన 1 సంవత్సరం గడువును తొలగించాలి

13 వృత్తిపన్నును ప్రైవేటు కళాశాలలు, కోచింగ్ సెంటర్లు, ప్రైవేటు ఆసుపత్రులలో డాక్టర్లు, ప్లీడర్లు, చార్టర్డ్ అక్కౌంటెంట్లనుండి కూడా వసూలుచేయుటకు వాణిజ్య పన్నుల శాఖను అనుమతించాలి

14 విద్యుత్ శాఖ, టెలిఫోను, ప్రైవేటు సంస్థలు మునిసిపల్ స్థలాల్లో ఏర్పాటుచేసిన స్తంభాలకు, ట్రాన్స్‌ఫార్మర్ వగైరాలనుండి ఆక్రమణ పన్ను విధించేందుకు నిబంధనలు మార్చాలి

15 మోటారు వాహనాల పన్ను పరిహారం గ్రాంటు అత్యంత స్వల్పంగా వుంది పెరుగుతున్న ఆదాయం ప్రకారంగా యీ పరిహారాన్ని గణనీయంగా పెంచాలి

16 మార్కెట్ యార్డులకు కలిపే రోడ్లను మార్కెటు కమిటీవారే అభివృద్ధిపరచుకోవాలి

17 పట్టణాలలోని గృహాలకున్న మునిసిపల్ పన్నులు (స్థలంతో సహా) చెల్లించుచున్నందున, వేరే వ్యవసాయేతర పన్ను విధింపును రద్దుచేయాలి

18 మునిసిపల్ సరిహద్దులలోని ఎస్ టి , ఎస్ సి , బి సి హాస్టళ్ళ తనిఖీ, అజమాయిషీ కమిటీలకు ఛైర్‌పర్సన్ అధ్యక్షులుగా నియమించాలి

19 ప్రభుత్వ స్థలాలను పేదలకు పంపకం చేయుటకు లబ్ధిదారుల గుర్తింపు, పట్టాలు యిచ్చినపుడు, కౌన్సిలును తప్పక సంప్రదించాలి

20 శానిటరీ వర్కర్స్ నియామకంలోగల కమ్యూనల్ రొటేషన్ పద్ధతిని విరమించాలి

21 శానిటరీ సెక్షనులో ఏర్పడే ఖాళీలను భర్తీచేసేందుకు కౌన్సిలుకు అధికారం వుండాలి

22 కమిషనర్లు సాధారణంగా ఛైర్‌పర్సన్స్ అజమాయిషీలో పనిచేయాలి సెక్షను 56 (4) ప్రకారం ఛైర్‌పర్సన్స్‌కు అధికారాలు కల్గించాలి

ఎ) మునిసిపాలిటీ టపాల్స్ అన్నీ ఛైర్‌పర్సన్ చూడాలి

బి) సెక్షను 29, 70ల క్రింద నియమించబడిన అధికారులందరికి కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు వ్రాయుటకు ఛైర్‌పర్సన్స్‌కి అధికారం వుండాలి

సి) రెవిన్యూ వసూళ్ళు, అభివృద్ధి కార్యక్రమం పురోగతి, టౌన్‌ప్లానింగ్ కార్యకలాపాలు, శానిటేషన్, ప్రజారోగ్యం యు సి డి కార్యక్రమాలు సమీక్షించు అధికారం వుండాలి

డి) కమిషనరు మంజూరుచేయు బిల్లులను ఛైర్‌పర్సన్ ముందుంచాలి

23 ప్రస్తుత జనాభా, ఆదాయాల ఆధారంగా నగర పంచాయతీల స్థాయి పెంచాలి

24 సెలెక్షన్స్, స్పెషల్ గ్రేడ్ మునిసిపాలిటీలలో పని పెరిగిన దృష్ట్యా, డిప్యూటీ కమిషనరు పోస్టులను ఏర్పర్చి వారిని నియమించాలి

25 పెన్షనర్లకు చెల్లించే భృతి మొత్తం రాష్ట్ర ప్రభుత్వం స్పెషల్ గ్రాంటుగా యివ్వాలి

26 ఎ పి ఛైర్మన్ల మండలి వారికి సాంవత్సరిక చెల్లింపును దిగువ విధంగా పెంచుటకు ప్రభుత్వం అనుమతించాలి

| | ప్రస్తుతం | పెంచాలి |
|---|---|---|
| సెలెక్షన్ గ్రేడ్ | రు 1000 | రు. 2500 |
| స్పెషల్ | రు 800 | రు 2000 |
| ఫస్ట్ గ్రేడ్ | రు 600 | రు 1000 |
| సెకండ్ గ్రేడ్ | రు 250 | రు 600 |
| థర్డ్ గ్రేడ్ | రు 150 | రు 400 |

ఈ సదస్సు తదుపరి మునిసిపల్ శాఖగా మంత్రులతోనూ, ముఖ్యమంత్రోను చర్చలు జరిపిన ఫలితంగా సెక్షను 43కు సంబంధించి కొద్దిగా సవరించారు అయినా ప్రధాన కోర్కెలు అలాగే మిగిలిపోయాయి రు 150/- కోట్ల రూపాయల తాత్కాలిక గ్రాంటు యివ్వడానికి ప్రభుత్వం అంగీకరించలేదు అందుచేత ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఛైర్మన్‌ల మండలి నాయకత్వాన పలు సదస్సులు తీర్మానాలను చేయటం ద్వారా చేసిన ఆందోళనలు పెద్దగా ఫలించలేదు చివరకు 1998లో వారంరోజులపాటు హైద్రాబాద్‌లోని ఛైర్మన్ల మండలి కార్యాలయం వద్ద పదిమందికిపైగా ఛైర్‌పర్సన్సు నిరవధిక నిరాహారదీక్ష కార్యక్రమాన్ని సాగించారు అయినా మొక్కుబడిగా, అసెంబ్లీలోని కొంతమంది ప్రతిపక్ష నాయకుల సమక్షంలో ఆ శాఖామాత్యులు అన్ని సమస్యలు త్వరలో పరిష్కారం చేస్తాం అనే హామీతో నిరాహారదీక్షలు విరమించారు

అయినా పట్టువిడవక, ఛైర్మన్‌ల మండలి ప్రభుత్వ దృష్టికి తమ సమస్యలను తీసుకొని వస్తూనే వున్నారు 1997-98లో రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించిన మెమోరాండంలోని పలు డిమాండ్లను పరిష్కరించమని కోరినారు



# 3. 1965 మునిసిపల్ చట్టంలో తెలుసుకోవలసిన కొన్ని సెక్షన్లు

సెక్షన్ 3 ఏదేని స్థానిక ప్రాంతంలో ఒక మునిసిపాలిటిని రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేయవచ్చు

3ఎ మునిసిపాలిటీ ఆర్థిక పరిస్థితి బాగుగా లేదని ప్రభుత్వం అభిప్రాయపడి నప్పుడు, వ్రాతపూర్వకంగా తెలియచేయు యితర కారణాలపై ఆ మునిసిపాలిటీని ప్రభుత్వం రద్దు చేయవచ్చును అయితే, అట్లు చేయుటకు ముందుగా ఆ కారణాలను ఆ మునిసిపల్ కౌన్సిలుకు తెలియచేసి, వారి సంజాయిషీని కోరి, వారి సంజాయిషీ సంతృప్తికరంగా లేనిచో ఆ మునిసి పాలిటీని రద్దుచేయవచ్చు అట్టి ఉత్తర్వులను శాసనసభ ముందుంచవలెను

సెక్షన్ 4 మునిసిపల్ చట్టంలోని విధులను నిర్వహించుటకు ఈ క్రింది సంస్థలు బాధ్యత వహించును

1 కౌన్సిలు 2 ఛైర్‌పర్సన్ 3 కమిషనర్ 4 వార్డు కమిటీ

## కౌన్సిలు ఏర్పాటు

సెక్షన్ 5 1 ఎప్పటికప్పుడు ఆ మునిసిపల్ కౌన్సిలులో ఎంతమంది ఎన్నికైన సభ్యు లుందురో నిర్ణయించుకుని తిరిగి సవరించే వరకు అదే సంఖ్య కొనసాగును

2 ఆ మునిసిపాలిటీ ప్రాంతంలో ఎన్నికైన రాష్ట్ర శాసనసభ సభ్యుడు అయితే, ఆ నియోజకవర్గంలో ఎక్కువ శాసనసభ స్థానాలుంటే, వారు ఎంచుకొన్న మునిసిపల్ కౌన్సిలులో ఎక్స్ అఫీషియో సభ్యులుగా వుందురు

3 ఆ మునిసిపాలిటీ ప్రాంతం చేరిన లోక్‌సభ నియోజకవర్గం నుండి ఎన్నికైన సభ్యులు కూడా ఎక్స్ అఫీషియో సభ్యులుగా వుందురు పై వారు ఓటు హక్కు కూడా కల్గివుందురు ఆ మునిసిపాలిటీలో ఓటరుగా నమోదయిన రాజ్యసభ సభ్యుడు కూడా సభలో పాల్గొనవచ్చును

4 మునిసిపల్ పరిపాలనలో అనుభవం లేదా పరిజ్ఞానం గల వ్యక్తులు నగర పంచాయతీలో ఒకరు, 3 లక్షల కంటే తక్కువ జనాభా గల మునిసిపాలిటీకి యిద్దరు, ఆపై జనాభా వున్నచో ముగ్గురును కౌన్సిలు కో-ఆప్టు చేసుకోవచ్చును అయితే అందులో ఒకరు మహిళ అయివుండును వీరికి ఓటుహక్కు వుండదు అల్పసంఖ్యాక వర్గమునకు చెందినవారిని కూడా కో-ఆప్టు చేసుకోవాలి

సెక్షన్ 5బి 3 లక్షలు అంతకుమించి జనాభా గల మునిసిపాలిటీలో మునిసిపల్ పరిపాలనా డైరెక్టరు నిర్ణయించిన సంఖ్యగల వార్డు కమిటీలను ఏర్పాటు

చేయవలెను ప్రతి వార్డు కమిటీకి అయిదు తక్కువగాకుండా వార్డులు వుండవలెను వార్డు కమిటీలు ఏర్పాటయినప్పుడు సాధ్యమైనంతవరకు ప్రదేశముల సామీప్యమును పాటించవలయును ఈ వార్డు కమిటీలు తమ నుండి ఒకరిని ఛైర్‌పర్సన్‌గా ఎన్నుకోవలయును వార్డు కమిటీ కాల వ్యవధి ఎన్నికైన తేదీ నుండి ఒక సంవత్సరం మాత్రమే

సెక్షను 8 1 రిజర్వేషన్ - షెడ్యూలు జాతులు, షెడ్యూలు కులముల వారికి మొత్తం జనాభాలో వారి వారి జనాభా శాతం ప్రకారం కౌన్సిలులో వారికి సీట్లు రిజర్వు కాబడును

సెక్షను 9 సభ్యుల మరియు ఛైర్‌పర్సన్స్ పదవుల రిజర్వేషన్ - రాష్ట్ర ప్రభుత్వం నిర్దేశించిన రూల్సు ప్రకారంగా జరుగవలెను

సెక్షను 10 రాష్ట్రంలోని మునిసిపాలిటీలన్నింటికి ఓటర్ల జాబితా తయారునుండి ఎన్నికల క్రతువు మొత్తం పూర్తిచేసి ఫలితాలను ప్రకటించుటకుగాను రాష్ట్ర ఎన్నికల కమిషనరు బాధ్యుడై వుండును

సెక్షను 23 1 రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించిన కేటగిరీకి చెందిన వ్యక్తి ఛైర్‌పర్సన్‌గా పోటీ చేయుటకు అర్హులు అట్టి వ్యక్తిని మునిసిపాలిటీలోని ఓటర్లందరు ప్రత్యక్షంగా ఎన్నుకొందురు

2 రాష్ట్ర జనాభా ప్రాతిపదికన, షెడ్యూలు కులాలు, జాతుల, బలహీన వర్గాలకు కౌన్సిలు సీట్లు రిజర్వేషను జరుగును మొత్తం స్థానాల్లో పైవర్గాలతో సహా మూడవ వంతు మహిళలై వుండవలెను

సెక్షను 25 ఎన్నికైన సభ్యులు ఎన్నికయిన 15 రోజుల్లోగా వారిలోనుండి ఒకరిని వైస్ ఛైర్‌పర్సన్‌గా ఎన్నుకోవలయును

సెక్షను 29 ప్రతి మునిసిపాలిటీకి రాష్ట్ర ప్రభుత్వం ఒక కమిషనర్‌ను నియమించును అతడు మునిసిపాలిటీకి కార్యనిర్వహణాధికారిగా వుండును

సెక్షను 30 1 కౌన్సిలు రికార్డులను తెప్పించుకొను అధికారం కల్గివుండును

2 కమిటీలను నియమించుకునే అధికారం అవసరాన్నిబట్టి, ఆ కమిటీలలో కౌన్సిలు సభ్యుడుగా లేనివ్యక్తులను కూడ ఆ కమిటీ సభ్యులలో మూడవ వంతుకు మించకుండా నియమించుకోవచ్చును

43 మరియు 74వ సెక్షన్ల క్రింద నియమించబడిన కమిటీ సభ్యులు కాలపరిమితి ఒక సంవత్సరం మాత్రం

సెక్షను 34 గడచిన సంవత్సరంలో జరిగిన కార్యకలాపాలను పొందుపరిచే వార్షిక పరిపాలనా నివేదికను ప్రతి సంవత్సరం ఏప్రిల్ ఒకటో తేదీ తర్వాత సమర్పించవలెను

సెక్షను 43 కౌన్సిలు తరపున ఏదేని కాంట్రాక్టు చేసుకొను అధికారం దిగువ చూపిన వారికి గలదు

రెండవ, మూడవ గ్రేడ్

| | |
|---|---|
| ఎ ద్రవ్య పరిమితి 5000/-లకన్నా మించనప్పుడు | కమిషనరు |
| బి 5000 నుండి 20,000 మించినపుడు | ఛైర్‌పర్సన్ కమిషనరు మరియు ముగ్గురికి తగ్గకుండా ఏడుగురికి మించకుండా సభ్యులతోకూడిన కమిటి |
| మొదటిగ్రేడ్ ఎ రు 10,000కు లోపు | కమిషనరు |
| బి 10,000 నుండి 50,000 వరకు | ఛైర్‌పర్సన్, కమిషనరు మరియు కౌన్సిల్ ఎంపికచేసిన 3 నుండి 7కు మించకుండా సభ్యులతోకూడిన కమిట |
| స్పెషల్ లేదా సెలెక్షన్ గ్రేడ్ ఎ 25,000ల లోపు | కమిషనరు |
| బి 25,000 నుండి 75,000లోపు | కమిటీ |
| ఆ మొత్తానికి మించినపుడు | కౌన్సిల్ ఆమోదం పొందవలెను |

సెక్షను 46 వైస్ ఛైర్‌పర్సన్‌పై అవిశ్వాస తీర్మానం కౌన్సిల్ సభ్యులలో సగానికి తగ్గకుండా, సంతకాలతో జిల్లా కలెక్టరుకు సమర్పించాలి పదవిరీత్యా కౌన్సిల్ సభ్యులలో మెజారిటీతో తీర్మానం ఆమోదించబడవలయును

సెక్షను 47 ఛైర్‌పర్సన్ అధికారములు, బాధ్యతలు

1 వైస్ ఛైర్‌పర్సన్ ఎన్నిక ఏర్పాటు

2 కౌన్సిల్ సమావేశాల ఏర్పాటు

3 ఈ చట్టం ద్వారా ప్రత్యేకంగా ఒసగబడిన అధికారములు వినియోగించుట

4 కౌన్సిల్ మరియు ప్రభుత్వ లేదా శాఖాధిపతుల మధ్య అధికార ప్రత్యుత్తరములన్ని ఛైర్‌పర్సన్ పేరుపై జరుపబడవలెను

సెక్షను 48 అవసర వ్యయం చేయుటకు ఛైర్‌పర్సన్‌కు గల అధికారాలు మూడవ గ్రేడ్ రు 500/-లలో

రెండవ గ్రేడ్ మునిసిపాలిటీలలో రు 1500/- వరకు

మొదటి గ్రేడ్ సెలెక్షన్ గ్రేడ్ రు 5000 మించని మొత్తం

అట్లు చేసిన వ్యయ వివరాలు దరిమిలా జరుగు కౌన్సిల్‌కు నివేదించాలి

సెక్షను 49 అత్యవసర పరిస్థితుల్లో యింకా ఎక్కువ విలువగల పథకాలను కూడా నిర్వహించవలసిందిగా కమిషనరును ఆదేశించవచ్చును

సెక్షను 50 ఛైర్‌పర్సన్ తన బాధ్యతలలో వేటినైనను వైస్ ఛైర్‌పర్సన్ లేదా కమిషనరుకు వ్రాతమూలకంగా అప్పగించవచ్చును

ఛైర్‌పర్సన్ వరుసగా పట్టణంలో పదిరోజులు గైరుహాజరయినా, పదిరోజులకు పైగా అశక్తుడైనా, ఆయన బాధ్యతలు వైస్ ఛైర్‌పర్సన్‌కు సంక్రమించును

సెక్షను 51 ప్రతి కౌన్సిల్ సమావేశమునకు ఛైర్‌పర్సన్ అధ్యక్షత వహించును ఆయన లేనప్పుడు, వైస్ ఛైర్మన్, వీరిద్దరు లేనప్పుడు ప్యానల్‌లో పేర్కొనబడిన సభ్యులు అధ్యక్షత వహింతురు

బి కౌన్సిల్ మొదట సమావేశంలోనే నలుగురికి మించకుండా ఎన్నికైన సభ్యులను ప్యానల్‌గా ఆమోదించవలయును

సెక్షను 52 కౌన్సిల్ పరిశీలన, చర్చకు వచ్చిన అంశాలలో ఏదైనా సభ్యునకు వ్యక్తిగత ప్రయోజనం వున్నప్పుడు, అట్టి సభ్యుడు చర్చలోగాని, ఓటింగులోగాని పాల్గొనరాదు

సెక్షను 53 ఏ సభ్యుడైనా, మునిసిపాలిటీ నిర్మాణపు పనిలో లోటుపాట్లను, ఆస్తినష్టం, లేక వ్యర్థమగుటను లేదా ఏదైనా ప్రాంత అవసరాల గురించి ఛైర్‌పర్సన్ దృష్టికి తేవచ్చును

నియమములకు లోబడి ప్రతిపాదనలు పెట్టుటకు, ప్రశ్నలు అడుగుటకు హక్కు కలిగివుండును ఛైర్‌పర్సన్‌కు నోటీసు యిచ్చి, ఆఫీసు వేళల్లో తన కవసరమయిన రికార్డులు పరిశీలించు హక్కుగలదు

సెక్షను 54 ఛైర్‌పర్సన్‌కు గౌరవ వేతనంలో, వాహన భత్యము - సభ్యులకు వారి జీత భత్యములు రూల్సు ప్రకారం చెల్లించబడును

సెక్షను 55 సభ్యులు, వైస్ ఛైర్‌పర్సన్ లేదా ఛైర్‌పర్సన్ తమ రాజీనామా లేఖలను కమిషనరుకు యివ్వవలయును అట్టి నోటీసులను మరుసటి కౌన్సిలు ముందుంచి దాని అనుమతి పొందవలయును ఆనాటినుండే రాజీనామా అమలులోనికి వచ్చును

సెక్షను 56 కమిషనరు అధికారములు, బాధ్యతలు

1 కౌన్సిల్ తీర్మానములను అమలుజరుపవలెను

2 తీర్మానాల అమలు ప్రగతిని కౌన్సిలుకు నివేదించవలయును

3 ఈ చట్టపు విధులను అమలుపరచవలయును

4 కౌన్సిల్ ఉద్యోగులందరిపై క్రమశిక్షణ నియంత్రణ కలిగివుందురు

5 పన్నులు, ఫీజులు, లైసెన్సు ఫీజులు మొదలగు వాటిని వసూలుచేయుట, అన్యాక్రమణలను తొలగించు అధికారాలు కల్గివుండును

6 మునిసిపల్ రికార్డులు, ఆస్తులు ఆయన కస్టడీలో వుండును

7 వినోద స్థలములను, సినిమా థియేటర్లను తనిఖీ చేయవచ్చును

8 క్రమశిక్షణ, ప్రవర్తనకు సంబంధించిన నియమాల్లో ఇతర విధంగా నిబంధించితే తప్ప కమిషనరు ఛైర్‌పర్సన్ యొక్క పరిపాలన నియంత్రణ క్రింద పనిచేయవలయును

సెక్షను 59, 60 ప్రభుత్వాధికారాలు

1 తనంతతానుగాని లేదా సభ్యులు, ఛైర్‌పర్సన్, కమిషనరులు చేసిన విన్నపాలవల్లగాని, కౌన్సిల్ చేసిన తీర్మానాలనుగాని జారీచెసిన లైసెన్సు, అనుమతులను ప్రభుత్వం రద్దుచేయవచ్చును

2 ఛైర్‌పర్సన్, వైస్ ఛైర్‌పర్సన్ లేదా సభ్యులను సస్పెండు చేయుటకు విచారణానంతరం తొలగించుటకు ప్రభుత్వం అధికారం కల్గివుండును

సెక్షను 62 కౌన్సిల్ కాలపరిమితి దరిమిలా, ఎన్నికలు జరపటం సాధ్యంకాదని ప్రభుత్వం భావించినప్పుడు తిరిగి ఎన్నికలు జరిగి ఎన్నికైనవారు పరిపాలనా బాధ్యతలు చేపట్టే వరకు - ప్రభుత్వం ప్రత్యేక అధికారిని నియమిం చును వారు కౌన్సిల్ విధులు, ఛైర్‌పర్సన్ విధులు కూడ నిర్వహింతురు

సెక్షను 66 కలెక్టర్ల అధికారములు

1 కౌన్సిల్ తీర్మానాలు అమలుజరుపుటలో వైఫల్యం చెందారని కలెక్టర్‌కు తోచినపుడు, అట్టి వైఫల్యాన్ని ప్రభుత్వమునకు నివేదించి వారి ఆదేశాలను అమలుజరుపవచ్చును

2 ఆస్తులను, పనులను, రిజిష్టర్లను, అంచనాలు, అక్కౌంట్లు తనిఖీ చేయుటకు

3 ప్రజా భద్రత, అవసరాల దృష్ట్యా, ఏదేని పని, నిర్మాణం అత్యవసరంగా చేపట్టవలసివుందని కలెక్టరు భావించినప్పుడు, ఆ పనిని, నిర్మాణాన్ని తక్షణం చేపట్టవలసిందిగా మునిసిపాలిటీలను ఆదేశించగలరు

4 ఏదేని కౌన్సిల్ తీర్మానం, యివ్వబడిన లైసెన్సు, అనుమతులు రద్దు చేయటం మునిసిపాలిటీకి ప్రయోజనకరం అని భావించిన సందర్భంలో కలెక్టరు రద్దుచేయవచ్చును

సెక్షను 72 అధికారి ఉపసంహరణ

ప్రభుత్వం ఎప్పుడైనను, 29, 71 సెక్షన్ల క్రింద నియమించబడిన ఏదైన అధికారిని ఉపసంహరించి, అతని స్థానంలో మరొకరిని నియమించవచ్చును అట్లు ఉపసంహరణకై సిఫార్సు చేయటానికి పిలువబడిన కౌన్సిల్ ప్రత్యే సమావేశంలో ఆమోదించిన తీర్మానం ద్వారా, అట్లు సిఫార్సు చేసిన అధికారిని తొలగించవలెను అయితే, ఆ తీర్మానం కౌన్సిల్ యొక్క మంజూరయిన బలములో అయిదింట మూడు వంతులకు తక్కువకాని ఓట్ల మద్దతు పొందవలెను అయితే, అట్టి అధికారి పదవీ బాధ్యతలు చేపట్టిన సంవత్సరం లోపల తీర్మానం ప్రతిపాదించరాదు

సెక్షను 81 మునిసిపాలిటీలు దిగువ పన్నులను విధించవచ్చును

1 ఆస్తిపన్ను 2 వాహనములు, బండ్లపై పన్ను 3 జంతువులపై పన్ను 4 అడ్వర్టయిజ్‌మెంట్ పన్ను

ఆస్తి పన్నులు - దిగువ భవనాలకు మినహాయింపు కలదు

1 ఆరాధన మందిరాలు, సత్రములు, ధార్మిక ప్రయోజనాల కొరకు వాడు గృహములు

2 విద్యార్థుల హాస్టళ్ళతో సహా గుర్తింపు పొందిన విద్యాసంస్థల భవనములు మరియు అనాథలు, జంతువులకు ఆశ్రయం కల్పించిన స్థలములు, గ్రంథాలయాలు మరియు ఆటస్థలములు

3 పురాతన స్మారక కట్టడములు

4 ధర్మాసుపత్రులు - ఔషధశాలలు

5 దహనవాటికలు

6 భవన యజమానులే నివాసంలోవుండి, రు 300/-లలోపు సాలుసరి అద్దె విలువగల భవనాలు

7 పట్టణ పేద ప్రజలకు నిర్మించబడిన ఇండ్ల యజమానులనుండి ప్రతి అర్థ సంవత్సరమునకు ఒక రూపాయి మాత్రమే ఆస్తిపన్నుగా వసూలుచేయాలి

## మునిసిపాలిటీల గ్రేడ్ నిర్ధారణ

1 మూడవ గ్రేడ్ కోటి రూపాయలలోపు ఆదాయం

2 రెండవ గ్రేడ్ 2 కోట్ల రూపాయలలోపు ఆదాయం

3 మొదటి గ్రేడ్ 2 కోట్ల రూపాయల నుండి మూడు కోట్లలోపు ఆదాయం

4 ప్రత్యేక గ్రేడ్ 3 కోట్లు - 4 కోట్ల రూపాయలలోపు ఆదాయం

5 సెలెక్షన్ గ్రేడ్ . 4 కోట్ల రూపాయలకు మించి ఆదాయం

## మునిసిపాలిటీలలో ఎన్నికైన సభ్యుల సంఖ్య :

కౌన్సిలర్ల సంఖ్య

నగర పంచాయతీ - 15

40,000 జనాభా లోపు - 21

40,000 నుంచి లక్ష మించి మరియు 1 లక్షకు మించని - 21 + ప్రతి 10,000కు ఒక అదనం

లక్షకు మించి, 2 లక్షలకు మించని - 27 + లక్షపైన ప్రతి 15,000లకు ఒకరు అదనం

2 లక్షలకు మించి - 22 + ప్రతి 20,000కు అదనం అయితే మొత్తం సంఖ్య 45కు మించరాదు

## ఆం.ప్ర. మునిసిపాలిటీల చట్టం, 1965 క్రింద చేయబడిన రూల్సు

1 నగర పంచాయతీలు మరియు మునిసిపాలిటీలను వార్డులుగా విభజించు రూల్సు 1994

2 నగర కౌన్సిళ్ళు మరియు నగర పంచాయతీల శ్రేణీకరణ రూల్సు, 1994

3 మునిసిపల్ కౌన్సిళ్ళు మరియు నగర పంచాయతీలలో ఛైర్‌పర్సన్ పదవుల రిజర్వేషన్ రూల్సు, 1995

5 రిజర్వు చేయబడు సభ్యుల పదవులు నిర్ణయించుట - ప్రత్యాయోజనము (డెలిగేషన్)

6 రిజర్వు చేయబడు వార్డులను నిర్ణయించుట - ప్రత్యాయోజనము (డెలిగేషన్)

7 మార్పు చెందుచున్న ప్రాంత మరియు చిన్నతరహా పట్టణప్రాంత (ప్రధానాంశములను నిర్ణయించు) రూల్సు 1995

8 నగర పంచాయతీలలో మరియు మునిసిపల్ కౌన్సిళ్ళలోని సభ్యుల సంఖ్యను నిర్ణయించు రూల్సు, 1994

9 వార్డుల కమిటీ ఏర్పాటు, ఛైర్‌పర్సన్ల ఎన్నిక, అధికారములు మరియు కృత్యముల రూల్సు, 1995

10 మునిసిపల్ పరిపాలనలో ప్రత్యేక పరిజ్ఞానము లేదా అనుభవము కలిగివున్న సభ్యుల కో-ఆప్షన్ రూల్సు, 1995

11 అల్ప సంఖ్యాక వర్గములకు చెందిన సభ్యుల కో-ఆప్షను రూల్సు, 1995

12 మునిసిపాలిటీలు మరియు నగర పంచాయతీల (ఓటర్ల రిజిస్ట్రేషన్) రూల్సు, 1994

13 మునిసిపల్ కౌన్సిల్ మరియు నగర పంచాయతీల (ఛైర్‌పర్సన్ ప్రత్యక్ష ఎన్నిక) రూల్సు, 1986

14 మునిసిపాలిటీలలో వైస్ ఛైర్‌పర్సన్ ఎన్నిక నిర్వహణ రూల్సు, 1986

15 మునిసిపల్ కౌన్సిళ్ళు/నగర పంచాయతీల (ఎన్నిక నిర్వహణ) రూల్సు 1965

16 ఓటర్లకు గుర్తింపు కార్డుల సరఫరా రూల్సు, 1986
17 ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీలలోని కమిటీ సభ్యుల ఎన్నికల రూల్సు, 1981
18 ఛైర్‌పర్సన్ మొదలగువారికి చెల్లించు ప్రయాణ, దినసరి భత్యముల రూల్సు, 1988
19 కమిటీల కార్యకలాపాల నిర్వహణ రూల్సు
20 సభ్యులచే ఛైర్‌పర్సన్‌ను ప్రశ్నలు అడుగబడుటకు రూల్సు, 1965
21 మునిసిపల్ కౌన్సిళ్ళ కాంట్రాక్టులు మరియు లీజుల మాఫీ రూల్సు, 1965
22 కేంద్ర ప్రభుత్వ భవనాల రూల్సు, 1965
23 పనుల కొలతల తనిఖీ రూల్సు, 1972
24 రికార్డులు గోపనీయమైనవిగా లేదా రహస్యమైనవిగా వర్గీకరించు రూల్సు, 1965
25 కొన్నిరకాల యంత్ర సామాగ్రిని 264వ సెక్షన్ అమలునుండి మినహాయించుట
26 యంత్రాలు స్థాపించుటకై అనుమతులు మరియు లైసెన్సుల మంజూరుకై ఫీజుల రూల్సు, 1968
27 కేటాయించిన నిధులను తాత్కాలికంగా మళ్ళించుటకు రూల్సు
28 మునిసిపాలిటీల టెండరు రూల్సు, 1967
29 వ్యక్తిగత కేసులలో రూల్సు మరియు రెగ్యులేషన్లను సడలించుటకు ప్రభుత్వమునకు గల అధికారము రూల్సు
30 మునిసిపాలిటీ పనుల రూల్సు, 1967
31 సెక్షన్ 71 క్రింద నియమించబడిన అధికారులపై ఛైర్‌పర్సన్ యొక్క నియంత్రణ రూల్సు
32 సెక్షన్ 368 క్రింద మునిసిపాలిటీలో నివాస, పారిశ్రామిక, వాణిజ్య, మురుగు ప్రాంతాల అధిసూచనను ప్రచురించుట
33 స్థిరాస్తుల ఆర్జన మరియు బదిలీ రూల్సు, 1967
34 బైలాల ప్రచురణ రూల్సు, 1969
35 నోటీసు ప్రచురణ రూల్సు, 1967
36 లైసెన్సు లేకుండా స్థలములను ఏ ప్రయోజనముల నిమిత్తం వాడరాదో, ఆ ప్రయోజనములను తెలిపే అధిసూచనను ప్రచురించు రూల్సు, 1967
37 నిధుల కేటాయింపు, బదిలీ బడ్జెటు తయారీ రూల్సు, 1967
38 విచారణ అధికారుల యొక్క అధికారముల రూల్సు
39 రాబడులు మరియు వ్యయముల రూల్సు, 1968
40 కమిటీలు పనిచేయుటకు సంబంధించిన రూల్సు, 1969
41 మునిసిపాలిటీ లే-అవుట్ రూల్సు, 1979

42 ప్రాజెక్షన్ల కొరకు లైసెన్సులు ఇచ్చుట, రోడ్డుప్రక్కలు, వీధి అంచులను లీజుకిచ్చుటకు సంబంధించిన రూల్సు, 1969

43 మునిసిపల్ కౌన్సిళ్ళ సమావేశంలో తీర్మానాలను ప్రవేశపెట్టడానికైన రూల్సు, 1965

44 డిపాజిట్లు మొదలగువాటికి సంబంధించిన లావాదేవీల రూల్సు, 1970

45 నీటి సరఫరా గృహ సర్వీసు కనెక్షన్ల రూల్సు, 1977

46 మునిసిపల్ కమిషనరుపై ఛైర్‌పర్సన్ నియంత్రణ రూల్సు, 1977

47 కాంట్రాక్టర్ల రిజిస్ట్రేషన్ రూల్సు, 1978

48 నమూనాల కొనుగోలు, నిర్వహణ మరియు అకౌంటింగ్ రూల్సు, 1968

49 అప్పీళ్ళ స్వీకరణ మరియు పరిష్కారముల రూల్సు, 1967

50 కొత్త పన్నులను విధించుటకు మరియు ప్రస్తుతమున్న పన్నులను పెంచుటకు ఉద్దేశించిన అధిసూచనను ప్రచురించే పద్ధతి

51 పన్నుల నిర్ధారణ రూల్సు, 1990

52 మునిసిపాలిటీలలో అడ్వర్‌టైజ్‌మెంట్ పన్ను వసూలు మరియు అడ్వర్‌టైజ్‌మెంట్ల క్రమబద్ధీకరణ

53 పన్ను నిర్ధారణ పుస్తకాలలో ఆస్తి యాజమాన్యము మార్పు చేయుటను గురించి రూల్సు, 1966

54 ఆస్తి బదిలీపై సుంకము విధించు రూల్సు, 1965

55 మునిసిపల్ కౌన్సిళ్ళచే పన్నులు వసూళ్ళు

56 మునిసిపాలిటీలలో టీచర్ల నియామకపు రూల్సు

చట్ట నిబంధనలు ఎంత అధికారపూరితమైనవో, ఈ రూల్సు కూడ అంతే అధికారపూరితమైనవి వీనికి భిన్నంగా చేయబడు నిర్ణయాలు, తీర్మానాలు చెల్లుబడికావు

**ముఖ్య గమనిక :** మునిసిపల్ కౌన్సిలర్లు చట్ట నిబంధనలతోపాటు, మునిసిపల్ టాక్సేషన్ రూల్సు, బిల్డింగ్ రూల్సు అధ్యయనం చేయటం అవసరం



# 4. కౌన్సిలు సమావేశములు, వార్డుల కమిటి నిర్వహణకు సంబంధించిన కొన్ని రూల్సు (క్లుప్తంగా)

## కౌన్సిల్ సమావేశం : నియమ నిబంధనలు

1 ప్రతి నెల ఒకసారైనా సమావేశం జరుగవలెను మరియు ఛైర్‌పర్సన్ పిలిచినప్పుడు సమావేశం జరుగును కార్యాలయ శలవు దినమునందు సమావేశం జరుపరాదు

2 సమావేశానికి కనీసం 3 దినముల ముందు స్పష్టమైన నోటీసుతో నిర్వహించబడు తేది, సమయం నిర్దిష్టంగా వుండవలెను
అత్యవసర పరిస్థితుల్లో తక్కువ వ్యవధిలో నోటీసు యిచ్చి కూడ సమావేశం ఏర్పరచవచ్చు
ఛైర్‌పర్సన్‌తో సంప్రదించి, కమీషనరు ఎజండాను తయారుచేయవలయును వారిద్దరు తాము అవసరమనుకున్న అంశాలను కూడ ఎజండాలో చేర్చవచ్చు

3 అప్పుడున్న సభ్యులలో మూడింట రెండు వంతులమంది వ్రాతమూలకంగా కోరినట్లయితే, ఛైర్‌పర్సన్ సమావేశం ఏర్పాటుచేయవలయును అట్టి సమావేశం ఏ అంశం చర్చించుటకో నిర్దిష్టంగా వుండవలెను అయితే, అట్టి అభ్యర్థన స్పష్టమైన పది దినములకు ముందుగా సభ్యులకు అందచేయవలెను
అభ్యర్థన అందిన 48 గంటల లోపల సమావేశం ఏర్పాటు చేయని ఎడల, నోటీసు పొందుపరచిన తేదీనగాని, లేదా 3 దినముల లోపల, నోటీసును యితర సభ్యులకు యిచ్చి, అభ్యర్థనలో సంతకం చేసిన సభ్యులు సమావేశాన్ని ఏర్పాటుచేయవచ్చు

4 సాధారణంగా, కౌన్సిల్ సమావేశములు పబ్లిక్‌గానే జరుగవలెను కాని ఏదైనా ప్రత్యేక సందర్భంలో హాజరైన ప్రజలనుగాని, లేదా ప్రత్యేక వ్యక్తినిగాని బయటకు పంపవచ్చు

5 సమావేశం ముందుకు వచ్చిన అన్ని ప్రశ్నలను (ప్రతిపాదనలు) హాజరైన మెజారిటీ సభ్యులచే నిర్ణయించబడును సమాన ఓట్లు వచ్చిన సందర్భంలో సమావేశ అధ్యక్షులు తన కాస్టింగ్ ఓటుతో నిర్ణయం తీసికోవలయును

6 కౌన్సిలు సభ్యుల సంఖ్య 16 అయితే, 6గురు సభ్యులతో కోరం అగును అంతకు మించి సభ్యులున్న కౌన్సిలులో మూడవవంతు సభ్యులు కోరంగా పరిగణించవచ్చును

7 సమావేశ సమయం తర్వాత, అరగంట లోపల కోరం లేనట్లయితే, హాజరయిన సభ్యులు ఆమోదించితేతప్ప, సమావేశం వాయిదా వేయవలయును

8 కౌన్సిల్‌చే ఆమోదించబడిన ఏదేని నిర్ణయం మూడు నెలలలోపుగా దానిని మార్చుటకు లేదా రద్దుపరచుట చేయరాదు

9 ప్రతి సమావేశం ప్రొసీడింగ్స్‌ను మినిట్సు పుస్తకంలో నమోదుచేయవలయును దాని క్రింద సమావేశాధ్యక్షుడు సంతకం చేయవలెను ఎవ్వరైనా మినిట్సును పరిశీలించుటకు

- ఏ రుసుం లేకుండానే - అవకాశం కలదు సమావేశ నిర్ణయాలను జిల్లా కలెక్టరుకు, ప్రాంతీయ పురపాలక శాఖ డైరెక్టరుకు, ఆఫీస్ నోటీసు బోర్డు మీద వుంచవలెను ఏదైనా అంశంపై, ఎవరైనా సభ్యుడు తన భిన్నాభిప్రాయం (డిసెంట్ నోటు) ఛైర్‌పర్సన్‌కు యిచ్చినట్లయితే, దానిని మినిట్సులో చేర్చవలెను

10 మినిట్సు పుస్తకం, తదితర రికార్డులు కమీషనరు కస్టడీలో వుంచవలెను

వార్డుల కమిటీ ఏర్పాటు, ఛైర్‌పర్సన్ ఎన్నిక, అధికారములు మరియు విధుల రూల్సు - 1995

జి ఓ యం యస్ నెం 144 యం ఎ అండ్ యు డి తేది 18-3-1995

**ముఖ్యాంశాలు ·**

1 మునిసిపాలిటీల చట్టంలోని 5 బి సెక్షను ప్రకారం వార్డుల కమిటిలను ఏర్పాటు చేయవలెను

2 3 లక్షలలోపు జనాభాగల మునిసిపాలిటీల్లోనూ, మునిసిపాలిటీ పరిపాలన శాఖ కమిషనరు మరియు డైరెక్టరు వార్డు కమిటీల ఏర్పాటు చేయవచ్చును అయితే, ఆ మునిసిపాలిటీ ఆదాయం నాలుగు కోట్ల రూపాయలకంటె తక్కువ వుండరాదు

3. ఛైర్‌పర్సన్ ఎన్నికకు, కమిషనరుచే నియమింపబడిన అధికారి - స్పష్టమైన 7 దినములు గల నోటీసుతో ప్రత్యేక సమావేశం ఏర్పాటుచేసి, ఛైర్‌పర్సన్ ఎన్నికను నిర్వహించ వలెను

4 ఈ సమావేశానికి కోరం మొత్తం సభ్యులలో సగానికి తగ్గకుండా వుండాలి

5 సమావేశానికి కోరం లేనప్పుడు, తిరిగి 3 రోజుల నోటీసుతో మరల జరిపి ఎన్నిక చేయవలెను ఒకవేళ యీ సమావేశానికిగూడా కోరం లేనట్లయితే, కోరంతో నిమిత్తం లేకుండా మూడవ సమావేశంలో ఛైర్‌పర్సన్ ఎన్నికను వార్డుకమిటీ కార్యదర్శి నిర్వహించవలెను

6 ఛైర్‌పర్సన్‌కు ఎన్నిక నిర్వహించవలసినప్పుడు, రహస్య బ్యాలటు ద్వారా, ఎన్నిక నిర్వహించి అధిక ఓట్లు లభించినవారిని ఎన్నికైనట్లు ప్రకటించవలెను

**ఛైర్‌పర్సన్ అధికారములు, విధులు**

1 వార్డుల కమిటీ సమావేశాలను ఏర్పాటుచేసి, అధ్యక్షత వహించుట

2 మొదటి సమావేశాలలోనే ఇద్దరికి మించకుండా, తాత్కాలిక ఛైర్‌పర్సన్స్‌ను నియమించాలి

3 ఆ సమావేశాలలో లేవనెత్తిన పాయింటు ఆఫ్ ఆఫ్ ఆర్డర్సుమీద ఛైర్‌పర్సన్ తన నిర్ణయాన్ని ప్రకటించాలి దీనిపై ఎట్టి వాదోపవాదాలు, అప్పీలులు వుండవు.

4 సమ్మావేశంలో ఒక సభ్యుని ప్రవర్తన సక్రమంగా లేనప్పుడు అట్టి సభ్యుడిని సమావేశం

నుండి బయటకు పంపవచ్చును

5 ఏదైనా ప్రతిపాదన, కమిటి అధికారములుకు మించి వుందని భావిస్తే, అట్టి ప్రతిపాదనలను కౌన్సిలు పరిశీలన నిర్ణయం కొరకు పంపవచ్చును

6 వార్డులకమిటీ కార్యాలయానికి అత్యవసర వ్యయం రు 100/-కు మించకుండా ఛైర్‌పర్సన్ చేయవచ్చు

7 వార్డులకమిటీ ఛైర్‌పర్సన్ రాజీనామా చేయదలచినచో, అట్టి లేఖను వార్డులకమిటి కార్యదర్శికి పంపవలెను

8 రాజీనామా వల్లగాని, అశక్తుడైన సందర్భంలోగాని, మరే యితర కారణాలవల్లగాని, ఛైర్‌పర్సన్ పదవి ఖాళీ అయినప్పుడు, వార్డులకమిటి తమ సభ్యుల నుండి ఒకరిని ఛైర్‌పర్సన్‌గా ఎన్నుకోగలదు అయితే మిగిలిన కాలానికే ఆ పదవి పరిమితం

9 సమావేశ చర్చనీయాంశాలలో ఎవరైన సభ్యునికి ప్రత్యక్ష లేక పరోక్ష ధన సంబంధమైన ప్రయోజనం వున్నచో అట్టి సభ్యుడు ఆ అంశంపై చర్చలోగాని, లేదా ఓటింగులోగాని పాల్గొనరాదు ఈ నియమం ఛైర్‌పర్సన్‌కు గూడా వర్తించును

10 ఏ సభ్యుడైనా, జరుగుచున్న పనులలో లోటుపాట్లను, నిర్లక్ష్యాన్ని, నష్టాన్నిగాని, ఛైర్‌పర్సన్ దృష్టికి తేవచ్చును తీర్మానములు ప్రవేశపెట్టుటకు, ప్రశ్నలు అడుగుటకు ప్రతి సభ్యునికి హక్కుగలదు

11 వార్డుల కమిటి అధికారములు, విధులు

1 పారిశుద్ధ్య నిర్వహణ

2 నీటి సరఫరా లేక మురుగునీటి పారుదల నిర్వహణ

3 వీధి దీపాల నిర్వహణ

4 రోడ్ల నిర్వహణ

5 మార్కెట్ల నిర్వహణ

6 పార్కులు, ఆటస్థలముల నిర్వహణ

7 పాఠశాల భవనాల నిర్వహణ

8 తమ వార్డు కమిటి పరిధిలోని రెవిన్యూ వసూళ్లను సమీక్షించవచ్చు

9 వార్డులకమిటీ వార్షిక బడ్జెటు తయారుచేసి, మునిసిపల్ కౌన్సిలు వార్షిక బడ్జెటులో పొందుపరచు నిమిత్తం మున్సిపల్ కౌన్సిలుకు పంపవలెను

10 వార్డులకమిటీ కొరకు మంజూరయిన పనులు, పథకములను కమిషనరు అమలు చేయవలెను.

11 వార్డుల కమిటీకి ఒక కార్యాలయం వుండాలి ప్రతినెలలోను నిర్ణయించిన దినములలో కనీసం ఒకసారైనా సమావేశం కావలయును ఆ సమావేశాలకు 3

రోజుల స్పష్టమైన కాలవ్యవధితో నోటీసులు యివ్వాలి అవసరమయిన సందర్భంలో తక్కువ నోటీసుతోనూ సమావేశం జరగవచ్చును

12 ఛైర్‌పర్సన్‌ను సంప్రదించి, కార్యదర్శి సమావేశ ఎజెండాను రూపొందించవలయును, ఎజెండా అంశాలపై కార్యదర్శి తమ అభిప్రాయాలను గూడా జతపరచవచ్చును

13 వార్డుల కమిటీసభ్యులలో సగమునకు తక్కువగాని సభ్యులు కోరిన పక్షంలో ఛైర్‌పర్సన్ సమావేశం జరుపవలెను ఒకవేళ ఛైర్‌పర్సన్ యీ లిఖితపూర్వక అభ్యర్ధన అందిన 48 గంటలలోగా సమావేశాన్ని ఏర్పాటుచేసి, నోటీసు పంపనట్లయితే, అభ్యర్ధనలో సంతకం చేసిన సభ్యులే, యితర సభ్యులకు 3 రోజుల నోటీసు యిచ్చి, సమావేశాన్ని జరిపి, నిర్ణయం చేయవచ్చు

14 సమావేశంలో చర్చకు వచ్చు అన్ని అంశాలపై, అత్యధిక సంఖ్య ఓట్లతో నిర్ణయించాలి ఓట్లు సమానంగా వచ్చే యెడల, ఛైర్‌పర్సన్ తద నిర్ణాయక ఓటుతో తీర్మానించవచ్చును సమావేశంలో కమిటీలో అప్పుడున్న మొత్తం సభ్యులలో కనీసం సగంమంది హాజరు వుండాలి సమావేశ సమయానికి మించి అరగంటలోగా కోరం కానట్లయితే, ఆ సమావేశం వాయిదా పడినట్లుగా భావించవలెను ఒకసారి చేసిన తీర్మానాన్ని, మూడు నెలల తర్వాతనే మార్పుచేయవచ్చు

★ ★ ★

## 2. సెక్షను 71 క్రింద నియమించబడిన అధికారులపై ఛైర్‌పర్సన్ నియంత్రణ రూల్సు

జి ఓ యం యస్ నెం 357 యం ఎ తేది 26-3-1966

మునిసిపల్ పరిపాలనకు చెందిన విషయములలో మునిసిపల్ ఆరోగ్యశాఖాధికారి, మునిసిపల్ ఇంజనీరు, విద్యాధికారి మరియు నియంత్రణాధికారులకు - ప్రజల సౌకర్యార్థం, ఛైర్‌పర్సన్ వ్రాతమూలక వుత్తర్వులద్వారా ఒకానొక పనిని నిర్వహించవలసిందిగా, నిర్దిష్టమైన కృత్యమును నిర్వహించవలసినదిగా ఆదేశించవచ్చు అధికారులు ఛైర్‌పర్సన్ ఉత్తర్వులను విధిగా పాటించవలయును

వ్యయములతో ఇమిడివున్న సందర్భాలలో తన నోట్‌లో ఛైర్‌పర్సన్ బడ్జెటు కేటాయింపులను పేర్కొనవచ్చు

ఉత్తర్వులు పాటించబడనట్లయితే, ఆ విషయమును చర్య తీసుకునే నిమిత్తం సంబంధిత శాఖాధిపతికి, ప్రభుత్వ దృష్టికి ఛైర్‌పర్సన్ తీసికొనిరావలెను

★ ★ ★

## 3. మునిసిపల్ కౌన్సిలు సమావేశములలో తీర్మానాలను ప్రవేశపెట్టడానికి రూల్సు

1995 జి ఓ యం యస్ నెం 1369 యం ఎ - 18-11-1995

కౌన్సిలు సమావేశంలో తీర్మానమును ప్రతిపాదించదలచు కౌన్సిలరు, తన

తీర్మానమును 10 రోజులకు ముందు కౌన్సిలు ఛైర్‌పర్సన్‌కు లిఖిత పూర్వకంగా తెలుపవలెను అనుమతించుడని ప్రతిపాదనలు

1 అది స్పష్టముగాను, నిర్దిష్టమైన సమస్యకు సంబంధించి వుండనట్లయితే,

2 అందులో వాగ్వివాదములు, అనుమానములు, పరిహాసపూర్వక పదములు లేదా అగౌరవము కల్గించు వివరణలు ఉండరాదు వ్యక్తుల అధికారలేదా పబ్లిక్ హోదాకు సంబంధించినవి కాబట్టి వ్యక్తిగత ప్రవర్తన, స్వభావానికి సంబంధించిన అంశములు పేర్కొనరాదు

3 చట్టము, దానిక్రింద చేయబడిన రూల్సుకు విరుద్ధంగా ఉన్నదనిగాని, అనవసరమైన లేదా వర్గపరమైన వివాదములకు దారితీయగలదని ఛైర్‌పర్సన్ భావించినచో, అట్టి తీర్మానమును అనుమతించరాదు ఈ విషయంలో అతని/ఆమె నిర్ణయం అంతిమం

4 ఎజండా అంశాలలో పేర్కొనబడిన తీర్మాన ప్రతిపాదకుని సభాధ్యక్షులు పిలిచినప్పుడు, సభ్యుడు లేచి తీర్మానమును ప్రతిపాదించవలెను

అయితే, పిలిచినప్పుడు, ఆ సభ్యుడు గైర్హాజరయినచో, ఆ సమావేశంలోని ఎవరైనా సభ్యుడు ఆ తీర్మానమును ప్రతిపాదించవచ్చును లేనట్లయితే, అది ఉపసంహరించ బడినట్లుగా పరిగణించవలెను

ప్రతిపాదించబడిన తీర్మానాన్ని మరొక సభ్యుడు బలపరచవలెను లేనట్లయితే అది చర్చించబడదు

సభాధ్యక్షుని అనుమతితో తప్ప, 15 నిమిషములను మించి మాట్లాడరాదు తీర్మాన ప్రతిపాదకుడు, తీర్మానాన్ని ప్రవేశపెడుతూ 30 నిముషములు ప్రసంగించవచ్చును చర్చ అనంతరం, సమాధాన రూపంలో తీర్మాన ప్రతిపాదకులు మాట్లాడవచ్చు ఆయన/ఆమె రెండుసార్లకంటె ఎక్కవసార్లు మాట్లాడరాదు చర్చలో పాల్గొనే సభ్యులు ఒకేసారి మాత్రం మాట్లాడాలి

తీర్మానంపై చర్చ, తీర్మానంలోని విషయమునకు మాత్రమే పరిమితం కావాలి

తీర్మానానికి ఎవరైనా సభ్యులు సవరణలను ప్రతిపాదించవచ్చును అంతిమంగా తీర్మానంపై సభ్యుల అభిప్రాయాన్ని తెలుసుకోటానికి, సభాధ్యక్షులు ముందుగా సవరణలకు ఓటింగును పెట్టవలయును సవరణలు వీగిపోయినట్లయినప్పుడు, అసలు ప్రతిపాదనపై ఓటింగు తీసుకోవాలి

వివిధ అంశములపై ప్రతిపాదన వున్నప్పుడు, ఆ తీర్మానాన్ని కొన్ని భాగాలుగాచేసి, ఒక్కొక్క భాగంపై ఓటింగు తీసికొనవచ్చు ఒకే అంశంపై పలు ప్రతిపాదనలు వున్నప్పుడు, వాటినన్నింటిని ఒకటిగా పరిగణించి చర్చకు పెట్టి నిర్ణయం చేయవచ్చు

★ ★ ★

## 4 మునిసిపల్ కమీషనరుపై ఛైర్‌పర్సన్ నియంత్రణ రూల్సు - 1977

జి ఓ ఎమ్ ఎస్ నెం 703, హెచ్ ఎమ్ ఎ డి అండ్ (ఎమ్ ఎ ) ది 17-11-1977

మునిసిపల్ పరిపాలన సౌలభ్యం దృష్ట్యా, సెక్షను 56, సబ్‌సెక్షను (1) లోని (ఎ) నుండి (సి) వరకుగల క్లాజులు పరిధిలోనికి వచ్చు ఏదేని విషయమునకు సంబంధించి కమిషనరుకు వ్రాతమూలంగా ఏవేని న్యాయబద్ధమైన సూచనలను చేయవచ్చు కమిషనరు అట్టి సూచలన్నింటికి బద్ధుడై వ్యవహరించవలయును

పన్నుల బయటి వసూళ్లతో సంబంధం వున్న మునిసిపల్ కౌన్సిలు సిబ్బంది బదిలీ విషయంలో - కమిషనరు ఛైర్‌పర్సన్ సమ్మతితో మాత్రమే ఉత్తర్వులను జారీ చేయవలయును

కమిషనరు అవసర శలవు దరఖాస్తు ప్రతిని ఛైర్‌పర్సన్‌కు సమాచారం నిమిత్తం అందజేయాలి

అవసర శలవు కానట్టి శలవు మంజూరుకై కమిషనరు కోరినప్పుడు, ఆ దరఖాస్తును ఛైర్‌పర్సన్‌కు యివ్వవలెను 3 దినములలోపుగా ఆ దరఖాస్తును తన రిమార్కులతో మునిసిపల్ శాఖ డైరెక్టరుకు పంపించాలి

ప్రతి సంవత్సరం ఏప్రియల్ మొదటివారంలో లేదా కమిషనరు బదిలీ అయినప్పుడు, కమిషనరు పని తీరుపై రహస్య నివేదికను (Confidential Report) ఛైర్‌పర్సన్ వ్రాయవలెను అత్యంత శ్రద్ధ మరియు జాగరూకతతో అట్టి రిపోర్టులు వ్రాయవలెను ప్రతికూల రిమార్కులు చేసినపుడు, నిర్దిష్ట సాక్ష్యాధారాలతో, లేదా సంఘటనలతో సాధ్యమైనంతవరకు బలపరచబడినవై యుండవలయును అస్పష్టమైన ఆధారరహిత రిమార్కులు వ్రాయరాదు

డిప్యూటీ కమిషనర్లు పనిచేయు మునిసిపాలిటీలలో కూడా వారికి సంబంధించి యిదే విధానాన్ని అనుసరించవలయును

కమిషనరుకు విధించిన మందలింపు లేదా ఏదేని యితర శిక్షను రికార్డు చేయునప్పుడు, సదరుచర్యకు సంబంధించిన కమిషనరుకు పంపిన లేఖ ప్రతిని రహస్య నివేదికకు జతపరచవలెను



# 5. పురపాలక సంఘాలు, నగరపాలక సంస్థలు సమర్థవంతంగా పనిచేయటానికి, ఆర్థికాభివృద్ధికి రాష్ట్ర మేయర్ల, ఛైర్‌పర్సన్స్ సమావేశంలో రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఎజండా

## హైద్రాబాద్, జూబ్లీహిల్స్ - 9-4-2001

1996 తర్వాత, మరియు అయిదు సంవత్సరాలకు రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలోని మునిసిపల్ ఛైర్‌పర్సన్స్, మేయర్ల సభను ఏప్రిల్ 9న హైదరాబాద్‌లో నిర్వహించింది సభలో ప్రసంగించిన ఛైర్‌పర్సన్స్, మేయర్లు తమకు అధికారాలు కావాలని, కమిషనర్లు తమను లెక్కచేయటంలేదని, ఆర్థిక సహకారాలు యివ్వాలని కోరారు మేయర్లందరూ 10 సూత్రాల విజ్ఞప్తిని అందచేశారు అయితే మితిమీరిన అధికారాలు, గౌరవ వేతనం మూడురెట్లు పెంచమని కోరారుగాని, అసలు ముఖ్య అవసరమైన ఆర్థిక సహకారం, గ్రాంట్లు, ఆర్థిక కమిషన్ సిఫార్సుల అమలుగురించి అసలు ఏమాత్రం ప్రస్తావించక పోవటం శోచనీయంగా వుంది

ఈ సభలోను, అంతకుముందు తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో టి డి పి ఛైర్‌పర్సన్స్, మేయర్ల సభలో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ప్రసంగించారు తమ తమ బాధ్యతలను నిజాయితీతో నిర్వహించాలని, అలా చేయలేనివారు పదవులనుండి తప్పుకోవాలని, వారు కోరిన అధికారాలను త్వరలో - 6 నెలలలోగా సంక్రమింపచేసే విషయం ఆలోచిస్తామని, విద్యుత్ రెగ్యులేటరీ కమిషన్ మాదిరిగా పట్టణాలలో మంచినీటి రెగ్యులేటరీ కమిషన్లను ఏర్పాటుచేసి, మంచినీటి సప్లయి రేట్లను వారు ఖరారు చేస్తారని తెలియచేశారు విద్యుత్ బకాయిలు చెల్లించని మునిసిపాలిటీలకు వచ్చే వృత్తి పన్నును విద్యుత్ బకాయిలకు సర్దుబాటు చేయబడుతుందని కూడ తెలియచేశాడు

9వ తేదీన జరిగిన రాష్ట్ర ఛైర్‌పర్సన్స్, మేయర్ల సమావేశం ముంపు రాష్ట్ర ప్రభుత్వ ఎజండాను ఆవిష్కరించారు

1 1993లో విధించిన ఆస్తి పన్నులను ప్రస్తుతం వున్న అద్దె విలువల ప్రాతిపదికగా 1-4-2002 నుండి పెంచాలని, దానివల్ల ప్రస్తుతం మునిసిపాలిటీలకు వస్తున్న వంద కోట్ల రూపాయల ఆదాయానికి అదనంగా రు 50 కోట్లు లభించగలవని తెలియచేశారు

2 అనధికార కట్టడాలపై 10% అదనపు పెనాల్టీగా విధించాలి

3 వ్యాపార ప్రకటనల పన్నులను పెంచాలి

4 ప్రస్తుతం నీటి సరఫరావల్ల అన్ని మునిసిపాలిటీలకు లభించుతున్న ఆదాయం రు 18 కోట్లు మాత్రమే సరఫరా నిర్వహణ వ్యయంలో సగం మాత్రమే వుంది రాష్ట్ర ప్రభుత్వం ఆదేశాల మేరకు పెంచిన చార్జీలు పూర్తిగా అమలుజరిగితే, అదనంగా

రు 8 కోట్ల రూపాయల ఆదాయం పెరుగుతుంది సరఫరా వ్యయాన్ని పూర్తిగా రాబట్టడానికి నీటిచార్జీలు ఎంతమేరకు పెంచాలో వారు నియమించిన కమిటీ నిర్ణయిస్తుందని, ఆ చార్జీలను అన్ని మునిసిపాలిటీల్లో వసూలు చేయాలని, అందుకు చట్టాన్ని కూడ సవరిస్తామన్నారు

5 లైసెన్సు రుసుములు, భవన నిర్మాణ రుసుములు, మార్కెటు రుసుములు, అద్దెలు పెంచటానికి చర్యలు తీసికోవాలి ప్రతి 2 సంవత్సరాలకొకసారి వీటిని సవరించాలి

6 పట్టణాలలో ఖాళీ జాగాలను తక్షణ గుర్తించి వాటి మార్కెట్ విలువపై 2% పన్ను విధించాలి

7 అన్ని మునిసిపాలిటీల వ్యయంపై ఖచ్చితమైన నిఘా, తనిఖీలు వుండాలి అక్కౌంట్సు ఆడిట్ లేనందున కోట్ల రూపాయల దుర్వినియోగం జరుగుతుంది దానిని నివారించాలి

8 అన్ని మునిసిపాలిటీలలోను జూన్ 15కు అంతకు క్రితం సంవత్సరం జమా ఖర్చులు ఆడిట్ కాబడాలి కార్పొరేషన్లలో వున్న మాదిరిగా ప్రీ ఆడిట్ విధానం ప్రవేశపెట్టాలి

9 బడ్జెట్‌లు యదార్ధ ఆదాయాలనుబట్టి తయారుచేయాలి గత సంవత్సరం ఆదాయ, వ్యయాలపై 10%కు మించకుండా వుండాలి

10 రోడ్లు, భవనాల నిర్మాణాలపై, వాటికి వినియోగించే మెటీరియల్ క్వాలిటీ, క్వాంటిటీలను వివిధ దశలలో వివిధ అధికారులతో తనిఖీ చేయబడాలి

11 ప్రతి శాఖలోను - రెవిన్యూ, నీటి సరఫరా, ఇంజనీరింగ్, వీధిలైట్లు, శానిటేషన్, ఆహార పదార్థాల కల్తీ నిరోధకం, టౌన్ ప్లానింగ్, అక్కౌంట్స్, ఆడిట్, విద్య, వగైరా శాఖల్లో పనిచేసే అధికారులకు, సిబ్బందికి నిర్ణీత బాధ్యతలు అప్పగించి, వాటి సక్రమ అమలుకు సమర్ధవంతమైన చర్యలు తీసుకోవాలి

12 అన్ని మునిసిపాలిటీలలో అధికారులు, ఉద్యోగులు, శానిటేషన్ వగైరా అన్ని శాఖల్లో పనిచేస్తున్న వారి సంఖ్య 25001 వీరికి జీత, భత్యాల క్రింద రు 144 కోట్లు చెల్లిస్తున్నారు మునిసిపాలిటీల మొత్తం ఆదాయం రు 470 కోట్లలో యిది 30 63 శాతం

13 అన్ని శాఖలలోని అన్ని తరగతుల ఉద్యోగులకు వారి పని నైపుణ్యాన్ని పెంచటానికి వారికి అవసరమైన శిక్షణను ఏర్పాటుచేయాలి

14 ప్రోత్సాహకాలు 1) బిల్లు కలెక్టర్లు, వారికి నిర్ణయించిన పన్నును 100% వసూలుచేసిన వారికి ఒక నెల జీతం అదనం

2) వారి సెక్షనులో నూటికి నూరుపాళ్ళు చెత్తాచెదారాన్ని నిత్యం తొలగించుచున్న శానిటరీ ఇన్‌స్పెక్టర్లకు ఒక నెల జీతం అదనం

3) అసిస్టెంటు ఇంజనీర్లకు - వారి ఏరియాలో (జి ఇ కేసులు) అతిసార వ్యాధి కేసులు ఏమీ లేకుండా చేయగలిగితే ఒక నెల జీతం అదనం

4) జమా ఖర్చులు తాలూకు అక్కౌంట్స్ ఖచ్చితంగా బకాయిలేకుండా తయారుచేసే

అక్కౌంటెంట్లకు ఒక నెల జీతం అదనం

అదే విధంగా విధి నిర్వహణలో వెనుకబడినవారికి

1) బిల్లు కలెక్టర్ల వసూలు డిమాండ్‌లలో 90% తగ్గితే చార్జి మెమో ఇవ్వాలి

2) 85% తక్కువగా చెత్తాచెదారాన్ని తొలగించు శానిటరీ ఇన్‌స్పెక్టర్లకు చార్జి మెమో యివ్వాలి

3) లక్ష జనాభాలో 10 జి ఇ కేసులకంటే ఎక్కువ నమోదయితే, ఎ ఇ లకు చార్జి మెమోలు యివ్వాలి

4) అక్కౌంట్లు నిర్ణీత కాలానికి పూర్తిగా తయారుచేయనట్లయితే, అక్కౌంటెంట్లకు చార్జిమెమోలు యివ్వాలి

15 మునిసిపాలిటీల సమర్ధత, పనితనంపై గ్రేడ్ల నిర్ణయం ఇంతకు ముందు గ్రేడ్ల నిర్ణయానికి తీసుకున్న 10 సూత్రాలను మార్చి, దిగువ విధంగా 12 అంశాల అమలు స్థాయిపై గ్రేడ్లు నిర్ణయిస్తారు

| | మార్కులు |
|---|---|
| 1) పన్నులు, పన్నులుకాని యితర ఆదాయాల వసూలుకు | 15 |
| 2) అక్కౌంట్లు పూర్తి | 15 |
| 3) ఘన వ్యర్థ పదార్థాల సేకరణ, తొలగింపు | 15 |
| 4) మంచినీటి సరఫరా | 15 |
| 5) నీటి సరఫరా చార్జీల వసూలు | 5 |
| 6) వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణం | 5 |
| 7) యస్ జె యస్ ఆర్ వై నిధుల వినియోగం | 5 |
| 8) యన్ యస్ డి పి నిధుల వినియోగం | 5 |
| 9) పొదుపు, అరువు సంఘాల ఏర్పాటు | 5 |
| 10) ప్రజా ఫిర్యాదుల పరిష్కారం | 5 |
| 11) ఆరోగ్యం | 5 |
| 12) విద్యా ప్రమాణాలు | 5 |
| | 100 మార్కులు |

ప్రతి 3 మాసాల కొకసారి కమిషనర్లు తమ నివేదికలను విధిగా నాల్గవ నెల 10వ తేదీలోగా పంపించాలి 20వ తేదీలోగా యీ రిపోర్టులు పరిశీలించి, మార్కులు వేసి, గ్రేడ్లు నిర్ణయించి తెలియచేయాలి

గ్రేడ్లు - A 90 మార్కులపైన - వెరి గుడ్ (Very Good)

B 76 నుండి 90 మార్కులు - గుడ్ (Good)

C 60 నుండి 75 మార్కులు - యావరేజ్ (సగటు) (Av.rage)

D 60 లోపు - పూర్ (Poor)

పై గ్రేడింగులను ఆయా మునిసిపాలిటీలు, కార్పొరేషన్లు తమ సమావేశాలలో పెట్టి చర్చించాలి బహిరంగ వేదికల ద్వారా ప్రజలకు కూడ తెలియచెప్పాలి

16 పర్యవేక్షక అధికారులు - అన్ని విభాగాలకు చెందినవారు ఉదయం 6 నుండి 10 గంటలవరకు ప్రతిరోజు వారికి నిర్దేశించిన పనులను, ప్రాంతాలను స్వయంగా పర్యవేక్షించి, తమ రిపోర్టులను కమిషనరుకు ఆ రోజే సమర్పించాలి

17 ప్రజలకు మరింత సంతృప్తికరమైన సౌకర్యాలు కల్గించటానికిగాను పారిశుద్ధ్యం, వీధి దీపాల నిర్వహణ, మంచినీటి సరఫరా ఏర్పాట్లను ప్రైవేటు ఏజెన్సీలకు టెండరు విధానం ద్వారా అప్పగించుటకు చర్యలు తీసుకోవాలి

18 పౌర సౌకర్యాలను మెరుగుపరచాలి పట్టణ, నగర ప్రజలకు మెరుగైన పౌర వసతుల ఏర్పాటుకు - పారిశుద్ధ్యం, రక్షిత మంచినీటి సరఫరా, మంచి రోడ్లు, డ్రయిన్ల ఏర్పాటు, సరిపడినంత వీధిలైట్లు ఏర్పాటు, ఉద్యానవనాలు, జనన, మరణ సర్టిఫికెట్లు జారీ - సమర్ధవంతమైన విధానాలుండాలి

పై లక్ష్య సాధనకు 1-5-2001 నాటికి అన్ని పట్టణాలు, నగరాలలో 'సర్వీసు సెంటర్లు' తెరవాలి ప్రజల అవసరాలు తీర్చటానికి నిర్ణీత గడువును నిర్ణయించి అమలుజరపాలి

| | |
|---|---|
| 1 ఆస్తి పన్ను విధింపు, డోర్ నెంబరు ఇవ్వటం | 15 రోజులు |
| 2 భవన నిర్మాణానికి ప్లాను మంజూరు | 15 రోజులు |
| 3 మంచినీటి కుళాయి మంజూరు | 30 రోజులు |
| Own your Tap ఏర్పాటు | 10 రోజులు |
| 4 జనన, మరణ సర్టిఫికెట్ల జారీ | 5 రోజులు |

పై గడువుల్లో పూర్తికానట్లయితే, దరఖాస్తుదారులకు రోజుకు రు 50/-లు పరిహారం చెల్లించబడును

19 మునిసిపల్ సిబ్బందిని ఉపాధ్యాయులను బదిలీ చేసేందుకు కొన్ని మార్గదర్శక సూత్రాలు యిచ్చారు

20 ఛైర్‌పర్సన్స్‌కు, సభ్యులకు గౌరవ వేతనం, కన్వేయన్సు అలవెన్సు

| | ఛైర్‌పర్సన్స్ | వైస్-ఛైర్‌పర్సన్స్ | కన్వేయన్స్ అలవెన్సు |
|---|---|---|---|
| మూడవ గ్రేడ్ మునిసిపాలిటీలలో | 2000 | 800 | 250 |
| రెండవ గ్రేడ్ " | 2000 | 800 | 350 |
| మొదటి గ్రేడ్ " | 2000 | 800 | 450 |
| స్పెషల్ గ్రేడ్ " | 2400 | 1200 | 550 |
| సెలెక్షన్ గ్రేడ్ " | 2400 | 1200 | 650 |

నెలలో జరిగిన ఒక్క మీటింగుకైనా హాజరైనవారికే కన్వేయన్స్ అలవెన్సు యివ్వాలి కన్వేయన్సుకు మోటారు కారునుపయోగించే ఛైర్‌పర్సన్స్, వైస్-ఛైర్‌పర్సన్స్‌కు చెల్లించ బడు గరిష్ట కన్వేయన్సు అలవెన్సు

| | |
|---|---|
| మూడవ, రెండవ గ్రేడ్ - నెలకు | రు 750 |
| ప్రథమ గ్రేడ్ | రు 750 |
| స్పెషల్, సెలెక్షన్ గ్రేడ్ | రు 1000 |

**గమనింపు :** ఛైర్‌పర్సన్స్‌కు మునిసిపాలిటీ ఏర్పాటుచేసే వెహికల్‌ను స్థానిక పర్యటనలకు వినియోగించినట్లయితే, అందుకు వినియోగించిన పెట్రోలు లేక డీజిల్ బిల్లును గౌరవ వేతనం నుండి మినహాయించాలి ఎట్టి పరిస్థితులలోను గౌరవ వేతనానికి మించి, ఇంధన బిల్లులు వుండరాదు

**అదనపు సమాచారం** . 1999-2000 సంవత్సరానికి 110 మునిసిపాలిటీల ఆదాయం

| | | | |
|---|---|---|---|
| పన్నుల ద్వారా | 76 61 | కోట్ల రూపాయలు | 16 31% |
| పన్నులుకాని యితర ఆదాయాలు | 118 96 | " | 25 33% |
| యసైండ్ ఆదాయాలు | 115 41 | " | 24 57% |
| నాన్‌ప్లాన్ గ్రాంట్లు | 6 62 | " | 1 41% |
| ప్లాను గ్రాంట్లు | 152 12 | " | 32 39% |
| **మొత్తం** | **469 72** | " | **100%** |

1999-2000 సంవత్సరానికి 7 నగరపాలక సంస్థల ఆదాయం

| | | | |
|---|---|---|---|
| పన్నుల ద్వారా | 154 10 | కోట్ల రూపాయలు | 33 15% |
| పన్నులుకాని యితర ఆదాయాలు | 151 66 | " | 32 63% |
| అసైండ్ ఆదాయాలు | 85 25 | " | 18 34% |
| నాన్‌ప్లాన్ గ్రాంట్లు | 49 07 | " | 10 56% |
| ప్లాన్ గ్రాంట్లు | 24 74 | " | 5 32% |
| మొత్తం | 468 82 | " | 100% |

**వ్యయం** మునిసిపాలిటీలలో 1999-2000

| | | | |
|---|---|---|---|
| 1 సిబ్బంది జీతభత్యాలు | 143 70 | కోట్ల రూపాయలు | 31 46% |
| 2 శానిటేషన్, నీటి సరఫరా, రోడ్లు, డ్రయిన్ల నిర్వహణకు | 67 17 | " | 14 71% |
| 3 ప్లాను పథకాలు, కాపిటల్ అభివృద్ధి పనులకు | 127 74 | " | 27 97% |
| 4 యితరములు | 118 10 | " | 25 86% |
| మొత్తం | 456 71 | " | 100% |

మునిసిపల్ కార్పొరేషన్లలో

| | | | |
|---|---|---|---|
| 1 సిబ్బంది జీతభత్యాలు | 176 80 | కోట్ల రూపాయలు | 34 80% |
| 2 సర్వీసుల నిర్వహణ | 89 84 | " | 17 68% |
| 3 ప్లాను, కాపిటల్ అభివృద్ధి పథకాలు | 241 40 | " | 47 52% |
| | 508 04 | " | 100% |

# 6. మునిసిపల్ ఛైర్‌పర్సన్స్ అధికారాలు

1 ఏదైనా తీర్మానం కౌన్సిల్ అధికారాలకు మించివున్నట్లుగాని లేదా చట్టాల లక్ష్యాలకు భిన్నంగా వుందని ఛైర్‌పర్సన్ భావించితే, తిరిగి కౌన్సిల్ పునఃపరిశీలించమని కోరుటకు (సెక్షన్ 47(1)(సి))

2 ప్రభుత్వంతో, యితర శాఖలతో మునిసిపాలిటీ తరపున చేసే ఉత్తర ప్రత్యుత్తరాలు ఛైర్‌పర్సన్ పేరుమీదనే జరగాలి (సెక్షన్ 47(2))

3 మూడవ, రెండవ గ్రేడ్ మునిసిపాలటీలలో రు 1500/-కు మించకుండాను, ప్రథమ, సెలెక్షన్, స్పెషల్ గ్రేడ్ మునిసిపాలిటీలలో రు 3000/-లు మించకుండా అత్యవసర వ్యయం మంజూరుకు అధికారం కలదు (సెక్షన్ 48(1))

4 ఏదైనా పని అత్యవసరంగా నిర్వహించబడాలని భావించితే, అట్టి పనిని మంజూరు చేయవచ్చు (సెక్షన్ 49)

5 జూనియర్ అసిస్టెంటు, ఉపాధ్యాయులు, శానిటరీ ఇన్‌స్పెక్టర్లు, మెడికల్ ఆఫీసర్లు -వీటికి దిగువగల పోస్టులకు ఛైర్‌పర్సన్ అపాయింటింగ్ అథారిటీ అయితే, నియమించ బడినవారు అంతకు ముందు నిర్ణయించిన ప్యానల్‌లో వుండాలి (సెక్షన్ 74)

6 వ్యక్తిగత మంచినీటి కుళాయిని ఛైర్‌పర్సన్ శాంక్షన్ చేయును (సెక్షన్ 140)

7 తన విధులను కొన్నింటిని వైస్-ఛైర్‌పర్సన్‌కు, పరిపాలనా బాధ్యతలను కమిషనరుకు బదలాయించవచ్చును (సెక్షన్ 50)

8 తానే నియామక అథారిటీగా వున్న ఉద్యోగులను సస్పెండ్ లేక డిస్‌మిస్ లేక తొలగించుటకు ఛైర్‌పర్సన్‌కు అధికారం కలదు (సెక్షన్ 77)

9 వీధుల మరమ్మతులు వగైరా అవసరంగా చేపట్టుటకు ఆదేశించవచ్చు (సెక్షన్ 171)

10 బావులు, చెరువులపై కంట్రోలు (సెక్షన్ 236)

11 కమిషనరుపై ఛైర్‌పర్సన్ పరిపాలనా అజమాయిషీ (G O Ms No 703 MAD - 17-11-1977)

12 పన్నుల వసూళ్ళ సిబ్బందిని అంతర్గత బదిలీల విషయమై ఛైర్‌పర్సన్ ఆమోదం అవసరం

13 కమిషనర్లు తమ క్యాజువల్ సెలవు దరఖాస్తును ఛైర్‌పర్సన్ ద్వారా పంపించాలి మిగతా రకాలైన శలవు దరఖాస్తులు కూడా ఛైర్‌పర్సన్ ద్వారా వెళ్ళాలి

14 కమిషనర్ల కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు వ్రాసే ఆఫీసరు 'బి' ఫారంలో ఛైర్‌పర్సన్ నుండి నివేదిక పొందాలి

15 కౌన్సిల్ సమావేశాల్లో తీవ్ర గందరగోళ పరిస్థితులు ఏర్పడినప్పుడు, ఆ సమావేశాన్ని 3 రోజులకు మించకుండా సస్పెండ్ చేయవచ్చు (సెక్షన్ 51(4))

16 భవనాలలోకి వెళ్ళి తనిఖీ చేయుటకు, సర్వే చేయుటకు, పనుల పర్యవేక్షణకు అధికారం కలదు (సెక్షన్ 357)

17 పనులు జరుగు ప్రదేశానికి చేరువనున్న స్థలాల్లోని ఛైర్‌పర్సన్ వెళ్ళి పరిశీలన చేయవచ్చు (సెక్షన్ 358)

18 చెరువులు, బావుల నిర్మాణాన్ని నిషేధించు అధికారంగలదు (సెక్షన్ 236)

(నగరపాలక సంస్థల మేయర్‌కంటే, మునిసిపాలిటీల ఛైర్‌పర్సన్స్‌కు చాలా హెచ్చు అధికారాలు కలవు )

సభలో ప్రసంగించిన ముఖ్యమంత్రిగారు ప్రకటన చేస్తూ, కమిషనర్లపై ఛైర్‌పర్సన్స్ ఆధిక్యతను ధృవీకరించారు కమిషనర్ల పని, సమర్థత గురించి ఉన్నతాధికారులు పరిశీలించే సందర్భంగా ఛైర్‌పర్సన్స్ వ్రాసిన కాన్ఫిడెన్షియల్ రిపోర్టులను విధిగా పరిగణనలోనికి తీసుకునే విధానాన్ని అమలుజరుపుతున్నారు అయినా, ఛైర్‌పర్సన్స్, మేయర్లు చేసిన ఆర్థికపరమైన డిమాండ్స్‌ను గురించి దాటవేశారు ఛైర్‌పర్సన్స్ స్థాయి, హోదాకు అనుగుణ్యంగా ప్రోటోకాల్ నిబంధనలను పాటించమని ఉత్తర్వులు యిస్తామన్నారు

ఆ సమావేశంలో గత త్రైమాసిక గ్రేడింగులో మంచిర్యాల 93% మార్కులతో ప్రధమ స్థానంలోనూ, 84 3% మార్కులతో కాకినాడ రెండవ స్థానంలోనూ, 84 2% మార్కులతో హిందూపూర్ మూడవ స్థానంలోనూ నిలిచాయి తర్వాత స్థానాల్లో వరుసగా పాలకొల్లు, కొవ్వూరు, యల్ బి నగర్, పెడన, ఉప్పల్, కలాన్, ఏలూరు, ఇల్లెందు, పాల్వంచ, బైంసా, నారాయణపేట, నిడదవోలు, అమలాపురం, సిరిసిల్ల, శ్రీకాకుళం, నంద్యాల, మిర్యాలగూడ, తిరుపతి ఉన్నాయి 50 5% మార్కులతో కొత్తగూడెం అట్టడుగున వుంది

నగరపాలక సంస్థలలో విశాఖపట్నం 89% మార్కులతో ప్రధమ స్థానంలో, 77 6% మార్కులతో గుంటూరు రెండవ స్థానంలో, 70% మార్కులతో విజయవాడ మూడవ స్థానంలో, 69 3% మార్కులతో వరంగల్ నాల్గవ స్థానంలో, 66 5% మార్కులతో కర్నూలు, 63 4% మార్కులతో రాజమండ్రి అయిదవ, ఆరు స్థానాలు పొందాయి

(9-4-2001న రాష్ట్ర ప్రభుత్వం సమావేశపరిచిన మేయర్ల, ఛైర్‌పర్సన్స్ సమావేశంలో సర్క్యులేటు చేసిన ఎజండానోట్సు నుండి)

## 2000 మార్చిలో ఎన్నికైన మునిసిపాలిటీల ఛైర్‌పర్సన్స్

| | | |
|---|---|---|
| శ్రీకాకుళం జిల్లా | శ్రీకాకుళం | శ్రీమతి జయంతి పైడిరెడ్డి (తె దే ) |
| | ఆముదాలవలస | శ్రీమతి బి సత్యవతి (కాం) |
| | ఇచ్ఛాపురం | శ్రీ పి పోలారావు (కాం) |
| విజయనగరం జిల్లా | విజయనగరం | శ్రీమతి పి కనకమహాలక్ష్మి (తె దే ) |
| | సాలూరు | శ్రీ జె ఈశ్వరరావు (తె దే ) |
| | బొబ్బిలి | శ్రీమతి ఎ వి ఆర్ ఆండాళ్ (కాం) |
| | పార్వతీపురం | శ్రీ యం జయన్న |

| | | |
|---|---|---|
| విశాఖపట్నం | గాజువాక | . శ్రీ టి గురుమూర్తిరెడ్డి (కాం) |
| | అనకాపల్లి | శ్రీ కె జగన్నాధరావు (కాం) |
| | భీమునిపట్నం | శ్రీ శైలేంద్రరెడ్డి (తె దే) |
| తూర్పు గోదావరి జిల్లా | కాకినాడ | డాక్టర్ బి చంద్రశేఖర్ (కాం) |
| | అమలాపురం | శ్రీ కె సుబ్బారావు (తె దే) |
| | పెద్దాపురం | శ్రీ రాజా సూరిబాబురాజు (తె దే) |
| | సామర్లకోట | శ్రీ ఎ చిన అప్పారావు (తె దే) |
| | పిఠాపురం | శ్రీ యస్ రామచంద్రమూర్తి (కాం) |
| | మండపేట | శ్రీ వి జోగీశ్వరరావు (తె దే) |
| | రామచంద్రపురం | శ్రీమతి యస్ ఆర్ కె విజయదేవి (కాం) |
| | తుని | శ్రీ సి తలుపుల రావు (తె దే) |
| పశ్చిమ గోదావరి జిల్లా | ఏలూరు | శ్రీమతి యం ఈశ్వరి (తె దే) |
| | భీమవరం | శ్రీమతి యం నారాయణమ్మ (తె దే) |
| | పాలకొల్లు | శ్రీ యస్ పాపారావు (బి జె పి) |
| | నరసాపురం | శ్రీ కె వేణుగోపాలరావు (తె దే) |
| | తాడేపల్లిగూడెం | శ్రీ కరణం అప్పారావు (బి జె పి) |
| | కొవ్వూరు | శ్రీమతి టి సత్యవతి " |
| | నిడదవోలు | శ్రీ చిన్నం వెంకన్న " |
| | తణుకు | శ్రీమతి ముళ్ళపూడి రేణుక " |
| కృష్ణా జిల్లా | మచిలీపట్నం | శ్రీ బి అర్జునుడు (తె దే) |
| | గుడివాడ | శ్రీ యన్ వెంకటేశ్వరరావు (కాం) |
| | పెడన | శ్రీ బి వేణుగోపాలరావు (తె దే) |
| | నూజివీడు | డాక్టర్ బి ఝాన్సీరాణి (తె దే) |
| | జగ్గయ్యపేట | శ్రీ కె వెంకటనారాయణ (కాం) |
| గుంటూరు జిల్లా | నరసరావుపేట | శ్రీమతి జి జోగీశ్వరమ్మ (తె దే) |
| | సత్తెనపల్లి | శ్రీ కె కాశీ విశ్వేశ్వరరావు (తె దే) |
| | మాచర్ల | శ్రీ చట్టూ సాహెబ్ " |
| | తెనాలి | శ్రీ యడ్ల గంగాధరరావు " |
| | రేపల్లె | శ్రీ యం వెంకట సుబ్బారావు (తె దే) |
| | మంగళగిరి | శ్రీమతి కె కమల (కాం) |
| | బాపట్ల | శ్రీమతి జె ప్రమీలారాణి (తె దే) |
| | చిలకలూరిపేట | శ్రీ బి రామమూర్తి " |
| | పొన్నూరు | శ్రీమతి యం శాలిని " |

| | | |
|---|---|---|
| ప్రకాశం జిల్లా | ఒంగోలు | శ్రీ వై తులసీరావు (తె దే ) |
| | చీరాల | శ్రీమతి ఎ కస్తూరిబాయి (కాం) |
| | మార్కాపురం | శ్రీ ఎ రామశేషయ్య (తె దే ) |
| | కందుకూరు | శ్రీమతి యం శివకుమారి (తె దే ) |
| నెల్లూరు జిల్లా | నెల్లూరు | శ్రీమతి టి అనూరాధ (తె దే ) |
| | గూడూరు | శ్రీమతి కె కల్పలత (స్వ ) |
| | కావలి | శ్రీ జి యానాదిశెట్టి (కాం) |
| కర్నూలు | ఆదోని | శ్రీమతి పి అరుణాదేవి (బి జె పి ) |
| | నంద్యాల | శ్రీ యస్ పి వై రెడ్డి (కాం) |
| | ఎమ్మిగనూరు | శ్రీ యం యం హెచ్ జగదీష్ (తె దే ) |
| కడప | కడప | శ్రీ సయ్యద్ మహమ్మద్ అహమ్మదుల్లా (కాం) |
| | ప్రొద్దుటూరు | శ్రీమతి పి సావిత్రి (తె దే ) |
| అనంతపురం | అనంతపురం | శ్రీ ఖాజా నూర్ మహమ్మద్ (కాం) |
| | గుంతకల్లు | శ్రీ రామాంజనేయులు (కాం) |
| | తాడిపత్రి-హిందూపూర్ | శ్రీ జె సి ప్రభాకరరెడ్డి (కాం) |
| | రాయదుర్గం | శ్రీమతి కె అరుణ (తె దే ) |
| | కదిరి | శ్రీమతి షహనాజ్ షకీర్ (కాం) |
| | ధర్మవరం | శ్రీ కె కంచన్న (బి జె పి ) |
| చిత్తూరు | చిత్తూరు | శ్రీ పి చంగల్లరాయనాయుడు (తె దే ) |
| | మదనపల్లి | శ్రీ బి నరేష్‌కుమార్ రెడ్డి (కాం) |
| | శ్రీకాళహస్తి | శ్రీమతి మేరీ క్లారా (తె దే ) |
| | పుంగనూరు | శ్రీ షేక్ హైదర్ సాహెబ్ (తె దే ) |
| | తిరుపతి | |
| రంగారెడ్డి జిల్లా | తాండూరు | శ్రీ వి విశ్వనాథ్ గౌడ్ (తె దే ) |
| | మల్కాజ్‌గిరి | శ్రీమతి బి శారద (బి జె పి ) |
| | రాజేంద్రనగర్ | శ్రీ జె సత్యనారాయణ (కాం) |
| | కూకట్‌పల్లి | శ్రీ జి రామచందర్ (కాం) |
| | లాల్‌బహదూర్‌నగర్ | శ్రీ ఆకుల రమేష్ (బి జె పి ) |
| | కాప్ర | శ్రీ జి రామచందర్ గౌడ్ (తె దే ) |
| | ఉప్పలకలాన్ | శ్రీ డి శ్రీనివాస్ " |
| | ఖుత్బుల్లాపూర్ | శ్రీ బి లింగా గౌడ్ " |
| | ఆల్వార్ | శ్రీ వి జీవగం " |
| | శేరిలింగంపల్లి | శ్రీ ఎ నరసింగరావు " |
| | వికారాబాద్ | శ్రీమతి జి జయ " |

| | | |
|---|---|---|
| నిజామాబాద్ జిల్లా | నిజామాబాద్ | డాక్టర్ భారతీరాణి (బి జె పి ) |
| | బోధన్ | శ్రీమతి డి సుమిత్ర (తె దే ) |
| | కామారెడ్డి | శ్రీమతి యం లక్ష్మి (కాం) |
| మెదక్ జిల్లా | మెదక్ | శ్రీమతి కె సావిత్రి (కాం) |
| | సంగారెడ్డి | శ్రీమతి కె పద్మ (తె దే ) |
| | సిద్ధిపేట | శ్రీమతి జి అపర్ణ " |
| | సదాశివపేట | శ్రీ యం సత్యనారాయణ (కాం) |
| | జహీరాబాద్ | శ్రీ యం నరసింహ (కాం) |
| మహబూబ్‌నగర్ జిల్లా | మహబూబ్‌నగర్ | శ్రీ యస్ ప్రకాష్ (కాం) |
| | నారాయణపేట | శ్రీ జి సాయిచిన్న (బి జె పి ) |
| | గద్వాల్ | శ్రీ ఎ రామసాయిబాబు (బి జె పి ) |
| | వనపర్తి | శ్రీమతి జి ప్రమీల (తె దే ) |
| వరంగల్ జిల్లా | జనగామ | డాక్టర్ పి కరుణాకర్ రాజు (కాం) |
| నల్గొండ జిల్లా | నల్గొండ | శ్రీ పి వెంకటనారాయణ (కాం) |
| | భువనగిరి | శ్రీ పి నరసింహ (తె దే ) |
| | సూర్యాపేట | శ్రీ జె సత్యనారాయణ (బి జె పి ) |
| | మిర్యాలగూడ | శ్రీ సిహెచ్ విజయకుమార్ (తె దే ) |
| ఖమ్మం జిల్లా | ఖమ్మం | శ్రీమతి ఎ నాగమల్లి (కాం) |
| | ఇల్లెందు | శ్రీమతి వై అనసూయ (తె దే ) |
| | కొత్తగూడెం | శ్రీమతి వి అన్నమ్మ (కాం) |
| | పాల్వంచ | |
| కరీంనగర్ జిల్లా | కరీంనగర్ | శ్రీ వి హనుమంతరెడ్డి (కాం) |
| | జగిత్యాల | శ్రీ జి రామమూర్తి (తె దే ) |
| | సిరిసిల్ల | శ్రీ ఎ రవీందర్ (బి జె పి.) |
| | రామగుండం | శ్రీ యస్ సత్యనారాయణ (కాం) |
| | కోరుట్ల | శ్రీ పీర్ నర్సయ్య |
| అదిలాబాద్ జిల్లా | అదిలాబాద్ | శ్రీ లాలా రాధ్‌శ్యాం (స్వ) |
| | మంచిర్యాల | శ్రీ యస్ మంగీలాల్ (స్వ) |
| | భైంసా | |
| | నిర్మల్ | శ్రీ జి ఈశ్వర్ (తె దే ) |
| | సిర్పూర్-ఖాగజ్‌నగర్ | శ్రీమతి కె శాయిలీల (కాం) |
| | బెల్లంపల్లి | శ్రీమతి యం సరస్వతి (కాం) |

# 7. వినూత్న ప్రయోగం - పనిజరక్కపోతే పరిహారం

## సిటిజన్స్ చార్టర్ (పౌర సేవాపత్రం) అమలుకు ప్రయత్నం

రాష్ట్ర ప్రభుత్వం 25-4-2001 తేదీగల నెంబరు 158 జి ఓ ను అన్ని మునిసిపాలిటీలకు, మునిసిపల్ కార్పొరేషన్లకు జారీచేశారు పౌరుల అవసరాలు తీర్చటానికి కొన్ని పనులకు నిర్దిష్ట గడువును నిర్ణయిస్తూ, ఆ గడువులోపల ఆ పనులు పూర్తికానట్లయితే, గడువు దాటిననాటినుండి ప్రతిరోజుకు రు 50/-లు పరిహారం దరఖాస్తుదారులకు ఆ మునిసిపాలిటీ/మునిసిపల్ కార్పొరేషన్ చెల్లించాలి ఇందుకొరకు పట్టణ/నగర వివిధ ప్రాంతాల్లో సేవా కేంద్రాలు మే 14వ తేదీ నుండి ప్రారంభించాలి ఈ కేంద్రాలలో ప్రజల ఫిర్యాదులు, యితర అర్జీలు స్వీకరించాలి వాటి పరిష్కారానికి దిగువ సమయం నిర్ణయించారు

| | | |
|---|---|---|
| 1 | ఆస్తి పన్ను విధింపు, ఇంటి నెంబరు కేటాయింపు | 15 రోజులు |
| 2 | భవన నిర్మాణ అనుమతులు | 15 రోజులు |
| 3 | నీటి కుళాయి మంజూరు సాధారణ | 30 రోజులు |
| | ఓ పై టి (ఓన్ యువర్ ట్యాప్) | 10 రోజులు |
| 4 | జనన మరణ ధృవపత్రాలు | 5 రోజులు |

**ఫిర్యాదులు ·**

| | | |
|---|---|---|
| 1 | చెత్త తొలగించటానికి | 1 రోజు |
| 2 | మురికికాల్వ శుభ్రంచేయుటకు | 2 రోజులు |
| 3 | క్రిమికీటక నివారణ చర్యలు | 2 వారాలుకొకమారు |
| 4 | చెత్తకుండీల ఏర్పాటు | 2 వారాలు |
| 5 | పైపు లైన్ల లీకేజీ మరమ్మతులు | 1 రోజు |
| 6 | వీధి లైటు రిపేరు | 5 రోజులు |
| 7 | రోడ్ కటింగ్ మరమ్మతులు | 7 రోజులు |

అర్జీలు, ఫిర్యాదులు పైన తెల్పిన కాలములో పరిష్కరించనట్లయితే, పౌరుల అమూల్యమైన కాలానికి నష్టపరిహారంగా గడువు దాటిన ప్రతిరోజుకు రు 50/-లు వారికి చెల్లించాలి

ఈ ఉత్తర్వు లక్ష్యం హర్షించదగినదే బాధ్యతగల, తత్సంబంధిత అధికారులు, ఉద్యోగులు సకాలంలో ఆయా సమస్యల పరిష్కారాలకు విధిగా కృషి చేయాలి అయితే, నిర్ణీత గడువులోగా ప్రజా అవసరాలు, ఫిర్యాదులు పరిష్కారం చేయవలసిన అధికారులు, ఉద్యోగులు నిర్లక్ష్యంగా ప్రవర్తించి, గడువులోపుగా పరిష్కారం చేయకపోతే, వారిని

బాధ్యులుగా చేసి, వారి నిర్లక్ష్యానికి, సాచివేతకు తగిన చర్యలు తీసికోవాల్సి వుంటుంది కాని, రు 50/-లు పరిహారం మునిసిపాలిటీలు/కార్పొరేషన్లు చెల్లించాలని నిర్ణయించటం సహేతుకంగా లేదు ఆర్థిక యిబ్బందులలో కూరుకుపోయిన యీ సంస్థలకు యీ పరిహారాలు చెల్లించే స్థోమత వుందా?

అర్జీలు, ఫిర్యాదులు నిర్ణీత గడువులోగా పరిష్కారం కానట్లయితే, యీ పరిహారం లెక్కకట్టేదెవరు? చెల్లించేదెవరు? ఆ విధంగా చేయనట్లయితే, దానికి బాధ్యులెవరు? ఆ పరిహారం పొందటానికి ఫిర్యాదులదారులు ఆఫీసులచుట్టూ, అధికారులచుట్టూ ఎంతకాలం తిరగాలి? దానికెంత సమయం పౌరులు వ్యయం చేయాలి? పరిహారం చెల్లింపుకు కూడ అవినీతికి అలవాటుపడిన సిబ్బంది కమీషన్లు లేకుండా చెల్లిస్తారా? ఇలా సందేహాలు, ఒకదానివెనుక ఒకటి దొర్లుతాయి ఈ తతంగం అంతా పూర్తయ్యేందుకు ఎంతో సమయం తీసుకుంటుంది



# 8. 74వ రాజ్యాంగ సవరణ చట్టం - 1992 ముఖ్యాంశాలు

స్థానిక సంస్థల చరిత్రలో 74వ రాజ్యాంగ సవరణ చట్టం మహత్తర ఘట్టంగా పేర్కొన వచ్చు 1992లో ఆమోదించబడిన యీ చట్టం 20-4-1993న రాష్ట్రపతి ఆమోదాన్ని పొంది, 1-6-93 నుండి దేశవ్యాపితంగా అమలుజరుపబడింది స్థానిక సంస్థలు రాష్ట్ర అధికారాల పరిధిలో వున్నాయి గనుక వివిధ రాష్ట్రాలలో స్థానిక సంస్థలకు వివిధ చట్టాలు అమలులో వున్నందున, 74వ రాజ్యాంగ సవరణ చట్టంలోని అన్ని అంశాలను రాష్ట్రంలోని పురపాలక, నగరపాలక సంస్థల చట్టాలలో పొందుపరచవలసివచ్చింది అయితే కొన్ని అంశాల విషయంలో రాష్ట్రాలకు స్వేచ్ఛ యివ్వటంతో మన రాష్ట్ర ప్రభుత్వం కూడ 1994 సవరణ చట్టం 17లో కొన్ని మినహాయింపులు చేసింది

ఈ చట్టంలోని ముఖ్యాంశాలు

1 ఇంతకుముందు స్థానిక సంస్థలకు ప్రత్యేక ప్రతిపత్తి రాజ్యాంగంలో లేదు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మాత్రమే పరిపాలన సంస్థలుగా రాజ్యాంగబద్ధంగా వుండేవి ఈ సవరణ చట్టం ద్వారా స్థానిక సంస్థలు కూడ ప్రత్యేక పరిపాలనా వ్యవస్థగా గుర్తించబడినవి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వం తర్వాత, స్థానిక సంస్థలు మూడవ అంచె ప్రభుత్వంగా పరిగణించబడటంతో ఉన్నతస్థాయి లభించింది

2 స్థానిక సంస్థలకు ఎన్నికైన స్థానాల్లో మూడవ వంతు మహిళలకు విధిగా కేటాయింపులతోపాటు బలహీనవర్గాల, షెడ్యూలు జాతుల, తరగతులకు జనాభా ప్రాతిపదికను రిజర్వేషను కలిగించబడింది

అదేవిధంగా ఛైర్‌పర్సన్స్, మేయర్లలో కూడా రొటేషన్ పద్ధతిలో రిజర్వేషన్ ఏర్పాటు చేయబడింది దీనివలననే నేడు పురపాలక సంఘాలలో, నగరపాలక సంస్థలలో గణనీయమైన సంఖ్యలో మహిళలు, బలహీనవర్గాలు, షెడ్యూలు జాతులు, తరగతులకు స్థానాలు మరియు ఛైర్‌పర్సన్స్, మేయర్ల స్థానాలు కూడా లభించాయి

3 ఇంతకుముందు స్థానిక సంస్థల ఎన్నికల పూర్తిబాధ్యత, అజమాయిషీ రాష్ట్ర ప్రభుత్వానికే వుండేది దానివలన, గత చరిత్ర చూస్తే అనేక సందర్భాలలో స్థానిక సంస్థలకు ఏండ్ల తరబడి ఎన్నికలు జరుపకుండా, ప్రత్యేకాధికారుల పాలన కొనసాగించబడేది ఏవో, సమర్ధనీయంకాని కారణాలు చెప్పి, ఎన్నికలను వాయిదా వేస్తుండేవారు (మన రాష్ట్రంలో హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌కు ఏండ్ల తరబడి ఎన్నికలు నిర్వహించబడలేదు ) ఈ విధానానికి యీ చట్టంలో స్వస్తిచెప్పి, జాతీయ, రాష్ట్ర స్థాయిలో శాసనసభ, పార్లమెంటులకు ఎన్నికలు నిర్వహించటానికి వున్న ఎన్నికల కమిషన్ మాదిరిగా రాష్ట్ర ఎన్నికల కమిషనరును నియమించింది

రాష్ట్ర ఎన్నికల అధికారిని నియమించాలని, ప్రతి అయిదు సంవత్సరాలకు విధిగా వారే ఎన్నికలు నిర్వహించాలని ఖచ్చితంగా ఏర్పాటుజరిగింది ఎన్నికల నోటిఫికేషన్ (తేదీలు గురించి ప్రభుత్వంతో సంప్రదించటం అవసరం) ఎన్నికల నిర్వహణ, ఎన్నికైనవారి ధృవీకరణ ప్రకటనలు ఎన్నికల కమిషనరే చేస్తారు ప్రజలచే ఎన్నుకోబడిన స్థానిక సంస్థలు ఎల్లకాలాల్లో పరిపాలనాధికారాలు నిర్వహిస్తాయి ఎప్పుడైనా, అరుదైన సందర్భాలలో స్థానికసంస్థలు రద్దు చేయబడితే, ఆరునెలలలోపుగా విధిగా ఎన్నికలు నిర్వహించబడాలి స్థానికసంస్థల పదవీకాలం 5 సంవత్సరాలని నిర్దేశించింది

4 3 లక్షల జనాభా పైనగల పట్టణాలు, నగరాలలో పరిపాలనా వికేంద్రీకరణకు వార్డు కమిటీల ఏర్పాటుకు, వాటి పరిశీలనలో అనేక అంశాలను చేర్చటం ద్వారా ప్రజాప్రతినిదులు మరింత సమర్ధవంతంగా పనిచేయుటకు, తమ ప్రాంత అవసరాలను తీర్చుకొనుటకు అవకాశం ఏర్పడింది

అయితే రాష్ట్ర ప్రభుత్వం నిర్దేశించిన, నియమ నిబంధనల ప్రకారం యీ వార్డు కమిటీల నిర్ణయాలు సిఫార్సులుగానే పరిగణించబడి ఆయా కౌన్సిల్సు ఆమోదం పొందిన పిదపనే, అమలుకు ఆస్కారం వుంది అందువల్ల దీర్ఘకాలయాపనలు జరగటంతో, తక్షణ ప్రయోజనం పొందలేకపోవటం, ప్రజాప్రతినిదులకు యీ కమిటీల నిర్వహణలో ఉత్సాహం తగ్గింది నియమ నిబంధనలను సవరించి ఆయా తరగతులనుబట్టి, వార్డు కమిటీలు కొంత పరిమితి వరకు అంచనాలు మంజూరుచేసే అధికారం, నిర్ణయం జరిగిన వెంటనే అమలుజరుపుటకు అవకాశం వుండాలనే కోరికకు ప్రభుత్వ ఆమోదం యింకా లభించలేదు

5 పురపాలక సంఘాలు, నగరపాలక సంస్థలు దాదాపు అన్ని తరతమ భేదాలతో ఆర్థిక యిబ్బందులను ఎదుర్కొంటూనే వున్నాయి కొన్నింటి ఆదాయాలు, అధికారుల ఉద్యోగుల జీతభత్యాలు చెల్లించటానికి, కంటింజెంటు ఖర్చులకు మాత్రమే సరిపోగా, మరికొన్ని సంవత్సరాల తరబడి విద్యుత్ బిల్లులు, నెలలతరబడి జీతాలు చెల్లించలేక, కాంట్రాక్టర్ల బిల్లులు చెల్లించలేని దుస్థితిలో వున్నాయి

రాష్ట్ర ప్రభుత్వంగాని, పురపాలకశాఖగాని అప్పుడప్పుడు వారి యిష్టానిష్టాలమీద ఆధారపడి ప్రత్యేక గ్రాంట్లు యిస్తుండేవి ఈ విధమైన ఆర్థిక దుస్థితి నుండి స్థానిక సంస్థలకు సహాయం అందించుటకు మంత్రుల, ముఖ్యమంత్రుల దయ, దాక్షిణ్యాలతో నిమిత్తం లేకుండా, అన్ని సంస్థలకు విధిగా రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక సహాయం లభించేందుకుగాను, 74వ రాజ్యాంగ సవరణ చట్టం ప్రతి రాష్ట్రంలోను 'రాష్ట్ర ఆర్థిక కమిషను నియమించబడాలని, ఆ కమిషన్ వారు స్థానిక సంస్థల ఆదాయ వనరులు, వ్యయాలు వగైరా అధ్యయనం చేసి, అలాగే రాష్ట్ర ప్రభుత్వానికి వివిధ పన్నుల ద్వారా (కేంద్రం గ్రాంటులు మినహా) వచ్చే మొత్తం ఆదాయంలో స్థానిక సంస్థలకు ఎంత శాతం విధిగా వివిధ శాఖల ద్వారా ఆర్థిక సహాయం యివ్వాలో యీ ఆర్థిక కమిషన్ నిర్ధారణ చేస్తుంది వారి సిఫార్సుల ఆధారంగా

స్దానిక సంస్దలకు రాష్ట్ర బడ్జెటులో కేటాయింపులు చేసి, ఆ నిధులను సక్రమంగా స్దానిక సంస్దలకు అందచేయాలి ఈ సిఫార్సుల ద్వారా రాష్ట్ర ప్రభుత్వం విధిగా పంచాయతీలు, పురపాలకసంస్థలకు, నగరపాలక సంస్దలకు గ్రాంట్లుగా అందచేయాలి

మన రాష్ట్రంలో యీ విధానానుసారం, 1994లో ఒక రాష్ట్ర ఆర్థిక కమిషన్‌ను ఆనాటి రాష్ట్ర ప్రభుత్వం నియమించి, 3 సంవత్సరాలలోగా, తమ నివేదికను యివ్వాలని ఆదేశించింది ఆ కమిషన్‌వారు తమ నివేదికను 1997 మే నెలాఖరులో రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించారు రాష్ట్రాదాయం రు 9000 కోట్లుగా లెక్కించి, అందులో 39% స్దానిక సంస్దలకు కేటాయించాలని ఆ కమిషన్ సిఫార్సు చేసింది అనగా 1997-98 నుండి ఆ ప్రకారంగా ప్రతి సంవత్సరం స్దానిక సంస్దలకు ఆర్థిక సహాయం అందించాలి కాని, మన రాష్ట్రంలో ఆ కమిషన్ సిఫార్సులు ఏవిధంగా నీరుకార్చబడినవో వేరే అధ్యాయంలో వివరించబడింది

తిరిగి 1999లో రెండవ ఆర్థిక కమిషన్‌ను రాష్ట్ర ప్రభుత్వం నియమించింది వారు తమకిచ్చిన గడువులో రానున్న 5 సంవత్సరాలకు రాష్ట్ర ప్రభుత్వం పంచాయతీలకు, పురపాలక, నగరపాలక సంస్థలకు తమ ఆదాయంలో ఎంత శాతం ఏయే పద్దుల క్రింద యివ్వాలో సిఫార్సులు అందచేయవలసివుంది

6 74వ రాజ్యాంగ సవరణ చట్టం ప్రజాప్రతినిధులకు విధిగా కల్గించవలసిన అధికారాలను గురించి కూడా నిర్దేశించింది ఆర్టికల్ 243 డబ్ల్యు ప్రకారంగా స్దానిక సంస్దలు **సంపూర్ణ స్వయం పరిపాలనాసంస్థలుగా వ్యవహరించటానికి అవసరమైన అన్ని అధికారాలను** రాష్ట్ర ప్రభుత్వాలు తమ చట్టాల ద్వారా కల్పించాలని ఆదేశించింది కాని, మన రాష్ట్ర ప్రభుత్వం దానిని పూర్తిగా నిర్లక్ష్యం చేసింది అందువల్ల ఆశించిన అధికారాలు ప్రజాప్రతినిధులకు లభించలేదు

7 స్దానిక సంస్థలకు ప్రస్తుత రాష్ట్ర చట్టాల ద్వారా నిర్దేశించబడిన విధులు, బాధ్యతలతో పాటు 12వ షెడ్యూలు ద్వారా 18 అదనపు బాధ్యతలను అప్పగించాలని ఆర్టికల్ 243-డబ్ల్యు నిర్దేశించినా, మన రాష్ట్ర ప్రభుత్వం యీ అంశాన్ని కూడా పట్టించుకోలేదు

8 ఆర్టికల్ 243 ZD, ZE ప్రకారం నియమించవలసిన జిల్లా ప్లానింగ్, మెట్రోపాలిటన్ ప్లానింగ్ కమిటీల ఏర్పాటును కూడ మన రాష్ట్ర చట్టంలో పొందుపరచలేదు

విశాల దృక్పథంతో, సమాజాభివృద్ధిలో నగర, పట్టణ, గ్రామస్దాయిలో అత్యంత కీలక పాత్ర వహించవలసిన యీ స్ధానిక సంస్దలకు అవసరమయిన నిధులు, అధికారాలు, అవకాశాలను కల్గించటంలో మన రాష్ట్ర ప్రభుత్వం ముందంజవేయలేకపోయింది

**వివరాలు** ·

243Q ప్రకారం అతి చిన్న ఏరియాతో ఏర్పర్చే సంస్దను నగర పంచాయతీగా, పట్టణాలను పురపాలక సంఘాలుగా, నగరాలను మునిసిపల్ కార్పొరేషన్‌గా ఏర్పర్చాలి

243RG మునిసిపాలిటీలను వార్డులుగా విభజించగా, వాటినుండి ఎన్నికైన

సభ్యులతో మునిసిపల్ కౌన్సిల్ ఏర్పడును అదనంగా స్థానిక పరిపాలనా అనుభవం వున్న వారిని కో-ఆప్ట్ చేసుకోవాలి అయితే వారికి ఓటుహక్కు వుండదు శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు రాజ్యసభ సభ్యులు ఎక్స్ అఫీషియో సభ్యులుగా, ఓటుహక్కుతో స్థానిక సంస్థల్లో పాల్గొందురు

243S వార్డు కమిటీల ఏర్పాటు

243T సీట్ల రిజర్వేషన్ షెడ్యూలు జాతులు, తరగతులు (జనాభా ప్రాతిపదికన) ఇందులో మూడవ వంతు నుండి మహిళలుండాలి ఛైర్‌పర్సన్స్ రిజర్వేషన్సు కూడా వుండాలి

243U ప్రతి మునిసిపాలిటీలో ఎన్నికల తర్వాత, మొట్టమొదటి కౌన్సిల్ సమావేశం నుండి అయిదు సంవత్సరాల కాలపరిమితిగా వుండును

ఒకవేళ ఆ కౌన్సిల్‌ను రాష్ట్ర ప్రభుత్వం రద్దుచేసిన పక్షంలో, తిరిగి ఆరునెలల్లోగా ఎన్నికలు జరగాలి అయితే, తిరిగి ఎన్నికైన కౌన్సిల్ కాలం మిగిలిన కాలానికే పరిమితం

243V సభ్యుల యొక్క అనర్హతలు

243W అధికారాలు, బాధ్యతలు

***1) స్థానిక సంస్థలు నిజమైన స్వపరిపాలనా సంస్థలుగా వ్యవహరించటానికి అవసరమైన అన్ని అధికారాలు రాష్ట్ర ప్రభుత్వాలు యీ కౌన్సిలుకు దఖలుపరచాలి***

2) సాంఘిక న్యాయాన్ని రక్షిస్తూ, ఆర్థికాభివృద్ధికి అవసరమైన ప్లానులు రూపొందించుట

3) 12వ షెడ్యూలులో పొందుపరచిన విధులు, బాధ్యతలను నిర్వహించుట

243X ఎ) పన్నులు, డ్యూటీలు, టోల్సు ఫీజులు విధించి వసూలుచేయుటకు అధికారాలు ఇవ్వాలి

బి) కన్సాలిడేటెడ్ నిధినుండి గ్రాంట్లు మంజూరు

243Y స్థానిక సంస్థల ఆర్థిక పరిపుష్టికిగాను రాష్ట్ర ప్రభుత్వ ఆదాయం నుండి స్థానిక సంస్థలకు కేటాయించవలసిన నిధులను నిర్ధారించుట, స్థానిక సంస్థల ఆర్థిక స్థితిని మెరుగుపరచుకొనుటకుగాను సిఫార్సులు చేయుటకు రాష్ట్ర గవర్నరుచే రాష్ట్ర ఆర్థిక కమిషను నియామకం

243Z స్థానిక సంస్థల జమాఖర్చులు ఆడిట్

243ZA స్థానిక సంస్థల ఎన్నికలు నిర్వహించుటకు రాష్ట్ర ఎన్నికల అధికారి నియామకం

243ZD జిల్లా ప్లానింగ్ కమిటీల ఏర్పాటు

243ZE మెట్రోపాలిటన్ ప్లానింగ్ కమిటీ ఏర్పాటు

243W ఈ క్రింద అదనపు విధులు, బాధ్యతలు - షెడ్యూలు 12 ప్రకారం నిర్వహించాలి

## 12వ షెడ్యూలు

1 పట్టణ ప్లానింగ్‌తో సహా అర్బన్ ప్లానింగ్
2 భూమి వినియోగం, భవన నిర్మాణములను క్రమబద్ధీకరించుట
3 ఆర్థిక, సామాజిక అభివృద్ధికొరకు ప్లానింగ్
4 రోడ్లు, వంతెనలు
5 గృహ అవసరాలకు, పారిశ్రామిక, వాణిజ్య అవసరాలకు నీటి సరపరా
6 ప్రజారోగ్యం, పారిశుద్ధ్యం, ఘనరూపంలోని వ్యర్ధ పదార్థాలను నిర్మూలించడం
7 అగ్నిమాపక సేవలు
8 సంఘంలోని వికలాంగులు, మానసిక అస్వస్థ చిత్తులతో సహా బలహీనుల సంక్షేమచర్యలు
9 పట్టణ అడవులను పెంచుట, పరిసరాలను రక్షించుట, వాతావరణ సమతుల్యతను కాపాడుట
10 మురికివాడలను బాగుచేయుట, వాటి స్థితిగతులను మెరుగుపరచుట
11 పట్టణాలలో పేదరిక నిర్మూలనకు కృషి
12 పార్కులు, తోటలు, ఆటస్థలముల వంటి పట్టణ సదుపాయాలు, సౌకర్యములు కల్గించుట
13 సాంస్కృతిక, విద్యా విషయక మరియు మానసికోల్లాసము కల్గించు రంగాలను అభివృద్ధిపరచుట
14 దహనములు, దహనవాటికలు, ఖననము, ఖననవాటికలను, విద్యుత్ దహన వాటికలను నెలకొల్పుట
15 పశువుల చెరువులు, జంతువులపట్ల క్రూరత్వ నివారణ చర్యలు
16 జనన మరణాల రిజిస్ట్రేషన్‌తోసహా, ముఖ్యమైన గణాంకాల సేకరణలు
17 వీధిదీపాలు, పార్కింగ్ స్థలాలు, బస్సు స్టాపులు వద్ద ప్రజలకు సదుపాయాలు, పబ్లిక్ సౌకర్యములను కలిగించుట
18 కబేళాలు, చర్మములు పరిశుభ్రం చేయు స్థలములను క్రమబద్ధీకరించుట

ఇందులో 2, 7, 8, 9, 11, 13, 15 అంశాలకు సంబంధించి బాధ్యతలు ప్రస్తుత చట్టాలలో చోటుచేసుకోలేదు

అయితే 2000 జనవరిలో రాష్ట్ర ప్రభుత్వంచే నియమించబడిన మంత్రుల ఉపసంఘం వారు తమ రిపోర్టులో, ప్రజాప్రతినిధులతో వారు యీ అదనపు బాధ్యతలు గురించి సంప్రదించినట్లున్నూ, అధిక సంఖ్యలో పురపాలక సంఘాధ్యక్షులు ఇప్పుడున్న బాధ్యతలే నిర్వహించటానికి నిధులులేక సక్రమంగా నిర్వహించలేకపోతున్నామని, అందుచే అదనపు బాధ్యతలు అవసరంలేదని ఉపసంఘం వారికి చెప్పారని, అందువల్ల ఆ బాధ్యతలు కల్గించ అవసరంలేదని తమ రిపోర్టులో పేర్కొన్నారు కాని, 74వ రాజ్యాంగ సవరణ చట్టంలో స్పష్టంగా పేర్కొన్నదేమంటే బాధ్యతలతోపాటు, రాష్ట్ర ప్రభుత్వం వాటి నిర్వహణకు అవసరమైన నిధులు కూడ సమకూర్చాలని ఆ విధంగా అదనపు నిధులు ప్రసక్తిలేకుండా, బాధ్యతలు తీసికోటానికి సహజంగానే ఛైర్‌పర్సన్స్ సుముఖత చూపివుండరు

# 9. ప్రధమ రాష్ట్ర ఆర్ధిక కమిషన్ సిఫార్సులు

25-10-1994, జి ఓ ఎం ఎస్ నెం 683, పంచాయతీరాజ్, రూరల్ డెవలప్‌మెంట్ మరియు రిలీఫ్ డిపార్ట్‌మెంట్, తేది 25-10-94 ద్వారా యీ కమిషన్ నియమించబడింది

**కమిషన్ సభ్యులు**

| | | |
|---|---|---|
| 1 | శ్రీ లక్ష్మణస్వామి - డాక్టర్ అంబేద్కర్ ఓపెన్ యూనివర్శిటీ రిటైర్డ్ రిజిస్ట్రార్ | ఛైర్మన్ |
| 2 | శ్రీ చంద్ర వెంకటనారాయణరావు సర్పంచ్, ముక్కెళ్ళపాడు, గుంటూరు జిల్లా | సభ్యులు |
| 3 | శ్రీ శ్రీనివాసాచారి, మహబాబ్‌నగర్ | సభ్యులు |
| 4 | డాక్టర్ ఓ చంద్రమ్మ, ఎం బి బి ఎస్ , శ్రీకాళహస్తి | సభ్యులు |
| 5 | శ్రీ కె పిచ్చయ్య, రిటైర్డ్ ఫైనాన్షియల్ కమిషనర్ పంచాయతీరాజ్ రూరల్ డెవలప్‌మెంట్ రిలీఫ్ డిపార్టుమెంట్, హైద్రాబాద్ | కార్యదర్శి మరియు సభ్యులు |

ఈ కమిషన్ తన నివేదికను 31-5-1997లోగా సమర్పించవలయును

1994లో నియమించబడిన ఆర్ధిక కమిషన్, స్థానిక సంస్థల ఆర్ధిక పరిపుష్టికిగాను రాష్ట్రాదాయంనుండి (కేంద్రం నుండి లభించే గ్రాంట్లుకాక) ఆనాటి గణాంకాల ప్రకారం రు 9000ల కోట్ల రూపాయల రాష్ట్రాదాయం నుండి 39 శాతం అనగా రు 3550 కోట్లు స్థానిక సంస్థలకు ప్రస్తుతం యిస్తున్న గ్రాంట్లకు అదనంగా పంచాయతీలకు, మునిసిపాలిటీలకు, మునిసిపల్ కార్పొరేషన్లకు వివిధ పద్దుల క్రింద ప్రతి సంవత్సరం యివ్వాలని 1997 మేలో ప్రభుత్వానికి తన సిఫార్సులను అందజేసింది రాష్ట్ర ప్రభుత్వం మొదట ఆ సిఫార్సులను శాఖా కార్యదర్శులు - మునిసిపల్, పంచాయతీరాజ్, ఆర్థిక శాఖలు - ఉపసంఘంతో ప్రధమ దశగా, దరిమిలా ఆ శాఖామాత్యుల ఉపసంఘంతో రెండవ దశలో కుదించి, కత్తిరించి, ఆ సిఫార్సులను ఆచరణలో స్థానిక సంస్థల ఆర్థిక పరిపుష్టికి దోహదపడని విధంగా చేసిన పద్ధతులను దిగువ వివరాలు తెలియచేస్తాయి ఇప్పటికే మన రాష్ట్రంలో పంచాయతీరాజ్ శాఖకు జీతభత్యాలు, మరికొన్ని గ్రాంట్లు యిస్తున్నందున, ఆ మేరకు తగ్గించి, మిగతా రు 979 16 కోట్లను మాత్రమే స్థానిక సంస్థలకు ప్రతి సంవత్సరం యివ్వాలని కమిషన్ సూచించింది ఇందులో పంచాయతీరాజ్ సంస్థలకు సంబంధించిన సిఫార్సులను పొందుపరచటంలేదు మునిసిపాలిటీలు, మునిసిపల్ కార్పొరేషన్లకు సంబంధించి మాత్రమే పేర్కొనబడినవని గ్రహించగోరుచున్నాము

**ఆర్థిక కమిషన్ సిఫార్సు**

1 పంచాయతీ సంస్థలకు, అర్బన్ సంస్థలకు (యిప్పుడిస్తున్న గ్రాంట్లు, చెల్లింపులుగాక) అదనంగా 979 16 కోట్ల రూపాయలు రాష్ట్రంనుండి బదలాయింపులు చేయాలి

2 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** రాష్ట్రాదాయం నుండి 39 24 శాతం స్థానిక సంస్థలకు కేటాయించాలి దానిని చట్టపరంగా ఉటంకించాలి

**సెక్రటరీల ఉపసంఘం** స్థానిక సంస్థల చట్టాలలో పొందుపరచాలి

**మంత్రుల ఉపసంఘం** ఆమోదం (కాని ఇంతవరకు చట్టాలలో పొందుపరచబడలేదు)

3 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** వివిధ పన్నులలో వాటాకంటే, మొత్తం రాష్ట్రాదాయంనుండి వాటా నిర్ణయించటం మంచిది

**సెక్రటరీల, మంత్రుల ఉపసంఘాలు** ఆమోదించాయి

4 **ఆర్థిక కమిసన్ సిఫార్సు** పట్టణ ప్రాంతాల అభివృద్ధి పథకాలకు సంవత్సరానికి 31 కోట్ల చొప్పున మూడు సంవత్సరాలు గ్రాంట్లుగా యివ్వాలి అనగా మొత్తం - 93 కోట్ల రూపాయలు

**సెక్రటరీల కమిటీ** ఈ గ్రాంట్లు మంచినీటి సరఫరా, డ్రయినేజి, రోడ్ల అభివృద్ధి పనులకే విధిగా వినియోగించబడాలి

**ఉపసంఘం** ఈ నిధుల విడుదలకు ఆయా గ్రేడ్ల ప్రకారం, జనాబా, విస్తీర్ణం, మురికి వాడలు, వగైరా ప్రాతిపదికగా యివ్వాలి

5 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** వృత్తిపన్ను వసూళ్ళల్లో 95 శాతం స్థానిక సంస్థలకు యివ్వాలి

**సెక్రటరీల కమిటీ** 1996-97లో వృత్తిపన్ను క్రింద 69 80 కోట్లు వసూలుకాగా, 35 2 కోట్లు మాత్రం (అనగా 52 శాతం మాత్రమే) విడుదలయింది 1997-98లో రు 86 80 కోట్లు వసూలవుతుందని అంచనా అందులో 53 9 కోట్లు మాత్రమే (అనగా 62 శాతం) విడుదల చేయుటకు ఏర్పాటుచేయబ ింది ఇంకా 28 5 కోట్లు విడుదల చేయాలి

**మంత్రుల కమిటీ** పై విధంగా 95 శాతం ఇవ్వనక్కరలేదు వసూళ్ళలో 90 శాతం మాత్రమే యివ్వాలి

6 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** విద్యాలయాలకు అవసర ఖర్చుల క్రింద చట్టనిబంధనల ప్రకారం గ్రాంట్లు యివ్వాలి

**సెక్రటరీల కమిటీ** ఉపాధ్యాయులు జీతాలపై 2 శాతం యీ ఖర్చుల క్రింద యివ్వవలసివుంది 9 60 కోట్ల రూపాయలు బడ్జెటులో కేటాయించినా నిధుల లేమితో యీ గ్రాంటు గత 3 సంవత్సరాలనుండి యివ్వలేదు అయినా ఈ సంవత్సరం (1997-98) రు 3 84 కోట్లు విడుదల చేయబడింది

**మంత్రుల కమిటీ** ఆమోదించటమైంది అయినా ఇంతవరకు విడుదలకాలేదు

7 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** మునిసిపల్ సంస్థలకు బోధనేతర సిబ్బందికి పెన్షను ప్రభుత్వం చెల్లించాలి (పంచాయతీరాజ్ ఉపాధ్యాయులకు యిస్తున్నట్లుగా)

**సెక్రటరీల కమిటీ** రాష్ట్రంలో రెండు పద్ధతులున్నాయి తెలంగాణా ప్రాంతంలో ఒక పద్ధతి, మిగతా రాష్ట్రంలో ఒక పద్ధతి

ఆంధ్రప్రాంతంలో, ఉద్యోగి జీతంలో 9 5 శాతం చొప్పున పెన్షను ఫండ్ ఏర్పాటుచేసి, ప్రతి నెల అందులో జమచేయాలి కాని చాలా హెచ్చు మునిసిపాలిటీలు అలా చేయటంలేదు

తెలంగాణా ప్రాంతంలో, ప్రభుత్వమే యీ పెన్షను ఫండును జీతంలో 1/7 వంతు చొప్పున ఆ పెన్షను ఫండులో జమచేస్తుంది

ఆంధ్ర ఏరియాలో 64 మునిసిపాలిటీలలో వార్షిక పెన్షను చెల్లింపు 7 25 కొట్ల రూపాయలు కాగా, ఆయా మునిసిపాలిటీలు చెల్లించటంలేదు

అందుచేత, రెండు ప్రాంతాలలోను ఒకే విధానం వుండటం వాంఛనీయం తెలంగాణాలో వలెనే ఆంధ్రప్రాంతంలో కూడా రాష్ట్ర ప్రభుత్వమే కన్సాలిడేటెడ్ ఫండ్ నుండి చెల్లించాలి ఉద్యోగుల జీతాలలో 1/7 లేదా 14 28 శాతం యీ ఫండు క్రింద మునిసి పాలిటీలన్నీ చెల్లించే ఏర్పాటు చేయాలి

**మంత్రుల కమిటీ** పై సిఫార్సులను ఆమోదించటమయింది

8 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** ఆయా పట్టణాలలో నీటి సరఫరా ఛార్జీలు పెంచటానికి మునిసిపాలిటీ సంస్థలకు అధికారాలు యివ్వాలి

**సెక్రటరీల కమిటీ** 19-1-1993 తేదీగల నెం 44 ఉత్తర్వు ప్రకారం టాప్ ఛార్జీలు, విరాళాలు పెంచటానికి ఉత్తర్వులు యివ్వబడినవి తిరిగి 20-6-97 తేదీ గల నెం 158 ఉత్తర్వుల ద్వారా మరల ఛార్జీలు, విరాళాలు పెంచటానికి ఉత్తర్వులు యివ్వబడినవి కమిషన్ సిఫార్సు ఆమోదిస్తూ ఆ ఉత్తర్వు అమలుపై గల నిలుపుదలను తొలగించాలి

**మంత్రుల కమిటీ** ఆమోదించటమైంది

9 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** స్టాంపు డ్యూటీపై నున్న సర్‌ఛార్జీని నూటికి 5 శాతం నుండి 10 శాతానికి పెంచాలి

**సెక్రటరీల కమిటీ** ఇప్పటికే మన రాష్ట్రంలో సర్‌ఛార్జీ రేటు హెచ్చుగా వుంది కనుక ఆమోదించరాదు

**మంత్రుల కమిటీ** పై అభిప్రాయంతో ఏకీభవించింది

10 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** విద్యాలయాల నిర్మాణానికి ప్రతి సంవత్సరం రు 100 కోట్లు గ్రాంటుగా యివ్వాలి

**సెక్రటరీల కమిటీ** స్థానిక సంస్థలు నూటికి 50 శాతం భరించితే, మిగతా 50% ప్రభుత్వ గ్రాంటు యివ్వాలి

**మంత్రుల కమిటీ** విద్యాలయాల నిర్మాణానికి నిధులు ఏర్పాటుచేయాలి ఆయా స్థానిక సంస్థల భాగస్వామ్యంతోనే పంచాయతీరాజ్, మునిసిపల్ సంస్థలు, ప్రభుత్వం - ఉమ్మడిగా భరించాలి

11 **ఆర్థిక కమిషన్ సిఫార్సులు** 1997-98 నుండి ప్రతి సంవత్సరం రు 18 కోట్లు మంచినీటి సరఫరా పథకాల ఏర్పాటుకు గ్రాంటుగా యివ్వాలి అయితే పదవ ఫైనాన్స్ కమిషన్ గ్రాంటు మేరకు తగ్గించి యివ్వాలి

**సెక్రటరీల కమిటీ, మంత్రుల కమిటీ** ఆమోదించాయి కాని అమలుజరగలేదు

12 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ మునిసిపల్ కార్పొరేషన్లకు సంవత్సరానికి రు 8 కోట్లు (ఒక్కొక్కదానికి)న్నూ, మిగతా కార్పొరేషన్లకు (గుంటూరు, వరంగల్, కర్నూలు, రాజమండ్రి) సంవత్సరానికి రు 6 కోట్లు గ్రాంటుగా యివ్వాలి

**సెక్రటరీ కమిటీ, మంత్రుల కమిటీ** పై సిఫార్సులను తిరస్కరించాలి ఇప్పటికే తలసరి గ్రాంట్లు యిస్తున్నందున అదనపు గ్రాంట్లు అక్కరలేదు

13 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** విద్యాలయ భవనాల సంరక్షణకు 13 58 కోట్ల రూపాయలను గ్రాంటుగా యివ్వాలి

**సెక్రటరీల కమిటీ** ఇప్పటివరకు 2 కోట్ల రూపాయలు మాత్రమే విడుదల చేయబడు తుంది మిగతా సొమ్మును స్థానిక సంస్థలు వేరే పద్ధతుల్లో సమకూర్చుకోవాలి అయిదు సంవత్సరాల పైబడిన భవనాలను సగం స్థానిక మిగతా సగం ప్రభుత్వ గ్రాంటు ఏర్పాటు చేయవచ్చు

**మంత్రుల కమిటీ** 6 సంవత్సరాల పైబడిన భవనాల మరమ్మతులకు రు 4 కోట్లు మంజూరు చేయాలి

14 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** హైదరాబాద్ సిటీలో బెట్టింగ్ టాక్స్ నుండి వసూలయ్యే సొమ్ములో 10 శాతం కార్పొరేషన్‌కు యివ్వాలి

**సెక్రటరీ కమిటీ** ఈ విధంగా యివ్వటం సాధ్యం కాదు కావాలనుకుంటే, కార్పొరేషన్ 10 శాతం సర్ఛార్జి విధించుకోవచ్చు

**మంత్రుల కమిటీ** కార్పొరేషన్‌కు యిలాంటి అవకాశం యివ్వరాదు లాభం కంటే నష్టమేరావచ్చు అందుచేత నిరాకరించటమయింది

15 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** ఆస్తిపన్నుకు బదులు రాష్ట్ర ప్రభుత్వం తమ ఆస్తులపై యిస్తున్న గ్రాంటును ప్రతి 5 సంవత్సరాలకి 5 శాతం పెంచి యివ్వాలి

**సెక్రటరీల కమిటీ** మునిసిపాలిటీల వ్యయం పెరుగుతున్నందున, యీ సిఫార్సు ఆమోదించవచ్చు

**మంత్రుల కమిటీ** ప్రస్తుతం ప్రభుత్వం యిస్తున్న గ్రాంటు 2 5 కోట్లు మాత్రమే పై సిఫార్సు ప్రకారం అదనంగా 13 లక్షలు మాత్రమే లభించుతుంది దీనివల్ల ఏ ప్రయోజనం లేదు అయితే ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం కొన్ని భవనాలపై పన్ను మినహాయింపు యిస్తున్నాయి అట్టి మినహాయింపు సొమ్మును ప్రభుత్వం నుండి నష్టపరిహారంగా పొందటం బాగుంటుంది అయితే, పన్ను మినహాయింపులు ఎలా ఎంత వరకు జరుగుతున్నవో, ఒకసారి సమీక్ష చేయటం, లోటుపాట్లను సర్దుబాటు చేయాలి

16 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** ఆక్ట్రాయి నష్టపరిహారం ప్రతి సంవత్సరం నూటిక 10 శాతం పెంచాలి

**సెక్రటరీల కమిటీ** తెలంగాణా ప్రాంతంలో 14 మునిసిపాలిటీలకు యీ పరిహారం చెల్లించబడుతుంది అది సంవత్సరానికి 199 19 లక్షలు మాత్రమే హైద్రాబాద్ కార్పొరేషన్‌కు 1961 నుండి 41 92 లక్షల రూపాయలు పరిహారం లభించుతుంది ధరలు పెరిగిన కారణంగా, యీ సిఫార్సును ఆమోదించవచ్చు

**మంత్రుల కమిటీ** ఆస్తిపన్ను పరిహారంవలెనే, ఆక్ట్రాయి రద్దు పరిహారం కూడా గ్రాంటు ఇన్ ఎయిడ్‌గా సర్దుబాటు చేయాలి

17 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** మోటారు వాహనాల పన్ను పరిహారం పెంచాలి

**సెక్రటరీల కమిటీ** ప్రస్తుతం 58 లక్షల రూపాయలు మోటారు వాహనాల పరిహారం క్రింద చెల్లించబడుతుంది ఇది 1961లో నిర్ణయించబడింది 1996-97లో యీ పన్ను వసూళ్ళు 544 కోట్ల రూపాయలకు పెరిగాయి ప్రస్తుతం యిస్తున్న పరిహారం 0 1 శాతంగా వుంది మునిసిపల్ సంస్థలకు కనీసం 1 శాతం, అనగా 5 44 కోట్లు పరిహారం యివ్వటం న్యాయంగా వుంటుంది

**మంత్రుల కమిటీ** నిర్ణీత పరిహారంకంటే రాబడిలో శాతం ఏర్పాటు మునిసిపల్ సంస్థలకు లాభసాటిగా వుంటుంది సెక్రటరీల కమిటీ ప్రతిపాదించిన 1 శాతం బదులు అరశాతం (0 5 శాతం) నిర్ణయించాలి

18 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** తలసరి గ్రాంటును మునిసిపాలిటీలలో ప్రస్తుతం వున్న 4 రూపాయలనుండి రు 8 రూపాయలకు పెంచాలి

**సెక్రటరీల కమిటీ** ప్రస్తుతం యీ పద్దుక్రింద రు 46 7 కోట్లు చెల్లించబడుతుంది.

| | రాష్ట్రంలో తలసరి | మొత్తం చెల్లింపు |
|---|---|---|
| పంచాయతీలలో | ఒక రూపాయి | 5 19 కోట్లు |
| మండల్ ప్రజాపరిషత్ | అయిదు రూపాయలు | 25 95 కోట్లు |
| జిల్లా పరిషత్‌లు | రెండు రూపాయలు | 10 38 కోట్లు |
| మునిసిపల్ సంస్థలు | నాల్గు రూపాయలు | 5 19 కోట్లు |
| **మొత్తం** | | **46.71 కోట్లు** |

ఇదిగాక, పదవ ఆర్థిక కమిషన్ గ్రాంటు క్రింద సంవత్సరానికి 87 50 కోట్లు విడుదల చేస్తున్నాయి అది కలుపుకుంటే మొత్తం రు 134 21 కోట్లు అవుతుంది ఈ కాలంలో స్థానిక సంస్థల వ్యయం బాగా పెరిగినందున, తలసరి గ్రాంటును పెంచటం అవసరమే

అర్బన్ సంస్థలకు లోగడ తలసరి గ్రాంటుతోపాటు పెరిగిన కరువు భత్యంలో సగం ప్రభుత్వం యిచ్చేది కాని తలసరి గ్రాంటును 4 రూపాయలు పెంచుతూ, కరువు భత్యంలో యిస్తున్న సగం వాటాను రద్దుచేసింది ఆ కారణంగా అర్బన్ సంస్థలకు నష్టం జరిగింది అందుచేత, తలసరి గ్రాంటును రు 8లకు పెంచటం న్యాయం

**మంత్రుల కమిటీ** · పై ప్రతిపాదనలను ఆమోదించాలి

19 **ఆర్థిక కమిసన్ సిఫార్సు** కుటుంబ నియంత్రణ పథకంలో హెచ్చు ఫలితాలు సాధించిన స్థానిక సంస్థలకు ప్రోత్సాహక బహుమతులు ఇవ్వాలి

**సెక్రటరీల కమిటీ** నిరాకరించింది మంత్రుల కమిటీ డిటో

20 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** కొత్తగా మునిసిపల్ కార్పొరేషన్ ఏర్పరచినపుడు రు 25 లక్షల స్పెషల్ గ్రాంటు యివ్వాలి

**సెక్రటరీల కమిటీ, మంత్రుల కమిటీ** ఈ ప్రతిపాదన అప్రస్తుతం గనుక నిరాకరించారు

21 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** . అన్ని షరతులు పూర్తిచేసిన విద్యాలయాలకు గ్రాంట్ ఇన్ ఎయిడ్ చెల్లించాలి

**సెక్రటరీల కమిటీ** 1-4-77 నుండి 1-1-1985లోపు ప్రారంభించిన విద్యాలయాలకు గ్రాంట్సు యిస్తున్నారు మొత్తం 2640 విద్యాలయాలు (ఇందులో 137 మునిసిపల్ పాఠశాలలు) యింకా గ్రాంట్సుకు ఎదురుచూస్తున్నాయి ఇందుకొరకు రు 217 56 కోట్లు అవసరం రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి బాగాలేనందున, వీటికి యింకా గ్రాంట్లు యివ్వటంలేదు

స్థానిక సంస్థలు నిర్వహిస్తున్నందున, వాటికి సరిపోయిన వసతిగాని, స్టాఫ్‌గాని, యితర హంగులు పూర్తిగా లేవు అందుచేత ఆ పాఠశాలల్లో విద్యాబోధన అసంతృప్తికరంగా వుంది పైవిగాక, ఇంకొక 1444 విద్యాలయాలు 1981 తర్వాత ప్రారంభించారు వాటికికూడా గ్రాంట్లు యివ్వాలంటే మరొక రు 128 51 కోట్ల రూపాయలు అవసరం

అనగా, మొత్తం రు 346 కోట్ల వ్యయం చేయాలి అయితే పదవ తరగతి వరకు స్థానిక సంస్థలే బాధ్యత వహించాలనే ఆలోచన వుంది విద్యాలయాల నిర్వహణకు స్థానిక సంస్థలు పిల్లలనుండి ఫీజులు వసూలు చేయటం ద్వారా, లేక అదనంగా పన్నులు విధించవచ్చు 1997-98 బడ్జెటులో స్థానిక సంస్థలకు గ్రాంట్ల క్రింద రు 869 34 కోట్లు ప్రావిజన్ చేయబడింది ఈ మొత్తానికి మించకుండా, స్థానిక సంస్థలు నిధుల సమీకరణ

సామర్థ్యాన్నిబట్టి 50 నుండి 100 శాతం వినియోగించబడాలి

**మంత్రుల కమిటీ** డిటో

22 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** · ప్రభుత్వ ఖాళీస్థలాల్లో షాపింగ్ సముదాయాలు నిర్మించవచ్చు అందుకు ఖాళీజాగాలను స్థానిక సంస్థలకు అప్పగించాలి

**సెక్రటరీల కమిటీ** అక్కరలేదు షాపులు నిర్మించిన పట్టణాలలో అద్దెలు సరిగా వసూలు చేయబడటంలేదు

**మంత్రుల కమిటీ** డిటో

23 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** చిన్న వ్యాపార సంస్థలనుండి కూడా వృత్తిపన్ను వసూలు చేయాలి

**సెక్రటరీల, మంత్రిమండలి కమిటీలు** ఆమోదం

24 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** జిల్లా పరిషత్‌లలో అదనపు సిబ్బంది విషయం సమీక్షించాలి

**సెక్రటరీల కమిటీ** సిఫార్సును అంగీకరిస్తూ, మంత్రిమండలి ఉపసంఘం - యీ పరిధిలోని మునిసిపల్ సంస్థలను కూడా చేర్చాలని యీ సమీక్ష 6 నెలల్లో పూర్తికావాలని నిర్ణయించింది

25 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** స్థానిక సంస్థల జమా ఖర్చులు, ఆదాయ వ్యయాలు ఖచ్చితంగా క్రమం తప్పకుండా ఆడిట్ చేయబడాలి అందుకొరకు అర్హులైన అక్కౌంటు సిబ్బంది నియమించాలి

ప్రభుత్వ, బ్యాంకు అప్పులకు దరఖాస్తులు చేసుకునేవారు, టెలిఫోను, విద్యుత్, మంచినీటి కుళాయి లేక రిజిస్ట్రేషన్ పొందాలనుకునేవారు విధిగా స్థానిక సంస్థలనుండి పన్ను బకాయి లేదనే సర్టిఫికెట్ దాఖలు చేయాలి

**సెక్రటరీ, మంత్రిమండలి కమిటీలు** ఆమోదించాలి (కాని అలాంటి ఉత్తర్వులు యింతవరకు యివ్వబడలేదు )

26 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** ఈ సిఫార్సుల మేరకు అమలుజరుగుతున్నాయో లేదో నిత్యం పరిశీలనకు ప్రత్యేక సెల్ ఏర్పాటుచేయాలి

**సెక్రటరీల, మంత్రుల కమిటీ** అవసరంలేదు

27 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** పన్ను విధింపు వ్యవహారంలో ప్రభుత్వ జోక్యం ముందరాదు

**సెక్రటరీల కమిటీ** 29-10-90 తేదీగల నెం 438 ప్రభుత్వ ఉత్తర్వుల ద్వారా, పన్ను విధింపు విధానం మార్చబడింది భవనం విస్తీర్ణం, వినియోగం, నిర్మాణ స్థాయి లాంటి అంశాల ప్రాతిపదికగా పన్ను విధించాలి అయితే ఏ పరిస్థితుల్లోను, ఆ పెరుగుదల 75% నుండి 100%కు మించరాదు

**మంత్రిమండలి ఉపసంఘం** పై ప్రతిపాదన ఆమోదం అయితే, ఇటీవల ఈ పెరుగుదల శాతం మీద విధించిన పరిమితిని రద్దుచేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు యిచ్చింది

28 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** పన్నుల పునర్వ్యవస్థీకరణ ప్రతి 3 సంవత్సరాలకొకసారి జరిపించాలి

**సెక్రటరీల కమిటీ** గ్రామాల్లో, పట్టణాల్లో ప్రతి 5 సంవత్సరాలకొకసారి పన్నుల రివిజన్ సరిపోతుంది పన్నుల పెంపుదలను ధరల పెరుగుదల ఇండెక్సుకు అనుసంధానం చేయటం మంచిది

**మంత్రుల కమిటీ** పై పద్ధతి ప్రకారం ప్రతి 3 సంవత్సరాలకొకసారి పన్నులను సవరించాలి

29 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** ఏ ఇల్లు కూడ పన్నుల నుండి మినహాయింపు వుండరాదు

**సెక్రటరీల కమిటీ** సెక్షన్ 88 క్రింద ఇచ్చిన పన్ను మినహాయింపులుగాకుండా,

1) ఏ ఇంటి సాంవత్సరిక అద్దె విలువ రు 300/- కార్పొరేషన్లలో రు 600/-లలోపు వున్నవాటికి అవి యజమాని స్వయంగా నివసించుతుంటే

2) పట్టణ పేదలకు ప్రభుత్వ సంస్థలచే నిర్మించబడిన ఇండ్ల నుండి ఆరు నెలలకు ఒక్క రూపాయి మాత్రమే పన్నుగా వసూలు చేయాలి

ప్రభుత్వ ప్రత్యేక ఉత్తర్వుల ద్వారా దిగువ గృహాలకు పన్ను మినహాయింపు ఇవ్వబడింది

1) ప్రభుత్వోద్యోగుల సంఘ కార్యాలయాలు

2) నాల్గవ తరగతి ఉద్యోగుల సంఘ కార్యాలయాలు

3) పశువుల ఆసుపత్రి భవనాలు

4) కృత్రిమ వీర్య సంరక్షణ కేంద్రాలు

5) మాజీ సైనికుల గృహాలు

**మంత్రుల కమిటీ** లాభాపేక్షలేని ధర్మసంస్థల భవనాలకే పన్ను మినహాయింపు వుండాలి అయితే స్థానిక సంస్థల ఆ భవన యజమానుల స్తోమతను బట్టి ఎంతో కొంత పన్ను చెల్లించటం న్యాయం

30 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** ఎప్పుడైనా ప్రభుత్వం వినోదపు పన్నులో రాయితీలు యిచ్చినట్లయితే, దానివల్ల కలిగే నష్టాన్ని స్థానిక సంస్థలకు ప్రభుత్వం విధిగా పరిహారం యివ్వాలి

**సెక్రటరీల, మంత్రుల కమిటీలు** ఆమోదించాయి కాని దీనికి విరుద్ధంగా, 2000 సంవత్సరంలో సినిమారంగాన్ని ఆదుకోవటానికిగాను పన్నుల రాయితీ ప్రభుత్వం కల్గించింది దానివల్ల ఇప్పటివరకు లభించుచున్న వినోదపు పన్నులో 20% తగ్గింది అనేక మునిసిపాలిటీలు, కార్పొరేషన్లు, ప్రభుత్వానికి నష్టాన్ని భర్తీచేయమని విజ్ఞప్తులు చేసినా,

ఫలితం లేకుండా వుంది

31 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** ప్రతి టెలిఫోను వినియోగదారునిపై సంవత్సరానికి రు 50/-లు స్థానిక సంస్థలు ఫీజు విధించటానికి రాష్ట్ర ప్రభుత్వం ఆమోదిస్తూ కేంద్ర ప్రభుత్వాన్ని ఒప్పించాలి

అయితే యీ సిఫార్సులను సెక్రటరీల, మంత్రిమండలి కమిటీలు తిరస్కరించాయి

32. **ఆర్థిక కమిషన్ సిఫార్సు** 73, 74వ రాజ్యాంగ సవరణ చట్టంలో ఉదహరించిన షెడ్యూలు 12లో స్థానిక సంస్థలకు అదనపు బాధ్యతలు అప్పగించే సందర్భంలో వాటి నిర్వహణకు అవసరమైన నిధులు కూడ అందచేయాలి ఆ బాధ్యతలను సాధ్యమై నంత త్వరలో చట్టరూపేణా బదిలీ చేయాలి

**సెక్రటరీల కమిటీ** పంచాయతీ సంస్థలకు బదిలీ చేయబడిన 29 బాధ్యతల్లో ఇప్పటికి 9 చేయబడినవి మునిసిపల్ సంస్థలకు బదలాయించబడిన విధుల్లో ఇప్పటికి 11 విధులు బదలాయించబడినవి విధులు, బాధ్యతలు బదలాయింపు విషయాలు ఆర్థిక కమిషనుకు సంబంధంలేదు అయినా యీ బదలాయింపువల్ల అవసరమయిన నిధులు సమకూర్చు కుందుకు ఒక సమీక్షా సంఘాన్ని ఏర్పర్చి, 3 నెలల్లో వాటి సిఫార్సులు తెప్పించటం మంచిది

**మంత్రుల కమిటీ** స్థానిక సంస్థలకు బాధ్యతలు, నిధులు బదలాయింపు వ్యవహారం సమగ్రంగా పరిశీలించాలి సెక్రటరీల కమిటీ చెప్పినట్లు, 3 నెలల్లోగా ఒక నిపుణుల కమిటీ ఏర్పర్చి తగు సూచనలు పొందాలి

33 **ఆర్థిక కమిషన్ సిఫార్సు** స్థానిక సంస్థల్లో సోషల్ ఆడిట్ విధానం ప్రవేశపెట్టాలి

**మంత్రుల కమిటీ** ఇది చాలా ముఖ్యం ప్రతి స్థానిక సంస్థ తమ ఆదాయ వ్యయాలు, ఆయా పనులకు చేసిన కేటాయింపులు వగైరాలను నోటీసు బోర్డు మీద ప్రకటించాలి ప్రజలు కోరే సమాచారాన్ని వెంటనే ఇవ్వాలి ఈ విధానాన్ని మరింత కట్టుదిట్టంగా ప్రవేశపెట్టి అమలుజరపాలని నిర్ణయించాయి

ఆర్థిక కమిషన్ 1997లో చేసిన సిఫార్సుల ద్వారా స్థానిక సంస్థలకు అప్పటివరకు ప్రభుత్వం ఇస్తున్న ఆర్థిక సహకారం (గ్రాంట్లు)కు అదనంగా ఇవ్వాలని చేసిన ప్రతిపాదనను రాష్ట్ర ప్రభుత్వం తారుమారుచేసి, వారి సిఫార్సుల మూలంగా వనగూరే నిధులనుండి అప్పటికే యిస్తున్న ఆర్థిక సహాయాన్ని తగ్గించి, స్థానిక సంస్థలకు అన్యాయం చేసింది ఆర్థిక కమిషన్ చేసిన సిఫార్సుల వల్ల అదనంగా 204 కోట్ల రూపాయలు యివ్వవలసి వుండగా, అప్పటికే బడ్జెటులో చూపిన మొత్తాన్ని తగ్గించి చివరకు 115 మునిసిపాలిటీలకు, 7 కార్పొరేషన్లకు రు 70 కోట్లు మాత్రమే అదనపు సహాయంగా నిర్ణయించటంతో ఆర్థిక కమిషన్ నియామక లక్ష్యాలను నీరుకార్చింది

***కేంద్ర ఆర్థిక కమిషన్ సిఫార్సులను కేంద్రప్రభుత్వం ఆమోదించి, అమలుచేస్తున్న రీతిలోనే, రాష్ట్ర ఆర్థిక కమిషన్ సిఫార్సులను పూర్తిగా రాష్ట్రప్రభుత్వం ఆమోదించి అమలు చేయటానికి చట్టబద్ధత కల్పించటం అవసరం.***

## ఆర్థిక కమిషన్ సిఫార్సుల మూలంగా మునిసిపల్ సంస్థలకు లభించిన అదనపు నిధులు

| వ నెం | ఐటం | ఆర్థిక కమిషన్ సిఫార్సు చేసినది | 1997-98 బడ్జెటు అంచనాల్లో పొందు పరిచింది | అదనంగా బడ్జెటులో కేటాయించ బడింది | సెక్రటరీ కమిటీ ప్రతిపా దనవల్ల | మంత్రుల కమిటీ తుది నిర్ణయం | రిమా ర్కులు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | మోటారు వాహనాల పన్ను నష్ట పరిహారం | రు 20 కోట్లు | 0 58 లక్షలు | 19 42 కోట్లు | 5 44 కోట్లు | 2 99 కోట్లు | |
| 2 | ఆస్తిపన్ను పరిహారం | 13 లక్షలు | 2 74 కోట్లు | | | | |
| 3 | తలసరి గ్రాంటు | 11 78 కోట్లు | 5 89 కోట్లు | 5 89 కోట్లు | 5 89 కోట్లు | 5 89 కోట్లు | |
| 4 | పెన్షన్ గ్రాంటు | 10 00 | -- | 10 00 | 7 25 | 7 25 | |
| 5 | బెట్టింగ్ టాక్సు | 1 10 | -- | 1 10 | -- | -- | |
| 6 | అక్ట్రాయి పరిహారం | 56 లక్షలు | 51 లక్షలు | 5 లక్షలు | 5 లక్షలు | | |
| 7 | వృత్తిపన్ను పరిహారం | 57 45 కోట్లు | 37 88 | 19 57 కోట్లు | 19 57 కోట్లు | 17 04 కోట్లు | |
| 8 | మునిసిపల్ సంస్థలకు బ్లాక్ గ్రాంట్లు | 31 00 | 26 70 | 4 30 | 4 30 | 4 30 | |
| 9 | మంచినీటి సరఫరా పథకాలకు | 18 00 | 18 42 | -- | 18 00 | 18 00 | |
| 10 | పౌర వసతు లకు గ్రాంట్లు | 54 00 | 25 14 | 28 86 | -- | 15 00 | |
| | **మొత్తం** | **204 02** | **117 86** | **107.19** | **60 50** | **70 47** | **కోట్లు** |

## ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్ర ప్రభుత్వ రెవిన్యూ - కోట్లలో

| సంవత్సరములు | పన్నులు | ఇతరములు ప్రభుత్వం నుండివాటా | కేంద్ర ఆదాయం | గ్రాంట్లు (కోట్లలో) | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1976-77 | 348 | 134 | 136 | 115 | 733 |
| 1980-81 | 596 | 223 | 296 | 164 | 1277 |
| 1985-86 | 1460 | 390 | 582 | 363 | 2795 |
| 1989-90 | 2427 | 716 | 902 | 475 | 4520 |
| 1992-93 | 3448 | 905 | 1505 | 1037 | 6953 |
| 1994-95 | 4227 | 948 | 1876 | 1245 | 8296 |
| 1995-96 | 4991 | 891 | 2563 | 1566 | 9555 |
| 1996-97 | 4988 | 1860 | 2883 | 1743 | 11474 |

## రాష్ట్ర ప్రభుత్వ ఆదాయ వివరాలు - కోట్లలో

| | 1991-92 | 1993-94 | 1995-96 | 1996-1997 |
|---|---|---|---|---|
| అమ్మకం పన్ను | 1673 63 | 2323 86 | 2901 26 | 4187 00 |
| రాష్ట్ర ఎక్సైజు | 811 95 | 759 42 | 77 62 | 52 00 |
| వాహనాల పన్ను | 203 36 | 300 49 | 461 43 | 544 00 |
| స్టాంపులు, రిజిస్ట్రేషన్లు | 170 04 | 222 87 | 325 62 | 480.00 |
| ల్యాండ్ రెవిన్యూ | 30 37 | 62 24 | 57 50 | 77 93 |
| వృత్తిపన్ను | 31 40 | 38 39 | 42 45 | 42 30 |
| వినోదపు పన్ను | 37 93 | 42 76 | 67 75 | 59.78 |
| ఇతరములు | 96 27 | 81 90 | 138 52 | 164 87 |
| | **3054 95** | **3832 93** | **4067 15** | **5607 88** |

## రాష్ట్ర ప్రభుత్వానికి పన్నులుకాని యితర ఆదాయాలు

| **1996-97** | | | ఖర్చు | |
|---|---|---|---|---|
| వడ్డీలు | 227 00 | కోట్లు | 1996-97 | |
| లాభాలు | 0 38 | " | రెవిన్యూ ఖర్చులు | 11,452 80 కోట్లు |

| 1996-97 | | | ఖర్చు | | |
|---|---|---|---|---|---|
| పబ్లిక్ సర్వీసు కమిషన్ | 1 21 | " | కాపిటల్ పెట్టుబడులు | 940 29 | కోట్లు |
| పోలీసు | 12 47 | " | మొత్తం | 12393 09 | కోట్లు |
| జైళ్ళు | 0 94 | " | రెవిన్యూ ఖర్చు శాతం | 92 4 | |
| పెన్షన్ల వసూళ్ళు | 10 32 | " | పెట్టుబడుల శాతం | 7 6 | |
| విద్యాశాఖ | 28 49 | " | | | |
| మెడికల్ | 16 78 | " | | | |
| నీటి సరఫరా, శానిటేషన్ | 4 38 | " | | | |
| పంటల హస్బెండ్రి | 2 81 | '2 | | | |
| అటవీశాఖ | 124 43 | " | | | |
| గనులు శాఖ | 359 70 | " | | | |
| ఇతరములు | 329 14 | " | | | |
| **మొత్తం** | **1118 03** | **కోట్లు** | | | |

## రాష్ట్ర ప్రభుత్వ రుణాలు - కోట్లలో

| | కేంద్రం నుండి | మార్కెటు నుండి | ప్రావిడెంట్ ఫండ్ | ఇతరములు | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1983-84 | 1039 | 349 | 159 | 396 | 2543 |
| 1986 | 2538 | 644 | 246 | 694 | 4122 |
| 1990 | 3774 | 1357 | 594 | 1292 | 7077 |
| 1995 | 8221 | 3047 | 1376 | 2253 | 14897 |

## మునిసిపాలిటీల ఆదాయం - లక్షల్లో

| | 1993-94 | 1994-95 | 1995-96 | |
|---|---|---|---|---|
| పన్నులు | 5612 52 | 5295 62 | 6351 01 | 17268 15 |
| పన్నులుకాని ఇతర ఆదాయాలు | 4383 95 | 4481 94 | 5625 72 | 14491 61 |
| నష్టపరిహారాలు వగైరా | 524 88 | 5230 43 | 5982 58 | 16455 81 |
| గ్రాంట్లు | 8276 59 | 7591.17 | 6583 61 | 22451 43 |
| **మొత్తం** | **23524.94** | **22599 16** | **24542 98** | **70687.06** |

## మునిసిపల్ కార్పొరేషన్ల ఆదాయాలు - లక్షల్లో

| | 1991-92 | 1992-93 | 1993-94 | మొత్తం |
|---|---|---|---|---|
| పన్నులు | 4050 23 | 4752.42 | 5379 06 | 14181 71 |
| పన్నులు ఆదాయం | 3105 92 | 3895.60 | 5206.51 | 12207 43 |
| అస్సైండ్ ఆదాయం | 4092.95 | 4875 66 | 4403 43 | 13372 04 |
| గ్రాంట్లు | 2635 94 | 2643 15 | 2723 11 | 8002 20 |
| డిపాజిట్లు | 1436 33 | 1351 26 | 2602 08 | 5389 67 |
| అర్గా | 546 66 | 466 68 | 1074 42 | 2087 76 |
| మొత్తం | 15867 43 | 17984 77 | 21388 61 | 55240 81 |



# 10. మునిసిపల్ కార్పొరేషన్ చట్టం - ముఖ్యాంశాలు

1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడేనాటికి రాష్ట్రంలో ఒకే ఒక మునిసిపల్ కార్పొరేషన్ వుంది అది హైద్రాబాద్ ఇది 1869లో ఏర్పాటయింది 1955 హైద్రాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ చట్టం అమలులోనికి వచ్చింది గత 45 సంవత్సరాల కాలంలో యీ చట్టానికి పలు సవరణలు చేశారు 1994లో 74వ రాజ్యాంగ సవరణ చట్టం అమలు తర్వాత చేసిన మార్పులు చాలా ప్రాధాన్యత కల్గివున్నాయి 1987 నుండి ప్రత్యక్ష ఎన్నికల ద్వారా మేయరు ఎన్నికను ప్రారంభించారు అంతకుముందు ఎన్నికైన కౌన్సిలర్లు సంవత్సరానికి ఒకసారి మేయర్‌ను పరోక్షంగా ఎన్నుకొనే విధానానికి స్వస్తిపలికి, ప్రత్యక్ష ఎన్నిక ప్రక్రియ ప్రారంభమయింది ఇదే విధానాన్ని మునిసిపాలిటీ ఛైర్‌పర్సన్స్‌కు వర్తింపజేశారు

## కార్పొరేషన్ చట్టంలోని కొన్ని ముఖ్యాంశాలు

1 ఏ పట్టణాన్నైనా, వార్షికాదాయం, జనాభా ప్రాతిపదికన రాష్ట్ర ప్రభుత్వం మునిసిపాలిటీ స్థాయినుండి, కార్పొరేషన్ స్థాయికి పెంచవచ్చు ఆ విధంగానే హైద్రాబాద్ తరువాత 1979లో విశాఖపట్నం, 1981లో విజయవాడ, 1994లో గుంటూరు, వరంగల్, కర్నూలు, రాజమండ్రి పట్టణాలలో కార్పొరేషన్లు ఏర్పడ్డాయి

2 హైద్రాబాద్ నగరపాలక సంస్థను గత 12 సంవత్సరాలుగా ఏదో ఒక కారణంగా ఎన్నికలు నిర్వహింపబడలేదు ఇప్పటికీ ప్రత్యేకాధికారి పరిపాలనలోనే కొనసాగుతుంది విశాఖపట్నం, విజయవాడలకు 1981లో, 1987లో, 1995లో 2000 మార్చిలో ఎన్నికలు జరుగగా, గుంటూరు, కర్నూలు, వరంగల్‌లకు 1995లోనూ, 2000 సంవత్సరాలలో ఎన్నికలు జరిగాయి కోర్టు వివాదం వుండడంతో రాజమండ్రి కార్పొరేషన్ ఎన్నికలు అసలు జరుగలేదు

3 విజయవాడ 50 డివిజన్లు, విశాఖపట్నం 50, గుంటూరు 50, వరంగల్ 44, కర్నూలు 44 డివిజన్లలో విభజింపబడినవి

**1. పాలనాధికార సంస్థలు** 1) కౌన్సిల్ 2) స్థాయీ సంఘం 3) కమిషనర్ 4) వార్డు కమిటీలు పాలనాధికారుల్లో ప్రత్యక్షంగా ఎన్నికైన మేయరు లేకపోవటం పెద్ద లోపంగా భావించ బడుతుంది

**2. కౌన్సిల్ సభ్యత్వం** ఎన్నికైన కౌన్సిలర్లు, ఆ ప్రాంతంలో ఎన్నికైన శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు, ఎక్స్ అఫీషియో సభ్యులుగా వుందురు వారికి ఓటుహక్కు కలదు స్థానిక సంస్థల ఎన్నిక నిర్వహణ రాష్ట్ర ప్రభుత్వ పరిధినుండి తొలగించబడి రాష్ట్ర ఎన్నికల కమిషన్‌కు అప్పగించబడింది ప్రతి 5 సంవత్సరాలకొకసారి విధిగా ఎన్నికలు నిర్వహించుచున్నారు మైనారిటీలనుండి ఇద్దరు, మునిసిపల్ పరిపాలనలో

అనుభవం గల రిటైర్డ్ గెజిటెడ్ ఆఫీసర్లు, 5 సంవత్సరాలు గతంలో కౌన్సిలర్‌గా పనిచేసినవారు ఐదుగురను కౌన్సిల్ కో-ఆప్ట్ చేసుకుంటుంది అయితే వీరికి ఓటు హక్కు లేదు ఇందులో ఇద్దరు మహిళ లుండాలి

3 **మేయర్ విధులు, అధికారాలు** మేయర్ కౌన్సిల్ సమావేశాలను పిలవటం, సమావేశానికి అధ్యక్షత వహించి సభను నిర్వహించటం, మినిట్సుపై సంతకం చేయటం తప్ప వేరే అధికారాలు లేవు దరిమిలా చేసిన ఆందోళనవల్ల 1996లో దిగువ అధికారాలు మేయర్లకు కల్పించారు

ఎ) రు 50,000లోపు ఏవైనా పనులు మంజూరు చేయవచ్చు బి) ఉద్యోగులపై ఆంతరంగిక అజమాయిషీ సి) అంతర్గత బదిలీలు చేయుటలో కమిషనర్, మేయరును విధిగా సంప్రదించాలి

ఎన్నికైన సభ్యులనుండి ఒకరిని డిప్యూటీ మేయరుగా ఎన్నుకోవాలి పదవీకాలం 5 సం॥రాలు కౌన్సిల్ పదవీకాలం 5 సం॥రాలు

## స్థాయీ సంఘం :

**వార్డ్సు కమిటీలు** ప్రతి పది డివిజన్లకు ఒక వార్డు కమిటీ ఏర్పడి అందులోనుండి ఒక ఛైర్‌పర్సన్‌ని ఎన్నుకోవాలి ఆ విధంగా 5 కమిటీలనుండి ఎన్నికైన ఛైర్‌పర్సన్స్ స్థాయీ సంఘంగా ఏర్పడును 5గురిలోనుండి ఒకరిని స్థాయీసంఘ అధ్యక్షులుగా ఎన్నుకోవాలి వీరి పదవీకాలం ఒక సంవత్సరం కౌన్సిల్ తరువాత స్థాయీసంఘం విశేషాధికారాలతో 10 నుండి 50 లక్షల రూపాయలలోపు అంచనాలుగల పనులు మంజూరుచేయగలదు అంచనాల మంజూరు, టెండర్ల ఆమోదం 3, 4 తరగతుల ఉద్యోగాల ప్రమోషన్ వగైరాలను నిర్ణయించుతుంది ఈ కమిటీ సాధారణంగా వారానికి ఒకసారైనా సమావేశం కావాలి చట్టం విధించిన బాధ్యతల నిర్వహణకు కౌన్సిల్ కొన్ని ప్రత్యేక కమిటీలను ఏర్పరచవచ్చు ఉదా . వాటరు సప్లయ్, డ్రైనేజీ, ప్రజాపనులు, పార్కులు, విద్యాలయాలు, క్రీడలు, మురికివాడల అభివృద్ధి వగైరా అంశాలను చర్చించి కౌన్సిల్‌కు సిఫార్సులు చేయుటకుగాను, ఈ కమిటీలు ఒక సంవత్సరకాలం పదవిలో వుంటాయి

కార్పొరేషన్‌కు సంబంధించి ఏదేని ప్రత్యేక అంశాన్ని లోతుగా పరిశీలించి కౌన్సిల్‌కు నివేదికను సమర్పించుటకు అడ్‌హాక్ కమిటీని ఏర్పరచవచ్చు దీని సిఫార్సులు కూడా కౌన్సిల్ చర్చించి నిర్ణయాలు చేయాలి వార్డు కమిటీలు నెలకు రెండుసార్లు సమావేశమై వారి వారి డివిజన్లలోని సమస్యలను చర్చించి, వారి నిర్ణయాలను కౌన్సిల్ ఆమోదానికి నివేదించాలి

**కమిషనర్** ప్రభుత్వంచే నియమించబడి సాధారణంగా 3 సంవత్సరాలు బాధ్యతలు నిర్వహించును కార్పొరేషన్ ముఖ్య కార్యనిర్వాహక అధికారిగా విస్తృతమైన అధికారాలు

కల్గివుండును అయితే కౌన్సిల్ 3/5 మెజారిటీతో వీరిని ఉపసంహరించమని ప్రభుత్వాన్ని కోరవచ్చు

మొత్తం అధికారాలు, ఉద్యోగాలు, కార్మికులందరిపైన అజమాయిషీ, అధికారం, ఆస్తిపన్ను విధింపు, వసూళ్ళు, భవన నిర్మాణ ప్లానుల మంజూరు, వ్యాపారులకు లైసెన్సులు మంజూరు, మంచినీటి కుళాయిలు, డ్రైనేజీ కనెక్షన్లు, కౌన్సిల్ తరపున ఉత్తర ప్రత్యుత్తరాలు, 10 లక్షల రూపాయలలోపు అత్యవసర పనులు మంజూరు చేసే అధికారం, శానిటేషన్, పార్కులు వగైరా నిర్వహణా బాధ్యతల అధికారం వీరికి కలదు వీరికి సహాయకులుగా అడిషనల్, డిప్యూటీ కమిషనర్లు, సెక్రటరీ, ఎగ్జామినర్ ఆఫ్ ఎక్కౌంట్లు, వారి అసిస్టెంట్లు, ఎక్కౌంటు ఆఫీసర్, ఇంజనీర్లు, హెల్తు ఆఫీసర్లు, విద్యాధికారి, ఉద్యానవన అసిస్టెంటు డైరెక్టర్, సిటీ ప్లానరు, వారి అసిస్టెంట్లు, మలేరియా నిర్మూలనాధికారి, బయాలజిస్టు, అసిస్టెంటు వెటర్నరీ సర్జన్లు వగైరాల ద్వారా వివిధ కార్యక్రమాలు, పనులు నిర్వహించును వారిపై కొంతస్థాయివరకు క్రమశిక్షణా చర్యలు తీసుకొనుటకు కూడా అధికారం కల్గివుండును

**రాజీనామాలు** · మేయరు తన పదవికి రాజీనామా చేయదలచినచో కౌన్సిల్‌కు సమర్పించాలి డిప్యూటీ మేయరు, సభ్యులు తమ రాజీనామాలను మేయరుకు సమర్పించాలి

**కౌన్సిలరు అధికారాలు** . ఎ) కార్పొరేషన్‌కు సంబంధించి ఎలాంటి ఫిర్యాదులైనా లేదా ఏదైనా జరుగుతున్న లోపాలను గురించి నష్టాన్ని గురించిగాని కౌన్సిలర్లు కమిషనర్ దృష్టికి తీసుకొనివెళ్ళవచ్చు

బి) కార్పొరేషన్‌కు సంబంధించి ఏదైనా ప్రతిపాదనలు కౌన్సిల్ ఆలోచనకు, నిర్ణయానికి గాను ప్రవేశపెట్టవచ్చు

సి) కార్పొరేషన్‌కు సంబంధించి ఏ వివరాలనైనా ప్రశ్నలద్వారా అడిగి తెలుసుకోవచ్చు

డి) కౌన్సిల్ సమావేశాల్లో సభా నియమాలకు లోబడి ఆయా అంశాలపై జరుగు చర్చలలో పాల్గొనవచ్చు

కౌన్సిల్ సమావేశాలకు మేయర్ అధ్యక్షత వహించును వారు లేనప్పుడు డిప్యూటీ మేయరు లేదా స్థాయీసంఘం అధ్యక్షులు, లేనప్పుడు హాజరైన సభ్యులలో ఒకరిని అధ్యక్షత వహించమని కోరవచ్చు

ఏదైనా అత్యవసర సమస్య చర్చకు కౌన్సిల్ అర్జంటు సమావేశం ఏర్పాటుచేయవల సిందిగా మొత్తం కౌన్సిల్ సభ్యుల్లో 6వ వంతుమంది రిక్విజిషన్ నోటీసు మేయరుకు ఇవ్వవచ్చు కౌన్సిల్ కోరం-12, స్థాయీసంఘం కోరం-3, స్పెషల్ కమిటీల కోరం-సగంమంది ఖచ్చితంగా 7 రోజులు (నోటీసు ఇచ్చిన తేదీ - సమావేశం జరుగు తేదీ కాకుండా) నోటీసులు కౌన్సిల్ సమావేశం నోటీసు సభ్యులకు యివ్వాలి

కౌన్సిల్ ఎజెండా మేయర్ అజమాయిషీతో రూపొందును కమిషనర్ ఆఫీసు అంశాలు కౌన్సిల్ సమావేశం ముందుగా ఎప్పుడైనా మేయరు అనుమతితో ఇవ్వవచ్చు 122 సెక్షన్ క్రింద ప్రశ్నలకు సమాధానాలు, చర్చలకు ఒక గంట మాత్రం సమయం నిర్ణయించాలి సాధారణంగా ఎజెండా అంశాలు చర్చ తర్వాత ఏకగ్రీవంగా గాని లేదా మెజారిటీగా గాని నిర్ణయం జరగాలి

ఎజెండా అంశాలలో లేని ఏదైనా అత్యవసర అంశం చర్చించాలని ఎవరైనా సభ్యుడు కోరితే సమావేశపు అనుమతితో ఆ అంశాన్ని ఎజెండాలో చేర్చవచ్చు అలాగే సమావేశ తేదీకి 3 రోజుల ముందుగా సభ్యులు తమ ప్రతిపాదనలను సెక్రటరీకి యివ్వవచ్చు ప్రశ్నలు యివ్వకూడదు సమావేశపు అనుమతితో మాత్రమే మేయరు సమావేశాన్ని వాయిదా వేయగలరు

సభ్యులు అసభ్యంగా ప్రవర్తించినా, అధ్యక్షుని ఆదేశాలు పదే పదే ధిక్కరించినా, సభ సజావుగా సాగకుండా అడ్డుకుంటున్నా, సమావేశం నుండి అట్టి సభ్యుడిని సభాధ్యక్షులు సస్పెండు చేసి బయటకు పంపవచ్చు

## కార్పొరేషన్ తప్పనిసరి విధులు :

1 కార్పొరేషన్ పరిధిని, సరిహద్దులను నిర్ణయించుట
2 అన్ని వీధులను నిర్వహించుట, నీరు పెట్టుట, ఊడ్చిన చెత్తాచెదారాన్ని తొలగించుట
3 మురుగునీటిని నిరభ్యంతర ప్రదేశానికి పంపుట, కంపోస్టు ఎరువులు తయారు చేయుట
4 డ్రైన్స్ నిర్మాణం, వాటిని నిత్యం శుభ్రపరచుట, పబ్లిక్ లెట్రిన్స్, మూత్రశాలల నిర్మాణం, సక్రమ నిర్వహణ
5 మునిసిపల్ భవనాలు, మార్కెట్లు, వీధులలో దీపాల ఏర్పాటు
6 కార్పొరేషన్‌కు చెందిన భవనాలు, మునిసిపల్ కార్యాలయాలు, పురాతన జ్ఞాపక చిహ్నాలు, ఖాళీస్థలాలను కాపాడుట
7 వీధులకు పేర్లు పెట్టుట, ఇండ్లకు నెంబర్లు వేయుట
8 ప్రమాదకరమైన వ్యాపారాలను క్రమబద్ధీకరణ చేయుట, లైసెన్సు ఫీజు విధించి వసూలు చేయటం
9 మృతుల శవాల దహనానికి ఏర్పాటు
10 మార్కెట్లు, కబేళాలు ఏర్పాటు, సక్రమ నిర్వహణ
11 పశువులకు బందెల దొడ్డి
12 వ్యాధులు సోకకుండా పెద్దలకు, పిన్నలకు టీకాలు వేయుట
13 ప్రజలకు అపకారం కల్గించు చెట్లు, గడ్డి వగైరాలు తొలగించుట

14 జనన మరణాల నమోదు

15 వీధుల అభివృద్ధి, వంతెనలు, కల్వర్టుల నిర్మాణం, సబ్‌వేలు వగైరాల ఏర్పాటు

16 వీధులలోనికి చొచ్చుకువచ్చే ఆక్రమణల తొలగింపు

17 జనాభాకు సరిపడినంతగా మంచినీటి సరఫరా ఏర్పాటుచేయటం

18 అంటువ్యాధుల నివారణ

19 ప్రమాదకరమైన భవనాలను తొలగించుట

20 నగరాభివృద్ధికి చర్యలు

21 పబ్లిక్ పార్కులు, తోటలు, క్రీడా, ఆటస్థలాల ఏర్పాటు, ప్రజావినోద కాలక్షేపాలకు అనువైన ప్రదేశాల ఏర్పాటు

22 ఈ చట్టం, దీని ననుసరించి చేసిన రూల్సు ప్రకారం పలు విధులను నిర్వహించవలసి వుంటుంది

23 ఆర్థిక పరిస్థితిని బట్టి నిరాధారులైన క్షామం, వరదలు, బాధితులను ఆదుకోవటానికి చర్యలు చేపట్టవచ్చు

24 పిచ్చికుక్కలు కరిచినవారికి వ్యాధి నివారణ యింజక్షన్లు యివ్వటం, పిచ్చివారికి ఆశ్రమ ఏర్పాట్లు చేయాలి

ఆర్థిక అవకాశాలనుబట్టి మరొక 40 అంశాలకు కార్పొరేషన్ చేపట్టవచ్చు

**మంజూరు అధికారాలు** ·

**వ్యయం** · 10 లక్షల రూపాయలలోపు వ్యయంగల పనులను కమిషనర్ మంజూరు చేయవచ్చును

బి) 10 నుండి 50 లక్షల రూపాయలలోపు పనులను స్థాయీసంఘం మంజూరు చేస్తుంది

సి) రు 50 లక్షలకు పైగాగల అంచనాలను, పనులను ప్రభుత్వ ఆమోదంతో మాత్రమే కౌన్సిల్ అమలుజరుపవచ్చును

**ఎగ్జామినర్ ఆఫ్ ఎకౌంట్స్**

అమలులోవున్న విధులు, నిబంధనల ప్రకారం కార్పొరేషన్ జమలు, ఖర్చులను ఆడిట్ చేయును 1994 ముందు ఇతడు స్వతంత్ర అధికారి దరిమిలా, కమిషనరుకు లోబడి వుండేవిధంగా చట్టంలో సవరించారు ఇది సరైన చర్యకాదు

మునిసిపల్ సెక్రటరీ, కౌన్సిల్ సమావేశాలకు మేయర్‌గారి సలహాతో ఎజెండా తయారు చేయటం, నోటీసులివ్వటం, స్థాయీసంఘం కార్పొరేషన్ నియమించిన అన్ని కమిటీల మినిట్సు, ప్రొసీడింగ్స్ తదితర ప్రొసెసింగ్‌ను సంబంధిత శాఖలకు తెలియచేయుట

**బడ్జెట్** .

ఆ సంవత్సరానికి సంబంధించిన ఆదాయ, వ్యయాలు, రానున్న సంవత్సరానికి ఆదాయ

వ్యయాలు కమిషనర్ ప్రతి సంవత్సరం నవంబరు 10వ తేదీలోగా తయారుచేసి స్థాయీ సంఘం ముందుంచాలి స్థాయీసంఘంవారు వారికి కావలసిన సమాచారాన్ని కమిషనర్ తదితర శాఖల నుండి పొంది, వారు అవసరమనుకున్న సవరణలతో 15 డిసెంబరులోగా కార్పొరేషన్ సభ్యులందరకు పంపించాలి జనవరి 10నగాని, అంతకు ముందుగాని కౌన్సిల్ ప్రత్యేక సమావేశంలో బడ్జెట్‌ను స్థాయీసంఘం అధ్యక్షులు ప్రవేశపెట్టాలి అదే సమావేశంలో గాని, వాయిదా పడిన సమావేశంలోగాని ఈ రివైజ్డ్ బడ్జెట్‌ను, రానున్న సంవత్సరం ఆదాయ, వ్యయ అంచనాలను ఫిబ్రవరి 20లోగా ఆమోదించాలి వీటిని రాష్ట్రప్రభుత్వానికి పంపించాలి దరిమిలా అవసరాలనుబట్టి బడ్జెట్‌లో కేటాయింపులు కొంతమేరకు స్థాయీసంఘం, మిగతా వాటిని కౌన్సిల్ ఆమోదంతో మార్పులు చేయవచ్చు కార్పొరేషన్‌లో ఏ పనీ, కార్యక్రమం నిర్వహించబడినా దానికి బడ్జెట్‌లో కేటాయింపు ఉండాలి బడ్జెట్‌లో పొందుపరచని పనులను, కార్యక్రమాలను నిధుల కేటాయింపుకు, కౌన్సిల్ ఆమోదం విధిగా ఉండాలి బడ్జెట్ కేటాయింపులో లేని పనులు చేయరాదు బిల్లులు పాస్ కాకూడదు చెల్లింపులు చేయరాదు

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ బడ్జెట్‌వలే, కార్పొరేషన్ బడ్జెట్‌లో ఏనాడు లోటు బడ్జెట్‌లుగా ఉండటానికి వీలులేదు సెక్షన్ 184 ప్రకారం బడ్జెట్ ఆదాయంలో (గ్రాంట్లు, అప్పులు వగైరాలు కాకుండా) కనీసం 5% రానున్న సంవత్సరానికి ప్రారంభనిల్వగా ఉంచితీరాలి

**అస్తులు కొనుగోలు, అమ్మకం :**

కార్పొరేషన్ పనులకు అవసరమైన భూసేకరణ నిబంధనల మేరకు కమిషనర్ కొనుగోలు చేయవచ్చు లేదా ఆ భూముల యజమానులతో ముఖాముఖి సంప్రదించి, ధరను నిర్ణయించి కొనుగోలు చేయవచ్చు

అదేవిధంగా కార్పొరేషన్ ఆస్తులను, స్థాయీసంఘం లేదా కౌన్సిల్ - కొన్ని సందర్భాలలో ప్రభుత్వ ఆమోదంతో పొంది బహిరంగ వేలంద్వారా అమ్మవచ్చు

స్థానిక సంస్థల ఆర్థిక పరిపుష్టికి, అభివృద్ధి కార్యక్రమ అమలుకు రాష్ట్రాదాయం నుండి స్థానిక సంస్థలకు నిధులు, విధిగా కేటాయింపులు చేసేందుకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక కమీషన్ ఏర్పాటు

**పన్నులు :**

ప్రభుత్వం ఇచ్చిన అధికారంతో - కార్పొరేషన్ దిగువ పన్నులు విధించి వసూలు చేయును

1) భూములు, భవనాలమీద పన్ను (ఆస్తిపన్ను)
2) ఆక్ట్రాయి (మన రాష్ట్రంలో లేదు)
3) వాహనాలమీద పన్ను
4) అడ్వర్టయిజ్‌మెంట్ల పన్ను

5) ఆస్తుల బదిలీలపై సర్‌ఛార్జి

6) వినోద కార్యక్రమాలపై థియేటర్ల పన్ను

**ఆస్తిపన్నులో దిగువ సౌకర్యాలకు పన్నులు చేర్చబడినవి**

ఎ) సాధారణ పన్ను బి) నీటిపన్ను సి) డ్రైనేజీ పన్ను డి) శానిటరీ పన్ను, లైటింగ్ పన్ను మరియు లైబ్రరీ సెస్, రూపాయికి 8 పైసలు చొప్పున

పై మొత్తం ఆస్తిపన్నుగా - కార్పొరేషన్ తీర్మానం ద్వారా నివాస భవనాలకు - 15 నుండి 25 శాతంలోపు, నివాసేతర భవనాలకు - 30 శాతం వరకు పన్ను విధించవచ్చు ప్రతి సంవత్సరం బడ్జెట్ ఆమోద సందర్భంగా పన్ను రేటును నిర్ణయించాలి

**ఆస్తిపన్నుల విధింపుకు మినహాయింపు ఎవరికి?**

1 దహన సంస్కారాలకు వినియోగించబడు స్థలాలు

2 పూజలకు, ధర్మకార్యాలకు వినియోగించబడు భవనాలు

3 ప్రభుత్వ సహాయంతోగాని, ధార్మిక సంస్థల సహాయంతోగాని నడిపే 10వ తరగతిలోపు పాఠశాలల భవనాలు

4 కేంద్ర ప్రభుత్వ ఆస్తులు

5 రాష్ట్ర ప్రభుత్వ భవనాలు అయితే, రాష్ట్ర ప్రభుత్వ భవనాలపై పన్నుకు బదులుగా ఈ పద్దుకింద రాష్ట్ర ప్రభుత్వం గ్రాంటు ఇస్తుంది. ప్రతి 5 సంవత్సరాలకొకసారి ఈ గ్రాంటును ఆనాటి అంచనాలను బట్టి సవరించాలి కాని గత 35 సంవత్సరాలుగా సవరణ జరగలేదు

6 సంవత్సరానికి 300 రూపాయల విలువలోపు అద్దె విలువగల ఇళ్ళు, పాకలు వగైరా

7 పేద ప్రజలకు, ప్రభుత్వం నిధులతో నిర్మించే గృహవసతికి ప్రతి అర్థసంవత్సరానికి ఒక రూపాయిమాత్రమే పన్నుగా వసూలు చేయాలి

## కార్పొరేషన్‌పై కంట్రోలు

1 కార్పొరేషన్, స్థాయీసంఘం తీర్మానాలతో సహా ఏ సమాచారాన్నైనా రాష్ట్ర ప్రభుత్వం కోరవచ్చు

2. రికార్డులుగాని, జరుగుతున్న పనులనుగాని తనిఖీ చేయుటకు రాష్ట్ర ప్రభుత్వం అధికారిని పంపించవచ్చు

3 చట్టం ప్రకారం జరుగవలసిన పనులు జరగకపోయినా, అసంతృప్తిగా జరుగుతున్నా, లేదా జరుగు పనులను పూర్తిచేయుటకు, ఆ పనులను బడ్జెట్‌లో చేర్చుటకు ప్రభుత్వం ఉత్తర్వులను జారీచేయవచ్చు

4 పై విధంగా ఇచ్చిన ఆదేశాలు అమలుజరగనట్లయితే వాటిని నిర్వహించుటకు తాత్కాలికంగా ఒక ప్రత్యేక అధికారికి బాధ్యతలు అప్పగించవచ్చు

5 కార్పొరేషన్ చేసిన తీర్మానాలుగాని, పనులుగాని, చట్టపరిధికి మించి ఉన్నప్పుడు లేదా వాటి అమలువల్ల శాంతిభద్రతలకు విఘాతం కలుగునని భావించినపుడు అట్టి తీర్మానాలను లేక పనులను ఆపివేయవలసినదిగా ఆదేశించవచ్చు

6 ప్రభుత్వం తనంతట తానుగానీ, లేదా కౌన్సిల్ సభ్యులు, మేయర్ లేక కమిషనర్ కోరినపుడు ఏదేని తీర్మానాలను సస్పెండ్ చేసి తదుపరి రద్దుచేసే అధికారం కలదు

7 ప్రభుత్వం తనంతట తానుగాని, లేదా మేయరు, డిప్యూటీ మేయరు, సభ్యుడుగాని, కమిషనరుగారు ఫిర్యాదును పురస్కరించుకుని మేయరును, డిప్యూటీ మేయరును, సభ్యులను వారు అక్రమంగా ప్రవర్తించినా, ఆఫీసర్లు, ఉద్యోగి, లేదా తోటి సభ్యులను కొట్టినా, దుర్భాషలాడినా కార్పొరేషన్ ఆస్తికి నష్టం కలిగించినా తన పదవి దుర్వినియోగం చేశారని ప్రభుత్వం భావించినపుడు మేయర్, డిప్యూటీ మేయర్, సభ్యులను సస్పెండ్ చేయవచ్చు

8 మేయర్‌ను, డిప్యూటీ మేయర్‌ను తొలగించవచ్చు స్థాయీసంఘాన్ని రద్దు చేయవచ్చు

9 కార్పొరేషన్‌ను రద్దుచేయుటకు అధికారం గలదు పై చర్యలకు దిగినపుడు ముందుగా ఆ చర్యలు ఎందుకు తీసుకోవలసి వచ్చిందో సవివరమైన సంజాయిషీ నోటీసు ఇచ్చి గడువు లోపల సంజాయిషీ రాకపోయినా, లేక ఇచ్చిన సంజాయిషీ సంతృప్తికరంగా లేనట్లయితే శిక్షణా చర్యలను ప్రభుత్వం తీసుకునే అధికారం కలదు

ప్రస్తుతం అమలులోనున్న కార్పొరేషన్ చట్టంవల్ల నగరపాలనలో ప్రత్యక్షంగా లక్షలాది మంది నగర ఓటర్లచేత ఎన్నుకోబడిన మేయరుకుగాని, లేదా కౌన్సిల్‌కుగాని, స్వయం పరిపాలనకు తగినన్ని అధికారాలు రాష్ట్ర ప్రభుత్వం కల్పించుటలేదు హెచ్చు భాగం అధికారాలు చెలాయించే కమిషనరు ముఖ్య కార్యనిర్వాహక అధికారిగా వుండటంతో ప్రజాప్రతినిధులకు సరైన ప్రతిపత్తిగాని, అవకాశాలుగాని లేవని చాలాకాలంగా ప్రజా ప్రతినిధులు విజ్ఞప్తులు చేస్తున్నారు

ఇటీవల వరకు కమిషనరు ఎవ్వరితో నిమిత్తం లేకుండా రు 20 లక్షల రూపాయల లోపు పనులను మంజూరుచేసే అధికారం కల్గివున్నారు మేయర్లు చేసిన అభ్యర్థనల మూలంగా, ఆ మొత్తాన్ని 10 లక్షలకు ఎగ్జిక్యూటివ్ ఉత్తర్వుల ద్వారా తగ్గించటం జరిగింది గత అయిదారు సంవత్సరాల ఆందోళనలు, చర్యల ద్వారా మేయరుకు రు 50,000/-ల వరకు అవసర పరిస్థితుల్లో ఏవైనా పనులను మంజూరు చేసేందుకు అధికారం కల్పిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు యిచ్చింది అంతర్గత బదిలీలు చేయునప్పుడు కమిషనరు మేయరును విధిగా సంప్రదించాలి అలాగే మేయరుకు కార్పొరేషన్ ఉద్యోగులపై జనరల్ అజమాయిషీకిగాను అవకాశం కల్పిస్తూ ఉత్తర్వులు యివ్వబడినాయి పైన పేర్కొన్న మార్పులకు యింతవరకు చట్టబద్ధత కల్పించబడలేదు

అనేక అంశాలమీద కమిషనరు రాష్ట్ర ప్రభుత్వంతోను, యితర శాఖాధికారులతోను ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతుంటారు అలాగే కార్పొరేషన్ చేసిన నిర్ణయాలమీద, ఎదుర్కొంటున్న అన్ని సమస్యలపైన కమిషనరు ప్రభుత్వానికి తన అభిప్రాయాలను తెలియ చేస్తుంటారు అలాగే ప్రభుత్వం కూడా చాలా విషయాలమీద వివరణలు కోరుతూ వుంటారు వాటినన్నింటికి కమిషనర్ జవాబులు వ్రాస్తుంటారు కాని, పై అంశాలేవీ మేయరుకు తెలియవు ఇది చాలా ఆశ్చర్యం కలిగించే విషయం మునిసిపాలిటీలో జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలను ఛైర్‌పర్సన్ పేరుమీద, ఆయన/ఆమె ద్వారా జరగాలి కాని, అదే విధానాన్ని కార్పొరేషన్‌లో అమలుచేయండని కొన్ని సంవత్సరాలుగా కోరుతున్నా రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించకపోవటం శోచనీయం

74వ రాజ్యాంగ సవరణ చట్టం ఆదేశించిన విధంగా ఎన్నికైన ప్రజాప్రతినిధులకు స్థానిక సంస్థలలో నిజమైన స్వయం పరిపాలనకు అవసరమైన సవరణలు కార్పొరేషన్ చట్టంలో చేయబడలేదు 1994 ఆఖరులో 74వ రాజ్యాంగ సవరణ చట్టంలోని కొన్ని ప్రధానమైన అంశాలను చేర్చారు తప్ప, అన్ని క్లాజులు చేర్చలేదు రాష్ట్రంలో మొదటిగావున్న హైద్రాబాద్ కార్పొరేషన్‌కు మాత్రం 1955లో చట్టం రూపొందించి, అమలుజరుపుతున్నారు దరిమిలా ఆవిర్భవించిన విశాఖపట్నం, విజయవాడలకు వాటి అవతరణకు వీలుగా విశాఖపట్నం మునిసిపల్ కార్పొరేషన్ చట్టం, విజయవాడ మునిసిపల్ కార్పొరేషన్ చట్టాలను ఆమోదించారు గుంటూరు, వరంగల్, రాజమండ్రి, కర్నూలు కార్పొరేషన్‌లన్ని హైద్రాబాద్ చట్టం, దాని నిబంధనల క్రిందనే పరిపాలన సాగిస్తున్నాయి ఇదొక విచిత్ర పరిస్థితి ఆంధ్రప్రదేశ్‌లో యిప్పటివరకు గల కార్పొరేషన్లకు, యికముందు రాబోవు కార్పొరేషన్లకు వర్తించేవిధంగా ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ కార్పొరేషన్ చట్టం రూపొందించాలని - అది తెలుగులో - (ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టం 1965లాగా) దీర్ఘకాలంగా కోరుతున్నా యింతవరకు ప్రభుత్వం ఆమోదించలేదు అందుచేతనే హైద్రాబాద్ కార్పొరేషన్ చట్ట నిబంధనలు, రూల్సు యితర అన్ని కార్పొరేషన్లు అనుసరించవలసివచ్చింది

వాస్తవ స్వయంపాలన జరగాలంటే, ప్రస్తుత చట్టంలో మౌలికమైన మార్పులు తేవాలి ఈ దిశగా జరిగిన కృషి ఫలప్రదం కాలేదు

పశ్చిమ బెంగాల్ - కలకత్తా నగరంలో 1986 నుండి అమలుజరుగుతున్న మేయర్-ఇన్-కౌన్సిల్ విధానాన్ని మన రాష్ట్రంలో కూడా అమలుచేయాలని దీర్ఘకాలంగా విజ్ఞప్తులు చేయటం జరిగింది అత్యంత ప్రజాస్వామ్యయుతమైన, కార్పొరేషన్‌కు సంబంధించిన అన్ని అంశాలపై ప్రజాప్రతినిధులకే సర్వాధికారం యీ విధానం ద్వారా అమలులోనికి వచ్చింది అఖిల భారత మేయర్ల సమితి గత 15 ఏండ్లుగా వివిధ రాష్ట్ర ప్రభుత్వాలను యీ విధానాన్ని అమలుజరపాలని కోరుతున్నారు అందుకుగాను 'మాడల్ చట్టాన్ని' కూడా రూపొందించి అన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు పంపించి, దాని నాధారంగా కార్పొరేషన్ చట్టాలను మార్పు చేయాలని కోరారు

**ఈ విధానం ప్రకారం రాగల మార్పులు :**

1 కార్పొరేషన్ పరిపాలన యావత్తు మేయర్-ఇన్-కౌన్సిల్ ద్వారానే జరుగుతుంది

2 ఎన్నికైన మేయరు సభ్యులనుండి పది పదిహేనుమందికి మించకుండా వివిధ శాఖలు - నీరు, డ్రైనేజీ, పబ్లిక్ వర్క్స్, రెవిన్యూ, శానిటేషన్, ఆరోగ్యం, క్రీడలు, టౌన్ ప్లానింగ్ వగైరా శాఖలకు కేటాయించి, బాధ్యతలు అప్పగించుదురు అనగా రాష్ట్ర ప్రభుత్వంలో ముఖ్యమంత్రి, మంత్రిమండలిని ఏర్పర్చి వివిధ శాఖలకు కేటాయించినట్లుగానే మేయరు కూడా శాఖలను కేటాయించి, బాధ్యతలు అప్పగించెదరు

ఆ విధానంలో కమిషనరు సెక్రటరీగా వుండి, మేయర్-ఇన్-కౌన్సిల్ చేసిన నిర్ణయాలను అధికారవర్గం, ఉద్యోగుల ద్వారా అమలుజరుపుతారు ఎప్పటికప్పుడు నివేదికలను మేయర్-ఇన్-కౌన్సిల్‌కు సమర్పించుతారు

కౌన్సిల్ సమావేశాలను మేయరు నిర్వహించరు ఇందుకొరకు విడిగా కౌన్సిల్ ఛైర్మన్‌ను ఎన్నికచేస్తారు శాసనసభ స్పీకరులాగా వారే సమావేశాలు నిర్వహిస్తారు పన్నుల రివిజన్‌గాని, ఉద్యోగుల నియామకంగాని, ప్రమోషన్లుగాని, భవన నిర్మాణ ప్లాన్లు మంజూరు లైసెన్సులు మంజూరులాంటి అనేకానేక కర్తవ్యాలకు సంబంధించిన నిర్ణయాలు మేయర్-ఇన్-కౌన్సిల్ చేస్తుంది

కమిషనరును నియమించేటప్పుడు రాష్ట్ర ప్రభుత్వం మేయరును విధిగా సంప్రదించాలి వాస్తవ స్వయంపాలనకు ప్రయోజనకరంగా వున్న యీ విధానాన్ని 1998లో మహారాష్ట్రలో ముంబాయి, నాగపూర్ కార్పొరేషన్లలో ప్రవేశపెట్టారు ఇప్పుడు మధ్యప్రదేశ్ రాష్ట్రంలో కూడా యీ విధానాన్ని అమలుజరుపుటకు ప్రభుత్వం నిర్ణయించింది

మన రాష్ట్రంలో కూడా యిదే విధానాన్ని అవలంబించాలని దీర్ఘకాలంగా కోరుతున్న పర్యవసానంగా, కార్పొరేషన్ పరిపాలనలో తీసుకుని రావలసిన మార్పులను - అందులో మేయర్-ఇన్-కౌన్సిల్ విధానాన్ని కూడా పరిశీలించి పరిపాలనను మరింత ప్రజాతంత్రం చేయడానికి సిఫార్సులు చేయవలసిందిగా ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది కాని ఆ ఉత్తర్వులు ఫైలులోనే వుండిపోయాయి ఆ క్యాబినెట్ కమిటీ సమావేశం కూడా జరుగలేదు ఇదొక దురదృష్టకర సంఘటన

ప్రస్తుతం కార్పొరేషన్ కమిషనరు చుట్టూ పరిభ్రమించే పరిపాలన, అనేక విషయాల్లో స్వంత నిర్ణయాలుచేసి అమలుజరుపుటకు అవకాశాలులేని పరిపాలన

1 కార్పొరేషన్‌లోగల అధికార, ఉద్యోగులపై ఎలాంటి చర్యలు - క్రమశిక్షణ లేక సస్పెండు, బదిలీ వగైరా చేసే అధికారాలు లేవు

2 ఉద్యోగాలలో రిటైర్‌మెంటు లేదా మరణంవల్ల కలిగే ఖాళీలను భర్తీచేసుకునే అధికారం లేదు

3 సమర్థవంతమైన, విస్తృతమైన వివిధ సర్వీసుల సక్రమ నిర్వహణకు అవసరమైన సిబ్బందిని నియమించుకునే అధికారం లేదు

4 శానిటేషన్ మెరుగుదలకు అవసరమయిన శానిటేషన్ స్టాఫ్‌నుగాని, లేదా అవసరమయిన వాహనాల కొనుగోలుకుగాని అధికారం లేదు

5 పనుల్లోగాని, పరిపాలనలోగాని జరిగే అవకతవకలు, అవినీతి చర్యలు లేదా నష్టాలు కల్గించే అధికారులపైగాని, ఉద్యోగులపైగాని ఎలాంటి క్రమశిక్షణా చర్యలు తీసుకునే అధికారం లేదు

6 యాభై లక్షల రూపాయలకుపైగా విలువగల అంచనాలను, ప్రతిపాదనలను ప్రభుత్వ ఆమోదంపొందిన తర్వాతనే, అమలుజరపాలి ఈ ఆమోదం పొందటానికి కొన్ని సందర్భాలలో నెలలు, సంవత్సరాలు గడుస్తుంటాయి కాలహరణ కారణంగా అంచనాలు పెరిగి, ఆర్థిక భారం పడే ప్రమాదం చోటుచేసుకున్నాయి

7 తన స్వంత ఆస్తులను అమ్మాలన్నా లేదా కొత్తగా కొనాలన్నా లేదా కొన్ని భారీ పథకాలను అమలుజరపాలన్నా, వాటికి నిధులు సమకూర్చుకోవాలన్నా - అన్నింటికి ముందు ప్రభుత్వ అనుమతి కావాలి హడ్కో వగైరా సంస్థల నుండి రుణాలు పొందాలంటే, రాష్ట్ర ప్రభుత్వ గ్యారంటీ వుండి తీరాలి

ఆ విధంగా దైనందిన వ్యవహారాలనుండి, భారీ వ్యవహారాలవరకు ప్రభుత్వానుమతితో స్థానిక సంస్థలు స్వయంపాలక సంస్థలుగా వ్యవహరించటానికి వీలుకలుగటంలేదు అంతమాత్రాన కార్పొరేషన్లు సర్వ స్వతంత్ర సంస్థలుగా వుండాలని ప్రజాప్రతినిధులు కోరటంలేదు రాష్ట్ర ప్రభుత్వం జనరల్ అజమాయిషీ అతి తక్కువ వుండాలనే అవసరాన్ని కాదనడంలేదు ఉదా కార్పొరేషన్ తన బాధ్యతల నిర్వహణలో కొంతమంది వ్యక్తులపైన, సంస్థలపైన కోర్టుల్లో దావాలు వేయవల్సివుంటుంది అదేవిధంగా పౌరులు, సంస్థలు కూడా కార్పొరేషన్‌పై దావాలు కోర్టుల్లో దాఖలు చేస్తారు కార్పొరేషన్ తరఫున అన్ని కోర్టుల్లో హాజరై వాదోపవాదాలు చేయటానికి సమర్థులైన స్థానిక న్యాయవాదులను ఆయా కార్పొరేషన్లు నియమించుకోవాల్సిన అవసరం వుంది ఇలాంటి విధానం 1987 వరకు కొనసాగింది కాని, 1987లో రాష్ట్ర ప్రభుత్వం యీ విధానాన్ని రద్దుచేసి, అన్ని స్థానిక సంస్థలకు ప్రభుత్వమే స్టాండింగు కౌన్సిలును నియమించే అధికారాన్ని చేపట్టింది ఫలితంగా ఎన్నికైన ప్రజాప్రతినిధులు హక్కులు హరించబడ్డాయి

అన్ని విషయాలను రాజకీయాలు చోటుచేసుకున్నట్లుగా యీ నియామకాలు కూడ రాజకీయరంగు పులుముకొన్నాయి

ఒక నగరంలో రాజకీయాలకు అతీతంగా సమర్థతతో కోర్టుల్లో వాదించే న్యాయవాదులను ఆ స్థానిక కార్పొరేషన్ ఎంపిక చేయలేదా? ఇంతకంటే బాగా హైద్రాబాద్‌లోగల

అధికార బృందం ఎన్నికచేయగలరా? ఈ విధానాన్ని మార్చాలని, స్థానిక సంస్థలకు తమ న్యాయవాదులను నియమించుకునే హక్కు వుండాలని చేసిన విజ్ఞప్తుల కారణంగా 1997లో ప్రభుత్వం ఆమోదించింది ఆ ప్రకారం ఉత్తర్వులు జారీ అయ్యాయి కాని అమలుజరపటం ప్రారంభంకాకముందే, కొద్దినెలల్లోనే తమ ఉత్తర్వులను రాష్ట్ర ప్రభుత్వం రద్దు చేసుకొంది ఏదో కారణం చెప్పారు కాని, అది సమంజసంగా లేనందున, తిరిగి ప్రభుత్వంపై వత్తిడి తేవటంతో 1999 మే నెలలో, ఎట్టకేలకు ఆ హక్కు పునరుద్ధరణకు అంగీకరించిన ప్రభుత్వం, సంవత్సరం గడిచినా, ఉత్తర్వులు మాత్రం జారీచేయలేదు

అలాగే మరో సందర్భంలో శాసనసభ్యులు కొంతమంది వారు ఎక్స్ అఫీషియో సభ్యులుగానున్న కౌన్సిల్స్‌లో తమకు తగినంత ప్రాధాన్యత, గౌరవ మర్యాదలు లభించటం లేదని ఫిర్యాదులు చేసిన ఫలితంగా, కౌన్సిల్ సమావేశాలలో మేయరు, ఛైర్‌పర్సన్‌తో పాటు అదే వేదికపై ఆ ప్రాంత ఎం ఎల్ ఎ లు పార్లమెంటు సభ్యులకు కూడా సీట్లు ఏర్పర్చాలని ఒక వింత ఉత్తర్వును జారీచేసింది రాష్ట్రంలో అన్ని మునిసిపల్ కౌన్సిల్స్, కార్పొరేషన్లు తీవ్ర అభ్యంతరం చేయటంతోనూ హైకోర్టులో ఆ ఉత్తర్వులను సవాల్ చేయటంతోను, ప్రభుత్వం దరిమిలా ఉపసంహరించుకోవలసి వచ్చింది

## అఖిల భారత మేయర్ల మండలి 1999లో సిద్ధం చేసిన కార్పొరేషన్ మోడల్ (నమూనా) బిల్లుల్లోని ముఖ్యాంశాలు

1 ప్రస్తుతం చట్టాలలో వివిధ సంఘాల విధానం మార్పుచేసి, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వలె కాబినెట్ విధానాన్ని కార్పొరేషన్లలో ప్రవేశపెట్టారు వికేంద్రీకరణకు పూర్తి స్వయం పాలనానికి యీ విధానం మిక్కిలి ప్రజాస్వామికమైనది

2 ప్రతి కార్పొరేషన్‌లోను మేయరు, డిప్యూటీ మేయరు మరియు మేయరుచే నియమించబడిన సంఖ్యలో ఎన్నికైన కౌన్సిలర్లతో గూడిన మేయర్-ఇన్-కౌన్సిల్ విధానాన్ని ప్రవేశపెట్టాలి

3 కార్పొరేషన్ కార్యనిర్వాహక ఆధిపత్యం మేయర్-ఇన్-కౌన్సిల్‌కు వుంటుంది కార్పొరేషన్‌కు యీ కాబినెట్ సమిష్టి బాధ్యత వహిస్తుంది

4 కార్పొరేషన్‌లో ప్రతిపక్షం నాయకునికి మేయర్-ఇన్-కౌన్సిల్ సభ్యుని హోదా కల్పిస్తారు

5 కార్పొరేషన్‌లోని మునిసిపల్ అక్కౌంట్సు కమిటీకి ప్రతిపక్ష నాయకుడు ఛైర్‌పర్సన్‌గా వుంటారు అన్ని జమాఖర్చులు క్షుణ్ణంగా పరిశీలించి, వాటిపై నివేదికను కార్పొరేషన్ సర్వసభ్య సమావేశానికి నివేదించుతారు

6 చట్టంలోని అన్ని నిబంధనలు, బాధ్యతలు నిర్వహించే అధికారులుగా - 1) కార్పొరేషన్ 2) మేయర్-ఇన్-కౌన్సిల్ 3) మేయర్-ఇన్-కౌన్సిల్‌లో బాధ్యతలు నిర్వహించే సభ్యులు 4) మునిసిపల్ కమిషనర్ 5) వార్డు కమిటీలు

7 వార్డు కమిటీ పరిధిలో పనులను నిర్దేశించి, బడ్జెట్ కేటాయింపులకు లోబడి 5 లక్షల రూపాయలలోపు అంచనాలను మంజూరు చేసే అధికారంతో ఇవి తమ బాధ్యత లను నిర్వహిస్తారు

8 మేయర్-ఇన్-కౌన్సిల్‌లో ఎంతమంది సభ్యులుంటే అన్ని శాఖాపరమైన స్థాయీ సంఘాలుండాలి కౌన్సిల్‌లోని ఆ శాఖ సభ్యుడు ఆ కమిటీకి ఛైర్‌పర్సన్‌గా వుండాలి ప్రతి స్థాయీ సంగంలో 16 మంది సభ్యులుండాలి

9 మేయర్ ఈ కౌన్సిల్ సమావేశాలకు అధ్యక్షత వహించును కమిషనరు అమలుచేస్తున్న తీరుపై అజమాయిషీ కలిగివుండును అక్కౌంట్లు, రికార్డుల బాధ్యతపై కూడా వీరికి అజమాయిషీ వుంటుంది

10 కమిషనరు కార్పొరేషన్‌లో ప్రధాన కార్యనిర్వాహక అధికారిగా వుండును చట్ట నిబంధనల మేరకు అన్ని పనుల నిర్వహణా బాధ్యతలను మేయరు పర్యవేక్షణలో నిర్వహించును

11 మెంబర్ ఇన్‌ఛార్జి ఛైర్‌పర్సన్‌గా, మునిసిపల్ ప్లానింగ్ కమిటీ ఏర్పాటు, అన్ని రకాల అభివృద్ధి కార్యక్రమాలు కమిషనరు కమిటీ ముందుపెట్టి చర్చల తర్వాత మేయరు-ఇన్-కౌన్సిల్ ఆమోదానికి వుంచాలి అనధికార కట్టడాలు, అనధికార విస్తరణను అదుపులో పెట్టాలి

12 డిప్యూటీ కమిషనరు స్థాయికి తగ్గని అధికారిని మేయరు తన పి ఎ గా నియమించుకొన వచ్చును తన కార్యాలయంలోను, డిప్యూటీ మేయరు కార్యాలయంలోను, మేయర్-ఇన్-కౌన్సిల్ సభ్యుల కార్యాలయంలోను అవసర సిబ్బందిని ఏర్పరచాలి

13 కార్పొరేషన్‌పై అజమాయిషీకి రాష్ట్ర ప్రభుత్వానికి వుండవలసిన అధికారాలు నిర్వచించ బడ్డాయి అయితే, అవి నమూనాగా ప్రతిపాదించబడినందున, అవసరమయిన చేర్పులు, మార్పులు చేసుకొని, ఏ రాష్ట్రానికారాష్ట్ర అసెంబ్లీలు చట్టాలను రూపొం దించుకోవాలి

కార్పొరేషన్లను రాష్ట్ర ప్రభుత్వం రద్దుచేయదలచినపుడు అయిదుగురికి తగ్గకుండా ఒక కమిటీని రాష్ట్ర ప్రభుత్వం నియమించి, వారిముందు రద్దుకు గల కారణాలను, కార్పొరేషన్ ఇచ్చిన సంజాయిషీని పరిశీలించి ఆ కమిటీ నిర్ణయం ప్రకారం రాష్ట్ర ప్రభుత్వం తదుపరి చర్యలు తీసుకోవాలి

2000 సంవత్సరం ఏప్రిల్ 29, 30 తేదీలలో కేంద్ర పట్టణాభివృద్ధి శాఖ మేయర్ల జాతీయ మహాసభను ఢిల్లీలో నిర్వహించింది దానికి దేశం నలుమూలలనుండి 44 మంది మేయర్లు హాజరైనారు పట్టణాభివృద్ధి శాఖామాత్యులుగా శ్రీ జగ్‌మోహన్ ప్రసంగించారు ఆ మహాసభలో దిగువ తీర్మానాలు ఆమోదించబడినవి

1 74వ రాజ్యాంగ సవరణ చట్టం ప్రకారం కార్పొరేషన్‌లకు పరిపుష్టి కలిగించటానికిగాను, ఆయా నగరాలలో నేరుగా నిర్వహించబడే ఇంప్రూవ్‌మెంట్ ట్రస్టు, పట్టణాభివృద్ధి సంస్థలు, వాటర్, డ్రైనేజి బోర్డులను కార్పొరేషన్ ఆధిపత్యంలోనికి తేవాలి

2 కార్పొరేషన్ ముఖ్య కార్యనిర్వాహణాధికారాలను మేయర్లకు యివ్వాలి కమిషనర్ల కాన్ఫిడెన్షియల్ రిమార్కులు వ్రాసేందుకు అధికారం వుండాలి

3 అన్ని రాష్ట్రాలలోను మేయర్ పదవీకాలం అయిదు సంవత్సరాలుగా వుండాలి

4 అఖిల భారత మేయర్ల కౌన్సిల్ కోరుతున్నట్లు ప్రజాప్రతినిధుల సమర్ధవంత పరిపాలన కొరకు మేయర్-ఇన్-కౌన్సిల్ విధానాన్ని కార్పొరేషన్లలో అమలుజరపాలి

5 ఆక్ట్రాయ్ పన్ను నిలిపివేయరాదు అన్ని నగరాలలోను యీ పన్ను వసూలు విధానం అమలుజరిగేవరకు రద్దుచేసిన కార్పొరేషన్లకు నష్టపరిహారం పూర్తిగా చెల్లించాలి

6 అన్ని కేంద్ర సంక్షేమ పధకాలను - పేదరిక నిర్మూలన పధకంతో సహా - కార్పొరేషన్ల ద్వారానే అమలుజరపాలి ఇందుకు యిచ్చే కేంద్ర నిధులు రాష్ట్ర ప్రభుత్వం ద్వారా కాకుండా, నేరుగా ఆయా కార్పొరేషన్లకే యివ్వాలి

7 కేంద్ర ప్రభుత్వం, అది నిర్వహించు సంస్థలు కార్పొరేషన్లకు సర్వీసు ఛార్జీలు చెల్లించ నందువల్ల కార్పొరేషన్ల ఆదాయం నష్టం జరుగుతూ వుంది అందుచేత చట్టాన్ని సవరించి, కేంద్ర ప్రభుత్వ ఆస్తులపై పన్ను విధించి, వసూలుచేసుకునేందుకు అవకాశం · కల్పించాలి

8 ఆయా కార్పొరేషన్ల పరిధిలో జరుగు డీజిల్, పెట్రోలు అమ్మకాలపై లీటరుకు 25 పైసలు సర్‌ఛార్జి వసూలుచేసుకునే అవకాశం కల్పించాలి

9 అన్ని రాష్ట్ర ఆర్థిక కమిషన్లు చేసిన సిఫార్సులను పూర్తిగా రాష్ట్ర ప్రభుత్వాలు అమలు పరచాలి

అదుపులేకుండా పెరుగుతున్న పట్టణాలు, నగరాలు సహజంగానే అనేక నూతన సమస్యలు సృష్టిస్తాయి రాష్ట్రంలోని దాదాపు 60 మునిసిపాలిటీల ఆర్థిక పరిస్థితి దయనీయంగా వుంది జీతభత్యాలు చెల్లించటమే సమస్యగా వుంది. మిగతావాటి పరిస్థితి - ఏవో రెండు మూడు మినహా వారు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి తగినన్ని నిధులు సేకరించలేకపోతున్నాయి ప్రధాన ఆదాయంగా వున్న ఆస్తిపన్ను కాలం కొద్ది పెరుగుతున్నా, పెరిగిన అవసరాలకు నిత్యం పెరుగుతున్న ధరవరలతో జీతభత్యాలతో తల్లడిల్లిపోయి, వారి ప్రజలకు కనీస సౌకర్యాలు కల్గించలేకపోతున్నాయి వీటికి ఆర్థిక పరిపుష్టి కల్గించటానికి 74వ రాజ్యాంగ సవరణ చట్టం ఒక మంచి విధానాన్ని రూపొందించి యిచ్చింది అది రాష్ట్ర ఆర్థిక కమిషన్ ఏర్పాటు రాష్ట్రానికి పన్నులద్వారా లభించే ఆదాయంలో స్థానిక సంస్థలకు, పంచాయతీలకు, మునిసిపాలిటీలు, నగరపాలక సంస్థలు

నిర్దిష్ట శాతం వారికి కేటాయించి యివ్వాలని రాజ్యాంగ సవరణ చట్టం స్థానిక సంస్థలకు యిచ్చినా రాష్ట్ర ప్రభుత్వం బేఖాతరు చేయటంతో స్థానిక సంస్థల పరిపాలకులు దిగాలుపడి పోయారు దీనికితోడు కేంద్ర ప్రభుత్వం నుండి 1995 నుండి లభించిన పదవ ఆర్థిక సంఘ గ్రాంట్లు దాదాపు రు 450 కొట్ల రూపాయలు మధ్య రాష్ట్ర ప్రభుత్వం చేతిలోపడి, వారినుండి అడపాదడపా, ధర్మం యిచ్చినట్లుగా కొందరికి మాత్రమే లభించటంతో నిధులు పూర్తిగా చేరలేదు ప్రజాప్రతినిధులు - ప్రతి పార్టీ, పట్టణాల, నగర ప్రజల కనీస అవసరాలు తీర్చుతామని, బాగా అభివృద్ధిపరుస్తామని ప్రజలకు వాగ్దానాలు చేసి ఎన్నికల్లో గెలిచి, పదవీ బాధ్యతలు స్వీకరించిన తర్వాత, వారికంతా అయోమయంగా వుంది ఏ అభివృద్ధి పనికైనా ధనం అవసరం అదే వారికి చాలినంతగా దొరకటంలేదు

లోగడ - ముప్ఫై ఏండ్లక్రితం పట్టణాలలో మంచినీటి సరఫరా, డ్రైనేజీ పథకాలు - భారీ ఖర్చుతో కూడినవి చేపట్టాలంటే, రాష్ట్ర ప్రభుత్వ అనుమతితో ఎల్ ఐ సి లనుండి అప్పు పొందేవారు కాని, యిచ్చిన అప్పులను సక్రమంగా తీర్చనందున, ప్రతి అప్పుకు రాష్ట్ర ప్రభుత్వం హామీ వుండటంతో చాలా భాగం రాష్ట్ర ప్రభుత్వంపై యీ అప్పులు తీర్చే బాధ్యత పడింది వందల కోట్ల రూపాయలు తీర్చవలసిరావటంతో, ప్రభుత్వం కూడా యిక హామీలు ఇవ్వటానికి నిరాకరిస్తోంది అలాంటి అయోమయ పరిస్థితుల్లో గత 20 సంవత్స రాలుగా కొత్త సంస్థలు పట్టణాభివృద్ధికి అప్పులు యివ్వటానికి ముందుకు వచ్చాయి అందులో ముఖ్యంగా కేంద్ర ప్రభుత్వ సంస్థ - హడ్కో రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించిన వివిధ అభివృద్ధి పథకాలకు హడ్కో అప్పుయిస్తుంది

కొన్ని విదేశీ సంస్థలనుండి, కొన్ని విదేశీ ప్రభుత్వాలనుండి కూడ అప్పులు, గ్రాంట్లు లభించటం పట్టణాలు, నగరాలకు ఆశావహంగా వుంది ఉదా బ్రిటిష్ ప్రభుత్వ సంస్థ ఒ డి ఎ ద్వారా హైద్రాబాద్, విశాఖపట్నం, విజయవాడలలో కోట్ల రూపాయల వ్యయంతో మురికివాడలు అభివృద్ధి చేసింది మరొక 745 కోట్ల వ్యయంతో మన రాష్ట్రంలోని 32 పెద్ద, మధ్యరకం పట్టణాభివృద్ధి పథకాలు ప్రస్తుతం చేపట్టింది దీనినే మన రాష్ట్ర ప్రభుత్వం 'వెలుగు' పథకంగా ప్రవేశపెట్టింది అదే విధానాన్ని జపాన్, కెనడా, ఫ్రాన్సు, అమెరికా, నెదర్లాండ్ ప్రభుత్వాలు గణనీయమైన స్థాయిలో అభివృద్ధి పథకాలకు స్వల్ప వడ్డీలపై దీర్ఘకాల చెల్లింపులతో రుణాలు అందిస్తున్నాయి ఇవిగాక, కొంతమేరకు రాష్ట్ర ప్రభుత్వం యిటీవల చేపట్టిన జన్మభూమి కార్యక్రమంలో ప్రజల భాగస్వామ్యంతో రోడ్లు, డ్రయిన్లు, పాఠశాలలు వగైరా కార్యక్రమాలకు అవకాశం లభించింది ఇవిగాక కేంద్ర ప్రభుత్వం యిటీవల ప్రవేశపెట్టిన నేషనల్ స్లం డెవలప్‌మెంట్ పథకం క్రింద 70% రుణంగాను, 30% గ్రాంటుగాను, ముఖ్యంగా మురికివాడల, పేదప్రజలు నివశించే ప్రాంతాలలో మౌలిక సదుపాయాలకొరకు అన్ని స్థానిక సంస్థలకు సహాయం లభించింది

పట్టణాలలో, నగరాలలో గృహనిర్మాణానికి కూడ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుండి విరివిగా రుణాలు వ్యయం చేస్తున్నారు గ్రామీణ ప్రాంతంలోనే హెచ్చు భాగం గృహ నిర్మాణానికి ఖర్చు చేస్తున్నా యిటీవల పట్టణాలు, నగరాలకు కూడ యి పథకం విస్తరింప చేయటంతో అర్హులైన లబ్ధిదారులకు దీర్ఘకాలికాదాయాలమీద తీర్చుకునే ఏర్పాటుతో ఈ రుణాలు మంజూరవుతున్నాయి

అలాగే, కేంద్ర ప్రభుత్వం పట్టణాలు, నగరాలలో వైద్య, ఆరోగ్య సౌకర్యాలు గణనీయంగా పెంచటానికి, ప్రపంచ బ్యాంకు రుణాలతో విస్తృతంగా పై సౌకర్యాలు కల్పించుటకు కృషి జరుగుతుంది పెరుగుతున్న నగరాలు క్రమంగా జనారణ్యాలుగా వుంటున్నాయి లక్షలకొలది వివిధ రకాలైన వాహనాలు ఒకవైపు ట్రాఫిక్ సమస్యలను కల్పిస్తూనే, టన్నుల కొలది వాయు, శబ్ద కాలుష్యాన్ని వెదజల్లుతున్నాయి హైద్రాబాద్ నగరం చుట్టూ విస్తరించిన రకరకాల మధ్య, భారీ పరిశ్రమలు నగరాన్ని అగ్నిగుండంగా మారుస్తున్నాయంటే అతిశయోక్తికాదు నీటి కాలుష్యం తీవ్రరూపం దాల్చింది భూగర్భ జలాలు రసాయనాల కాలుష్యానికి గురై త్రాగునీరు సహితం పూర్తిగా నిరుపయోగం అయింది కనీసం వాడకానికి కూడా పనికిరావటంలేదు అన్ని మహానగరాల దుస్థితి ఒకటే దీనినుండి నగర జనాభాను రక్షించటానికి మార్గాలు తక్కువగానే వున్నాయి

గత 10-15 సంవత్సరాలలో నగరాల జనాభా అత్యధికంగా పెరిగిపోతోంది లక్షలాది మంది పేదప్రజలు తలదాచుకొనటానికి, చిన్న చితక పాకలు - రేకులు, ఆకులు వగైరా - మురికివాడలు పెరిగిపోతున్నాయి వారికి రక్షిత మంచినీరు లేదు రోడ్లు, లైట్లు అరకొర మురుగునీరు కూడా బైటకుపంపే మార్గంలేక, అవి దుర్వాసనలతో, అనారోగ్యాలతో, భయంకరంగా తయారవుతున్నాయి

పెరుగుతున్న జనాభా అవసరాలకు తగినట్లుగా రక్షిత మంచినీరు, మురుగునీటి పథకాలు చేపట్టలేకపోతున్నాయి

# 11. హైదరాబాద్ కార్పొరేషన్ చట్టంలోని వివిధ సెక్షన్ల క్రింద ప్రభుత్వంచే ఆమోదించి, అమలులో వున్న రూల్సు

(చట్టంలోని సెక్షన్లకు ఎంత అధికారిత వుందో, వాటి అమలుకు ప్రభుత్వంచే జారీ చేయబడిన రూల్సుకు, బైలాలకు అంతే బలం, అధికారిత కలదు.)

1 ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ కార్పొరేషన్ - ఓటర్ల నమోదు రూల్సు - 1994

2 ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ కార్పొరేషన్ - సీట్ల రిజర్వేషన్ రూల్సు - 1995

3 ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ కార్పొరేషన్ - స్టాండింగ్ కమిటీ ఛైర్‌పర్సన్ ఎన్నికల రూల్సు - 1994

4 ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ కార్పొరేషన్ - వార్డు కమిటీల ఛైర్‌పర్సన్స్ ఎన్నిక, అధికారాలు, బాధ్యతలు రూల్సు - 1995

5 ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ కార్పొరేషన్ స్టాండింగ్ కమిటీ ఛైర్‌పర్సన్ ఎన్నికల రూల్సు - 1995

6 కార్పొరేషన్‌లో మైనారిటీల కో-ఆప్షన్ రూల్సు - 1995

7 కార్పొరేషన్ రోడ్లకు, వీధులకు పేర్లు, ఇండ్లకు నంబరింగ్ రూల్సు - 1995

8 కార్పొరేషన్ పురపాలక పరిపాలనలో ప్రత్యేక పరిజ్ఞానం, అనుభవం వున్న వారిని కో-ఆప్షన్ చేయుటకు రూల్సు

9 కార్పొరేషన్ డెవలప్‌మెంట్ రూల్సు - 1967

10 కార్పొరేషన్ బడ్జెట్ అంచనాల రూల్సు - 1968

11 కార్పొరేషన్ భూస్వాధీనం, స్థిరాస్తుల అమ్మకాల రూల్సు - 1970

12 కార్పొరేషన్ టెండరు రూల్సు - 1970

13 కార్పొరేషన్ నిర్మించిన ఇండ్లను హైర్‌పర్చేజ్ ప్రాతిపదికన కేటాయింపు చేయుటకు రూల్సు -1970

14 కార్పొరేషన్ ప్రకృతి వైపరీత్యాలతో నష్టపోయిన ఉద్యోగుల గృహాలు పునర్నిర్మాణానికి రుణం మంజూరు రూల్సు - 1972

15 కార్పొరేషన్ ప్రత్యేక నిధి ఏర్పాటు, నిర్వహణ రూల్సు - 1973

16 కార్పొరేషన్ నగర పరిధిలో మాగాణి వ్యవసాయం, క్రమబద్ధీకరణ, నిషేధం రూల్సు - 1986

17 కార్పొరేషన్ భోజనశాలలు, హోటల్సు క్రమబద్ధీకరణ బైలాలు - 1973

18 కార్పొరేషన్ ప్రత్తి, ప్రత్తి వేస్టు, చింపిరిగుడ్డలు వ్యాపారం క్రమబద్ధీకరణ బైలాలు - 1973

19 కార్పొరేషన్ హెయిర్ డ్రెస్సింగ్, బార్బర్ షాపుల కంట్రోలు, క్రమబద్ధీకరణ బైలాలు - 1973

20 కార్పొరేషన్ వసతి గృహాలలో ప్రవేశానికి - నిర్వహణకు బైలాలు -

21 కార్పొరేషన్ నగరంలో సంతలు, వ్యాపార ప్రదర్శనలు క్రమబద్ధీకరణ బైలాలు - 1973

22 సులభంగా కాలెడు పదార్థాలు నిల్వచేయుట, ఏదైనా ప్రత్యేక ప్రాంతాలలో అగ్ని ప్రదర్శనల గురించిన బైలాలు - 1973

23 స్టాల్ సర్టిఫికెట్లు జారీచేయు బైలాలు - 1973

24 సంస్థలకు, సంఘాలకు ఆర్థిక సహాయం చేయుటకు రూల్సు - 1986

25 ఈతకొలనుల వినియోగానికి, నిర్వహణకు బైలాలు - 1979

26 మలేరియా దోమల వల్ల కలిగే జబ్బుల నివారణకు బైలాలు - 1981

27 ప్రత్యేక కమిటీల బైలాలు - 1981

28 పౌరులు మునిసిపల్ రికార్డుల పరిశీలన మరియు వాటి సర్టిఫైడ్ ఎక్స్ట్రాక్టు వారికి జారీ చేయుటకు బైలాలు

29 కార్పొరేషన్ సమావేశాలలో పౌరుల ప్రవేశానికి బైలాలు - 1966

30 కార్పొరేషన్ మరియు స్థాయీ సంఘం సమావేశాల నిర్వహణ బైలాలు - 1966

31 కార్పొరేషన్ పబ్లిక్ వీధులలోని పార్కులు, యితర బహిరంగ ప్రదేశాలలో చెట్లు సంరక్షణ బైలాలు - 1967

32 పార్కులు, తోటలు, పార్కింగ్ ప్రదేశాలు, ఆటస్థలాల క్రమబద్ధీకరణ బైలాలు - 1968

33 పాలు, పాల పదార్థాలు అమ్ము ప్రదేశాలు, వినియోగించు పాత్రలు పరిశుభ్రత, అమ్మకాలు, పాల సంరక్షణకు బైలాలు - 1967

34 మునిసిపల్ కమ్యూనిటీ హాల్సు, కంట్రోలు, నిర్వహణ బైలాలు - 1973.

35 ఓటర్లకు గుర్తింపు కార్డుల జారీ రూల్సు - 1986

36 మేయరు, సభ్యుల ఎన్నిక, ఎన్నికల పిటీషన్ల రూల్సు - 1987

37 విశాఖపట్నం, విజయవాడలలో డిప్యూటీ మేయరు ఎన్నికల రూల్సు - 1986

38 ఓటర్ల నమోదుకు రూల్సు - 1978

39 మునిసిపల్ ఇంజనీరింగ్ సబార్డినేట్ సర్వీసు రూల్సు - 1980

40 ఉద్యోగుల ప్రవర్తనా నియమావళి రూల్సు - 1968

41 స్కావెంజర్ల సర్వీసు రూల్సు - 1963

42 కౌన్సిలర్లకు కన్వేయన్సు అలవెన్సు చెల్లింపు రూల్సు - 1964

43 ఆరోగ్య శాఖాధికారుల విధుల రూల్సు - 1965

44 మునిసిపల్ కార్పొరేషన్ సర్వీసు రూల్సు -1987

45 ఫైనాన్సు కమిషను ఏర్పాటు, విధుల రూల్సు -

46 చేతిలాగుడు బండ్ల లైసెన్సు బైలాలు - 1973

47 కసాయి వృత్తి నియంత్రణ బైలాలు - 1973

48 పాలిచ్చే గేదెలు, పశువుల షెడ్లు, పాల ఉత్పత్తులు మరియు పశువుల సంరక్షణకు బైలాలు - 1964

49 కొన్ని ప్రత్యేక సరుకులు నిల్వచేయు ప్రదేశాల నియంత్రణ, కంట్రోల్ బైలాలు - 1973

50 ప్రైవేటు, పబ్లిక్ బండ్ల దొడ్ల నియంత్రణకు బైలాలు - 1974

51 నిర్బంధ టీకాల బైలాలు - 1974

52 స్థాయీ సంఘానికి సభ్యుల నియామక బైలాలు - 1973

53 మునిసిపల్ పరిపాలనలో అనుభవం, పరిజ్ఞానం గలవారిని కో-ఆప్షన్ రూల్సు

54 మైనారిటీ సభ్యుల కో-ఆప్షన్‌కు రూల్సు - 1995

55 ఆస్తిపన్ను మదింపు రూల్సు - 1990

56 భవన నిర్మాణ బైలాలు - 1981

57 61 పన్ను మదింపు రిజిష్టరులో స్థిరాస్తుల (ఓనర్‌షిప్) యాజమాన్యం

58 స్థలాల లే-అవుట్ రూల్సు - 1965

59 వాహనాలు, పశువులపై పన్ను విధించుటకు రూల్సు - 1965

60 వివిధ అధికారుల బాధ్యతలు, విధుల రూల్సు - 1965



# 12. కార్పొరేషన్, స్థాయి సంఘ సమావేశాల నియంత్రణ, బైలాలు - 1966

## (నియమ నిబంధనలు)

1 కార్పొరేషన్ సమావేశాలు నిర్వహణ

మేయర్ ఆదేశానుసారం సమావేశ చర్చనీయాంశాలను మునిసిపల్ సెక్రటరీ తయారుచేస్తారు మేయరు లేని సమయంలో డిప్యూటీ మేయరు, ఆయన లేనిసమయంలో స్థాయి సంఘ అధ్యక్షుల ఆదేశానుసారంగా ఎజండా తయారుచేయాలి ప్రాధాన్యత క్రమం యిలా వుండాలి

1 అన్ని రకాల ఎన్నికలు
2 అన్ని నియామకాలు
3 122 సెక్షన్ క్రింద ప్రశ్నలు
4 పిటీషన్లు
5 స్థాయిసంఘం, ప్రత్యేక కమిటీల తీర్మానాలు, సిఫార్సులు
6 కమీషనర్‌నుండి లేఖలు, యితర వ్యవహారాలు
7 ప్రభుత్వం నుండిగాని, ప్రభుత్వ కార్యాలయంనుండిగాని వచ్చిన లేఖలు
8 కమిటీల, ఉపసంఘాల, అడ్‌హాక్ కమిటీల రిపోర్టులు
9 ప్రతిపాదనలు
10 ఇతరములు

ప్రతిపాదనలనుండి అభ్యంతరకర భాగాలు తొలగించుటకు సభాధ్యక్షులకు గల విచక్షణాధికారం

**ఒక ప్రతిపాదనను దిగువ ప్రాతిపదికపై ఎజండాలో చేర్చుటకు ఆమోదం లభించును**

1 కార్పొరేషన్ చట్టపరిధిలో ప్రజా ప్రయోజనానికి సంబంధించి ప్రతిపాదనలుండాలి
2 విషయం స్పష్టంగాను, నిర్దిష్టంగాను వుండాలి
3 ఒక ప్రత్యేక సమస్యకు చెంది వుండాలి
4 పరుష పదాలు, వ్యంగ్యోక్తులు, నిందాపూర్వక వ్యాఖ్యలు కలిగివుండరాదు
5 అందులో ప్రత్యక్ష, పరోక్ష అప్రతిష్ఠాకరమైనగాని, వారి అధికార బాధ్యతల విషయంగాని, అధికారుల వ్యక్తిగత గుణగణాదులపై వ్యాఖ్యలు ఉండరాదు
6 కోర్టులో లేక ట్రిబ్యునల్‌లో పెండింగులో వున్న అంశాలు లేవనెత్తరాదు
7 సభ్యుల ప్రతిపాదనలు, ప్రశ్నల నుండి ఆక్షేపణకరమైన వ్యాఖ్యలు, అపవాదుల భాగాలను సభాధ్యక్షులు తొలగించుటకు లేదా మొత్తంగా తిరస్కరించుటకు అధికారం కలదు

8 కౌన్సిల్ నిర్ణయించిన భాషలోనే సమావేశ వ్యవహారాలు నిర్వహించబడవలెను

9 గత సమావేశపు మినిట్సును సభ్యులకు ముందుగా సర్క్యులేట్ చేసివున్నట్లయితే, సమావేశం ధృవపరచబడినట్లుగా పరిగణించవలెను అయితే, ఏ కౌన్సిలరు అయినా మినిట్సులో పొరపాటు వుందని అభ్యంతరం చేసినట్లయితే, సభాభిప్రాయాన్ని తెలుసుకొని, ఆ ప్రకారంగా సవరించవచ్చు

10 స్థాయిసంఘ తీర్మానాలను, అలాగే ప్రత్యేక కమిటీల తీర్మానాలను, ఉపసంఘం, అడ్‌హాక్ కమిటీల రిపోర్టులను ఆయా కమిటీల ఛైర్మన్‌లు, వారు లేనట్లయితే కమిటీ సభ్యులచే ప్రవేశపెట్టించవచ్చు

11 ప్రతిపాదనకు నోటీసు యిచ్చిన కౌన్సిరు స్వయంగా ప్రతిపాదించనట్లయితే, లేక ఆయనచేత అధికారం పొందిన మరొక సభ్యుడు ప్రతిపాదించనట్లయితే అట్టి ప్రతిపాదనలు డ్రాప్ అయినట్లే

12 ఎజండాలో ఏ స్థానంలో వున్న ప్రతిపాదననైనా, సమావేశంలో అత్యధికుల అనుమతితో, దానికి ప్రాధాన్యతనిచ్చి, ముందుగా చర్చించవచ్చు ఏదేని ఒకే అంశంపై పలు ప్రతిపాదనలు వున్నట్లయితే వాటినన్నింటిని సభ అనుమతితో, ఒకే అంశంగా గుర్తించి చర్చకు తీసికోవచ్చు ఏదైనా ప్రతిపాదనలో అనేక సమస్యలు ప్రస్తావన వున్నట్లయితే, సభాధ్యక్షులు వాటిని విడగొట్టి, చర్చకు అనుమతించే అధికారం గలదు అలా విడగొట్టినప్పుడు ప్రతిదానిని వేరువేరుగా ప్రతిపాదించనవసరంలేదు

13 వ్రాతమూలకమైన ఉపన్యాసములు సభాధ్యక్షుని అనుమతితో మాత్రమే చేయవలెను

14 ప్రసంగించు ప్రతి కౌన్సిలరు తన స్థానంలో నిల్చొని, సభాధ్యక్షుని ఉద్దేశించే ప్రసంగించాలి ఏ సమయంలోనైనా సభాధ్యక్షులు, ప్రసంగం ఆపి కూర్చోవలసిందిగా ఆ కౌన్సిలరును కోరినట్లయితే, తక్షణం ఆ కౌన్సిలరు కూర్చోవాలి శారీరక అశక్తత వున్న కౌన్సిలరు తన సీటులో కూర్చుని ప్రసంగించవచ్చు

15 తీర్మానమును ప్రతిపాదించే కౌన్సిలరు 15 నిముషములకు మించి మాట్లాడరాదు అంతకుమించి మాట్లాడుటకు సభాధ్యక్షుని అనుమతి తప్పక కావాలి సవరణ ప్రతిపాదించే కౌన్సిలరు 7 నిముషములలో పూర్తిచేయాలి

16 చర్చలో వున్న ఏ అంశంపైనైనా, యిక చర్చ ముగించి దానిపై సభాభిప్రాయాన్ని తీసికోవలసిందిగా ఏ కౌన్సిలరయినా క్లోజర్ (ముగింపు)ను ప్రతిపాదించవచ్చు సభ అనుమతి యిస్తే, ఆ అంశం ముగుస్తుంది

17 తీర్మానములు, ప్రతిపాదకులు, బలపరుచు (సెకండు చేయువారు) రెండుసార్లు మాట్లాడవచ్చు చర్చలో మిగతా సభ్యులు ఒకసారి మాత్రమే ప్రసంగించాలి

18 సమావేశంలో పాల్గొను సభ్యులెవరైనా ప్రసంగించువారు అసలు విషయాన్ని కాకుండా

యితర విషయాలు మాట్లాడుచున్నారని, లేదా చట్టం, రూల్సుకు భిన్నంగా మాట్లాడుతున్నారని లేదా పరుషమైన, నిందాపూర్వకమైన భాష మాట్లాడుతున్నారని పాయింట్ ఆఫ్ ఆర్డరు లేవనెత్తవచ్చు అలా చేసేటప్పుడు క్లుప్తంగా పాయింట్లు మాత్రమే చెప్పాలి తప్ప, ప్రసంగం చేయరాదు సభాధ్యక్షులు ఆ పాయింట్ ఆఫ్ ఆర్డరుపై నిర్ణయాన్ని ఆమోదిస్తూనో లేక తిరస్కరిస్తూనో ప్రకటించాలి తన నిర్ణయాన్ని ప్రకటించేముందు పాయింట్ ఆఫ్ ఆర్డర్‌పై ఒకరిద్దరిని ప్రసంగించటానికి (క్లుప్తంగా) అవకాశం యివ్వవచ్చు

19 ఏ ప్రతిపాదననైనా కౌన్సిలరు ప్రతిపాదించిన పిదప, దానిని మరొక కౌన్సిలరు బలపరచాలి (సెకండ్ చేయాలి) తర్వాతనే చర్చ జరుగును

20 చర్చలోవున్న ప్రతిపాదనలపై సభ్యులు ఎన్నైనా సవరణలను సూచించవచ్చు అయితే ఏ సవరణైనా అసలు ప్రతిపాదనకు పూర్తి విరుద్ధమైనదిగా వుండరాదు తీర్మాన ప్రతిపాదకులు తనకిష్టమైన సవరణలు అంగీకరించవచ్చు అప్పుడు ఆ సవరణలతో కూడిన తీర్మానమే ప్రాతిపదిక అవుతుంది

21 తీర్మానాలనుగాని, సవరణలుగాని సమావేశం అనుమతితో మాత్రమే ఉపసంహరించుకొనవచ్చు అయితే, ఉపసంహరణపై ఎలాంటి చర్చలకు అవకాశం లేదు (సభాధ్యక్షులు అనుమతిస్తే తప్ప)

22 సవరణలపై ఓటింగ్ తీసికునేటప్పుడు, చివరి సవరణను ముందుగా - అటు పిమ్మట ఆ క్రమంలో ఓటింగు జరగాలి

23 కౌన్సిలు సమావేశాన్ని, సభాధ్యక్షులు సభ అనుమతితో మాత్రమే వాయిదా వేయాలి

24 మాజీ కౌన్సిలర్లు, మాజీ మేయర్లు లేదా దేశానికి సేవ చేసిన ప్రజాసేవకుల మరణానికి సంతాప తీర్మానములు చేయవచ్చు సంతాప సూచకంగా రెండు నిముసాలు మౌనంపాటించి, సమావేశాన్ని వాయిదా వేయవచ్చు

25 సభ్యులెవరైనా తీర్మానాలపై ఓటింగ్ సందర్భంలో 'పోల్' కోరవచ్చు అనుకూలురు, వ్యతిరేకులుగా వున్న సభ్యులను రెండు గ్రూపులుగా విడదీసి, సెక్రటరీ సహాయంతో అనుకూలుర వ్యతిరేకులు వారి పేర్లు వేరుగా సంతకాలు చేయాలి సభాధ్యక్షులు యీ పనికి 'టెల్లర్సు'ను నియమిస్తారు వారి సమక్షంలో పై కార్యక్రమం నిర్వహించబడాలి అనుకూలురు, వ్యతిరేకులు, తటస్థులు సంఖ్యను టెల్లర్స్ సహాయంతో సభాధ్యక్షులు ఫలితాన్ని ప్రకటిస్తారు అనుకూలం, వ్యతిరేకం - సమానంగా ఓట్లు లభించినప్పుడు, సభాధ్యక్షులు తన కాస్టింగ్ ఓటును వినియోగించి, ఫలితాన్ని ప్రకటించాలి

26. ఒక విషయంపై కౌన్సిలు నిర్ణయం చేసినతర్వాత 3 నెలలలోపుగా ఆ అంశంపై

ఎటువంటి సవరణలు లేదా మార్పులు చేయరాదు

27 ఒక ప్రతిపాదనపై పలువురు కౌన్సిలర్లు మాట్లాడగోరినప్పుడు, సభాధ్యక్షులు ఏ క్రమంలో వారు ప్రసంగించాలో నిర్ణయిస్తారు ఈ నిర్ణయంపై చర్చ అనుమతించబడదు అది తుది నిర్ణయంగానే పరిగణించాలి

28 సర్వసాధారణంగా, ప్రతిపాదనలపై అనుకూలత, వ్యతిరేకత, చేతులెత్తటం ద్వారా రికార్డు చేయాలి అయితే కమిటీలకు ఎన్నికలు జరిగినప్పుడు, దిగువ విధానాన్ని పాటించాలి

1) కమిటీ సభ్యత్వానికి పోటీ చేయు సభ్యులు మునిసిపల్ సెక్రటరీకి 3 రోజులు ముందుగా తమ నామినేషన్ దాఖలు చేయాలి రెండు రోజులు ముందుగా ఎవరైనా తమ నామినేషన్ ఉపసంహరించుకోవచ్చు తుది జాబితా మీటింగుకు ఒక రోజు ముందుగా ప్రకటించవలెను అవసరమైనంత సంఖ్యలో నామినేషన్లు వున్నా, అంతకంటే తక్కువవున్నా అట్టి అభ్యర్థులను ఎన్నికైనట్లుగా ప్రకటించవచ్చు తక్కువ అభ్యర్థులున్నప్పుడు, మిగతా సంఖ్య భర్తీకి మరల నామినేషన్లు పిలవాలి

29 కౌన్సిలు సమావేశం జరుగుచున్నప్పుడు -

1) తన స్థానంలో కూర్చొనే ముందు సభ్యులు సభాధ్యక్షునికి అభివాదం చేయాలి
2) సమావేశ చర్చనీయాంశాలకు సంబంధించిన పేపర్లు మినహా, పత్రికలు, పుస్తకాలు చదువరాదు
3) ఒక సభ్యుడు ప్రసంగిస్తున్నప్పుడు, అతనికి ఎటువంటి అంతరాయం యితరులు కల్గించరాదు
4) ప్రసంగిస్తున్న సభ్యునికి - సభాధ్యక్షునికి మధ్యగా నడువరాదు
5) నిద్రపోరాదు
6) ప్రసంగించే సమయంలో సభాధ్యక్షుని ఉద్దేశించి మాత్రమే ప్రసంగించాలి
7) నిశ్శబ్దంగా వుండాలి
8) ప్రసంగం సమయంలో ఎటువంటి అంతరాయంగాని, వ్యాఖ్యలుగాని చేయరాదు
9) సిగిరెట్లు, బీడీలు త్రాగరాదు

**ప్రసంగించే సభ్యులు -**

1 చర్చనీయాంశానికి సంబంధంలేని విషయాలు మాట్లాడరాదు
2 కౌన్సిలు నిర్ణయాలకు విరుద్ధంగా మాట్లాడరాదు
3 కోర్టులో పెండింగులో వున్న విషయాన్ని ప్రస్తావించరాదు
4 అధికారులు, ఉద్యోగులు, కౌన్సిలర్ల గురించి వారి అధికార హోదాకే సంబంధించి మాట్లాడాలి

5 పరుషమైన వ్యాఖ్యలు చేయరాదు

6 దేశాధ్యక్షుడు, రాష్ట్ర గవర్నరు మరియు హైకోర్టు న్యాయాధిపతుల ప్రవర్తనలపై వ్యాఖ్యలు చేయరాదు

7 తమ వాదాలను బలపరుచుకొనుటకు దేశాధ్యక్షుని పేరు వినియోగించరాదు

8 అసంబద్ధమైన, నిందాపూర్వకమైన, నేరపూరితమైన మాటలు వాడరాదు

9 సమావేశం పురోగతిని అడ్డుకొనుటకు వ్యర్థ మాటలు మాట్లాడరాదు

**సభాధ్యక్షులు మాట్లాడునప్పుడు -**

1 సభ్యులందరూ నిశ్శబ్దంగా వినాలి అప్పటికే ప్రసంగిస్తున్న సభ్యుడు తన ప్రసంగాన్ని ఆపి, తన స్థానంలో కూర్చోవాలి

2 ఏ సభ్యుడు సభనుండి బయటకు పోరాదు

**30 ప్రశ్నోత్తరాల సమయంలో**

1 సభ్యుడు/సభ్యురాలు తన ప్రశ్నను వినిపించాలి

2 ఒకే సమావేశంలో ఏ సభ్యుడు మూడు ప్రశ్నలకు మించి అడుగరాదు

3 సమావేశం రోజున జవాబులు యివ్వని ప్రశ్నలు మురిగిపోయినట్లుగా పరిగణించాలి

31 సభాధ్యక్షులు, సెక్షన్ 126 క్రింద అనుమతించిన అన్ని ప్రశ్నలను మునిసిపల్ సెక్రటరీ కమీషనరుగారికి పంపించి, వాటికి సమాధానాలు వివిధ శాఖల నుండి సకాలంలో సేకరించి, సమావేశానికి ముందుగా సభ్యులందరికి అందచేయాలి

1 ప్రశ్నలడిగినవారి క్రమ సంఖ్యలో సభాధ్యక్షులు పిలవాలి ప్రశ్న అడిగిన సభ్యులు హాజరయినట్లయితే, ప్రశ్న, దాని జవాబు చదివినట్లుగానే పరిగణించవచ్చును ప్రశ్నను అడిగిన కౌన్సిలరు సభకు హాజరుకానట్లయితే, ఆ ప్రశ్నను డ్రాప్ చేసినట్లుగా పరిగణింతురు

32 దిగువ కారణాలతో సభ్యుల ప్రశ్నలకు సభాధ్యక్షులు అనుమతి నిరాకరించవచ్చును

1 50 మాటలకు మించి, సుదీర్ఘంగావున్నా,

2 వాదాలు, నిందాపూర్వక లేదా వ్యంగ్యపూరిత వ్యాఖ్యలున్నా,

3 గత 3 నెలలకాలంలో సమావేశంలో ఏ రూపంలోనైనా చర్చకు వచ్చినా,

4 పరుషమైన. దూషణపూరిత భాష, తీవ్ర ఆక్షేపణీయమైనా,

5 ఏ కౌన్సిలరయినా తాను ప్రత్యక్షంగాగాని లేదా పరోక్షంగాగాని సంబంధించినా, అందులో భాగస్వామిగాగాని లేదా వాటాలు కలిగివున్న వృత్తిరీత్యా తన క్లయింటు వగైరాల తరపున అట్టి ప్రశ్న వుందని భావించినా,

6 తన స్టేట్‌మెంటులో తెలుపు విషయాలను ఆ సభ్యుడు ధృవీకరించలేని పరిస్థితి వున్నా,

7 పత్రికలలో ఫలానా వార్త లేక శీర్షిక వాస్తవం అవునా కాదా అనే సందేహాత్మకంగా వున్నా,

8 ప్రశ్నకు సంబంధంలేని పేర్లు, రిపోర్టు గురించినా,

9 ప్రశ్న ఒక స్టేట్‌మెంటుతో కూడివుంటే, అందులోని అంశాల వాస్తవికతను ఆ సభ్యుడు రుజువుచేయగలిగి వుండాలి

33 ఏ ప్రశ్నమీదగాని లేదా యివ్వబడిన జవాబుమీద ఎట్టి చర్చ జరగరాదు

1 కమీషనరు యిచ్చిన జవాబులో మరింత వివరణ, సమాచారం కొరకు మాత్రమే ఉపప్రశ్నలకు అనుమతి యివ్వవచ్చు ఉపప్రశ్నలు బైలాలకు భిన్నంగా వున్నాయని సభాధ్యక్షులు భావించితే అట్టి ఉపప్రశ్నలను ఆపివేయవచ్చు

2 సర్వసాధారణంగా ప్రతి ప్రశ్నకు మూడు ఉపప్రశ్నలకు అనుమతించవచ్చు అయితే ప్రశ్న యిచ్చిన సభ్యునకు ఉపప్రశ్నలడుగుటకు యితర సభ్యులకంటే, అతనికి ముందు అవకాశం యివ్వాలి

3 సమాచారం సిద్ధంగా లేనట్లయితే, సభాధ్యక్షుని అనుమతితో కమీషనర్ ప్రశ్నలకు సమాధానం యివ్వనవసరంలేదు అప్పుడు ఉపప్రశ్న ముగిస్తుంది ఆ సమాచారం కావాలని సభ్యుడు కోరితే, తర్వాత సమావేశంలో నోటీసిచ్చి ఆ ప్రశ్నను తిరిగి అడగవచ్చు

34 సమావేశంలో మొదటి గంట ప్రశ్నలు జవాబులకు కేటాయించాలి

1 ప్రశ్నలు, జవాబులను సమావేశ మినిట్సులో మునిసిపల్ సెక్రటరీ వ్రాయాలి

35 1 సభాధ్యక్షునికి సభ సక్రమ నిర్వహణకు, అతని/ఆమె నిర్ణయాల అమలుకు అధికారం గలదు

2 మునిసిపల్ సెక్రటరీ అజమాయిషీలో వుండే 'మార్షల్'ను కార్పొరేషన్ నియమించాలి

3 సభనుండి వెళ్ళిపోవలసిందిగా సభాధ్యక్షులు ఆదేశించబడిన కౌన్సిలర్ లేదా కౌన్సిలర్లను మార్షల్ ద్వారా సభనుండి తొలగించాలి

4 సభాధ్యక్షుని ఆదేశం ప్రకారం అవసరమయిన యితర సహాయంతో మార్షల్ ఆ సభ్యులను తొలగించును

## స్థాయీ సంఘం నియమ నిబంధనలు

36 స్థాయి సంఘ సభ్యులందరకు మునిసిపల్ సెక్రటరీ సమావేశం ఎజండా ఒక రోజు ముందుగానైనా పంపించాలి అత్యవసర పరిస్థితులలో, ఛైర్‌పర్సన్ అనుమతితో తప్ప,

వేరే అంశాలు సమావేశంలో చర్చించరాదు

37 స్థాయీ సంఘ ఎజండాలో పొందుపరిచిన క్రమంలోనే చర్చించబడాలి ఏదైనా ప్రత్యేక అంశం ముందుగా చర్చించాలని హాజరైన సభ్యులలో హెచ్చుమంది కోరినట్లయితే, ఆ విధంగా ముందుగా తీసుకొని నిర్ణయించవచ్చు

38 అన్ని ప్రతిపాదనలు, సవరణలు - ఒకరిచే ప్రతిపాదించబడి, మరొక సభ్యులచే బలపరచబడాలి (సెకండింగ్)

39 ఏదైనా అంశం పలు సమస్యలతో కూడి వున్నట్లయితే గందరగోళాన్ని, యిబ్బందిని తొలగించుటకు, ఛైర్‌పర్సన్ దానిని విడదీసి చర్చకు పెట్టవచ్చు

40 సభ్యులందరకు యింతకుముందే సర్క్యులేట్ చేసినట్లయితే, గత సమావేశ మినిట్సు చదివి, ధృవపరచబడినట్లుగా పరిగణించవలెను

41 అట్టి మినిట్సులో ఏదైనా పొరపాటు దొర్లిందని ఏ సభ్యుడైనా అభ్యంతరం తెలిపితే, యితర సభ్యుల అభిప్రాయాలు తీసికొని, సక్రమంగా మినిట్సులో రికార్డు చేసి, సంతకం చేయాలి

42 అన్ని పాయింట్స్ ఆఫ్ ఆర్డర్లపై ఛైర్మన్ తన నిర్ణయాన్ని వెంటనే యివ్వాలి

43 ఏదైనా అంశంపై చర్చను వాయిదా వేయాలని ఎవరైనా కోరితే, అట్టి అభ్యర్థనకు ముందు ప్రాధాన్యత యివ్వాలి

44 ప్రతి అంశంపై ఆమోదానికి అనుకూలం - వ్యతిరేకం - ఓటింగు జరగాలి

45 అంతకు ముందే నిర్ణయం జరిగిన ఏ సమస్యనైనా మూడు నెలలు దాటిన తర్వాతనే అనుమతించబడును

46 స్థాయీ సంఘం నియమించిన ఉపసంఘ నిర్వహణకు యిదే బైలాలు ప్రకారం జరుగవలెను అయితే అందులో ప్రతిపాదనలు సవరణలను బలపరచే ప్రక్రియ వుండదు

47 స్థాయీ సంఘంలోని మెజారిటీ సభ్యుల నిర్ణయాన్ని వ్యతిరేకించే ఏ సభ్యుడైనా, తన అభ్యంతరాన్ని మినిట్సులో రికార్డు చేయమని కోరవచ్చును

48 సమావేశం సమయాన్ని 15 నిముషాలు దాటిన తర్వాత ఛైర్మన్‌గాని, యితర సభ్యులుగాని సమావేశాన్ని ఫలానా టైం లేదా ఫలానా తేదీకి వాయిదా వేయవచ్చు



# 13. పదవ ఫైనాన్స్ కమిషన్ గ్రాంట్లు

ప్రతి 5 సంవత్సరాలకు ఒకసారి కేంద్ర ప్రభుత్వం ఫైనాన్స్ (ఆర్థిక) కమిషన్‌ను నియమించుతుంది ఆ కమిషన్ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఆర్థిక సంబంధాలు గురించి, కేంద్ర నిధుల నుండి రాష్ట్రాలకు చెందవలసిన నిధుల గురించి అధ్యయనం చేసి, వారు ప్రభుత్వానికి సిఫార్సులతో కూడిన నివేదికలను అందజేస్తారు అదే విధంగా 1995 నంఉడి 2000 వరకు గల 5 సంవత్సరాల కాలానికిగాను పదవ ఫైనాన్స్ కమిషన్ యిచ్చిన నివేదికలో దేశంలోని అన్ని రూరల్, అర్బన్ సంస్థలకు వాటి అభివృద్ధి పథకాలు అమలుకు తోడ్పడేందుకుగాను రు 1000 కోట్లు కేటాయించింది అందులోని రాష్ట్ర వాటా నుండి జనాభా ప్రాతిపదికపై ఆ నిధులను ఆయా స్థానిక సంస్థలకు అందచేయాల్సి వుంది కేంద్ర ప్రభుత్వం యీ నిధులను రాష్ట్ర ప్రభుత్వానికి విడుదల చేయగా, రాష్ట్ర ప్రభుత్వం ఆ నిధులను ఆయా స్థానిక సంస్థలకు విడుదల చేయాలి

పదవ ఫైనాన్స్ కమిషన్ - పంచాయతీరాజ్ సంస్థలకు రు 351 కోట్లున్నూ, పట్టణ ప్రాంత సంస్థలకు 73 94 కోట్లున్నూ కేటాయించి, ఆ నిధుల వినియోగానికి దిగువ నిబంధనలు జారీచేశారు

1 ఈ నిధులను ప్లాను వ్యయంలో భాగంగానే పరిగణిస్తారు

2 ఈ నిధులను స్థానిక సంస్థలు జీతభత్యాలు వగైరా ఖర్చులకు వినియోగించరాదు ఆయా స్థానిక సంస్థల అభివృద్ధి పథకాలకొరకు మాత్రమే వినియోగించాలి

3 స్థానిక సంస్థలు యీ నిధుల వినియోగంపై ఆమోదించిన పథకాలకే వ్యయం చేసినట్లు వినియోగ సర్టిఫికెట్లు సమర్పించాలి

4 సంవత్సరవారీగా 1996-97 నుండి 1999-2000 వరకు అర్బన్ సంస్థలకు రు 18 44 కోట్లను కేటాయించారు

5 ఈ నిధులను ప్రధానంగా మంచినీటి సరఫరా మరియు డ్రయినేజీ సౌకర్యాలు ఏర్పాటుకు వినియోగించాలని ఆదేశించారు

కాని, పదవ ఫైనాన్స్ కమిషన్ నిధులు మన రాష్ట్రంలోని కార్పొరేషన్లకుగాని, మునిసిపాలిటీలకుగాని సక్రమంగా అందలేదు కొన్నింటికి ఒక వాయిదా సొమ్ము, కొన్నింటికి రెండు వాయిదాల సొమ్ము మాత్రమే లభించింది సరైన వివరాలు లేనందున, యీ నాలుగు సంవత్సరాల కాలంలో కేంద్రంనుండి యీ పద్దుక్రింద లభించింది ఎంత? స్థానిక సంస్థలకు విడుదల చేసింది ఎంత? కేంద్రంనుండి విడుదలైన యీ నిధులలో హెచ్చు భాగం స్థానిక సంస్థలకు లభించలేదు ఆ సొమ్మును రాష్ట్ర ప్రభుత్వ ఖర్చులకే వినియోగించి, స్థానిక సంస్థలకు అన్యాయం చేశారని బలమైన ఆరోపణలున్నాయి వాస్తవంగా కేంద్రం నుండి

వచ్చిందెంత? స్థానిక సంస్థలకు విడుదల చేసిందెంత? అనే ఖచ్చితమైన వివరాలు లభించలేదు

పదకొండవ ఫైనాన్స్ కమిషన్ తన నివేదికను కొద్ది మాసాలక్రితం కేంద్ర ప్రభుత్వానికి సమర్పించటం, దానిని పార్లమెంటులో ప్రవేశపెట్టి, నివేదికను యధాతధంగా ఆమోదించటం జరిగింది

ఈ పదకొండవ ఫైనాన్స్ కమిషన్ స్థానిక సంస్థలకు ఆర్థిక సహాయం క్రింద రానున్న అయిదు సంవత్సరాలకు భారీగా నిధులు కేటాయించినట్లు పత్రికావార్తలు వచ్చాయి ఈ అంశంక్రింద అన్ని మునిసిపాలిటీలకు, నగరపాలక సంస్థలకు గతంలోకంటే హెచ్చు నిధులు విడుదల కావలసివుంది

**ఈ సందర్భంగా మరొక సూచన** కేంద్ర ఫైనాన్స్ కమిషన్ రాష్ట్రాల వాటాను ఎలా నిర్ధారణ చేస్తుందో, కొన్ని మార్గదర్శక సూత్రాల ప్రకారం - స్థానిక సంస్థలకు గూడ వాటి బాధ్యతలు, అవసరాలు గుర్తించి, తగు వాటాను నిర్ధారణచేసి, ఆ గ్రాంట్లను నేరుగా ఆయా స్థానిక సంస్థలకు అందజేయటం - నేడున్న పరిస్థితుల్లో అత్యావశ్యకంగా వుంటుంది



# 14. ఎన్నికలు నిర్వహణలో లోపాలు

ఎన్నికలు .

74వ రాజ్యాంగ సవరణ పుణ్యమా అని ప్రతి 5 సంవత్సరములకు స్థానిక సంస్థలకు విధిగా ఎన్నికలు నిర్వహించబడటం హర్షణీయం అయితే ఇటీవల కాలంలో ఎన్నికల నిర్వహణలో ఎన్నో అవకతవకలు విస్తృతంగా చోటుచేసుకోవటం దురదృష్టకరం

1 **రిజర్వేషన్లు, రొటేషన్** మునిసిపల్ సంస్థల్లో మహిళలకు, షెడ్యూల్డు జాతులు, తరగతులు, బలహీనవర్గాలకు రిజర్వేషన్లు అమలు జరుగుతున్నాయి 1995లో జరిగిన ఎన్నికలలో ఆయా తరగతులకు రిజర్వు కాబడిన కౌన్సిల్ సీట్లు - 2000వ సంవత్సరంలో జరిగిన ఎన్నికల్లో రొటేషన్‌కు చేయబడిన నియమ నిబంధనలు అశాస్త్రీయంగా వుండి, తీవ్ర అసంతృప్తికి దారితీశాయి గత ఎన్నికల్లో మహిళలకు కేటాయించిన స్థానాలు ఈసారి మరల మహిళలకు యివ్వరాదని, అదే విధంగా ఇతర వర్గాలకు కేటాయించినవి, యీసారి వారికి వుండరాదని నిర్దేశించడం వల్ల తీవ్ర గందరగోళం ఏర్పడింది

రిజర్వేషన్ల విధానాన్ని పాటిస్తూనే, ఇప్పుడు అనుసరించిన లోపభూయిష్టమైన విధానాన్ని తప్పనిసరిగా మార్చాలి ఉదా బలహీనవర్గాలు అతి తక్కువ శాతం వున్నచోట్ల బలహీన వర్గాలకు, నిమ్నజాతులు శాతం మొత్తం ఓట్లలో 10%గాను లేనిచోట్ల వారికి కేటాయించటం ప్రజాస్వామికంగాదు లోగడ మహిళలకు, యితరులకు రిజర్వయిన స్థానాల్లో మరొక సారి మహిళలు యితర వర్గాలవారు వుంటే, ఏమీ ఉపద్రవం రాదు నిత్యం రొటేషన్ వుంటే, తమ వార్డులపై శ్రద్ధ చూపి, నిరంతరం శ్రమచేసి, వార్డును అభివృద్ధిపరచి, ప్రజాభిమానం పొందిన వారికి మరల, అక్కడ నుండి పోటీచేయటాన్ని నిరోధించితే, ఎవ్వరికి వారి ప్రాంతాలను అభివృద్ధి చేయాలనే పట్టుదల, ఆసక్తి వుండదు ఎలాగూ ఎన్నికైనాం గదా! 5 ఏళ్ళు తన పదవి ఖాయం రాబోయే ఎన్నికల్లో ఎలాగూ ఆ వార్డునుండి అతడు/ఆమె పోటీ అవకాశం లేనందున, శ్రద్ధాసక్తులు తగ్గుతాయి అందువల్ల రిజర్వేషన్, రొటేషన్ రూల్సును శాస్త్రీయంగాను, శ్రద్ధతో పనిచేసే వారికి ప్రోత్సాహకరంగా వుండేలాగున రూల్సును మార్చాల్సి వుంది

2 1995లో ఏర్పాటయిన వార్డుల్లో తీవ్రమైన అసమానత్వం ఏర్పడింది ఉదా విజయవాడలో రెండు మూడు వార్డుల్లో 20,000 పైగా ఓటర్లు వుంటే, దాదాపు 10 వార్డుల్లో అయిదువేలలోపు ఓట్లు - ఒక వార్డు 2700 మాత్రమే ఓట్లు కలిగి వుంది ఇది తప్పక సరి చేయవలసిన అంశం

అయితే, 2000 సంవత్సరంలో జరిగిన ఎన్నికల్లో ఎలాంటి మార్పులు లేకుండా తిరిగి అదే వార్డులను కొనసాగించటం ఎంతైనా ఆక్షేపణీయం గత ఎన్నికల తర్వాత, రాష్ట్ర ప్రభుత్వం జారీచేసిన ఉత్తర్వులలో "యీ అసమానతను తొలగించాలనే సదుద్దేశం"తో

వార్డులను పునర్వ్యవస్థీకరించటానికి ఉత్తర్వులు జారీ అయ్యాయి తర్వాత 3 సంవత్సరాలు వ్యవధి వున్నా ఆ ఉత్తర్వులను ప్రభుత్వమే అమలుజరపటానికి ఏమాత్రం శ్రద్ధ చూపలేదు ఆ ఉత్తర్వులు అమలుజరిగితే, పట్టణంలోని మొత్తం ఓట్లను వార్డులకు సరిసమానంగా వుండేలా చేసి మార్చాలి అదే విధంగా వార్డుల సరిహద్దులు భౌగోళిక సారూప్యంగా వుండాలి

1991లో తయారయిన జనాభా ఓటర్లను పది సంవత్సరాలు గడచి, 2000 సంవత్సరంలో అత్యధికంగా పెరిగిన జనాభా, ఓటర్లను పరిగణనలోనికి తీసుకోకపోవటం ఏమాత్రం సమర్ధనీయంగాదు ఎలాగూ ఎన్నికలు అయిపోయాయి గనుక, రానున్న ఎన్నికలకొరకైనా, వార్డుల పునర్వ్యవస్థీకరణ, రిజర్వేషన్లు, రొటేషన్ విధానాలను మార్పుచేసే విషయం రాష్ట్ర ప్రభుత్వం అత్యంత ప్రాధాన్యతగా చేపట్టాల్సి వుంది

3 ఫోటో గుర్తింపు కార్డుల అవశ్యకత లక్షలాది ప్రజలున్న పట్టణాలు, నగరాలలో ఓటర్లను గుర్తించటం అసాధ్యం అదే గ్రామాల్లో అయితే 99% ఓటర్లను ఆ గ్రామంలో ఎవరైనా గుర్తించే అవకాశం ఉంది కాని, ప్రక్కింటి వారిపేరు ఏమిటో, ఏమి చేస్తారో కూడా తెలియని మన పట్టణాలు, నగరాలలో లక్షలాదిమంది ఓటర్లను గుర్తించటం ఏ శాఖకుగాని, ఉద్యోగికిగాని, ఏ అభ్యర్ధికిగాని సాధ్యమయ్యేదికాదు అందుచేత, కనీసం అర్బన్ ఏరియాల్లోనైనా ప్రతి ఓటరుకు ఫోటో గుర్తింపు కార్డులు వుండాలి అంతమాత్రం చేత దొంగ ఓట్లు వుండవని ఎవ్వరూ చెప్పలేరు కాని 90% పైగా దొంగ ఓట్లను అరికట్టేందుకు వీలవుతుంది

4 మన రాష్ట్రంలో గత అయిదారు సంవత్సరాలలో రెండు మూడుసార్లు పార్లమెంటు ఎన్నికలు జరిగాయి అలాగే, 1999 సెప్టెంబరులో శాసనసభ ఎన్నికలు జరిగాయి ఈ కాలంలో కొట్టొచ్చినట్లు కనపడిన విశేషం - అభ్యర్థులు కోట్ల రూపాయలు ఖర్చు చేయటం చూశాం శాసనసభకు 2 కోట్లు, పార్లమెంటుకు అయిదు కోట్లు రూపాయలు ఒక్కొక్క అభ్యర్థి ఖర్చు చేసిన సందర్భాలున్నాయి

ప్రజలు, ముఖ్యంగా పేద, మధ్యతరగతుల ప్రజలను కొనుగోలు చేసే, అతి హేయమైన, అనైతికమైన ధోరణులు - వాటికి తోడు విచ్చలవిడిగా సారా, బ్రాందీల సరఫరాలు, పదులకొలది వాహనాలు ఏర్పాటు, అత్యంత ఆధునికమైన ఆడంబరమైన ప్రచార కార్యక్రమాలు - ఎవరి శక్తికి తగినట్లుగా వారు చేయటం చూస్తున్నాం

ఎన్నికల కమిషన్లు ప్రకటించిన ఎన్నికల ప్రవర్తనా నియమావళి ఘోరంగా వైఫల్యం చెందింది ఎన్నికల ప్రవర్తనా నియమావళి అమలుకు పర్యవేక్షణ చేయటానికి నియమించ బడిన ఉన్నత అధికారుల కండ్లముందే యీ వికృత అట్టహాసాలు జరగటం మరింత ఘోరం కమిషన్ నిర్ణయించి, ఎన్నికల ఖర్చుకు వందల రెట్లకు పైగా వ్యయంచేసినా, నిలువరించగల స్థితి లేకపోవటం విచారకరం

ఈ నేపథ్యంలో, ఇటీవల జరిగిన మునిసిపల్ ఎన్నికల్లో కూడా ధనం, మద్యం, కులం

- ఎన్నికల గెలుపును ప్రభావితం చేశాయంటే, ఏమాత్రం అతిశయోక్తి లేదు చైర్‌పర్సన్, మేయర్లు కొంతమంది కోటి రూపాయలు వ్యయం చేశారని, వార్డు కౌన్సిలర్లు సహితం ఒక్కొక్కరు అయిదారు లక్షలకు తగ్గకుండా వ్యయం చేశారంటే, విడ్డూరంగానే వుంటుందనటంలో సందేహం లేదు

ప్రతి అభ్యర్థి దాఖలు చేసిన ఎన్నికల ఖర్చులు పూర్తిగా అబద్ధాలనే వాస్తవాన్ని ఎవరూ కాదనలేరు దొంగ ఓట్లు, బూత్ స్వాధీనం, మద్యం, డబ్బు పంపకం, కులం పేరుతో ప్రచారాలు - లక్షల రూపాయల వ్యయం - ఇవన్నీ ప్రవర్తనా నియమావళికి పూర్తిగా విరుద్ధం అయినా, వాటిని అరికట్టి, నిజాయితీగల, నిస్వార్థులైన సామాన్య ప్రజాసేవకులు ఎన్నికల్లో పాల్గొనేందుకు ప్రభుత్వం రాజకీయ పార్టీలు కల్పించకపోతే, ఇది బూటకపు ప్రజాస్వామ్యం అవుతుంది లక్షల కరపత్రాలు, పోస్టర్లు వేసి ప్రెస్‌లనుండి వెయ్యి లేదా 5 వేలు మాత్రమే వేయించినట్లు తప్పుడు బిల్లులు సృష్టించుతుంటే అడ్డుకునేది ఎవరు?

కనీసం - ఈ స్థాయిలోనైనా డబ్బు, మద్యం, ఆర్భాటం, ప్రభావాలు తగ్గాలంటే ప్రజల మనోభావాలకు అనుగుణ్యంగా వారు ఓట్లు నిర్భయంగా, స్వేచ్ఛగా వినియోగించుకోవాలంటే, దిగువ చర్యలు కొంతవరకు తోడ్పడవచ్చు

1 ముందుగా రాజకీయ పార్టీలు నామమాత్రంగా ప్రవర్తనా నియమాలను అంగీకరించటం కాక, ఆచరణలో వాటికి కట్టుబడి వుండేలాగున కట్టుబాటు చేయాలి

2 ఎన్నికల కవసరమయిన పార్టీల అభ్యర్థుల ప్రచార కార్యక్రమాన్ని క్రమబద్ధం చేయాలి సమంజసంగా వుండే రీతిలో కరపత్రాలు, పోస్టర్లు, బహిరంగవేదికలు వగైరాలను సక్రమంగా నిర్ధారణ చేసి, ప్రభుత్వమే అభ్యర్థులకు అందచేసే పద్ధతిని ప్రవేశపెట్టాలి

3 రాష్ట్ర మంత్రులు ఎన్నికల ప్రక్రియలో పాల్గొనరాదు అధికారంలోగలవారు శుష్క వాగ్దానాలు చేసి, ప్రజలను మభ్యపరిచే అవకాశాలు వుండరాదు (ఉదా 2000 సం॥ ఎన్నికలలో రాష్ట్ర ముఖ్యమంత్రి దాదాపు అన్ని మునిసిపాలిటీలు నగరాలు, లక్షల వ్యయంతో, హెలికాప్టరు ద్వారా దర్శించి, అనేకమైన వాగ్దానాలను చేసి, వారి పార్టీ అభ్యర్థులను గెలిపించాలని కోరటం పూర్తిగా అప్రజాస్వామికం అందుచే మంత్రులు, ముఖ్యమంత్రులు స్థానిక ఎన్నికల్లో ప్రచారం చేయరాదు

4 ప్రవర్తనా నియమావళిని పర్యవేక్షించే అధికారులు తమ కళ్ళెదుటే జరుగుతున్న నిబంధనల ఉల్లంఘనను నిలిపివేసే అధికారం వుండాలి ఉల్లంఘనకు పాల్పడిన అభ్యర్థులను తక్షణం ఎన్నికలబరి నుండి తొలగించాలి

5 ఎన్నికల నిర్వహణలో నియమించబడిన అధికారులు, సిబ్బంది, పోలీసులు - నిజాయితీతో వ్యవహరించాలి పోటీలో వున్న ఎవరిపట్లనైనా అనుకూలంగా వ్యవహరిస్తున్నట్లు పట్టుబడితే, వారిపై కఠిన చర్యలు తీసుకోబడాలి

# 15. స్థానిక సంస్థలు - అవినీతి జాడ్యం

సర్వవ్యాపితంగా వున్న యీ అవినీతి జాడ్యం స్థానిక సంస్థలలోను క్రమక్రమంగా పెరగటం, పౌరులలో తీవ్ర ఆందోళన, యిబ్బందులు కల్గించే ప్రమాదకర స్థాయికి చేరింది అత్యధిక అవినీతికి ప్రభుత్వశాఖలలో కొన్నింటిలో మునిసిపాలిటీలు, నగరపాలక సంస్థలు చేరిపోయాయి ముఖ్యంగా మునిసిపల్ సంస్థల్లో రెవిన్యూ, టౌన్‌ప్లానింగ్, ఇంజనీరింగ్ శాఖలలో విస్తృతంగాను, మిగతా శాఖలలో కొంత పరిమితంగా వుందని ప్రజల ఫిర్యాదులు

**1. రెవిన్యూలో :** పన్నుల నిర్ణయంలోను, వసూళ్ళలోను పెద్ద ఎత్తున అవినీతి జరుగుతుంది అటు గృహ యజమానులు సమంజసమైన పన్నులు చెల్లించకుండా, రెవిన్యూ అధికారులు మమేకమై తక్కువ పన్నులు విధించటం పరిపాటి తక్కువ పన్నుతో గృహ యజమాని, ఆ విధంగా సహాయపడినందున రెవిన్యూ అధికారులు బాగా లాభపడుతుండగా, మునిసిపల్ సంస్థలు ఇతోధికంగా ఆదాయాన్ని కోల్పోతున్నాయి ఇందుకు ఆస్కారం ఇస్తున్న పన్ను విధింపు విధానాన్ని ఇటీవల మార్చి, భవన నిర్మాణం, క్వాలిటీ, వినియోగం, విస్తీర్ణం జోన్ వగైరాలు ప్రాతిపదికన ఒక్కొక్క ప్రాంతంలో అద్దె రేట్ల నిర్ణయించటంవల్ల అవినీతి యీ శాఖలో తగ్గుతుందని ఆశించినా, పూర్తిగా అవినీతి నిరోధించబడలేదు

కొంతమంది పన్నులు వసూలుచేసి, వాటిని సకాలంలో మునిసిపల్ ట్రెజరీలో జమ చేయకపోవటం, అంటే దుర్వినియోగం చేయటం, ఖాళీ జాగాలో పన్ను వసూలుచేసి, వసూలయిన పన్నులు అసలు చెల్లించకుండా, భూకామందు ఆచూకీ దొరకటంలేదని, అందువల్ల పన్ను వసూలుకాలేదని తెలియచేస్తుంటారు

**2. టౌన్ ప్లానింగ్ శాఖలు :** ఈ శాఖలో అవినీతికి ఆస్కారం ఎక్కువ ప్లానింగ్ ఆఫీసర్స్, బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్లు వగైరా అతి తేలికగా వేలు, లక్షల రూపాయలు గుంజుతున్నారు దాదాపు 75% పైగా భవన నిర్మాతలు రూల్సుకు, అప్రూవ్డ్ ప్లాన్లకు భిన్నంగా నిర్మాణాలు కొనసాగించుకుంటున్నారు అయినా వాటిని నిరోధించే అధికారం కలవారు మిన్నకుండటమో లేక పరోక్షంగా సహాయపడటం పరిపాటి అసలు ఎలాంటి ప్లాన్లు లేకుండా కట్టేవారు చాలామంది వున్నారు

అపార్టుమెంట్లు, నిర్మాణాలు పెరిగిన తర్వాత, యీ Violations బాగా పెరిగాయి సాధారణ నిబంధనల ఉల్లంఘనలతోపాటు, కొంతమంది ప్లానులు లేకుండానే అంతస్తులు పెంచుచున్నారు పార్కింగు కొరకు వినియోగించుకోవలసిన స్థలాల్లో షాపులు కట్టి, తదితర లాభసాటి పనులకు వినియోగిస్తున్నారు

హైదరాబాద్ నగరంలో లక్షల్లో, విశాఖ, విజయవాడల్లాంటి నగరాలలో వేలాది ఇలాంటి నిబంధనలలోలేని భవనాలు నిర్మాణం అవుతున్నాయి ఇవన్నీ టౌన్ ప్లానింగ్ అధికారుల

చలవవల్లేనని పలువురు ఆరోపిస్తున్నారు

రోడ్ల మార్జిన్లను ఆక్రమించుకొని, భవనాలు, షాపులు నిర్మించేవారు తక్కువేమీ కాదు

**3 ఇంజనీరింగ్ శాఖపై పలు విమర్శలు వున్నాయి .** 1) అంచనాలు తయారీలోనే ఎస్ ఎస్ ఆర్ రేట్లకంటే అదనంగా వేస్తుంటారని, రోడ్లు, భవనాల కొలతలు తేడాలుగా చూపి, అంచనాలు పెంచుతున్నట్లు,

2) రోడ్లు, భవనాల నిర్మాణంలో స్పెసిఫికేషన్లలో పొందుపరచిన క్వాలిటీ, క్వాంటిటీలను తగ్గించి పనులు చేస్తున్నా, ఉపేక్షిస్తుంటారని,

3) నాసిరకం మెటీరియల్ వినియోగం ద్వారానే బ్రిడ్జీలు, రోడ్లు, భవనాల క్వాలిటీ తగ్గిపోయి, కూలిపోతున్నాయని,

4) అన్ని స్థాయిల్లోను అంచనాలపై పర్సెంటేజీలు విదిగా వసూలు చేస్తారని,

5) వస్తువుల నాణ్యతను పట్టించుకోకుండా కొనుగోలుచేసి, హెచ్చు ధరలను చూపి అదనంగా బిల్లులు వేసి సంపాదించుతారని, ఏ మునిసిపాలిటీ, నగరపాలక సంస్థల్లో కాపిటల్ పనులకు కేటాయింపులు హెచ్చుగా వుంటాయో అక్కడ చాలా హెచ్చు స్థాయిలో అధికారులు, ఇంజనీర్లు, వారి సహాయకులు, ఆడిట్ శాఖలు, ఆదాయాలు పొందుతున్నారని అభియోగాలు

**4 శానిటేషన్ :** అవినీతికి ఈ శాఖ కూడా మినహాయింపు కాదు మునిసిపాలిటీలు కొనే చీపుళ్ళనుండి సున్నం, తట్టలు నుండి డ్రయిన్లను శుభ్రపరచుట, సిల్టు తీయుటకు వగైరా పనులకు వినియోగించే తాత్కాలిక కార్మికుల వినియోగంలో అత్యధికంగా సంఖ్య చూపించుతారని, ఇక కల్తీ పదార్థాల, హోటల్స్, సినిమాహాల్సు, పరిశుభ్రతా ప్రమాణాలను పరిరక్షించకుండా వదలటం ద్వారా ఆయా యజమానులనుండి ఆరోగ్య శాఖాధికారులు, సిబ్బంది నెలవారీ ముడుపులు పొందుతారని,

**వాటరు, డ్రైనేజీ కనెక్షన్లు** అధికారయుతంగా ఇవ్వకుండానే గుప్తంగా కనెక్షన్లు యివ్వటం, చివరకు మంజూరయిన కనెక్షన్లు ఇవ్వటానికి టాప్‌కు ఇంతని, డ్రైనేజీ కనెక్షన్లకు ఇంతని, పరిస్థితినిబట్టి సిబ్బంది అక్రమ వసూళ్ళు చేస్తారని ఫిర్యాదులు కోకొల్లలు

**5. జనన, మరణ సర్టిఫికెట్లు :** అనేక అవసరాలకొరకు యీ సర్టిపికెట్లు ప్రజలకు అవసరం ఇవి జారీచేయటానికి నిర్దిష్టమైన నిబంధనలున్నా వాటిని ఖాతరు చేయకుండా, దరఖాస్తుదార్ల అవసరాన్ని గుర్తించి, వారిని వేధించి అక్రమ వసూళ్ళు చేస్తారని ఫిర్యాదులు

అయితే, ఈ శాఖలన్నింటికి వేల రూపాయల జీతాలు పొందే ఉన్నతాధికారులకు అధికారాన్నివ్వడం, పాటించవలసిన నియమాలు, నిబంధనలు పుష్కలంగా వున్నా, కొంతమందిపై ప్రజల ఫిర్యాదుల మూలంగా నేరాలు పట్టుబడినా, లేదా ఎ సి బి వారి ట్రాపింగు ద్వారా పట్టుబడినా ఇందులో చాలా హెచ్చుభాగం ఏ శిక్ష లేకుండానే, తప్పించుకో గలగటం విశేషం

ఉన్నతాధికారులమీద అవినీతిని ఆదుకొంటున్నవారిపై దాడిచేయాలంటే ప్రభుత్వ అనుమతి కావాలి అక్రమ ఆర్జన ధనం లక్షలు, కోట్లు దొరికినా, వారిపై ప్రాసిక్యూషన్‌కు ప్రభుత్వ అనుమతి కావాల్సి వుండగా, అలాంటి అనుమతులు ఏండ్లు గడిచినా రాని సందర్భాలు అనేకం వున్నాయని ఎ సి బి అధికారుల ఆక్రందన

ప్రజలనుండి అక్రమ వసూళ్ళు చేసే మునిసిపల్ సిబ్బంది ఉద్యోగులు - వారి కార్యాలయాల్లోనే బదిలీలకు, ఇంక్రిమెంట్లకు, ప్రమోషన్‌లు వగైరాలకు ఆయా శాఖల్లో లంచాలు విరివిగా గుంజుతున్నారనే వాస్తవం ఎవరూ కాదనలేరు

చట్టాల్లో వున్న కొన్ని లొసుగుల కారణంగా, వాటి ఆధారంగా నేరస్తులయిన అవినీతి పరులు తేలికగానే తప్పించుకోగలుగుతున్నారు దీనికితోడు రాజకీయ నాయకులు, ప్రజా ప్రతినిధుల ప్రవేశంతో ఇలాంటివి మరింత జటిలంగా తయారవుతున్నాయి

ఏళ్ళతరబడి బదిలీలు లేకపోవడం, కొన్ని తరగతుల ఉద్యోగులు జాయిన్ అయిన నాటినుండి రిటైరయ్యే వరకు ఎలాంటి బదిలీలు లేకపోవటం, పరిపాలనాధికారుల ప్రాపకంతో, ఒకేచోట పాతుకుపోయి, శ్రద్ధాసక్తులు తగ్గి, పనుల్లో మందగొండితనం ప్రదర్శించటం అరుదుకాదు

అవినీతి నిరోధక శాఖలోనే అవినీతిపరులు జొరపడితే, ఇక యీ సమస్యలకు పరిష్కారం ఏమిటో?

**నివారణకు మార్గాలు :**

1 అధికారులు, ఉద్యోగులు ప్రతి సంవత్సరం తమ ఆస్తుల వివరాలను శాఖాధికారులకు సమర్పించాలి వీటిని ఎప్పటికప్పుడు పరిశీలించి తగు చర్యలు తీసుకునేందుకు యంత్రాంగం వుండాలి ఈ సమాచారం అందరికి అందుబాటులో వుంచాలి

2 అవినీతికి గురయిన వ్యక్తి హోదాతో నిమిత్తం లేకుండా - తన ఆదాయ వనరుల ఆదాయంకంటే అదనపు ఆస్తి కలిగి వున్నప్పుడు, పట్టుబడగానే తక్షణం సర్వీసునుండి సస్పెండు చేయబడాలి అక్రమ ఆస్తులపై నిఘా పెట్టాలి

3 అవినీతి పరిశోధక శాఖ సమర్పించిన రిపోర్టు ఆధారంగా న్యాయస్థానంలో కేసు నమోదు చేసే అధికారం వారికి వుండాలి

4 ప్రాసిక్యూషన్‌కు రాష్ట్ర ప్రభుత్వ ఆమోదానికి పంపిన కేసుల్లో 30 రోజుల్లోగా నిర్ణయం రానట్లయితే, ఆమోదం లభించినట్లుగానే పరిగణించి, తదుపరి చర్యలకు అవినీతి నిరోధక శాఖ పూనుకోవాలి

5 నేరం రుజువయిన సందర్భాలలో అన్యాయంగా ఆర్జించిన యావత్తు ఆస్తులను ప్రభుత్వానికి లేక మునిసిపల్ సంస్థకు దఖలు చేయాలి

6 అవినీతి రుజువై శిక్షలుపడినవారి కేసులు ప్రసార మాధ్యమాలద్వారా బహుళప్రచారం జరగాలి

7 రాజకీయ నాయకులు లేదా ఉన్నతాధికారుల జోక్యం లేకుండా కేసులు పరిష్కారం కాబడాలి

8 అవినీతి నిరోధక చట్ట పరిధిలోనికి మంత్రులు, అన్ని స్థాయిల ప్రజాప్రతినిధులు, రాజకీయ నాయకులను కూడా చేర్చాలి

కాని, అవినీతిని కొంతమంది, కొన్ని వర్గాల ప్రజలు, వ్యాపారులు, యితరులు ప్రోత్సాహం యిచ్చే నేటి స్థితి మారాలి తమ సమస్యలను సరైన మార్గాలద్వారా పరిష్కారం చేసుకునే నైతిక స్థాయిని పెంపొందించుకోవాలి

*ప్రత్యేకంగా మునిసిపాలిటీలు, మునిసిపల్ కార్పొరేషన్లలో ఎన్నికైన వివిధ స్థాయిలల్లో ప్రజా ప్రతినిధులు నిజాయితీగా, నిబంధనల ప్రకారమే నిక్కచ్చిగా పరిపాలన కొనసాగటానికి పూనుకుంటే, స్థానిక సంస్థల్లో వివిధ రూపాల్లో విజృంభిస్తున్న అవినీతికి అడ్డుకట్ట వేయటంలో ఎంతగానో దోహదపడుతుంది రాజకీయాలకు అతీతంగా, పట్టణాల, నగరాల అభివృద్ధికి సమైక్యంగా, సహకార భావంతో పదవీ బాధ్యతలు స్వీకరించే సమయంలో చేసిన ప్రమాణాన్ని గుర్తెరిగి నిజమైన ప్రజాసేవకులుగా వ్యవహరించగలిగితే, సత్పరిపాలనను అందించగలుగుతారు ప్రతి సంవత్సరం ఏప్రియల్‌లో తమ ఆస్తులను తెలియజేయటం, దానిని బహిరంగంగా ప్రకటించితే మంచి సాంప్రదాయాన్ని నెలకొల్పిన వారవుతారు*

పై విధంగానూ, కఠినమైన చర్యలద్వారా, పూర్తిగా కాకపోయినా, చాలావరకు అవినీతిని అరికట్టడానికి అవకాశం వుంటుంది



# 16. కాడర్ పాలసీ

ప్రస్తుతం అమలులో వున్న కాడర్ పాలసీ మునిసిపల్ సంస్థలు వారు ఎదుర్కొంటున్న బాధ్యతలు సమర్థవంతంగా నిర్వహించటానికి దోహదపడటంలేదు ఈ కాలంలో నూతన సవాళ్ళు - వాటి పరిష్కారానికి అవగాహన, అనుభవం గల వివిధ తరగతుల ఉద్యోగులను ఎంపిక చేసి, సీనియారిటీతోపాటు, సమర్థత, చొరవ, పరిజ్ఞానం కొలబద్దలుగా ప్రమోషనల్ పద్ధతులు అవలంబించాలి

పట్టణాలు, నగరాలు నేడు పరిష్కరించవలసిన మంచినీటి సరఫరా, డ్రైనేజీ వ్యవస్థ, సాలిడ్ వేస్టు మేనేజిమెంటు, కంప్యూటరైజేషన్, సామాజిక సేవలు వగైరా బహువిధ సేవలకు అనుగుణ్యంగా ఉద్యోగ బృందం తయారుకావాలి అందులో భాగంగా మునిసిపల్ సర్వీసు ప్రత్యేకంగా రూపుదిద్దుకోవాలి నూతన సవాళ్ళు ఎదుర్కోవటానికి అవసరమయిన సాంకేతిక, జనరల్ పరిజ్ఞానం యివ్వటానికి శాశ్వత పద్ధతిమీద ట్రైనింగ్ సంస్థను నెలకొల్పాల్సి వుంటుంది అలాంటి ఏర్పాటు లేకపోవటం పెద్ద లోపంగా వుంది

అలాగే, సీనియర్ అధికారులను విదేశాలకు ప్రత్యేక శిక్షణ, అధ్యయనం కొరకు లక్షల రూపాయలు వ్యయం చేసి పంపుచున్నా, తిరిగి వచ్చిన తర్వాత వారు విధిగా మునిసిపల్ సర్వీసులో వుండటానికి ఆస్కారం లేదు వారిని యితర శాఖలకు బదిలీలు చేయటంతో వారు పొందిన విజ్ఞానం నిరుపయోగం అవటం ప్రత్యక్షంగా చూస్తున్నాం అందువల్ల ఉన్నతస్థాయి అధికారులు, వివిధ అంశాలలో అనుభవం, సాంకేతిక పరిజ్ఞానం పొందినవారితో రాష్ట్ర మునిసిపల్ సర్వీసు విధిగా ఏర్పర్చాలి

ప్రస్తుతం 115 మునిసిపాలిటీలు, 7 నగరపాలక సంస్థలున్నా, ఇంకా రానున్న కాలంలో మరికొన్ని నూతనంగా ఆవిర్భవించవచ్చు వాటినన్నింటిని ప్రయోజనకరంగా, సమర్థవంతంగా నిర్వహించటానికి, చాలినంతమంది ప్రత్యేక శిక్షణ పొందిన అధికార బృందం వుండాలి మునిసిపల్ సంస్థలు గ్రేడ్‌ల తేడాను పెద్దగా పట్టించుకోకుండా, అవసరమయిన సంస్థలకు వీరి సర్వీసులను వినియోగించుకోవటం అత్యవసరం

రెవిన్యూ, ఇంజనీరింగ్, ప్లానింగ్, ఆరోగ్యం, కంప్యూటరీకరణ, సామాజిక సేవలు, వాతావరణ పరిరక్షణలాంటి వివిధ సర్వీసులకు తగినంత మందికి శిక్షణలు ఇచ్చి వారి సర్వీసులను వినియోగించుకోవటం మిక్కిలి ప్రయోజనకరంగా వుంటుంది

ప్రస్తుతం వివిధ తరగతుల ఉద్యోగులు - పరిపాలనా సంబంధమైన ఉద్యోగులు క్లాసు 2, 3, 4 సర్వసాధారణంగా ఏ పట్టణంలో, సర్వీసులో చేరితే అక్కడే రిటైరవుతున్నారు అక్కౌంటెంట్లు, మేనేజర్లు, సీనియర్ అసిస్టెంట్లు, ఉపాధ్యాయులు వగైరాలు ఏళ్ళతరబడి ఒకే ప్రాంతంలోనే స్థిరపడిపోయి పనితనంపై శ్రద్ధాసక్తులు తగ్గి, తమ విధులను

నిష్పక్షపాతంగా, చురుకుగా చేయటంలేదు అందువల్ల పరిపాలనలో స్తబ్ధత, ఉదాశీనత పెరిగిపోయాయి ఈ విధానం మారాలి ఒక కార్పొరేషన్ నుండి మరొక కార్పొరేషన్‌కు సెలెక్షను, స్పెషల్ గ్రేడ్, మునిసిపాలిటీలకుగాని బదిలీల విధానం తప్పనిసరిగా ప్రవేశపెట్టాలి ఈ సర్వీసులో చేరటం నుండి రిటైరయ్యేవరకు ఒకేచోట వుండటంతో, ఉద్యోగులకు స్వార్ధ ప్రయోజనాలు పెరగటం, విధుల నిర్వహణలో తగినంత శ్రద్ధ చూపకపోవటం చూస్తున్నాం

మునిసిపల్ సర్వీసులను, రాష్ట్రీయకరణ చేయాలి కొన్ని ఉద్యోగ సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు యీ విధానాన్ని వ్యతిరేకించటంలో ఆశ్చర్యం లేదు అయినా, సర్వీసుల స్థాయి పెరగటానికి అలక్ష్యంగా, అశ్రద్ధగా వుంటే వేరే పట్టణానికి బదిలీ అయ్యే విధానం అమలులో వుంటే, ఉద్యోగులు వగైరా మరికొంత శ్రద్ధతో తమ విధులు నిర్వహించటానికి కృషి చేస్తారు

పై తరగతుల ఉద్యోగులను - నాల్గవ తరగతి మినహా - మిగతావారిని ప్రతి 3 సంవత్సరాలు లేదా కొన్ని సందర్భాలలో కనీసం 5 సంవత్సరాలకు బదిలీ విధానం ప్రవేశ పెట్టడం అవసరం



# 17. మహిళల్లో సామాజిక పరివర్తన

మన జనాభాలో సగం భాగం మహిళలు తాజా సర్వే ప్రకారం మహిళల్లో అక్షరాస్యత 45 శాతం మాత్రమే అయితే, దశాబ్దాలుగా స్త్రీలు విద్యాధికులై, డాక్టర్లుగా, లాయర్లుగా, ఇంజనీర్లుగా, ఉపాధ్యాయినులుగా, రచయిత్రులుగా అనేక రంగాలలో ప్రావీణ్యత పొందుతున్నారు పారిశ్రామికవేత్తలుగా, క్రీడా సాంకేతిక శాస్త్రరంగాలలో ముందడుగు వేస్తుండటం హర్షదాయకమే

అయితే, గ్రామసీమలలోని అసంఖ్యాక స్త్రీలు, పట్టణాలు, నగరాలలో గణనీయమైన సంఖ్యగా వున్న స్త్రీలు నిరుద్యోగులుగా జీవనం గడుపుతున్నారు విపరీతంగా పెరిగిన జీవన వ్యయంతో, కుటుంబ యజమాని పురుషుడు సంపాదన కుటుంబ నిర్వహణకు చాలడంలేదు లక్షలాదిగా వున్న యీ స్త్రీల శక్తి నిరుపయోగంగా వుంటుంది పైగా పేదరికం, పిల్లల పోషణ, విద్యాబుద్ధులు గరపడం, వివాహాలు చేయటం, యింత నీడ కల్పించటానికి వారు పడే బాధలు, తపనలు మనకెల్లరకు తెలుసు

ఈ సమయంలో మహిళల్లో చైతన్యంపెంచి, వారి శ్రమశక్తిని వినియోగించుకుని, సమాజాభివృద్ధికి, తమ స్వంత కుటుంబ పోషణకు కొంతగానైనా తోడ్పడేందుకు పలు పథకాలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రూపొందించి అమలుజరుపుతున్నాయి అందులో ప్రధానంగా మహిళా స్వయం సహాయ బృందాలుగా ఏర్పడి, వారి జీవిత విధానాన్ని మార్చుకుంటున్నారు ఈ బృందాలు - ముందు పొదుపుసంఘాలుగా, రోజుకు ఒక్క రూపాయి చొప్పున నెలకు రు 30/-లు పొదుపు చేసుకుని, ఆ గ్రూపులోని సభ్యులకు వారి అవసరాలు తీర్చుకోటానికి స్వల్పకాల రుణాలుగా యిచ్చి, ఆదుకుంటున్నారు దరిమిలా, యీ గ్రూపులకు బ్యాంకు రుణాలు యివ్వబడటం, ప్రభుత్వం కూడా ఆర్థికంగా యీ గ్రూపులకు వివిధ రూపాలలో సహాయపడటంతో యీనాడు మన రాష్ట్రంలో గ్రామగ్రామాన, అన్ని పట్టణాలలో వందలు, వేలు, లక్షల బృందాలు ఆవిర్భవించి, ఎంతో పురోగతిని సాధిస్తున్నాయి

తమ ఖాళీ సమయాన్ని సద్వినియోగం చేసుకుంటున్నారు అనేక రకాలైన వృత్తి శిక్షణను పొంది, రకరకాలైన గృహోపకర వస్తువులు, సరుకులు తయారుచేస్తున్నారు వారు తయారుచేసిన వివిధ ఆకర్షణీయమైన వస్తువులకు మంచి గిరాకీ వుండటంతో, జిల్లా స్థాయి, రాష్ట్ర స్థాయి డ్వాక్రా బజార్లు నిర్వహించి, వారు తయారుచేసిన పలు రకాలైన వస్తువుల విక్రయానికి సౌకర్యాలు కల్పించుచున్నారు బ్యాంకులు కూడా ముందుకు వచ్చి యీ ఉద్యమానికి సహాయ సహకారాలు అందించటంతో, యీ ఉద్యమం మంచి వూపు నందుకుంటుంది

ఈ బృందాలు పట్టణాలు, నగరాలలో బహువిధ కార్యక్రమాలు చేపట్టడం చూస్తున్నాం పారిశుద్ధ్య మెరుగుదలకు, పార్కులు, తోటల అభివృద్ధికి, అక్షరాస్యతా ఉద్యమానికి, ప్రజల్లో చైతన్యం కల్పించటం ద్వారా, ఆరోగ్య పద్ధతులు, పరిసరాల పరిశుభ్రతను పెంపొందించటానికి తమ సేవలు అందచేస్తున్నారు ఇవేగాక, నిర్మాణ పనులు, రోడ్లు, డ్రయిన్లు, భవనాలు, సి డి యస్ ద్వారా కేంద్ర ప్రభుత్వం యిస్తున్న యస్ జె యస్ ఆర్ వై , యన్ యస్ డి పి పథకాలకు, మునిసిపాలిటీలు, మునిసిపల్ కార్పొరేషన్లు విడుదల చేస్తున్న కోట్ల రూపాయల ఆర్థిక సహకారంతో పలు అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టి పూర్తిచేస్తున్నారు

ఇదొక సామాజిక విప్లవం కుల, మత, రాజకీయాలకు అతీతంగా, స్త్రీలు చైతన్యం పొంది, సమాజాభివృద్ధిలో గణనీయమైన పాత్రను పోషించటం హర్షదాయకం మన రాష్ట్రంలో 3 లక్షల, 38 వేల బృందాలు ఏర్పడి, అందులో దాదాపు 50 లక్షల మహిళలు సభ్యులుగా వుంటూ, రు 400 కోట్లను పొదుపు చేసుకుని, 650 కోట్ల రూపాయలు కార్పస్ ఫండ్ ఏర్పర్చుకొని, ఆర్థిక కార్యకలాపాలు నిర్వహించటం, స్వయంశక్తిని పెంపొందించుకుంటున్నారు భారతదేశం మొత్తంలో 2 లక్షల 10 వేల గ్రూపులుండగా మన రాష్ట్రంలో 3,80,000 గ్రూపులు సమర్థవంతంగా పనిచేస్తున్నాయి ఇది గర్వించదగ్గ పరిణామమే

అయితే, ప్రస్తుతం అన్నిరంగాలకు వ్యాపిస్తున్న అవినీతి చాయలు యిందులోను చొచ్చుకురావటం, రాజకీయ పక్షాలు, నాయకులు యీ ఉద్యమంలోనికి చొరబడి, కలుషితం చేయటం బాధాకరము

గత సంవత్సరం యీ గ్రూపులకు, కమ్యూనిటీ డెవలప్‌మెంట్ సొసైటీలకు జరిగిన ఎన్నికలు - జనరల్ ఎన్నికలను మరిపించే స్థాయిలో కొన్ని రాజకీయ పక్షాలు వ్యవహరించటం యిందుకు తార్కాణం ఈ చీడను దూరంగా వుంచనట్లయితే, యీ ఉద్యమం పక్కదార్లుపట్టి, లక్ష్యంలోనే దూరం కావటం తథ్యం



# 18. చట్టాల్లో మార్పులకోరకు, అధికారాలు, నిధులకోరకు ఆందోళనా పోరాటాలు (1995-99)

1995 మార్చిలో మునిసిపాలిటీలు, కార్పొరేషన్లకు ఎన్నికలు జరిగాయి మునిసిపాలిటీలలో అధిక సంఖ్యలో కాంగ్రెస్‌వారు ఛైర్‌పర్సన్‌గా ఎన్నికకాగా, కార్పొరేషన్లకు రెండు కాంగ్రెస్, రెండు టి డి పి , ఒకటి సి పి ఐ మేయర్లుగా ఎన్నికైనారు మొదటిసారిగా 35మంది మహిళలు ఛైర్‌పర్సన్స్‌గా ఎన్నికైనారు విద్యాధికులున్నప్పటికీ మునిసిపల్ వ్యవహారాలు, చట్టాలు, రూల్సు కొత్త అంతకుముందు ప్రత్యేక అధికారాలు వున్నవారే కమిషనర్లుగా కొనసాగటంతో కొత్త చిక్కులు ఏర్పడ్డాయి 1992 నుండి 95 వరకు వారే పరిపాలకులుగా కమిషనర్లు వుండటంతో, సర్వాధికారం వారిదే కొత్తగా ఛైర్‌పర్సన్స్ ఎన్నికైనా, వారికి తగిన గౌరవం, గుర్తింపు, బాధ్యతలు యివ్వటంలో కమిషనర్లు సక్రమంగా వ్యవహరించలేకపోయారు ఛైర్‌పర్సన్స్‌లో నిరాశ, నిస్పృహ విస్తృతంగా చోటుచేసుకుంది

ఆ తరుణంలో వామపక్షాల నాయకత్వానగల విజయవాడ నగరపాలక సంస్థ రాష్ట్రంలోని అందరు ఛైర్‌పర్సన్స్, మేయర్ల సదస్సును 18-6-1995న విజయవాడలో నిర్వహించింది అధికారాలు, నిధులు ప్రధాన సమస్యలుగా గుర్తించి, వాటి సాధనకుగాను రాష్ట్రస్థాయి సమన్వయ కమిటీ ఏర్పడింది మరొక ఆరునెలల్లో రెండవ సదస్సు నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ ఆధ్వర్యంలో జరిగింది ఆనాడు పురపాలక శాఖామాత్యులు రెండు రోజులు సదస్సులో పాల్గొని ప్రజాప్రతినిధుల గోడు, బాధలు, అవసరాలు చాలా ఓపికగా విన్నారు పురపాలక సంస్థలకు నగరపాలక సంస్థలకు ఎన్నికైనవారే అధిపతులని, కమిషనర్లు వారికి లోబడి పనిచేయాలని, ఆ విధంగా ఉత్తర్వులు యివ్వగలమని మంత్రిగారు ఆ సదస్సులో హామీ యిచ్చారు

మునిసిపాలిటీల, నగరపాలక సంస్థలకు సంబంధించి విడివిడిగా డిమాండ్స్ యివ్వటం జరిగింది కాని, హామీ యిచ్చినట్లుగాని, ఆశించిన మేరకుగాని రాష్ట్ర ప్రభుత్వం నుండి నెలలు గడిచినా స్పందన రాలేదు

ఒకవైపున ఆంధ్రప్రదేశ్ మునిసిపల్ ఛైర్మన్ మండలి, రెండోవైపు నగరపాలక సంస్థల తరపున, మూడోవైపు రాష్ట్ర పంచాయతీ సర్పంచుల సంఘం ఆధ్వర్యంలో 1996-97, 98, 99 సంవత్సరాలలో వారివారికి సంబంధించిన సమస్యలు, అంశాలపై సదస్సులు, సభలు, ప్రదర్శనలు, ధర్నాలు, నిరాహారవ్రతాలు, ఆయా సంస్థల తీర్మానాలు - మొత్తం స్థానిక సంస్థలు అధికారాలు, నిధులకొరకు శాంతియుత ఆందోళనలు కొనసాగాయి

పదిమంది ఛైర్‌పర్సన్స్ వారంరోజులు నిరాహారదీక్ష హైద్రాబాద్ వారి కార్యాలయంవద్ద చేశారు సమస్యల్ని పరిష్కారం చేస్తామనే మంత్రి హామీతో నిరసన దీక్ష విరమించారు కాని ఫలితం శూన్యం ముఖ్యమంత్రి చూపుతున్న నిరాదరణ, నిర్లక్ష్యానికి నిరసనగా రాష్ట్ర సర్పంచుల సంఘ కార్యవర్గ సభ్యులు 60 మంది ముఖ్యమంత్రి నివాసంవద్ద ఆత్మాహుతి చేసుకోవటానికి సిద్ధపడగా, అప్పుడు ముఖ్యమంత్రిగారు స్పందించి, కొన్నింటిని పరిష్కారం చేశారు అలాగే నేను, మా డిప్యూటీ మేయరు ఆమరణ నిరాహారదీక్ష చేయటానికి సిద్ధపడిన తర్వాతనే కొన్ని సమస్యలనైనా పరిష్కరించటానికి ప్రభుత్వం అంగీకరించింది పర్యవసానంగా 1994లో ఉపసంహరించబడిన మునిసిపాలిటీలలో కాంట్రాక్టు కమిటీల ఛైర్‌పర్సన్ అధికారాలను పునరుద్ధరణకు ప్రభుత్వం అంగీకరించి, ఉత్తర్వులు యిచ్చింది ఏమీ అధికారాలులేని మేయర్లకు కూడా స్వల్ప అధికారాలు కల్పిస్తూ ఉత్తర్వులు యిచ్చింది అలాగే సర్పంచులకు కూడా చెక్‌పవర్, పదవ ఆర్థిక సంఘం గ్రాంట్లు, వృత్తిపన్ను రిలీజు వగైరాలు రాబట్టుకొ గలిగారు 74వ రాజ్యాంగ సవరణ చట్టం స్థానికసంస్థలు వాస్తవ స్వయం పాలనా సంస్థలుగా వ్యవహరించటానికి అవసరమైనవి ఖచ్చితంగా అమలుపరచాలని, పదవ ఫైనాన్స్ కమిషన్ గ్రాంట్లు విడుదల చేయాలని, తదితర కోర్కెలు రాష్ట్ర ప్రభుత్వం ముందు వుంచటం యీ తరహా ఉద్యమాలు స్థానిక సంస్థల చరిత్రలో జరగటం యిదే ప్రథమం అయినా, ప్రభుత్వం యితర రాష్ట్రాలతో పోల్చినా, ఈ విషయంలో చాలా వెనుకబడి వుందనేది నిర్వివాదాంశం

## 18-6-95 విజయవాడలో జరిగిన నగరపాలక సంస్థల మేయర్ల, పురపాలక సంఘాధ్యక్షుల రాష్ట్ర సదస్సులో ఆమోదించబడిన తీర్మానాలు

1 74వ రాజ్యాంగ సవరణ చట్టం ఫలితంగా స్థానిక సంస్థల ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుటకు అవసరమైన సిఫార్సులు చేయుటకు రాష్ట్ర ఆర్థిక కమిషన్ నియామకంపట్ల యీ సదస్సు తన హర్షాన్ని తెలియచేస్తుంది

పురపాలక సంఘాలు, నగరపాలక సంస్థలు చాలాకాలంగా ఆర్థిక యిబ్బందులను ఎదుర్కొంటున్న యదార్థాన్ని ఎవరూ కాదనజాలరు నిత్యం పెరుగుతన్న జనాభాతో, అంతకంటే హెచ్చుగా పెరుగుతున్న వ్యయం కారణంగానూ పురపాలక సంఘాలు, నగర పాలక సంస్థలకు వస్తున్న ఆదాయాలు చెప్పుకోదగ్గ పెరుగుదల లేనందున ఏ పట్టణంలోగాని, నగరంలోగాని ప్రజల కనీస అవసరాలు తీర్చలేని దుస్థితి ఏర్పడింది కొన్ని పురపాలక సంఘాలు తమ సిబ్బంది జీతాలను సహితం చెల్లించలేని స్థితి, విద్యుత్ బిల్లులు కూడా చెల్లించలేని దుస్థితిపట్ల సదస్సు తీవ్ర ఆందోళనను వెలిబుచ్చుతున్నది

కారణాలు ఏవైనా, ఏ పార్టీలు ప్రభుత్వాన్ని నిర్వహించినా, రాష్ట్ర జనాభాలో దాదాపు 29% వున్న నగర, పట్టణ జనాభాల అవసరాలు తీర్చవలసిన బాధ్యతలు గల స్థానిక

సంస్థలకు తగు విధంగా రాష్ట్ర ప్రభుత్వాలనుండి సహాయం అందకపోవడం యదార్థం 1993 అక్టోబరు 1 నుండి అమలుజరిపిన గృహవిస్తీర్ణం, జోనల్ పద్ధతిపై ప్రవేశపెట్టిన నూతన పన్నులవల్ల చెప్పుకోతగ్గ విధంగా పురపాలక సంఘాల, నగరపాలక సంస్థల ఆదాయాలు పెరగలేదు పెరిగిన కొద్ది కూడా పెరిగిన ద్రవ్యోల్బణంతో హరించుకుపోయింది స్థానిక సంస్థలు అసలు రాజ్యాంగంలోనే నిన్నటివరకు గుర్తింపులేనివిగా వుండటంతో రాష్ట్ర ప్రభుత్వం, ఆయా మంత్రివర్గాల దయాదాక్షిణ్యాలతో యీ సంస్థలు మనుగడ సాగించవలసి వచ్చింది ఈ దయనీయ దుస్థితి నుండి రక్షించటానికి స్థానిక సంస్థల ఆదాయ వనరులు, ఆదాయం పెరుగుదలకు రాష్ట్ర ప్రభుత్వానికి లభించు వివిధ ఆదాయాల నుండి స్థానిక సంస్థలకు చట్టపరమైన వాటాను కల్పించటంతో పరిస్థితి మెరుగవటానికి అవకాశాలు ఏర్పడ్డాయని సదస్సు భావించుతుంది దీర్ఘకాలంగా రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలపై స్థానిక సంస్థలు ముఖ్యంగా మేయర్ల సంఘం, ఆంధ్ర పురపాలక సంఘ మండలివారు చేసిన, చేస్తున్న ఆందోళనల కారణంగా నేడు స్థానిక సంస్థలు రాజ్యాంగపరంగా పరిపాలనలో మూడవ అంచెగా (కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల తర్వాత) చట్టబద్ధ గుర్తింపు లభించింది దాని ఫలితంగా ఏర్పర్చబడిన A P State Finance Commission త్వరలో తన అధ్యయనాన్ని పూర్తిచేసి, మునిసిపాలిటీల, నగరపాలక సంస్థల ఆర్థిక పరిపుష్టికి స్పష్టమైన సమర్థవంతమైన సిఫార్సులను అందజేయగలందులకు కోరుచున్నాం

దిగువ విధంగా రాష్ట్రానికి లభించే ఆదాయంలో పురపాలక, నగరపాలక సంస్థలకు వాటా యివ్వాలని యీ సదస్సు కోరుతుంది

1 రాష్ట్రంలో వసూలవుతున్న వృత్తిపన్ను నుండి 95% స్థానిక సంస్థలకు యివ్వాలి ఈ పన్ను వసూలు లోగడవలె ఆయా మునిసిపాలిటీలకు నగరపాలక సంస్థలకు అప్పగించాలి

2 వినోదపు పన్ను వసూలును కూడా స్థానిక సంస్థలకు అప్పగించాలి ఈ మధ్యకాలంలో సినీ పరిశ్రమకు యిచ్చిన వివిధ రాయితీల కారణంగా వినోదపు పన్ను ఆదాయం దాదాపు 1/4 నుంచి 1/3 వరకు తగ్గటం గమనార్హం ఈ లోటును రాష్ట్ర ప్రభుత్వం భర్తీచేసి గ్రాంటు రూపంలో చెల్లించాలి

3 మోటారు వాహనాల పన్ను వసూలు నుండి ఆయా పట్టణ, నగరంలోని వాహనాల సంఖ్యనుబట్టి వసూలుచేస్తున్న పన్ను నుండి 25%ను స్థానిక సంస్థలకు విధిగా యివ్వాలి

4 ఆయా పట్టణాలలో, నగరాలలో వసూలవుతున్న అమ్మకంపన్ను నుండి కనీసం 10% స్థానిక సంస్థలకు కేటాయించాలి

5 పంచాయతీరాజ్ శాఖలో వలెనే మునిసిపల్ సిబ్బంది జీతభత్యాలు రాష్ట్ర ప్రభుత్వమే భరించాలి

6 ఆయా పట్టణాలలో, నగరాలలో వున్న రాష్ట్ర ప్రభుత్వ ఆస్తులపై ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం చెల్లించుచున్న గ్రాంటును నేటి పరిస్థితుల కనుగుణ్యంగా పెంచాలి

7 కేంద్ర ప్రభుత్వ ఆస్తులపై పన్ను విధించరాదనే సెక్షన్‌ను రద్దుచేయాలి లక్షలాది కోట్ల రూపాయల లావాదేవీలు జరుపుతున్న రైల్వేలు, పి అండ్ టి పరిశ్రమలు వగైరాలు నుండి యితరుల నుండి వలెనే ఆస్తిపన్నును వసూలుచేసుకొనే హక్కును సంస్థలకు చట్టపరంగా కల్పించాలి

8 పట్టణాలలో, నగరాలలో మంచినీటి సరఫరాకు వినియోగించే విద్యుత్‌ను గ్రామ పంచాయతీలకు యిచ్చిన విధంగా జి ఓ నెం 48 తేది 5-6-1984 ప్రకారం పురపాలక సంఘాలకు, నగరపాలక సంస్థలకు వర్తింపచేయాలి

9 మునిసిపల్, నగరపాలక సంస్థల వాహనాలను మోటారు వాహనాల పన్ను నుండి మినహాయించాలి

10 ప్రతినిత్యం పెరుగుతున్న ధరల కారణంగా సిబ్బంది కరువుభత్యం పెరగటంతో ఆ భారాన్ని స్థానిక సంస్థలు భరించే స్థితిలో లేనందున, అదనపు కరువుభత్యాన్ని 100% రాష్ట్ర ప్రభుత్వం భరించటం న్యాయం

11 ఆయా పట్టణ, నగర పరిధిలో వసూలుచేస్తున్న గనుల ఆదాయం నుండి, నదిలో వున్న ఇసుక సీనరేజివల్ల వస్తున్న ఆదాయం నుండి 50% యివ్వాలి

12 స్థిరాస్తుల అమ్మకంద్వారా లభించే ఆదాయం నుండి నూటికి 95% తగ్గకుండా స్థానిక సంస్థలకు యివ్వాలి

13 రాష్ట్ర శాసనసభ ఆమోదించినట్లుగా కేబుల్ టి వి ల నుండీ వచ్చే ఆదాయంలో 95% స్థానిక సంస్థలకు యివ్వాలి

14 ప్రతి సంవత్సరం రాష్ట్ర ప్రభుత్వం ఖర్చు చేస్తున్న "ప్లాను" ఫండ్సు నుండి జనాభా ప్రాతిపదికపై ఆయా సంస్థల అభివృద్ధికి పంపకం చేయాలి

15 ఆయా పట్టణాలు, నగరాలలో వసూలయ్యే ఇన్‌కంటాక్స్, కస్టమ్స్ శాఖ ఆదాయం నుండి 10% తగ్గకుండా స్థానిక సంస్థల వాటాగా యివ్వాలి

16 రాష్ట్ర ప్రభుత్వ బాధ్యతయైన విద్యాలయాల నిర్వహణకు అయ్యే వ్యయాన్ని నూటికి నూరుపాళ్ళు రాష్ట్ర ప్రభుత్వం ఆయా స్థానిక సంస్థలకు గ్రాంటుగా యివ్వాలి

17 మార్కెట్ల సెస్సు వసూలు నుండి సమంజసమైన వాటాను మార్కెట్ యార్డులున్న పట్టణాలకు, నగరాలకు యివ్వాలి

18 రాష్ట్ర ప్రభుత్వం నుండి పై పద్దుల ద్వారా యిచ్చు వాటాను ప్రతి సంవత్సరం రివైజ్ చేసే ఏర్పాటుండాలి

19 నిత్యం పెరుగుతున్న జీతభత్యాల బిల్లులతో, తదితర సర్వీసుల, (Works) పనుల వ్యయం పెరుగుతుండటంవల్ల కనీస సదుపాయాలు కల్పించలేని పరిస్థితుల్లో, ఎన్నికైన ఛైర్మన్‌లు, ఛైర్‌పర్సన్‌లు, నగరపాలక సంస్థల మేయర్లు తమను ఎన్నుకొన్న ప్రజల అసంతృప్తికి కొన్ని సందర్భాలలో తీవ్ర అసంతృప్తికి గురికాబడటం సర్వసామాన్యంగా వుంది అధికారాలు కుదించుకుపోయి నిధులు చాలక దాదాపు పేరుకుమాత్రం "స్వపరిపాలన"గా వున్న దుస్థితి తప్పించి, సకాలంలో ప్రజల అవసరాలను తీర్చి, వారి మన్ననలను పొంది, నేటి పట్టణాలు, నగరాలు ప్రజాజీవితానికి అనుకూలమైన వాతావరణం, పారిశుధ్ధ్యం, మంచినీటి సరఫరాలతో ముందుకు సాగటానికి పైన ఉదహరించిన కోరికలను State Finance Commission ఆమోదించి రాష్ట్ర ప్రభుత్వానికి గట్టి సిఫార్సు చేయాలి ఆ సిఫార్సును రాష్ట్ర ప్రభుత్వంవారు విశాలభావంతో ఆమోదించి అమలుజరుపుతూ గ్రామీణ, పట్టణ, నగర ప్రజల సర్వతోముఖాభివృద్ధికి దోహదం చేయాలని యీ సదస్సు రాష్ట్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తుంది

కేంద్రం నుండి రాష్ట్రాలకు న్యాయంగా రావలసిన వాటాలను, ఎలా రాష్ట్ర ప్రభుత్వం కోరటం ఎంత సమంజసమో, రాష్ట్రాల స్వయంపాలనలో కేంద్ర జోక్యం వుండరాదని మన ముఖ్యమంత్రిగారు కోరటం ఎంత న్యాయమో, అదేవిధంగా స్థానిక సంస్థలకు తగినంత వాటా రాష్ట్రాదాయం నుండి కావాలని కోరటం, స్థానిక స్వపరిపాలనను ఖచ్చితంగా ఆమోదించాలని కోరటం అంతే న్యాయంగా రాష్ట్రాధినేతలు గమనించి, గుర్తించి తదనుగుణంగా స్థానిక సంస్థలను ఆదుకోవాలని, ప్రోత్సహించాలని యీ సదస్సు విజ్ఞప్తి చేస్తుంది

1 ఎ రాష్ట్ర ప్రభుత్వం, రాష్ట్ర ఫైనాన్స్ కమిషన్ను నియమిస్తూ 1997 మార్చి వరకు తమ నివేదికను సమర్పించుటకు గడువు పెట్టినందున, కమిషన్ నియామకంవల్లగాని, వారి సిఫార్సులవల్లగాని మునిసిపాలిటీలకు, నగరపాలక సంస్థలకు ఆర్థికపరమైన సహాయం అందటానికి కనీసం 3 సంవత్సరాల సమయం పట్టునుగాన అప్పటివరకు మునిసిపాలిటీలు, నగరపాలక సంస్థలు ఆర్థిక యిబ్బందులతో సతమతమవుతూ ఏమీ పురోభివృద్ధిని సాధించలేవు అనే వాస్తవాన్ని దృష్టిలో వుంచుకొని, ఫైనాన్స్ కమిషన్ పూర్తి నివేదికను 21-3-1996లోగానే ఇవ్వాలని ఆదేశించాలని లేదా అది సాధ్యంకానట్లైతే మధ్యంతర నివేదికను 31-12-1995లోగా సమర్పించేలాగా ఆదేశించాలని, యీ సదస్సు రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతూవుంది

## వినోదపు పన్ను నష్టాన్ని భర్తీచేయాలి

2 మునిసిపాలిటీల, నగరపాలక సంస్థల ఆదాయంలో వినోదపుపన్ను ఆదాయం గణనీయంగా వుంటుంది రాష్ట్రంలో యిటీవలకాలంలో అనేక పట్టణాలలో, నగరాలలో సినిమా థియేటర్లు పెరిగాయి అయినా స్థానిక సంస్థల ఆదాయాలు 1/4 నుండి 1/3 వరకు తగ్గుతున్నాయి కారణం రాష్ట్ర ప్రభుత్వం సినీ పరిశ్రమకు యిచ్చిన వివిధ రాయితీల వల్లనేగాక, 28-5-1995న ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావుగారు ప్రకటించిన భారీ రాయితీలవల్ల - మరింత ఆదాయాన్ని యీ స్థానిక సంస్థలు కోల్పోతున్నాయి ఈ నష్టాన్ని భర్తీచేయవలసిందిగా కోరుతున్నా, ఫలితం కలుగలేదు

10-4-1995న విజయవాడ నగర మేయర్ ముఖ్యమంత్రి గౌ॥ ఎన్ టి రామారావును కలిసి యీ విషయం ప్రస్తావించినప్పుడు శ్రీ రామారావుగారు తీవ్రంగా స్పందించి, సినీ పరిశ్రమకు యిచ్చిన రాయితీలవల్ల ఏ స్థానిక సంస్థ నష్టపడకూడదని, ఆ నష్టాన్ని రాష్ట్ర ప్రభుత్వం గ్రాంటు రూపంలో యివ్వటం ధర్మమని, ఆ విధంగా ఆదేశాలు యివ్వగలనని చెప్పిన గౌరవనీయ ముఖ్యమంత్రిగారికి ఈ సదస్సు కృతజ్ఞతలు తెలియచేస్తూ, వారి వాగ్దానం మేరకు బకాయీలతో సహా చెల్లించుటకు తగు ఉత్తర్వులు అత్యవసరంగా యిప్పించ వలసిందిగా యీ సదస్సు ముఖ్యమంత్రిగారిని అభ్యర్థిస్తూ తీర్మానించుతుంది

## ప్రస్తుత చట్టాలను సమూలంగా మార్చి తెలుగులో ప్రచురించండి

3 ప్రస్తుతం అమలులో వున్న 1955 సం॥ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ చట్టం, 1965 ఆంధ్రప్రదేశ్ పురపాలక సంఘం చట్టాలలో అనేక సవరణలు తీసుకొనిరావాలని లోగడ రాష్ట్రప్రభుత్వం ఏర్పాటుచేసిన స్టాండింగ్ కమిటీ చేసిన సిఫార్సులు అమలుకు నోచుకోనందుకు యీ సదస్సు తన అసంతృప్తిని తెలియచేస్తుంది

గత 30 సంవత్సరాల కాలంలో యీ రెండు చట్టాలను స్థానిక స్వపరిపాలన భావనకు అనుగుణంగాలేని అనేక సవరణలు, ప్రభుత్వ ఉత్తర్వులు యివ్వటం ద్వారా రాష్ట్ర ప్రభుత్వ అధికార కేంద్రీకరణ హెచ్చి, అనేక విషయాలలో సిఫార్సులు చేసే స్థితికి దిగజారాయని యీ సదస్సు నమ్ముతుంది రాష్ట్రంలో అధికారంలో ఏ పార్టీ వున్నా, మరింతగా స్థానికంగా ఎన్నికైన - అందులోనూ లక్షలాదిమంది ఓటర్లచే ప్రత్యక్షంగా ఎన్నికైన ఛైర్మన్‌లు, మేయర్లు తమ స్థాయికి తగిన అధికారాలులేక నిస్సహాయ స్థితిలో వున్నారనేది నగ్నసత్యం

73వ రాజ్యాంగ సవరణ చట్టాన్ని, 74వ రాజ్యాంగ సవరణ చట్టాన్ని మన రాష్ట్రంలో ప్రవేశపెడుతూ, ప్రభుత్వాధినేతలు పరిపాలనను ప్రజల వాకిలిముందుకు తెస్తున్నామని, ప్రజాప్రతినిధులకు మంచి అవకాశాలు కల్పించుచున్నామనే మాటల్లో చెబుతున్నా, ఆచరణలో వాటి సారాంశం కూడా అమలులో వుండటంలేదు

# 19. స్థానిక స్వపరిపాలన బలోపేతం చేయుటకు రాష్ట్ర ప్రభుత్వ సూచనలు

స్థానిక సంస్థలను బలోపేతం చేసేందుకుగాను నల్గురు క్యాబినెట్ మంత్రులతో ఒక సబ్ కమిటీని రాష్ట్ర ప్రభుత్వం 1999లో నియమించింది వారు కొన్ని పట్టణాలు, నగరాలు పర్యటించి, సమావేశాలు జరిపి వివిధ తరగతుల ప్రజాప్రతినిధులతో చర్చలు జరిపిన అనంతరం, ఆ సబ్ కమిటీవారు ప్రభుత్వానికి అందచేసిన సిఫార్సులు యిలా వున్నాయి

1 74వ రాజ్యాంగ సవరణ చట్టంలో మునిసిపల్ సంస్థలకు బదిలీ చేయవలసిన 12వ షెడ్యూలు దాఖలా 18 బాధ్యతలలో దిగువ తెలిపిన ఆరు బాధ్యతలు

1) ఆర్థిక సాంఘికాభివృద్ధికి ప్లానింగ్

2) రోడ్లు, బ్రిడ్జీలు

3) ఫైర్ సర్వీసులు

4) అడవుల పెంపకం, పర్యావరణ రక్షణ పెంపుదలకు కార్యక్రమం

5) వికలాంగుల, మానసిక, బలహీనవర్గాల ప్రయోజనాలను పరిరక్షించుట

6) సాంస్కృతిక, విద్యా విషయక, నైతికపరమైన అంశాలను పెంపొందించుట

2 పర్యావరణ రక్షణ చాలా ప్రాధాన్యత సంతరించుకుంది అందుచే, ప్రభుత్వ సహాయంతో, నీటి నిల్వ పథకం, మొక్కలు నాటే కార్యక్రమాలు చురుకుగా కొనసాగించాలి

3 ఘన, వ్యర్థపదార్థాల నిర్మూలన పథకాల కొనసాగింపును ఆరోగ్యశాఖ నుండి తప్పించి, ఇంజనీరింగు శాఖకు అప్పగించి, అందులో కొందరికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని కల్పించి, వారి సేవలను వినియోగించుకోవాలి ఈ రంగంలో ప్రైవేటు, పెట్టుబడి అంత ఉత్సాహంగా లేనందున, వారికి అదనపు ప్రోత్సాహకాలు యిచ్చేందుకు ఆలోచించాలి

4 ప్రస్తుత రెండు చట్టాల ప్రకారంగా ఛైర్‌పర్సన్స్, మేయర్లకంటే కమిషనర్లకే హెచ్చు అధికారాలున్నాయని ప్రజాప్రతినిధులకు ఎలాంటి అధికారాలు లేవని వాపోయారు ఆర్థిక పరిమితులను చట్టంలోనే విధించారు ప్రతిసారి యీ పరిమితి పెంచాలంటే ప్రభుత్వం ఆమోదం అవసరం పైగా ఏనాడో నిర్ణయించిన పరిమితులు ప్రస్తుతం చాలవు అందుచే ప్రస్తుత పరిస్థితులను బట్టి అన్ని ద్రవ్యసంబంధమైన పరిమితులు పెంచాలి

5 కార్పొరేషన్ చట్టం, మునిసిపాలిటీల చట్టంలో కమిషనర్లకు హెచ్చు అధికారాలున్నాయి ఎన్నికైన మేయర్లకు, ఛైర్‌పర్సన్స్‌కు ద్రవ్యపరమైన అధికారాలు లేవు వారికి కూడా

కొంతమేరకు మంజూరుచేసే అధికారాలు కల్పించటం అవసరం కమిషనర్లకుగాని, మేయర్, ఛైర్‌పర్సన్స్‌కు యీ అధికారం యిచ్చే సందర్భంలో బడ్జెట్‌లో కాపిటల్ వర్క్స్ కేటాయింపుల్లో 10%కు మించి వుండరాదు

6 ప్రస్తుతం మునిసిపల్ బడ్జెట్‌లను ప్రభుత్వం ఆమోదించాలి చాలాకాలం వృధా అవుతుంది ఈ పద్ధతిని రద్దుచేసి, కౌన్సిళ్ళు తమ ఆదాయ వ్యయాలను వారే తయారు చేసుకునేందుకు అవసరమయిన మార్గదర్శక సూత్రాలను ప్రభుత్వం రూపొందించి వాటి ప్రకారంగా బడ్జెటును తయారుచేసుకుని అమలుజరుపుటకు అవకాశాలు కల్గించాలి

7 వారి స్వంత నిధులతో చేపట్టే పనులకు కూడా కొన్నింటికి ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం ఆమోదం కావాలి ఇది అనవసరం ఈ విధానం మార్చాలి

8 పన్నులు, లైసెన్సు ఫీజులు, ఛార్జీలు పెంచినప్పుడల్లా ప్రభుత్వ ఆమోదం అవసరం వుంది ఆయా కౌన్సిల్సు కూడా అంగీకరించాలి తమ ఆదాయాలను పెంచుకొనటానికి ఆయా కౌన్సిల్సు చేసే ప్రయత్నాలను ప్రోత్సహిస్తూ, పన్నులు, ఛార్జీలు, ఫీజులు పెంచటానికి మునిసిపాలిటీలు ఆసక్తి చూపుటలేదు అందుచేత, కౌన్సిలు ఆమోదంతో నిమిత్తం లేకుండా, ప్రభుత్వ ఉత్తర్వులు అమలుపరచాలి ఈ ఉత్తర్వులను అమలు జరప నిరాకరించే మునిసిపల్ సంస్థలకు ప్రభుత్వ గ్రాంట్లు కోతపెట్టాలి

9 చట్టాలలోని వివిధ సెక్షన్ల ననుసరించి అనేక రూల్సు చేయబడి అమలు జరుగుతున్నాయి

10 పన్నులు, పన్నులుకాని సందర్భాలలో కొన్ని మినహాయింపులు యిచ్చేందుకు ప్రభుత్వానికి అధికారం వుంది అలాంటి మినహాయింపులు, రాయితీలు యిచ్చేందుకు అవసరమయిన మార్గదర్శక సూత్రాలను రూపొందించుటకు ఒక మేయరు, ఒక ఛైర్‌పర్సన్, పరిపాలన శాఖ కమిషనర్లతో కూడిన ఒక ఉపసంఘాన్ని నియమించి, వారు తుదిరూపం యివ్వటం సమంజసంగా వుంటుంది

11 ప్రస్తుతం ఎన్ ఎస్ డి పి , ఎస్ జె ఎస్ ఆర్ వై పనులను కమ్యూనిటీ సొసైటీల ద్వారా అమలుజరుపుతున్నారు అయితే ఆయా పట్టనాల మునిసిపల్ కౌన్సిలు పాత్రను విస్మరించకూడదు కౌన్సిలు, సి డి యస్ ల మధ్య వుండవలసిన సంబంధాలను స్పష్టంగా నిర్ధారణ చేయటం అవసరం పురపాలకశాఖ జాయింటు సెక్రటరీ, పురపాలక శాఖ డైరెక్టరుగాని వారి ప్రతినిధిగాని, ఒక సి డి ఎస్ అధ్యక్షులు, ఒక ఛైర్‌పర్సన్‌లతో కూడిన ఒక కమిటీని ఏర్పర్చి, వారి సిఫార్సుల ప్రకారం రెండు సంస్థల పట్ల సంబంధాలు నిర్ణయం చేయటం అవసరం

12 ప్రస్తుతం మునిసిపాలిటీలలో జమా ఖర్చుల ఆడిట్ సక్రమంగా జరగటంలేదు

ఇకనుండి ఏ సంవత్సరానికా సంవత్సరం ఆడిట్ పూర్తిచేసేందుకు చర్యలు తీసుకోవాలి అవసరమయితే స్థానికంగా వుండే ఛార్టర్డు అక్కౌంట్సుకు యీ ఆడిట్ బాధ్యతలను అప్పగించి, వారి రిపోర్టులకు కౌన్సిలు ముందుంచాలి కౌన్సిలు ఒక ఆడిట్ కమిటీని నియమించాలి ఆడిట్‌లో తేలిన ఆర్థికపరమైన దుర్వ్యయంగాని, వ్యర్థవ్యయాలకు బాధ్యులైన వారిపై చర్యకు అవకాశం వుండాలి

13 మునిసిపాలిటీలు ప్రభుత్వం నుండి సాధారణ గ్రాంట్లు, నష్టపరిహారాలు పొందు తున్నాయి అవిగాక 10వ, 11వ ఫైనాన్స్ కమిషన్లనుండి, రాష్ట్ర ఆర్థిక కమిషన్ సిఫార్సుల ద్వారా, యన్ యస్ డి పి యస్ జె యస్ ఆర్ ల క్రింద పెద్ద మొత్తాల్లో నిధులు లభించు చున్నవి ఈ నిధులు ఏఏ సంస్థకు ఏఏ దామాషాలో యివ్వాలో సూచనలు యివ్వాలని పురపాలక శాఖను కోరారు

## ఆదాయాలు పెంచటానికి విధానాలు

1 మునిసిపల్ ఏరియాల్లో యిచ్చే సర్వీసులకు అయ్యే ఖర్చును పూర్తిగా వినియోగ దారులనుండి వసూలు చేయాలి బ్యాంకుల్లాంటి సంస్థలనుండేగాక, ప్రైవేటు పెట్టుబడిని ఆకర్షించగలగాలి పోటీలతో సర్వీసులు మెరుగవుతాయి ప్రజలకు మెరుగైన సేవలు, తక్కువ ఖరీదుకు అందించటానికి అవకాశం కల్పించాలి ప్రస్తుత రేట్లు ఆ సర్వీసు కల్గించ టానికయ్యే ఖర్చులో మూడవవంతు లేదు ఒకేసారి రేట్లు, ఛార్జీలు పెంచితే, పెద్ద భారం అవుతున్నది అందుచేత క్రమక్రమంగా పెంచేందుకు ప్రయత్నిస్తూ పూర్తి ఖర్చులను దీర్ఘకాలం మీద పొందుటకు చర్యలు తీసుకోవాలి ఇందుకు నాందీగా, ప్రస్తుతం వున్న రేట్లను, ఛార్జీలను, ఫీజులను 25% వెంటనే పెంచి, ప్రతి సంవత్సరం 10% పెంచుకుంటూపోవాలి ఆ విధంగా పెంచమని రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసిన 7 రోజుల్లోగా అమలు జరపాలి ఏ మునిసిపాలిటీ దానిని అమలుజరపదో, అట్టి సంస్థలు ప్రభుత్వ గ్రాంట్లు పొందుటకు అర్హత కోల్పోవును

2 పట్టణ ప్రజలు వారికందుతున్న సేవలు తృప్తికరంగా వుంటే, పన్నులు వారంతట వారే ఇష్టపూర్తిగా చెల్లించుటకు సిద్ధంగా వున్నారు ఏ ప్రాంతంలో అన్ని రకాల ఆదాయం ఎంత వసూలవుతుంది, ఆ ప్రాంతంలో పౌరవసతులు కల్పించటానికి మునిసిపాలిటీలు ఎంత వ్యయం చేస్తుంది, ప్రతి మూడు నెలలకొకసారి తెలియచేయాలి ప్రజలకు మునిసిపాలిటీలపై విశ్వాసం పెంపొందించాలి

3 ప్రజలకు అదిస్తున్న వివిధ సేవలు, వ్యయం అధికారపద్ధతులవల్ల హెచ్చుగా వుంటుంది అవే సేవలు ప్రైవేటు వ్యక్తులు, కంపెనీలు తక్కువ ధరలకే అందించగలరు అందుచే స్థానిక సంస్థలు నెమ్మదిగా అన్ని సర్వీసులు ప్రైవేటురంగానికి అప్పగించు విధంగా చర్యలు చేపట్టాలి

4 విద్యుత్ ఛార్జీల బిల్లులు అనేక మునిసిపాలిటీలలో గణనీయ స్థాయిలోనే వుంటున్నాయి ట్రాన్స్‌కోవారు పారిశ్రామిక, లేక వాణిజ్య రేట్లు విధించుచున్నారు కాని యితర గృహవినియోగదారుల భారంలో కొంత భరిస్తున్నారు అందుచేత మునిసిపాలిటీలకు వర్తింపచేసే టారిఫ్‌ను పునర్వ్యవస్థీకరించాలి

5 పన్నుల చెల్లింపులకు సంబంధించిన కేసులు పెద్ద సంఖ్యలో కోర్టుల ముందున్నాయి పన్ను రాబడిలో పెద్ద మొత్తం వివాదంలో వుంటున్నాయి అలాంటి కేసులన్నింటిని పరస్పర సంప్రదింపులద్వారా పరిష్కరించుకోవాలి

6 పెద్ద మొత్తాల్లో పన్నులు సకాలంలో చెల్లించే రేటు పేయర్లను మునిసిపాలిటీలు గౌరవించాలి వారికున్న ఇబ్బందులను ప్రాధాన్యతగా స్వీకరించి, పరిష్కరించాలి మంచినీటి సరఫరా, కళ్యాణమండపాల కేటాయింపులు యిచ్చే ప్రోత్సాహకాలను పరిశీలించాలి

7 వృత్తిపన్ను పరిహారం వాటాను 1986-87లో నిర్ణయించారు 12 సంవత్సరాలు గడిచిన తర్వాత అనేక నూతన వ్యాపార సంస్థలు, వృత్తిదారులు అనేక రెట్లు పెరిగి వుంటారు పెరిగిన ఆదాయానికి తగినట్లుగా యీ పరిహారాన్ని బాగా పెంచాలి

8 ప్రస్తుత ఆస్తి పన్ను విధానం 1-10-1993 నుండి అమలుపరుస్తున్నారు రూలు 8 (1) ప్రకారం ప్రతి 5 సంవత్సరాలకు యీ అసెస్‌మెంట్‌ను అనగా 1-10-98 నుండి పెంచాలి కాని ఏ మునిసిపాలిటీ యీ పని చేయటంలేదు అందుచేత 1-4-2000 నుండి యిప్పటి పన్నులను 50% తక్షణం పెంచాలి

9 దిగువ వ్యాపారాలు, వృత్తులపై ప్రస్తుతం లైసెన్సు రుసుం వసూలుచేయటంలేదు

1) కంప్యూటర్ శిక్షణ సెంటర్లు 2) టోకు, చిల్లర వస్త్ర వ్యాపారం, రెడీమేడ్ దుస్తులు 3) రొయ్యల పెంపకం, అమ్మకం, శీతలీకరణ 4) మినరల్ వాటర్ స్టోరేజీ, అమ్మకం 5) టెంట్‌హౌస్‌లు, కళ్యాణమండపాలు, శుభకార్యాలు జరిపే ఫంక్షన్ హాల్సు 6) ఫొటోగ్రఫీ, వీడియోగ్రఫీ 7) ప్రైవేటు హాస్టల్సు, హాస్పిటల్స్, నర్సింగ్‌హోంలు 8) డి టి పి , ఇ-మెయిల్, ఇంటర్నెట్ సెంటర్లు, ఎస్ టి డి బూత్‌లు 9) ఫర్నీచర్ మరియు ఇంటీరియల్ డెకొరేట్ల షాపులు 10) అన్ని రకాల బ్రోకరు ఆఫీసులు, కమిషన్ ఏజంట్లు, ట్రావెల్ ఏజంట్సు

పైవాటికి లైసెన్సు ఫీజులు వసూలు చేయాలి

## ఆస్తిపన్నుల సంస్కరణలు

మునిసిపల్ సంస్థలకు ముఖ్య ఆదాయ వనరులు ఆస్తిపన్నులు అన్ని ప్రాంతాలలోను, శానిటేషన్, కన్సర్వెన్సీ, వ్యర్థ పదార్థాల తొలగింపు, మంచినీటి సరఫరా, భూగర్భ డ్రైనేజీ, వీధి దీపాలు, పార్కులు, తోటలు, క్రీడాస్థలాలు, దహన సంస్కార ప్రదేశాలు, మంచి రోడ్లు, మునిసిపాలిటీలు ఏర్పాటుచేయాలి రోడ్ల సౌకర్యాలన్నీ అనుభవించేవారే వాటి నిర్మాణం, నిర్వహణ ఖర్చులు భరించాలి కాని, సర్వసాధారణంగా పన్నులు స్థాయి పై

వ్యయానికి తగినట్లుగా లేవు పన్నులు స్థాయిని అద్దె విలువ ప్రాతిపదికపైనే నిర్ణయిస్తారు ఈ అద్దె విలువలు రెవిన్యూ అధికారులు, యజమానులతో లాలూచీ అయి, తక్కువ రేట్లు నిర్ణయించటంవల్ల తక్కువ పన్నులు విధించుచున్నారు ఈ అక్రమాలవల్ల మునిసిపాలిటీలు చాలా ఆదాయాన్ని కోల్పోతున్నాయి దీనిని సరిదిద్దటానికి, ఆదాయాన్ని పెంచటానికి దిగువ అంశాలు పరిగణనలోనికి తీసుకోవాలి

1 వీలైనంత తక్కువగా పన్ను వుండటంవల్ల, రేటు పేయర్లు సులభంగా పన్నులు చెల్లించుతారు

2 టాక్సు విధింపులు వాల్యుయేషన్ ఆఫీసర్ల వ్యక్తిగత నిర్ణయాల పరిధిని పూర్తిగా తగ్గించాలి

3 అందరికి అర్థమయ్యేరీతిలో పన్నుల విధానం, విధింపు పద్ధతులు బహిరంగపర్చాలి

4 ఎవరి ఆస్తికి వారే పన్ను నిర్ధారణ చేసుకునే విధంగా పన్నుల విధానం రూపొందించాలి

## ఆంధ్రప్రదేశ్‌లో ఆస్తిపన్ను

ఆస్తిపన్నులో జనరల్ పర్పస్, వాటర్ అండ్ డ్రైనేజీ పన్ను, లైటింగ్ టాక్స్, స్కావెంజింగ్ టాక్సు కలిపి వుంటాయి అన్నీ కలిపి 25%కు మించకుండా నివాసభవనాలకు, 30% మించకుండా నివాసేతర భవనాలకు విధించవచ్చు

1989 ముందు భవనాల అద్దె విలువను ఆ ప్రాంతంలోని అద్దె విలువల ప్రాతిపదికగా వాల్యుయేషన్ ఆఫీసరు నిర్ణయించేవారు 1989లో మునిసిపాలిటీల, కార్పొరేషన్ల చట్టాలను సవరించి, భవనం వున్న ప్రాంతం, నిర్మాణం, విస్తీర్ణం, భవన వయస్సు, భవన వినియోగం ఆధారంగా సాంవత్సరిక అద్దె విలువ నిర్ణయించాలి ఈ విధానం శాస్త్రీయంగాను, ఆఫీసర్లకు స్వేచ్ఛ లేకుండా చేస్తుంది

మునిసిపల్ ఏరియాను దిగువ అంశాల ప్రాతిపదికన జోన్లగా విభజించాలి

1 అప్పటికే కల్పించిన పౌరసౌకర్యాలు - రోడ్లు, లైట్లు, డ్రయిన్లు, వాటర్ సప్లయ్ వగైరా వసతులు

2 మార్కెట్లు, షాపింగ్ సెంటర్లు

3 విద్యాలయాలు

4 బ్యాంకులు, పోస్టల్ వసతులు

5 వైద్య సంస్థలు

6 ఫ్యాక్టరీలు, పరిశ్రమలు తదితర సౌకర్యాలు

భవనాలను వాటి నిర్మాణ స్వభావ ప్రాతిపదికగా విభజన

1 ఆర్‌సిసి విలాస భవనాలు - నాణ్యమైన కలప, ఫ్లోరింగ్, శానిటరీ, ఫిట్టింగ్స్, అటాచ్డ్ టాయిలెట్లు వగైరా

2 ఆర్ సి సి సాధారణ భవనం - సాధారణ కలప, ఫ్లోరింగ్, శానిటరీ ఫిట్టింగులు కలిగి వున్నవి

3 మద్రాసు టైపు డాబాలు, లేదా రాతి స్లాబులు

4 మంగుళూరు పెంకుతో కప్పు, లేదా సిమెంటు రేకులు

5 నాటు పెంకుల భవనాలు

6 పాకలు

7 పైన ఉదహరించినవికాని భవనాలు

**భవన వినియోగాన్నిబట్టి విభజన :**

1 నివాస గృహాలు

2 షాపులు, వాణిజ్య సముదాయాలు

3 ఆఫీసులు, బ్యాంకులలాంటి వ్యాపార సంస్థలు

4 ఆసుపత్రులు, విద్యాలయాలు

5 హోటల్స్, లాడ్జీలు, రెస్టారెంట్సు, గోడౌన్స్ తదితర వ్యాపారాలు

6 పారిశ్రామిక వినియోగం - ఫ్యాక్టరీలు, వర్క్‌షాపులు వగైరా

7 సినిమా థియేటర్లు, వినోద ప్రదర్శనశాలలు

8 పై వినియోగాలుకాని భవనాలు

ప్రతి జోన్‌లోను 36 తరగతులు వుంటాయి జిల్లా కలెక్టరు, సూపరింటెండెంటు ఇంజనీరు, రీజినల్ జాయింట్ డైరెక్టర్‌తో కూడిన కమిటీ ప్రతి చదరపు మీటరుకు అద్దె విలువ నిర్ణయించి, గజెట్ ప్రకటనానంతరం, అభ్యంతరాలు పరిశీలించి, తుది నిర్ణయం చేయబడును తదుపరి ప్రతి భవనానికి పన్ను మదించి, నిర్ణయం చేయుదురు భవనం స్వంత వినియోగానికి కొంత తగ్గింపు, పరిమితికి మించి భవన ఆవరణలో ఖాళీస్థలం వున్నచో (300 చ గ ) అదనపు స్థలానికి వేరే పన్ను విధింతురు కొన్ని వర్గాలవారికి అద్దె విలువలో కొంత రాయితీలు యివ్వవచ్చు ప్రజాప్రయోజనాలకు వినియోగించబడు భవనాలు, బలహీనవర్గాల గృహాలు, యజమాని స్వయంగా నివాసం వున్నట్లయితేనూ, సముద్రతీరాన గల భవనాలకు కొంత తగ్గింపు కలదు

ఈ విధానంలో పేద, ధనిక తేడాగాని, మరొక విధమైన వ్యత్యాసంగాని వుండటానికి అవకాశం లేదు

మంచినీటి సరఫరా, సూయరేజి ఛార్జీలు విడిగా నిర్ణయించి, వసూలు చేయబడును

పై విధంగా, ఎవరింటికి వారే ఎంత పన్ను చెల్లించాల్సింది తెలుసుకోవటానికి వీలవుతుంది

పన్ను చెల్లింపులు చెక్కుద్వారా, బ్యాంకులద్వారా వసూలు మంచిది పన్ను చెల్లింపు

6 నెలలు ఆలస్యం అయినట్లయితే, మంచినీటి సరఫరా, విద్యుత్ సరఫరా నిలిపివేయవచ్చు

ఖాళీస్థలాలమీద పన్నును అనేక మునిసిపాలిటీలు వసూలుచేయటంలేదు టాక్స్ రూలు 8 ప్రకారంగా విధిగా ఖాళీజాగా పన్ను వసూలుచేయాలి

సెక్షన్ 88 క్రింద, ప్రభుత్వం గుర్తింపు పొందిన విద్యాలయాలు, హాస్టల్సు, ఆస్తిపన్ను నుండి మినహాయింపు వుందికాని ప్రస్తుతం యీ విద్యాలయాలు - స్కూల్సు, జూనియర్, డిగ్రీ, పి జి వృత్తి కళాశాలలు చాలా పెద్దమొత్తంలో ఫీజులు, విరాళాలు వసూలు చేస్తున్నాయి అందుచేత యిట్టివాటికి పన్ను మినహాయింపు వుండటం సమర్థనీయంకాదు సాంవత్సరిక అద్దె విలువ రు 300/-లోపు గల పాకలు వగైరా మినహాయింపు వుంది బలహీనవర్గాల కొరకు నిర్మించిన ఇండ్లకు పన్ను మినహాయింపు గలదు ఈ విధమైన పన్ను మదింపులు లోగడ పాతపన్నుకంటే 75%, 100%కి మించి వుండరాదని నిబంధన విధించారు ఇది కూడా సమంజసమైందికాదు దానిని ఉపసంహరించాల్సివుంది

**భవన నిర్మాణ రెగ్యులేషన్స్ :**

పలు అంతస్థుల భవనాలకు సంబంధించి, భవన నిర్మాణాల గురించిన నిబంధనలను పునఃపరిశీలనచేసి కొన్ని మార్పులు చేర్పులు చేయాలని కూడా కాబినెట్ సబ్ కమిటీ సూచించింది ఇందులో స్వర్గీయ వి మాధవరెడ్డి పంచాయతీరాజ్, యస్ యం ఫరూక్, పురపాలకశాఖ, శ్రీ దండు శివరామరాజు, సి రామచంద్రరావు, కార్పొరేషన్ మంత్రులు, సభ్యులుగా వున్నారు

## మంత్రివర్గ ఉపసంఘ సిఫార్సులపై యీ రచయిత ఫిబ్రవరి 2000న ప్రభుత్వానికి పంపిన అభ్యంతరాలు, సూచనలు

1) 74వ రాజ్యాంగ సవరణ చట్టంలోని 243 క్లాజు ప్రకారం స్థానిక సంస్థలు వాస్తవ స్వయంపాలకసంస్థలుగా వ్యవహరించటానికి ఎలాంటి అధికారాలు యివ్వటానికి యీ ఉపసంఘం సిఫార్సు చేయలేదు సాధారణ పద్ధతిలో మేయరు, ఛైర్‌పర్సన్స్‌కు కొన్ని అధికారాలు యిస్తే సమంజసంగా వుంటుందని మాత్రమే పేర్కొన్నారు కమిషనర్ల పెత్తనాన్ని గాని, విపరీతాధికారాలు తగ్గించేందుకు ఏ సిఫార్సులు లేవు 1986 నుండి కలకత్తాలో సక్రమంగా, సమర్ధవంతంగా అమలుజరుగుతున్న మేయర్-ఇన్-కౌన్సిల్, ఛైర్‌పర్సన్స్ కౌన్సిల్ విధానాలు యిటీవల మధ్యప్రదేశ్‌లోను, మహారాష్ట్రలోను మునిసిపల్ సంస్థలకు విస్తరింప చేసినట్లుగా, మన రాష్ట్రంలో కూడా ప్రవేశపెట్టాలనే పాపులర్ డిమాండ్‌ను కనీసం ఉదహరించకపోవటం శోచనీయం

2 చట్టాలలో మౌలిక మార్పులు చేయాలని దీర్ఘకాలంగా కోరుతున్నా, స్పష్టమైన ప్రత్యామ్నాయాలను పరిశీలించకపోవుటయేగాక, స్థానిక సంస్థలు తమ బాధ్యతలు, విధులు

నిర్వహించుటకు అవసరమయిన స్వేచ్ఛ, అవకాశాలులేని పరిస్థితిని కూడా ఉపసంఘం పరిశీలించలేదు కొత్త పోస్టులు నిషేధంవల్ల నగరాలు, పట్టణాల విస్తీర్ణతతో ప్రజల కందించే సేవలు పెరుగుతాయి అదనపు సిబ్బంది లేనట్లయితే అది ఎలా సాధ్యం? ఉదా

1) విజయవాడలో పేద మహిళల సౌకర్యార్థం నాల్గు ప్రసూతి ఆసుపత్రుల భవనాలు దాదాపు యాభై లక్షల రూపాయల వ్యయంతో నిర్మించబడినవి కాని వాటిలో పనిచేయ టానికి డాక్టర్లు, నర్సులు, కాంపౌండర్లు లేనిదే ఆసుపత్రులు ఎలా పనిచేస్తాయి?

2) ప్రజలకు ఆరోగ్య, వైద్య సౌకర్యాలు నగర వ్యాపితంగా ఏర్పాటుచేయుటకు సిటీ హెల్తు ప్లాను రూపొందించి అమలు జరపాలని కౌన్సిలు నిర్ణయించింది కాని అందులో పనిచేయటానికి వైద్యులు, తత్సంబంధిత సిబ్బంది లేనిదే అవి ఎలా పనిచేస్తాయి?

3) నగరపాలక సంస్థ కోట్ల రూపాయల వ్యయంతో క్రీడాసౌకర్యాలు పెంపొందించింది వీటి అజమాయిషీకి, సక్రమ సద్వినియోగం పర్యవేక్షణను ఒక స్పోర్ట్సు డైరెక్టరు లేక ఆఫీసరును నియమించమని కోరాం కార్పొరేషన్‌కు నియమించుకునే అధికారాలు లేవు క్రీడాకారులకు ప్రోత్సాహం యివ్వాలని సర్వే సర్వత్రా కోరుతున్నా, అందుకు యింతో అంతో పూనుకున్న విజయవాడ నగరపాలక సంస్థ నిరుత్సాహానికి గురైంది

4) మంచినీటి రిజర్వాయర్లు, వాటర్ మెయిన్సు, ప్రైవేటు పబ్లిక్ కుళాయిలు, బూస్టరు పంప్స్, డ్రయినేజీ, సర్వీసులు పెరిగాయి 1979లో శాంక్షన్ చేసిన సిబ్బందితో, పదిరెట్లు పెరిగిన సర్వీసులను సక్రమంగా ఎలా నిర్వహించగలరు? పైగా వయస్సు మీరిన కారణంగా రిటైర్ అయిన లేదా మరణించిన లేదా యితర కారణాలవల్ల ఏర్పడిన ఏ శాఖలోని ఖాళీలు భర్తీచేసుకునే అధికారం కూడా కౌన్సిల్‌కు లేదు

ఇప్పటికే అదనపు సిబ్బంది వున్నారనే వాదన అన్ని మునిసిపాలిటీలకు వర్తించదు అవసరమయినచోట్ల ప్రభుత్వ ఉన్నత అధికారులచేత గవర్నమెంటు మార్గదర్శిక సూత్రాల ప్రకారంగానే అవసరమైన అదనపు సిబ్బందిని తీసుకొనుటకు అధికారం, అవకాశం వుండాలి

5) 74వ రాజ్యాంగ సవరణ చట్టం నిబంధనల మేరకు స్థానిక సంస్థల ఆర్థిక పరిపుష్టికి 1994లో రాష్ట్ర ప్రభుత్వం నియమించిన రాష్ట్ర ఆర్థిక కమిషన్ సిఫార్సులను దాదాపు మన రాష్ట్ర ప్రభుత్వం బుట్టదాఖలు చేసింది

రాష్ట్రంలోని దాదాపు 8 కోట్లమంది ప్రజలకు మంచినీటి సరఫరా, రోడ్లు, డ్రయిన్లు, లైటింగ్, శానిటేషన్, ఆరోగ్య వసతులు, పార్కులు, తదితర సౌకర్యాలు కలుగచేసేవి 21,000 పైగా పంచాయతీలు, 115 మునిసిపాలిటీలు, 7 నగరపాలక సంస్థలు మాత్రమే అలాంటి సంస్థలకు ఆర్థిక సహకారం నిరాకరించటం ఏమాత్రం సమంజసం కాదు ఆర్థిక కమిషన్ సిఫార్సులను విధిగా, మినహాయింపు లేకుండా అమలుపరచవలసిన నైతిక, చట్ట బద్ధమైన బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వం విస్మరించజాలదు

6) పౌర సౌకర్యాలన్నింటికి వాటికయ్యే వ్యయం మొత్తం వినియోగదారుల నుండి వసూలు చేయుటకు క్రమక్రమంగా చర్యలు చేపట్టాలని సిఫార్సు చేశారు అధికార యంత్రాంగం యీ సౌకర్యాలు కల్పించుతుంది గనుక, ఖర్చు ఎక్కువగా వుంటుందని, అదే ప్రైవేటు సంస్థలు చేకూరిస్తే తక్కువ ఖర్చుతో, తక్కువ ఛార్జీలతో ఆ సేవలు అందుతాయనే సాధారణ సూత్రీకరణపట్ల తీవ్ర అభ్యంతరం తెలియపరుస్తున్నాం ఇది చాలా ప్రమాదకర సూత్రీకరణ ప్రయత్నంగా భావిస్తున్నాం ప్రైవేటువారిమీద ఆధారపడటం శ్రేయస్కరం కాదు మునిసిపాలిటీల ధ్యేయం ప్రజాశ్రేయస్సుకాగా, ప్రైవేటు సంస్థల ప్రధాన ధ్యేయం లాభాల సంపాదన ఇది ప్రజాప్రయోజనాలకు విరుద్ధం

7) ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టం 1965లాగానే, ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని మునిసిపల్ కార్పొరేషన్లకు ఇకముందు రాబోయే కార్పొరేషన్లకు వర్తించే విధంగా ఆం ప్ర మునిసిపల్ కార్పొరేషన్ చట్టం రూపొందించాలనే డిమాండ్‌ను కనీసం వీరు పేర్కొనలేదు

పరిపాలనలో కేంద్రం, రాష్ట్రంతోపాటు నేడు స్థానిక స్వపరిపాలన మూడవ స్థాయి ప్రభుత్వంగా రాజ్యాంగపరంగా గుర్తింపు పొందిన తర్వాత కూడా యింకా రాష్ట్ర ప్రభుత్వం స్థానిక సంస్థలను తన అధీనసంస్థలుగా పరిగణించటం ఆక్షేపణీయం

8) మునిసిపల్ సంస్థలకు ప్రత్యేక సాంకేతిక పరిజ్ఞానం కల్గిన కేడర్ అవసరం నీటి సరఫరా, వ్యర్థ పదార్థాల మురుగునీటి పథకాలు నూతన సాంకేతిక విధానాలు రావటంతో అందుకు అనుగుణమైన ఇంజనీర్లు అవసరం ప్రస్తుతం ఈ పరిజ్ఞానం వున్నవారు చాలా కొద్దిమంది మాత్రమే ప్రస్తుతం సర్వీసులోవున్న కొంతమంది ఇంజనీర్లకు ప్రత్యేక శిక్షణ యిచ్చి వారి సర్వీసులు సద్వినియోగం చేసుకోవాలి వీరిని యితర శాఖలకు బదిలీలు చేయరాదు కనీసం 3 సంవత్సరాలు ఒకేచోట వుండేలాగా చూడాలి

9 ప్రభుత్వ నిర్ణయాలను అమలుచేయని స్థానిక సంస్థలకు రాష్ట్ర ప్రభుత్వ గ్రాంట్లు నిలుపుదల చేయాలని సూచించటం పూర్తిగా ఆక్షేపణీయం అన్ని స్థానిక సంస్థలకు పంచాయతీలు, మునిసిపాలిటీలు, నగరపాలక సంస్థలకు ప్రభుత్వమే నిర్ణయాలు చెయటం అంటే, స్థానిక ప్రజాప్రతినిధులను పూర్తిగా నిర్లక్ష్యం చేయడమే అవుతుంది వేరే వేరే పట్టణాల, నగరాల పరిధిలో ఆ ప్రాంతీయ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, కౌన్సిల్సు నిర్ణయాలు చేస్తాయి ఒక్కొక్కసారి ప్రభుత్వ విధానంతో విభేదించినంతమాత్రాన వారికి గ్రాంట్లు నిలిపి వేయాలనటం స్థానిక సంస్థల స్వతంత్రతను, స్వేచ్ఛను కించపరచడమే కాగలదు. అలాంటి ఆలోచనకు స్వస్తిచెప్పాలి

10) కేంద్ర ప్రభుత్వ, రాష్ట్ర ప్రభుత్వ పథకాలు అమలు ఆయా కౌన్సిల్స్ ద్వారా అమలు జరగాలి సి డి యస్ (CDS) S.J S Ry, N S D P, C M E Y లబ్దిదారుల ఎంపిక ప్రోత్సాహకాల పంపిణీ వాటి అమలు వగైరాలు పూర్తిగా స్థానిక సంస్థ ఆధ్వర్యంలోనే జరగాలి

అందుకు కేటాయించిన నిధులు నేరుగా ఆయా స్థానిక సంస్థలకే విడుదల చేయాలి

ఏ ఇతర అధికార యంత్రాంగం యీ విషయంలో జోక్యం చేసుకోరాదు పథకాల అమలుకు పర్యవేక్షణ వారి ఉన్నతాధికారుల ద్వారా చేసుకోవచ్చు

11) మునిసిపల్ సంస్థల ఆదాయ వ్యయాలు ఖచ్చితంగా ఆడిట్ కాబడాలి ఆడిట్ శాఖకు తగినంతమంది ఆడిట్ స్టాఫ్ లేనట్లయితే, ఆయా ప్రాంతాలలో సమర్థులైన ప్రైవేటు చార్టర్డ్ అక్కౌంటెంట్సును, ఆడిటర్లను నియమించి, వారిద్వారానైనా ఏఏటి కాయేడు ఆడిట్ పూర్తిచేయించాలి

12) ఆస్తిపన్ను విధింపు మరింత శాస్త్రీయంగా జరిగేలా చర్యలు తీసుకోవాలి జోనల్ విధానం, యింటి విస్తీర్ణం వగైరా ప్రాతిపదికన 1993 నుండి అమలుజరుగుచున్న విధానం యొక్క మంచిచెడులు అధ్యయనం చేసి, మరింత శాస్త్రీయంగ, లోటుపాట్లు లేని విధంగా మార్చాల్సిన అవసరం వుంది దీనికి ప్రత్యేక అధ్యయన బృందాన్ని రాష్ట్ర ప్రభుత్వం తక్షణం నియమించాలి మంత్రివర్గ ఉపసంఘం సూచించినట్లుగా, 75%, 100% కంటే పన్ను పెంపుదల మించరాదనే జి ఓ ప్రభుత్వం యిటీవల రద్దుచేయబడటం ముదావహం

ఏదైనా భవనాన్ని విస్తరించటంగాని, లేదా వినియోగంలో ఏదైనా మార్పు సంభవించి నప్పుడుగాని తక్షణం తదనుగుణ్యంగా పన్ను రివైజ్ కాబడాలి మిగతా అన్ని అసెస్‌మెంట్ల మీద ప్రతి మూడు సంవత్సరాలకొకసారి 10-15% పెంచటానికి నిబంధనలు రూపొందించాలి

పన్ను చెల్లింపుదార్లందరికి పాస్‌బుక్ వుండాలి పన్నుల వసూళ్ళు బ్యాంకుల ద్వారానే చేయాలి

**13) న్యాయ వివాదాలు** · మునిసిపాలిటీలు కొన్ని సంస్థలపై, వ్యక్తులపై నిబంధనలు అమలుపరచనందుకో, ధిక్కరించినందుకో కోర్టుల్లో దావాలు వేయాలి అలాగే మునిసిపాలిటీ నిర్ణయం వల్ల నష్టం పొందామని భావించే సంస్థలు, వ్యక్తులు మునిసిపాలిటీలపై దావాలు వేస్తారు కాని, సంవత్సరాల తరబడి అవి తేలని కారణంగా పన్నుల బకాయిల పెరుగుదలను చూస్తున్నాం పైగా కేసుల వ్యవహారం ప్రతినిత్యం జాగరూకతతో follow up అయ్యేందుకు ప్రత్యేక విభాగం లేనందున, చాలా నష్టాలకు గురికావటం కూడా జరుగుతుంది ప్రతి మునిసిపాలిటీ సమర్థవంతంగా పనిచేయు లీగల్ సెల్లును విధిగా ఏర్పాటు చేయాలి

స్థానిక సంస్థలకు వారి కేసులలో వాదించటానికి స్థానికంగా సమర్థులైన న్యాయవాదులను నియమించుకునే అధికారం వుండాలి రాష్ట్ర రాజధాని నుండి నియామకాలు చేయటం విరమించాలి

14) మంత్రివర్గ ఉపసంఘం సిఫార్సు చేసిన నూతన తరహా వ్యాపార, వృత్తులకు సమంజసమైన లైసెన్సు ఫీజులు నిర్ణయించి, అమలుజరపాలి అవసరమైనచోట్ల ఫీజులను పెంచాలి లైసెన్సుదారులకు శాశ్వత గుర్తింపు కార్డులు యివ్వటం ప్రయోజనకరంగా

వుంటుంది లైసెన్సులు యిచ్చిన వ్యాపారాల ప్రదేశాలు, థియేటర్లు, హోటల్సు, భోజన శాలలు వగైరాలను తరచూ తనిఖీ చేయించాలి

15) అవినీతిని తుదముట్టించాలి అవినీతి హెచ్చుగావున్న శాఖలలో మునిసిపాలిటీలు వుండటం గమనార్హం పౌరులకు ఏ పని కావాల్సినా లంచాలు యివ్వందే జరగదని జనవాక్యం అయింది

అవినీతిపరులను పట్టుకొని, శిక్షించటానికి వున్న ఉత్తర్వులు, చట్టాలు లోప భూయిష్టంగా వున్నాయి నేరాలు రుజువయిన కేసులు కూడా శిక్షలు పడకుండా తప్పుకోగలుగుతున్నాయి పైగా కొన్ని సందర్భాలలో ప్రమోషన్లు పొందటం కూడా గర్హనీయం తీవ్రమైన అంటువ్యాధిగా వున్న స్థానిక సంస్థల్లో అవినీతిని అరికట్టడానికి తీవ్రచర్యలు తీసుకోవాలి

ప్రజా ఫిర్యాదుల సెల్ ఏర్పాటు చేసి ప్రజల యిబ్బందులను సత్వరం తొలగించుటకు పూనుకోవాలి

అవినీతికి ముమ్మరంగా వున్న రెవిన్యూ, టౌన్ ప్లానింగ్, ఇంజనీరింగ్, ఎస్టాబ్లిష్‌మెంట్ సెక్షన్లను బాగా ప్రక్షాళనం చేయాలి పకడ్బంది నిఘా ఎల్లప్పుడూ కొనసాగాలి దీర్ఘకాలం ఒకేచోట వున్నవారిని, నిబంధనల మేరకు బదిలీలు విధిగా చేయాలి



# ౨౦. స్థానిక సంస్థలు సమర్థవంతంగా పనిచేయాలంటే?

మన రాష్ట్రంలోని సుమారు 8 కోట్లమంది గ్రామీణ, పట్టణ ప్రజలకు కనీస సౌకర్యాలు - మంచినీరు, రోడ్లు, శానిటేషన్, లైటింగ్, ఆరోగ్య వసతులు వగైరాలు - కల్గించే బృహత్తర కార్యభారం 21,000 పంచాయతీలు, 110 మునిసిపాలిటీలు, 7 మునిసిపల్ కార్పొరేషన్‌ల మీద వుంది అట్టి గురుతర బాధ్యతలు నిర్వహించాలంటే, ప్రజల కనీస అవసరాలు తీర్చాలంటే, ముసురుకుంటున్న కాలుష్య నివారణ చేపట్టాలంటే, ప్రస్తుతం యీ సంస్థలు కొట్టుమిట్టాడుతున్న దుస్థితిలో ఏమాత్రం సాధ్యం కాదు ఇందుకు వందలు, వేల కోట్ల రూపాయలు అవసరం

ప్రజల అవసరాలు తీర్చాలన్నా, పలు అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టి, వాటిని సకాలంలో పూర్తిచేయాలన్నా ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వం అవలంబిస్తున్న విధానాలు ఏమాత్రం సహకరించవు మునిసిపల్ సర్వీసులు ముఖ్యంగా సేవా సర్వీసులు లాభ నష్టాలు బేరీజు వేసుకుంటూ, వీలైతే అన్నింటిని ప్రైవేటుపరం చేస్తే అంతా చక్కబడుతుందనే దృఢమైన అభిప్రాయాలు రాష్ట్ర ప్రభుత్వానికి వున్నాయి వాటి అమలుకు క్రమక్రమంగా చర్యలు చేపట్టడం జరుగుచున్నది కాని మునిసిపల్ సేవలు ప్రత్యేక తరగతిగా పరిగణించాలి

ప్రజాస్వామ్య వ్యవస్థలో పునాది పరిపాలనా సంస్థలు - స్థానిక సంస్థలు తమ బాధ్యతలు, విధులు సంతృప్తికరంగా నిర్వహించాలంటే ముఖ్యంగా అర్బన్ సంస్థలు ఎదుర్కొంటున్న పలు సవాళ్ళను జయప్రదంగా పరిష్కరించాలంటే, **దిగువ పది సూత్రాలు** అమలుజరగాలి

1 74వ రాజ్యాంగ సవరణ చట్టం ఆదేశానుసారం ఎన్నికైన ప్రజాప్రతినిధులకు స్వయం పాలనకు అవసరమైన అన్ని అధికారాలు యివ్వాలి అందులో భాగంగానే మేయర్-ఇన్-కౌన్సిల్/ఛైర్మన్-ఇన్-కౌన్సిల్ విధానాన్ని తక్షణం అమలుజరపాలి పరిపాలనా రంగంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వంవలె, స్థానిక ప్రభుత్వాలుగా - మూడవ అంచె - (Third Tier) రాజ్యాంగం గుర్తించిన హోదాను కల్పించాలి స్థానిక సంస్థలను తమ అధీన సంస్థలుగా పరిగణించటం రాష్ట్రాలు మానుకోవాలి ప్రజాసేవలో భాగస్వామ్య సంస్థలుగా గుర్తించాలి

- కార్పొరేషన్ల ఉత్తర ప్రత్యుత్తరాలన్ని - మునిసిపాలిటీలవలె - మేయరు ద్వారానే నిర్వహించాలి
- కార్పొరేషన్లకు, మునిసిపాలిటీలకు ప్రస్తుతం వున్న శాంక్షను పరిమితులను గణనీయంగా పెంచాలి

- ఆయా సంస్థల్లో మంజూరయిన సిబ్బందిలో - రిటైరయిన, సర్వీసు వదలి వెళ్ళినా, మరణించినా - ఏర్పడే ఖాళీలను, ప్రభుత్వ అనుమతితో నిమిత్తం లేకుండా భర్తీచేస్తుకునే అధికారం వుండాలి
- మునిసిపల్ సంస్థలు న్యాయవాదులను నియమించుకునే అధికారాన్ని పునరుద్ధరించాలి
- స్థానిక సంస్థల వ్యవహారాలలో సాధ్యమైనంత తక్కువ జోక్యం రాష్ట్ర ప్రభుత్వానికి వుండాలి
- మేయర్లు, ఛైర్‌పర్సన్స్ ఆయా నగరాల, పట్టణాలకు అత్యున్నత, గౌరవనీయ వ్యక్తులుగా గుర్తించి, ఆ మేరకు ప్రోటోకోల్ నిబంధనలను సవరించాలి
- షెడ్యూలు 12లోని అన్ని విధులను మునిసిపల్ సంస్థలకు చట్టరీత్యా బదలాయిస్తూ, వాటి నిర్వహణకు చాలినంత నిధులు సమకూర్చాలి

2 74వ రాజ్యాంగ సవరణ చట్టం ఆదేశానుసారం స్థానిక సంస్థల ఆర్థిక పరిపుష్టికి రాష్ట్ర ఆర్థిక కమీషన్ చేస్తున్న సిఫార్సుల ప్రకారం రాష్ట్రాదాయం నుండి వాటా విధిగా, క్రమం తప్పకుండా యివ్వాలి రాష్ట్ర ఆర్థిక కమిషన్ సిఫార్సులు యధాతథంగా రాష్ట్రప్రభుత్వం ఆమోదించి, అమలు జరపాలి రాష్ట్ర ప్రభుత్వం 'దయతో' యిచ్చే సహాయంగా చూడరాదు కేంద్ర ఆదాయం నుండి రాష్ట్రానికి ఎలా వాటా పొందుతున్నారో, అదే విధంగా రాష్ట్రాదాయం నుండి స్థానిక సంస్థలు వాటాకు అర్హులు

3 రాష్ట్రంలోని మునిసిపాలిటీలు, మునిసిపల్ కార్పొరేషన్ల ఆర్థిక దుస్థితిని గుర్తించి, దిగువ చర్యలు చేపట్టాలి

ఆయా పట్టణాలు, నగరాల నుండి వసూలయ్యే అమ్మకం పన్ను, ఎక్సైజ్ పన్ను, మోటారు వాహనాల పన్ను, గనుల, యిసుక క్వారీలు వగైరా ఆదాయం నుండి సమంజసమైన వాటాను ఆయా స్థానిక సంస్థలకు యివ్వాలి

లేదా మునిసిపల్ సంస్థలకు తలబరువైన, ఉద్యోగుల, సిబ్బంది, పెన్షనర్ల జీతభత్యాలను పంచాయతీరాజ్‌లో శాఖవలె రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక గ్రాంటుగా యివ్వాలి

4 పట్టణాలు, నగరాలు క్లిష్టమైన సవాళ్ళను ఎదుర్కొంటున్నాయి మంచినీటి సరఫరా, భూగర్భ మురుగునీటి పథకాలు, ఘన వ్యర్థ పదార్థాల సేకరణ, నిర్మూలన, పర్యావరణ పరిరక్షణ, పేదరిక నిర్మూలన, ఆరోగ్య సౌకర్యాలు కల్పించుటకు భారీగా వ్యయం అవుతుంది స్థానిక సంస్థలు భరించలేవు కనుక రాష్ట్ర ప్రభుత్వం స్థానిక సంస్థల

ఫైనాన్స్ కార్పొరేషన్‌ను నెలకొల్పి, రు 200 కోట్ల రూపాయల నిధితో ప్రారంభించి, తక్కువ వడ్డీకి వివిధ పథకాల అమలుకు స్థానిక సంస్థలకు రుణాలుగా యివ్వాలి దీర్ఘకాలిక వాయిదాలమీద తిరిగి చెల్లింపు ఏర్పాటు వుండాలి

5 కేంద్ర ప్రభుత్వం వివిధ పథకాల క్రింద స్థానిక సంస్థలకు యిస్తున్న గ్రాంట్లు, యితర ఆర్థిక సహకారాలను రాష్ట్ర ప్రభుత్వం అవసరాలకు వినియోగించుకోకుండా (యిప్పుడు జరుగుతున్నట్లు కాకుండా) తక్షణం ఆయా స్థానిక సంస్థలకు చెల్లించాలి కేంద్ర ప్రభుత్వమే నేరుగా మునిసిపల్ సంస్థలకు నిధులను విడుదల చేయటం ఉత్తమ విధానం వినోదపు పన్ను, వృత్తి పన్ను, స్టాంపు డ్యూటీ సర్‌చార్జి, తలసరి గ్రాంటు ఆస్తి పన్నుకు బదులుగా రాష్ట్రం ప్రభుత్వం యిస్తున్న గ్రాంటును ప్రతి త్రైమాసిక చెల్లింపులు ఆలస్యం లేకుండా విడుదల చేయాలి

6 ఆయా స్థానిక సంస్థలు తమ స్వంత ఆదాయాలను పెంచుకునే విధానాలు సమర్థవంతంగా అమలుజరుపుకోవాలి చార్జీలు, రుసుములు, పన్నుల విధానాలను నేటి వాస్తవ ఆర్థిక స్థితిగతులకు, మార్కెట్ విలువలకు అనుగుణ్యంగా పెంపొందించు కోవాలి

7 స్థానిక సంస్థల జమా ఖర్చులు ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం ప్రభుత్వం నియమించిన అధికార లేదా ప్రైవేటు రిజిష్టర్డ్ ఆడిటర్లచేత తనిఖీ చేయించి, ఆ రిపోర్టు ఆధారంగా తగు సత్వర చర్యలు చేపట్టాలి

8 వివిధ కేటగిరీల ఉద్యోగుల (నాల్గవ తరగతి మినహా) ఆయా మునిసిపాలిటీల, కార్పొరేషన్ల మధ్య జోన్ల పరిధిలోనైనా బదిలీ ఏర్పాటు వుండాలి ఒకేచోట పాతుకుపోయి, చేరినదగ్గరనుండి రిటైరయ్యే వరకు ఒకేచోట వుండే ప్రస్తుత పద్ధతిని మార్చాలి

9 పట్టణాలు, నగరాలు ఎదుర్కొంటున్న ప్రత్యేక సమస్యల దృష్ట్యా, పరిపాలన, టెక్నికల్ కేడర్‌ను ఎంపికచేసి, అవసరమైన తర్ఫీదు యిచ్చి, వారి సేవలను ప్రయోజనకరంగా వినియోగించుకోవాలి అలా కాకుండా, లక్షల రూపాయలు వ్యయంచేసి, విదేశాలకు పంపించి ఆయా అంశాలపై విశేష పరిజ్ఞానాన్ని పొందిన ఆఫీసర్లను యితర ప్రభుత్వ శాఖలకు బదిలీ చేయటం ఎంతైనా అవివేకం

10 అన్ని శాఖలలోవలె, స్థానిక సంస్థల్లో అవినీతి జాడ్యం విస్తరించింది లంచం యివ్వనిదే ఏ పనీ జరగదు అనే అత్యంత దురదృష్టకరమైన దుస్థితి అవినీతికి పాల్పడినవారిని కఠినంగా, కాలయాపన లేకుండా శిక్షించాలి బదిలీలు, సస్పెన్షన్లు - ఇవి శిక్షలు కావు ఆరు నెలల్లోగా దోషో, నిర్దోషో నిర్ధారణచేసి, తగిన శిక్షా చర్యలు తీసుకునే

విధానం అమలుజరపాలి రాజకీయ నాయకులు, అధికార పార్టీల నాయకుల ప్రమేయం, జోక్యం లేకుండా క్రమశిక్షణ చర్యల వ్యవహారం పూర్తికావాలి అవినీతి నిరోధక చట్టంలోని లొసుగులు తొలగించి, కట్టుదిట్టం చేయాలి

బలమైన కేంద్రం వుండాలంటే, బలమైన రాష్ట్రాలుండాలన్నట్లుగానే, బలమైన, సమర్ధవంతమైన (gross roots) స్థానిక సంస్థలుంటేనే బలమైన రాష్ట్రం వుంటుందని గుర్తించడం విజ్ఞత అవుతుంది

ఇటీవల మన మంత్రులు, ముఖ్యమంత్రి పదే పదే "మీ కాళ్ళమీద మీరు నిలబడాలి ఆదాయాన్ని పెంచుకోవాలి రాష్ట్ర ప్రభుత్వం నుండి ఆర్థిక సహకారం కొరకు ఎదురుచూడకండి మేము ఏమీ ఇవ్వలేం" అని హితోక్తులు పలకటం ఆశ్చర్యంగా వుంది ఆ మాటకొస్తే, రాష్ట్ర ప్రభుత్వం తన స్వంత ఆదాయంమీదనే నడుస్తుందా? కేంద్రం నుండి వాటా కోరటంలేదా? కేంద్రం ఆదాయం నుండి ప్రస్తుతం వున్న 30%ను 50%కు పెంచాలని మన రాష్ట్ర ప్రభుత్వం కోరటంలేదా? వేలకొలది కోట్ల రూపాయలు ఋణాలు పొందటంలేదా?

మనది ఫెడరల్ రాజ్యాంగం కేంద్రం నుండి రాష్ట్రాలకు నిధులు లభించుచున్నట్లుగా, రాష్ట్రాదాయం నుండి స్థానిక సంస్థలు వాటా డిమాండ్ చేయటం పూర్తిగా రాజ్యాంగబద్ధమే ఈ వాస్తవాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఎంత త్వరగా గుర్తించి అమలుజరిపితే, అంత త్వరగా స్థానిక సంస్థలు సమర్థవంతంగా పనిచేస్తాయి



# 21. పట్టణాలకు సంబంధించిన - రాష్ట్రప్రభుత్వ సంక్షేమ పథకాలు

**జన్మభూమి .**

వినూత్నంగా, ప్రజల భాగస్వామ్యంతో తమ సమస్యల పరిష్కారానికి, సామాజిక సమస్యలపై అవగాహనకు, ఏకైక కార్యక్రమం 1995 అక్టోబరులో ప్రజలవద్దకు పాలన, 1996 జనవరి నుండి శ్రమదానం కార్యక్రమాలతో ప్రారంభించి, 1997 జనవరి 1 నుండి రాష్ట్రవ్యాపితంగా ప్రారంభించబడినది ప్రధాన లక్ష్యాలు, సామాజిక పనులు, వ్యక్తిగత, సామాజిక అవసరాల పరిష్కారం, ప్రాథమిక ఆరోగ్యం, ప్రాథమిక విద్య, పర్యావరణ రక్షణ, కుంటుంబ సంక్షేమ కార్యక్రమాలు అమలుజరుపుట 2001 జూన్ వరకు 15 విడతల జన్మభూమి కార్యక్రమాలు అమలుజరపబడినవి ప్రభుత్వ గణాంకాలు ప్రకారంగా ఇంతవరకు 1) రు 1315 31 కోట్ల రూపాయల విలువలగల 94,476 పనులు చేపట్టారు అందులో రు 743 13 కోట్ల వ్యయంతో 60,051 పనులు పూర్వయ్యాయి 68,000 ఆర్థికేతర అవసరాలు తీర్చారు 6,18,000ల వ్యక్తిగత సమస్యలు పరిష్కారం అయినవి చేయూత పథకం క్రింద 15,475 మంది వికలాంగులకు మూడుచక్రాల సైకిళ్ళు, 2712 మందికి కృత్రిమ కాళ్ళు, 5594 మందికి వినికిడి యంత్రాలు, 1338 మందికి ఊతకర్రలు ఇచ్చారు ఇందుకు వ్యయం 4 88 కోట్ల రూపాయలు

స్థానిక సంస్థలను విస్మరించి, యీ కార్యక్రమాలన్నీ నోడల్ ఆఫీసర్లు, కలెక్టర్ల పర్యవేక్షణ క్రింద జరుగుతున్నాయని, నిధులు కొన్నిచోట్ల దుర్వినియోగం అవుతున్నాయనే అభియోగాలున్నాయి ప్రారంభంలో జన్మభూమి పనులకు స్థానికులు 30% ఇస్తే, ప్రభుత్వం 70% ఇచ్చేది ఆ విధానానికి మంచి స్పందన లభించింది కాని యిటీవల 50% స్థానికులు ఇస్తే ప్రభుత్వం 50% యిస్తుందని ప్రకటించటంతో యీ పథకాలకు స్పందన బాగా తగ్గిపోయింది

**సి యం ఇ.వై (ఛీఫ్ మినిస్టర్సు ఎంపవర్‌మెంట్ ఆఫ్ యూత్)**

యువతకు ఉపాధి అవకాశాలు కల్పించడం, సాఫల్యతా స్పృహ కలిగించటం ద్వారా సమాజ పునర్నిర్మాణం సాధ్యమన్న ధ్యేయంతో ప్రారంభించబడినది 18-35 సంవత్సరాల వయోజనుల్లో 5 నుండి 10 మంది యువజనులు సంఘంగా ఏర్పడతారు వారు చేపట్టే వ్యాపార కార్యకలాపాలకు అవసరమైన మార్జిన్ మనీ, సబ్సిడీ, రుణాలను బ్యాంకులు, యితర ఆర్థిక సంస్థల నుండి పొందుతారు

1996-98 మధ్య 70 కోట్ల 78 లక్షల వ్యయంతో 7005 సి యం ఇ వై యూనిట్లు పని ప్రారంభించాయి

1998-99లో 20,000 యువజన సంఘాల లక్ష్యం కాగా, 43,946 సంఘాలు ఏర్పడ్డాయి ఈ ఏడాది యీ సంఘాలకు రు 200 కోట్లు ఆర్థిక సహాయం అందచేయాలని నిర్ణయం

సాగునీటి సంఘాలు, వనసంరక్షణ సమితులు, వాటర్ షెడ్ కమిటీలు - యివి ముఖ్యంగా గ్రామాలకు ఉద్దేశించబడినవి

**పాఠశాల విద్యా కమిటీలు** ·

ప్రజల భాగస్వామ్యంద్వారా ప్రాథమిక విద్యను పటిష్టం చేయటానికి పాఠశాల విద్యా కమిటీలు ఏర్పాటుచేసింది ఇందుకొరకు రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ పాఠశాల విద్యా చట్టాన్ని కూడా చేసింది పాఠశాల స్థాయిలో, పంచాయతీ స్థాయిలో, మునిసిపల్ స్థాయిలో - 1,36,002 విద్యా కమిటీలు ఏర్పాటయ్యాయి ఈ కమిటీల్లో విద్యార్థుల తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు భాగస్వామ్యం ఉంటుంది వీటి యాజమాన్యాన్నే పాఠశాలలు పని చేయాలి పిల్లలందరు బడికి హాజరయ్యేలాగా చూడటం, భవనాల నిర్మాణం, అవసరమైన చోట్ల కాంట్రాక్టు టీచర్ల నియామకం వగైరా బాధ్యతలు నిర్వహిస్తాయి

**పచ్చదనం - పరిశుభ్రత** ·

పచ్చదనం పర్యావరణానికి ప్రాణం అదే విధంగా పరిశుభ్రం మనిషి ప్రశాంతంగా, ఆరోగ్యంగా జీవించడానికి అవసరం 1998 సెప్టెంబరు 10న చేపట్టిన యీ కార్యక్రమంలో ఇంతవరకు 64,15,688 మొక్కలు నాటబడినవని, పరిశుభ్రత కార్యక్రమం క్రింద 4871 కిలోమీటర్ల డ్రయిన్లలో పూడిక తీయబడిందని, ఇందులో 5,54,112 మంది ప్రజలు పాల్గొన్నారని, 11,043 వాహనాలను వినియోగించి, 44,633 మెట్రిక్ టన్నుల చెత్తాచెదారాన్ని తొలగించామని ప్రభుత్వం ప్రకటించింది

**బలహీనవర్గాల గృహ నిర్మాణం**

పేద ప్రజలకు గూడు కల్పించే బాధ్యత ప్రభుత్వంపై వుంది 1990-94 మధ్య 7,59,000 గృహాలు నిర్మించగా 1995-98ల మధ్య 13,18,000 గృహాలు నిర్మించబడినవి. 1990-94ల మధ్య ఇందుకొరకు రు 583 78 కోట్లు ఖర్చుకాగా, 1995-98ల మధ్య రు 1,159 04 కోట్లు వ్యయం జరిగింది తుపాను బాధితులకోసం రు 42 కోట్ల వ్యయంతో పశ్చిమ జర్మనీకి చెందిన కె యఫ్ డబ్ల్యు సహాయంతో 13,425 ప్రత్యేక గృహాల నిర్మాణం చేపట్టబడింది తుపాను బాధితులకు ప్రత్యేకంగా 47,953 యిళ్ళు నిర్మించారు

పట్టణ గృహ నిర్మాణం క్రింద లక్ష గృహాలను నిర్మించాలని ప్రభుత్వం తలపెట్టింది గృహ నిర్మాణానికి అవసరమయ్యే నాణ్యమైన సరుకుల తయారీకి రు 20 85 కోట్లతో 60 నిర్మిత కేంద్రాలు నిర్మించబడినవి ఇవన్నీ హడ్కో ఆర్థిక సహకారంతో జరుగుచున్నవి

**ఆదరణ :**

వెనుకబడిన కులాల్లో చేతివృత్తుల వారికి 1998-99లో రు 250 కోట్ల వ్యయంతో ఆదరణ పథకాన్ని ప్రవేశపెట్టారు దీనిద్వారా ఆధునికమైన, శ్రమను తగ్గించే వివిధ రకాల పనిముట్లను అందచేస్తారు సుమారు 4 లక్షలమంది యీ పథకం క్రింద లబ్ధి పొందగలరని అంచనా ఈ పథకం అమలులో చోటుచేసుకున్న పలు అవకతవకలవల్ల పథకం అమలు నిలిపివేయబడింది

**బాలికా సంరక్షణ పథకం :**

దారిద్ర్యరేఖకు దిగువనున్న కుటుంబాలకు చెందిన బాలికల పేర ప్రభుత్వం రు 5000/-లు బ్యాంకులో డిపాజిట్ చేస్తుంది 3 ఏండ్లలోపు గల ఆడపిల్లలు యిందుకు అర్హులు ఈ పథకం 1996-97 నుండి అమలుజరుపుతున్నారు

**చేయూత**

మన రాష్ట్రంలో 25 లక్షలమంది వికలాంగులున్నారు ఇందులొ గత ఏడాది నుండి 3 లక్షలమందికి ఆర్థిక సహాయం, చేయూత పరికరాలు, నిరుద్యోగ అలవెన్సు, వైద్య సర్టిఫికెట్లు, రైలు, బస్సు పాసులు అందజేశారు మిగతా 22 లక్షలమందికి క్రమంగా సహాయాన్ని అందించటానికి కృషి చేస్తున్నారు

**ఇండ్ల స్థలాల ఏర్పాటు .**

పేదప్రజలంతా స్వంత గృహాలు కలిగి వుండాలనే ధ్యేయంతో భూములను సేకరించి, ఇండ్లస్థలాలను కలుగచేస్తుంది ఇది యిప్పటికి గ్రామాలకే పరిమితం పట్టణాలకు విస్తరించి నప్పటికీ, యింకా అమలుకాబడలేదు

**వృద్ధాప్యపు పెన్షన్లు, వితంతు పెన్షన్లు వగైరా :**

2 లక్షలమందికి వృద్ధాప్యపు పెన్షన్లు మంజూరుకు రు 18 కొట్లు కేటాయించారు జాతీయ వృద్ధాప్యపు పెన్షన్ల క్రింద 11 లక్షలమందికి రు 100 కోట్లతో ప్రయోజనం కల్గించు చున్నారు

జాతీయ మెటర్నిటీ పథకం రు 33 75 కోట్లతో 7 25 లక్షల మంది లబ్ధిపొందుతారు

వితంతు పెన్షన్ల క్రింద 74000 మందికి రు 4 44 కోట్లు మంజూరు

ప్రమాదవశాత్తు చనిపోయిన పేదవారికి బీమా సౌకర్యం పిల్లలకు రు 50,000, పెద్దలకు ఒక లక్ష రూపాయలు, జాతీయ కుటుంబ పథకం క్రింద రు 44 కోట్లతో 62,157 కుటుంబాలకు మేలు జరుగుతుంది

**పట్టణాభివృద్ధి :**

పట్టణ నీటి సరఫరా, పారిశుద్ధ్యం, గృహనిర్మాణం, పట్టణాభివృద్ధి కార్యక్రమాలకు

1990-94లలో రు 889 94 కోట్లు

1995-98లలో రు 1670 05 కోట్లకు పెరిగింది

హైదరాబాద్, సికింద్రాబాద్‌లలోని 9 పురపాలక సంఘాలకు నీటి సరఫరా మెరుగు పర్చేందుకు, పారిశుద్ధ్య పథకాలకు రు 110 కోట్లు వ్యయం జరుగుతుంది జంటనగరాలలొ 9 ఫ్లై-ఓవర్లు, 6 రోడ్ వంతెనలు, 7 సబ్-వేలు నిర్మాణం చురుకుగా సాగుతుంది

పురపాలక సంఘాల్లో రు 645 కోట్లతో మంచినీటి సరఫరా మెరుగుపరిచేందుకు 73 పథకాలు చేపట్టబడినవి

రు 72 42 కోట్లతో పురపాలక సంఘాల్లో భూగర్భ మురుగునీటి పారుదల పథకాలు చేపట్టబడినవి నగరాలు, పట్టణాలలో 5 లక్షల మరుగుదొడ్లు నిర్మాణం చేపట్టబడుతుంది

**వెలుగు పథకం :**

డిపార్టుమెంట్ ఫర్ ఇంటర్నేషనల్ డెవలప్‌మెంట్ (బ్రిటన్)వారి పూర్తి గ్రాంటుగా రానున్న ఏడు సంవత్సరాలలో లక్ష జనాభాపైగల 32 పట్టణాలలో రు 745 కోట్ల రూపాయల వ్యయంతో నీటి సరఫరా. పారిశుద్ధ్యం, డ్రైనేజీ, రోడ్లు, వేస్టు మేనేజిమెంట్ కొరకు వ్యయం చేస్తారు లోగడ ఓవర్సీస్ డెవలప్‌మెంట్ అసోసియేషన్ (ఒ డి ఎ ) పేరుతో బ్రిటిష్ ప్రభుత్వం పూర్తి గ్రాంటుగా హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ నగరాలలో మురికివాడల నిర్మూలన, అభివృద్ధి పథకాలను గత 15 సంవత్సరాలుగా అమలుజరిపి, పేదప్రజల మన్ననలను పొందింది

**రోష్ని పథకం**

1999లో రాష్ట్ర ప్రభుత్వం ప్రారంభించిన రోష్ని పథకం అల్పసంఖ్యాకులకు (మైనారిటీలకు) కొత్త సౌకర్యాలు కల్పించుటకు ఉద్దేశించబడినది ఈ పథకం క్రింద 200 ఉర్దూ పాఠశాలలు, 300 షాదీఖానాల నిర్మాణానికి నిధులు కేటాయించింది మైనారిటీస్ కార్పొరేషన్ ద్వారా రు 15 కోట్లతొ స్వయం ఉపాధికి పథకాల అమలు, రు 5 కోట్ల వ్యయంతో మైనారిటీలకు ఆదరణ పథకం అమలు వగైరా

**మహిళా సాధికారికత పథకాలు .**

★ సుఖీభవ క్రింద గర్భిణీ స్త్రీలకు ప్రసవ సహాయంగా ఒక్కొక్కరికి రు 300/- ఆర్థిక సహాయం

★ స్త్రీలకొరకు ప్రత్యేకంగా 16 లక్షల మరుగుదొడ్ల నిర్మాణం

**వికలాంగుల సంక్షేమ పథకం :**

రాష్ట్రంలో 41 వసతి గృహాలు, 11 రెసిడెన్షియల్ పాఠశాలలు పనిచేస్తున్నాయి 35 హాస్టళ్ళలో 3500 మంది విద్యార్థులున్నారు వికలాంగులు వివాహాలు చేసుకున్న జంటలకు ప్రోత్సాహకాలు, వికలాంగులకు పెన్షన్లు - 50,000 మందికి నెలకు రు 75 చొప్పన మంజూరు, వికలాంగులకు ఉద్యోగాలలో 3 శాతం రిజర్వేషన్లు, 1998లో 'చేయూత' అనే పేరుతో యీ పథకాన్ని మరింతగా విస్తృతపరిచారు

మన రాష్ట్ర ప్రభుత్వం పైన పేర్కొన్న పథకాలన్ని తామే నిర్వహిస్తున్నామని చెబుతుండగా, యిందులో హెచ్చుభాగం 70% పైగా కేంద్ర ప్రభుత్వమే భరించుతుందని, కాని వారి పేరు లేకుండా యిదంతా తమ గొప్పేనని రాష్ట్ర ప్రభుత్వం చెప్పటం అసమంజసమనే బలమైన అభియోగాలున్నాయి

**దీపం పథకం :**

ఈ పథకాన్ని 1999 రాష్ట్ర శాసనసభ ఎన్నికల ముందుగా ప్రారంభించారు స్త్రీలు

వంటకు కట్టెలు వగైరా వాడటంతో వారు అనారోగ్యానికి గురౌతున్నందున, వారి సౌకర్యార్థం యీ దీపం పథకం అమలుజరుపుతున్నామన్నారు 15 లక్షలమంది మహిళలకు వంట గ్యాస్ కనెక్షన్లను ఇవ్వాలని లక్ష్యంగా, రు 150 కొట్ల వ్యయంతో ఒక్కొక్క కనెక్షన్‌కు రు 1000/-లు సబ్సిడీగా నిర్ణయించారు ఇందులో గ్రామీణ ప్రాంతాలలో 10 లక్షలు, పట్టణ ప్రాంతాలలో 5 లక్షలు గ్యాస్ పొయ్యిలు ప్రతిపాదించారు డ్రాక్వా, డ్వాక్రా మహిళలకు ఇవి ఇవ్వాలని ఉద్దేశం పట్టణాలలో ఇప్పటివరకు 2,18,100 మందికి మాత్రమే (అనగా టార్గెట్‌లో సగం), గ్రామాల్లో 7,98,000 మాత్రం ఇవ్వగలిగారు

ఈ పథకానికి ఎంతో ఆర్భాటంగా ప్రచారం చేసి మహిళలను ఆకట్టుకోటానికి తీవ్ర కృషి జరిగింది అయితే, మొదట్లొ వున్నంత ఉత్సాహంలేదు ఇటీవల కేంద్ర ప్రభుత్వం గ్యాస్ సిలిండరు ధరలను పెద్దగా పెంచటంతో, ఆ ధరలను భరించలేక ఉత్సాహం చూపటంలేదు పైగా, ఈ గ్యాస్ పొయ్యి ఇచ్చిన లబ్దిదారులకు ఇచ్చే కిరోసిన్ కొటా రద్దుచేయటంతో మరింతగా ఉత్సాహం తగ్గింది 2 సంవత్సరాల క్రితం ఆశించిన 15 లక్షల టార్గెటులో ఇప్పటికి 60 శాతం మాత్రమే పూర్తిచేయగలిగారు

## నీరు - మీరు .

ప్రకృతి వరంగా వర్షాల మూలంగా లభించుచున్న నీరు అత్యధికభాగం వృథా అవుతుంది రానురాను, వర్షాభావంవల్ల, యితర కారణాలవల్ల భూగర్భజలాల నీటిమట్టం తగ్గటంతో బావులు, చెరువులు, బోర్లు వగైరాలు వట్టిపోవటంతో పలు ప్రాంతాలు, పట్టణాలలో మంచినీటికి కూడ తీవ్ర కటకట ఏర్పడింది ఈ దుస్థితిని నివారించటానికి రాష్ట్ర ప్రభుత్వం 'నీరు - మీరు' పథకాన్ని విస్తృతంగా అమలుజరపటంద్వారా, వృథా అవుతున్న జలాలను కొద్దిమేరకైనా పొందుటకు కృషి జరుగుతుంది పట్టణాలలో బహిరంగస్థలాల్లో, పాఠశాలల్లో, ఆఫీసుల ఆవరణల్లో, గృహాలలో ఇంకుడు గుంటలను ఏర్పర్చి, కొంత నీటిని నిల్వచేసుకునే పథకాన్ని అమలుపరుస్తున్నారు

## రైతు బజార్

గ్రామాల్లో రైతులు పండించిన కూరగాయలు నగరాలకు చేరి, వినియోగదార్లకు చేరేసరికి ధరలు యిబ్బడిముబ్బడిగా పెరుగుతున్నాయి అటు కూరగాయిలు పండించే రైతులకు లాభం చేకూరక, వినియోగదారులైన ప్రజలకు సమంజసమైన ధరలకు దొరకక, మధ్యదళారీలు అమిత లాభాలు పొందుతున్న పరిస్థితుల్లో పట్టణాలు, నగరాలలో 1999 నుండి రైతు బజార్లను ప్రభుత్వం ప్రోత్సహించింది పండించిన రైతు స్వయంగా రైతు బజార్లో అమ్మకం చేసుకోటానికి వీలుగా కొన్ని మార్గదర్శక సూత్రాలను ప్రభుత్వం నిర్ణయించింది దీనివలన పండించే రైతుకు గిట్టుబాటు ధరలు, వినియోగదారులకు తాజా కూరగాయలు చౌకగా లభ్యమయ్యేందుకు అవకాశాలు కలిగాయి వీటి నిర్వహణలో కొన్ని లోటుపాట్లున్నా, వాటిని తగు విధంగా తొలగించి, పట్టణవాసులకు ప్రయోజనకరంగా శాశ్వత ప్రాతిపదికపై అన్ని పట్టణాలు, నగరాలలో రైతు బజార్లు ప్రజామోదాన్ని పొందుతున్నాయి

# 22. ప్రధానమంత్రి సమగ్ర పట్టణ పేదరిక నిర్మూలన పథకం

1991 జనాభా లెక్కల ప్రకారం దేశంలోని అన్ని పట్టణాల జనాభా 217 కోట్లు ఆంధ్రప్రదేశ్‌లో 6 65 కోట్ల జనాభాలో 179 కోట్ల ప్రజలు పట్టణాలలో నివసిస్తున్నారు పట్టణాలలో పెరుగుతున్న మురికివాడలు, రోడ్లప్రక్క నివసించేవారి సంఖ్య అధికం కావటంతో వీరికి సరియైన భౌతిక, సాంఘిక సదుపాయాలు లేవు వీరి సమస్యలను దృష్టిలో వుంచుకొని, ప్రధానమంత్రి పట్టణ పేదరిక నిర్మూలన పథకం దీర్ఘకాలికంగాను, బహుముఖ ప్రయోజనకరంగా వుండేటట్లు ఉద్దేశించబడింది

1995-96లో దేశవ్యాపితంగా 50,000 నుండి లక్ష జనాభా గల 345 పట్టణాలలో యీ పథకం ప్రారంభించబడింది మన రాష్ట్ర వాటాగా 34 పురపాలక సంఘాలలో అమలు చేయబడుతుంది

ఇందులో లబ్ధిదారులు = సాలుసరి రు 11850/-ల లోపు తక్కువ వార్షికాదాయం గలవారు అనాధ వీధి బాలబాలికలు

**కార్యక్రమాలు** 1 చిన్న వ్యాపారములు, నైపుణ్యాభివృద్ధి ద్వారా స్వయం ఉపాధి పథకాలు 2 నైపుణ్యాభివృద్ధి 3 బస్తీలలో **మౌలిక సదుపాయాల** ద్వారా పరిసరాల అభివృద్ధి 4 గృహాభివృద్ధి 5 సమాజ నిర్వహణ, **అధికారీ**కరణ, సమాజాభివృద్ధి నిధి, కమ్యూనిటీ కేంద్రాలు, పొదుపు - అప్పు సంఘాలు ఏర్పాటు 6 పట్టణ పేదరిక నిర్మూలన 7 జాతీయ పట్టణ పేదరిక నిర్మూలన నిధి 8 ప్రభుత్వేతర సంస్థల పాత్ర

1 నైబర్‌హుడ్ గ్రూపులు ఒకేరకమైన (ఎన్ హెచ్ జి) 10 **నుండి** 40 పట్టణ పేద మహిళలు కలసి, ఒక ఇరుగు-పొరుగు సముదాయమగును ఒక ప్రాంతమునకు చెంది, ఒకే రకమైన స్థితిగతులు **కల్గినవారైవుండాలి** వారిలో నుండి ఒక మహిళా స్థానిక సమాజ కార్యకర్తను (రెసిడెంటు కమ్యూనిటీ వాలంటీరు) **ఎన్నుకొంటారు**

2 ఇరుగు పొరుగు అభివృద్ధి సంఘం (**నైబర్‌హుడ్ డెవలప్‌మెంట్ కమిటీ - ఎన్ డి సి**) ఒక వాడ లేదా వార్డులో వున్న ఎన్ హెచ్ జి లో కలిసి ఎన్ **డి** సి **అగును**

ఈ సంఘం విధులు సమాజాభివృద్ధి సంఘం కమ్యూనిటీ డెవలప్‌మెంట్ సొసైటీ ఏర్పాటు

ముఖ్యంగా స్త్రీలు, పిల్లల అవసరాలు గుర్తించుట, సేవా సంస్థలు, ప్రభుత్వ శాఖలకు మధ్య వారధులుగా వుండి ప్రజల అవసరాలు గుర్తించి, తీర్చుట

శిక్షణా కార్యక్రమాలు నిర్వహించుట

ఆర్థికంగా సహాయపడుట, గృహవసతి కల్పించుట

సరైన లబ్ధిదారులను గుర్తించుటకు సర్వేలు నిర్వహించుట, నిధుల సమీకరణ

నిర్ణీతకాలంలో లబ్దిదారులు తీసుకున్న రుణాలు తిరిగి చెల్లింపులు చేయించుటకు సహకరించుట - వగైరా

## బాలల జాతీయ కార్యాచరణ ప్రణాళిక

## (National Plan of Action- a Commitment to the Child)

శిశువు తల్లిగర్భంలో ఉన్నప్పటి నుండి మరియు జన్మించిన తర్వాత తగిన వాతావరణం, మానసిక ఉల్లాసం, వ్యాధినిరోదకచర్యలు, వైద్య సలహాసౌకర్యాలు కల్పించటం మొదలగువాటిని శ్రద్ధగా అమలు పరచుటయే యీ పథకం ముఖ్య ఉద్దేశం

బాలలకు మనం చేయగలిగిందేమిటి ? దాదాపు 60 శాతం బాలలకు ప్రాథమిక విద్యావకాశాలు లేవు

త్రాగునీటి సౌకర్యం, మలమూత్ర విసర్జనకు అనువైనచోట్లు, ఉపయోగించిన నీరు మురికివలన పరిసరాల అపరిశుభ్రత, వాటివల్లవచ్చే జబ్బులు, నీటిలోగల ఫ్లోరైడ్ ద్వారా అంగవైకల్యం లాంటి సమస్యలున్నాయి 1990-2000 సంవత్సరంలో సాధించవలసిన లక్ష్యాలను 1990 సెప్టెంబరు 30న జరిగిన ప్రపంచ శిఖరాగ్రసమావేశం నిర్ధారించింది

1 5 ఏండ్లలోపు వయస్సుగల పిల్లల మరణాలను మూడవవంతు తగ్గించుట - ప్రసూతి మరణాలు తగ్గించటం

2 పౌష్టికాహారలోపాన్ని తగ్గించటం, అందరికీ అందుబాటులో త్రాగునీరు, పారిశుద్ధ్య వసతి కల్పించటం

3 ప్రాథమిక విద్యను కనీసం 80 శాతం పూర్తిచేయటం

**ఆడపిల్ల** · ఆడపిల్లలపట్ల వివక్షత, ఉదాశీనత భావాన్ని తొలగించి స్త్రీకి సమాజంలో సమాన స్థానాన్ని కల్గించటం, ఇందుకు అనుగుణ్యంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పేద కుటుంబాలలో జన్మించిన బాలికల పోషణ, విద్య, వివాహం, వృత్తిసహాయం 20 సంవత్సరాల వయస్సు వచ్చువరకు ఆర్థికసహాయం ప్రకటిస్తూ 1996 సెప్టెంబరులో ఉత్తర్వులు జారీ చేసింది

క్లిష్టపరిస్థితుల్లో వున్న

క్లిష్టపరిస్థితుల్లో వున్న అనాథ బాలలు, పేదరికంలో బాధపడుతూ, చెడు అలవాట్లకు గురి అయిన బాలలు, తిండికొరకు పట్టణాలకు పారిపోయివచ్చి, ఆశ్రయంలేక, చెత్తకుండీలలో పారేసిన వస్తువులు ఏరుతూ, బ్రతకలేక బ్రతుకుతున్న పిల్లలు, క్షణికావేశంలో చెడు అలవాట్లకు గురి అయిన బాలబాలికలు మాదకద్రవ్యాలు లాంటి అలవాట్లకు లోనైన అనాథ పిల్లలకు రక్షణ కల్పించుట ఈ కార్యక్రమంలో అంశాలు, వీరితోపాటు వికలాంగులు, మానసిక వికలాంగులు, ఎయిడ్స్ పేషంట్ల పిల్లలకు కూడా ఆరోగ్యం, విద్య కార్యక్రమాలు చేపట్టబడును

# స్వల్ప వ్యయపారిశుద్ధ్య పథకం

## (Low Cost Sanitation)

మన రాష్ట్రంలో 1982-83 నుండి ఇది అమలు జరుగుతుంది పాకీపని నిర్మూలన, విముక్తి, పాకీపనివారి విమోచన వగైరా ఈ మేరకు 1993లో పాకీపనివారిని నియమించటం మరియు ఇసుకదొడ్లు నిషేధచట్టం క్రింద పాకీపని వారిని నియమించుట శిక్షార్హమైన నేరముగా చేయబడినది

1 కుటుంబ, సామూహిక డ్రై లెట్రిన్స్ (ఇసుకదొడ్లు) ను వాటరీసీలు పోర్‌స్లష్ మరుగుదొడ్లుగా మార్చుటకు, 50 శాతం కేంద్ర గ్రాంటు, మిగతా 50 శాతం రాష్ట్ర ప్రభుత్వం, మునిసిపాలిటీలకు వడ్డీలేని రుణాలుగా యిచ్చును

2 విముక్తి 1983-84లో రాష్ట్ర పథకంలో ప్రథమదశ, ఇసుక, గచ్చుదొడ్లను సెప్టిక్ లెట్రిన్స్‌గా మార్చుట

2) కొత్తదొడ్లు నిర్మించుట, వ్యయంలో 50 శాతం రాష్ట్ర ప్రభుత్వ ఉచిత గ్రాంటుగా మునిసిపాలిటీకివ్వబడును మిగతా 50 శాతం హడ్కో రుణంగా పొందవలెను

3 సమగ్ర స్వల్ప వ్యయ పారిశుద్ధ్యం

లబ్దిదారుల తమ ఆర్థికస్థితిని బట్టి మరుగుదొడ్ల నిర్మాణానికి విరాళంగా యివ్వాలి

| | | భారత ప్రభుత్వం సబ్సిడీ | హడ్కోరుణం | లబ్దిదారుల వాటా |
|---|---|---|---|---|
| 1 | బలహీనవర్గాలకు | 45 శాతం | 50 శాతం | 5 శాతం |
| 2 | ఎల్ ఐ జి | 25 శాతం | 60 శాతం | 15 శాతం |
| 3 | యం ఐ జి | లేదు | 75 శాతం | 25 శాతం |

మరుగుదొడ్లులేని ఇండ్లలో మరుగుదొడ్ల నిర్మాణానికి లబ్దిదారుల నెలసరి రాబడిని బట్టి సబ్సిడీ, రుణసదుపాయం ఏర్పాటుగలదు పారిశుద్ధ్య పరిస్థితిని మెరుగుపరచుటకు లబ్దిదారులను ప్రోత్సహించాలి సబ్సిడీలు అందిన తర్వాత, 2 సంవత్సరాలలో నిర్మాణం పూర్తి చేయవలయును హడ్కో అప్పు 10 5 శాతం వడ్డీతో, 5 సంవత్సరాలలో 20 వాయిదాలలో తిరిగి చెల్లించవలయును

## మహిళా పొదుపు సంఘాలు

ఒక ప్రాంతంలోని స్త్రీలు అందరు పొదుపుసంఘ సభ్యులుగా ఏర్పడవచ్చును సంఘమునకు ప్రెసిడెంటు, సెక్రటరీ, కార్యవర్గసభ్యులను ఎన్నుకోవాలి నైబర్‌హుడ్ కమిటీ కన్వీనరు ఆర్గనైజర్‌గాను పెట్టుకోవచ్చును ఈ పొదుపు సంఘ బ్యాంక్ అకౌంటును ప్రెసిడెంటు, సెక్రటరీలు జాయింటుగా ఆపరేట్ చేయవలెను విధిగా బ్యాంకులో ఖాతాను తెరచి, రాబడిని బ్యాంకులో నిల్వచేయవలయును ప్రతి సభ్యురాలు ప్రతినెల పొదుపుక్రింద రు 30/- తక్కువగాకుండా చెల్లించాలి అప్పుగోరు సభ్యురాలు లీడరుద్వారా దరఖాస్తు,

చేసుకోవలయును మంజూరయిన అప్పుకు ప్రామిసరీనోటు పూర్తి చేయవలయును పొదుపు మొత్తమునకు ప్రతి సభ్యురాలు పొదుపు చేసిన మొత్తమునకు మూడు రెట్లు అప్పుపొందుటకు అర్హురాలు అప్పు పూర్తిగా చెల్లించిన పిదప, మరల అప్పుకోరవచ్చును అన్ని రకాలైన రిజిష్టర్లు, సభ్యత్వ రిజిష్టరు, అప్పు దరఖాస్తు, మంజూరు, ప్రాంసరి నోట్లు, ప్యాస్‌పుస్తకం, లెడ్జరు, క్యాష్‌బుక్, బ్యాంకు అక్కౌంటు వగైరాలు విధిగా వుంచవలెను

ఈ పొదుపు సంఘాలకు బ్యాంకులు తక్కువ వడ్డీకి అప్పులు యివ్వటం ద్వారా, పొదుపు ఉద్యమాన్ని ప్రోత్సహిస్తున్నారు పురపాలకసంఘ మరియు పట్టణాభివృద్ధిశాఖ ఉత్తర్వులు నెం 390, తేది 27 7 1994 రాష్ట్రంలోనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పలు పేదరిక నిర్మూలనా పథకాలు పట్టణాల అభివృద్ధి (ఐ డి ఎస్ ఎం టి ), నెహ్రూరోజ్‌గార్ (ఎన్ ఆర్ వై)లో కాస్ట్ శానిటేషన్ (ఎల్ సి ఎస్) అర్బన్ బేసిక్ సర్వీసెస్ ఫరదిపూర్, అర్బన్‌బేసిక్, సర్వీసులు, ఎన్విరాన్‌మెంటల్ ఇంప్రూవ్‌మెంట్ (మురికివాడల్లో) పథకాల, నైట్‌షెల్టర్లు అమలు జరుగుచున్నవి వీటి నిర్వహణకు వేరే వేరే అజమాయిషీ, నిర్వహణకు వివిధ స్థాయిల్లో భిన్నమైన కమిటీలు, యంత్రాంగం వుండడంవల్ల, ఒకదానితో మరొకటి సమన్వయంలేక, ఎవరిదారి వారిదే అన్న విధంగా వున్న పరిస్థితిని సమీక్షించి, అన్ని పథకాల అమలు, పర్యవేక్షణ, అజమాయిషీకిగాను ప్రతి జిల్లాకు అర్బన్ డెవలప్‌మెంట్ ఏజన్సీ-డి యు డి ఎ ను జిల్లా కలెక్టర్ అధ్యక్షులుగా, వివిధ శాఖల అధికారులు సభ్యులుగా (సుమారు 20 మంది) ఏర్పాటు చేయాలని నిర్ణయించింది మునిసిపల్ స్థాయిలో, జాయింట్ కలెక్టర్ ఛైర్మన్‌గా కమిటీల ఏర్పాటును నిర్ణయించింది రాష్ట్రస్థాయి కమిటీ (ఎస్ యు డిఎ) సొసైటీల చట్టం క్రింద రిజిష్టర్ చేయించాలని కూడా నిర్ణయించింది రాష్ట్రస్థాయి కమిటీ 2 నెలలకొకసారి సమావేశమై నిర్ణయాలు చేయాలి

ఇది యిలా వుండగా 12-1-1996 తేదీ గల 53 నెంబరు ఉత్తర్వుల ద్వారా రాష్ట్ర ప్రభుత్వం ప్రధానమంత్రి సమీకృత అర్బన్ పేదరిక నిర్మూలనా పథకం (పి ఎం ఐ యు పి ఇ సి) అమలుకు మార్గదర్శక సూత్రాలను రూపొందించింది

ఈ పథకాన్ని 50,000 నుండి 1,000,00 జనాభాగల రాష్ట్రంలోని 34 పట్టణాలలో అమలుజరుపుటకు నిర్ణయించారు

అవి 1) శ్రీకాకుళం 2) తాడేపల్లిగూడెం 3) నరసరావుపేట 4) నల్గొండ 5) అనకాపల్లి 6) ఆదిలాబాద్ 7) చిలకలూరిపేట 8) ధర్మవరం 9) మదనపల్లి 10) తాడిపత్రి 11) జగిత్యాల్ 12) బెల్లంపల్లి 13) మందమర్రి 14) కావలి 15) మిర్యాలగూడ 16) ఎమ్మిగనూరు 17) బోధన్ 18) కదిరి 19) తణుకు 20) బాపట్ల 21) శ్రీకాళహస్తి, 22) సూర్యాపేట 23) నిర్మల్ 24) కాగజ్‌నగర్ 25) పాలకొల్లు 26) నర్సాపూర్ 27) గూడూరు 28) పొన్నూరు 29) సిద్దిపేట 30) పాల్వంచ 31) మంచిర్యాల 32) రాయచోటి 33) సంగారెడ్డి 34) సిరిసిల్ల

పై ఉత్తర్వుల ద్వారా ఆయా ప్రాంత కమిటీలలో ఛైర్‌పర్సన్, మేయర్లను, శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులను కూడా జిల్లా అర్బన్ డెవలప్‌మెంట్ ఏజన్సీలో సభ్యులుగా చేశారు పట్టణాలలో, నగరాల్లో ఏర్పడే కమిటీలకు ఆయా మునిసిపాలిటీల కమిషనర్లు అధ్యక్షులుగా వుండాలని ఆదేశించారు

కేంద్ర ప్రభుత్వం వారి ఆదేశాల మేరకు ఎన్ ఆర్ వై, ఎన్ బి ఎస్, ఎన్ బి ఎస్ పి, ఐ డి ఎస్ ఎం వై, పధకాలను యింతకుముందు పేర్కొన్న 34 పట్టణాలలో అమలు 1995-96 నుండి నిలిపివేశారు. మిగిలిన నిధులను ఒక లక్ష, ఆ పైన జనాభాగల పట్టణాలలోనూ, 50,000లోపు జనాభా గల పట్టణాలలోనే అమలు జరపాలని నిర్ణయించారు పట్టణాలలో టౌన్ అర్బన్ పావర్టీ ఎరాడికేషన్ ఫండును ఏర్పాటు చేయుటకున్నూ, వివిధ విధాల లభించే నిధులన్నింటిని ఏకీకృతం చేసి, ఒక ఖాతా క్రింద ప్రత్యేకంగా అక్కౌంట్లు ఏర్పర్చాలని, యీ నిధులను మరే యితర ఖర్చులకు వినియోగించరాదని నిర్ణయించారు

## ప్రధానమంత్రి సమగ్ర పట్టణ పేదరిక నిర్మూలనా పథకం

ఈ పథకం 1995-96లో ప్రారంభించబడినది 50 వేల నుండి లక్షలోపు జనాభాగల **పట్టణాలకే** పరిమితం ప్రజల్లో ఆత్మస్థైర్యం కలిగించటం, ఉపాధి ఏర్పరచటం, నివాస వసతులు మెరుగుపరచటం, పరిశుభ్రత ద్వారా పరిసరాలు అభివృద్ధిపరచటం, యీ పథకం ప్రధాన లక్ష్యాలు ఈ పథకంలో కార్యక్రమ ప్రణాళికలు, అమలు, సమీక్షలు మెరుగుపరచటంలో స్థానిక సంస్థలు **కీలకపాత్ర** వహిస్తాయి స్థానిక స్వచ్ఛంద సంస్థలు, ప్రైవేటు సంస్థలు సహకారంతో కార్యక్రమాలు నిర్వహించాలి

**స్వయం ఉపాధి** క్రింద - ఒక యూనిట్‌కు లక్ష రూపాయల వరకు రుణం, పరిశ్రమ స్థాపనలో 15 శాతం సబ్సిడీ ఒక్కొక్క లబ్ధిదారునకు రు 7,500/- వరకు వ్యక్తిగత సబ్సిడీ పొందే అవకాశం వుంది లబ్ధిదారుడు తన వంతు ధనంగా 5 శాతం భరించితే చాలు మిగతా సొమ్మును సులభ వాయిదాల్లో 3 నుండి 7 సంవత్సరాలలోపుగా తిరిగి చెల్లించాలి

ఈ పథకం క్రింద మౌలిక సేవలను పూర్తిస్థాయిలో అమలుజరుపవచ్చు. మంచినీరు, శానిటేషన్, చెత్తాచెదారం తొలగింపు, రోడ్లు, మురుగుకాల్వలు, కమ్యూనిటీ స్నానపుగదులు, మరుగుదొడ్లు వగైరా చేపట్టవచ్చు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 60 40 శాతంగా ఖర్చును భరిస్తాయి

నివాస సౌకర్యాలు మెరుగుపరచటానికి 25 శాతం సబ్సిడీ, నాల్గువేల వరకు ఒక యూనిట్‌కు లభిస్తుంది. హడ్కో లేక యితర ఆర్థిక సంస్థల నుండి రు 10,000 వరకు రుణం యిప్పించబడుతుంది 100 కుటుంబాలు గల ఇరుగుపొరుగు సంఘాలు 300 చ గ లలో కమ్యూనిటీ కేంద్రాలు, శిశు విద్యా కేంద్రాలు, అనియత విద్య, అక్షరాస్యత,

ప్రాథమిక ఆరోగ్యకేంద్రం, సాంస్కృతిక కేంద్రాలు నిర్మించుకోవచ్చు ఇందుకయ్యే ఖర్చును చెరిసగం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు భరిస్తాయి

సుమారు 50 లక్షలమంది పట్టణ పేదలకు యీ పథకం వల్ల ప్రయోజనం చేకూరుతుంది అయిదు సంవత్సరాల కాలానికి 1995-96 నుండి 1999-2000 వరకు కేంద్ర ప్రభుత్వం రు 800 కోట్ల రూపాయలను తన వంతు విధిగా జమచేస్తుంది

## పట్టణ పేదల మౌలిక సేవా పథకం

**పట్టణ** పేదల జీవితాలను మెరుగుపరచుట**కు, అందుకు** కావలసిన అనుకూల పరిస్థితులను సృష్టించుట -స్థూలంగా యీ పథకం ముఖ్యోద్దేశం పట్టణ మురికివాడల పరిసరాల అభివృద్ధి, నెహ్రూ రోజ్‌గార్ యోజన, స్వల్ప వ్యయపారిశుధ్య పథకాలు యిందులో చేర్చబడినవి

**సంస్థాగత ఏర్పాటు** ఇరుగుపొరుగు సముదాయాలు (ఎన్ హెచ్ జి) ఇరుగుపొరుగు అభివృద్ధి సంఘం (ఎన్ హెచ్ సి) సమసమాజాభివృద్ధి సంఘాలు (సి డి ఎస్) ద్వారా అమలు

### నెహ్రూ రోజ్‌గార్ యోజన (NRY)

పట్టణ మురికివాడల్లో నివసిస్తున్న ప్రజల్లో పూర్తి నిరుద్యోగులు, లేక తగినంత పనిలేనివారి ఉపాధి కల్పనపై ఈ పథకం రూపొందించబడింది ఇది రెండు రకాలు

1 స్వయం ఉపాధి కల్పనకై చిన్న వ్యాపారములు నెలకొల్పుట

2 అల్పాదాయ వర్గాలు నివసించే ప్రదేశాలలో గృహవసతి మెరుగుపరచుట, లేదా ప్రజల ఉమ్మడి ఆస్తుల నిర్మాణం వంటి పనుల్లో కూలీలకు వేతన ప్రాతిపదికపై ఉపాధి కల్పించుట

చిన్న వ్యాపారుల పథకం అన్ని పట్టణాలకు వర్తించును పట్టణ వేతన ఉపాధి పథకం లక్షలమంది లోపు జనాభాగల ప్రాంతాలకు వర్తించును గృహ నిర్మాణం, మెరుగుదల పథకం లక్ష నుండి 20 లక్షల జనాభాగల పట్టణాలకు వర్తించును

**నిధుల ఏర్పాటు** ఈ పథకం క్రింద అయ్యే మొత్తం ఖర్చుకేంద్ర ప్రభుత్వం,రాష్ట్ర ప్రభుత్వాలు 60 40 శాతం నిష్పత్తిలో భరింతురు

## పట్టణ మురికివాడ పరిసరాల అభివృద్ధి పథకం

పట్టణ మురికివాడలలో నివసించు ప్రజల జీవన పరిస్థితులు మెరుగుపరచుట, మంచినీటి, మురుగునీటి పారుదల, సామూహిక మరుగుదొడ్లు, స్నానపుగదులు, వీధులు విశాలపరచి రోడ్లు వేయుట, వీధి దీపములు, యితర సామాజిక సౌకర్యములు ఏర్పాటు **చేయుటకు ఉద్దేశించబడినది** కనీసం 10 నుండి 15 సంవత్సరముల స్థిరనివాసముండే

మురికివాడల అభివృద్ధికి యీ పథకం తోడ్పడుతుంది

ఈ పథకం క్రింద తలసరి ఖర్చు రు 300 నుండి రు 525/- వరకు సామాజిక సౌకర్యములు, చెత్త తొలగించు నిర్వహణ ఖర్చులు ఇందులో చేర్చబడినవి

**సహాయ ప్రమాణములు** . మురికివాడ ప్లానులు డైరెక్టరు ఆఫ్ టౌన్ అండ్ కంట్రీ ప్లానింగ్ వారిచే ఆమోదించబడవలెను కొత్తగా చేపట్టనున్న, ఇప్పటికే వున్న పనులు కలసి యీ దిగువ ప్రమాణములు వుండవలెను

మంచినీటి కుళాయి 1 నుండి 200 మందికి

సామూహిక మరుగుదొడ్డి - 1 నుండి 100 మందికి

విద్యుత్ స్థంభములు - 1 నుండి 15 మందికి

తలసరి వ్యయం - రు 525/-

మంచినీరు, విద్యుత్, మరుగుదొడ్లకు ప్రాధాన్యత యివ్వవలెను



# 23. పట్టణ ప్రాంతాల పరిపాలనకు సంబంధించిన కొన్ని యితర చట్టాలు

## 1. ఆంధ్రప్రదేశ్ అర్బన్ ఏరియాస్ (డెవలప్‌మెంటు) యాక్టు - 1975 (అర్బన్ డెవలప్ అధారిటీస్ చట్టం)

ఈ చట్టం 21 సెప్టెంబరు 1974న గవర్నరుగారిచే ప్రెసిడెంటు ఆఫ్ ఇండియా వారి ఆమోదానికి నివేదించగా 20 1 75న వారి ఆమోదం లభించింది 27 1 1975 ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రచురించబడింది

**చట్టం యొక్క ముఖ్య ఉద్దేశాలు, లక్ష్యాలు .**

1 ఒక ప్రాంతాన్ని రాష్ట్ర ప్రభుత్వం డెవలప్‌మెంటు ఏరియాగా ప్రకటించిన వెంటనే 'అర్బన్ డెవలప్‌మెంట్ అధారిటీ' ఏర్పాటు చేయబడును

2 రాష్ట్ర ప్రభుత్వమే నామినేషన్ ద్వారా సంస్థ అధికారవ్యవస్థను నియమించుతుంది ఈ అధారిటీలో ఒక ఛైర్మన్, వైస్ ఛైర్మన్, ఆ ప్రాంతంలోని శాసనసభ్యులలో ముగ్గురును, ప్రాంతంలోని మునిసిపాలిటీల నుండి ఇద్దరును, మునిసిపల్ కార్పొరేషన్ నుండి ఒకరు, టౌన్‌ప్లానింగ్‌శాఖ, ఆర్థికశాఖ నుండి ఒక్కొక్క సభ్యుడు, ప్రభుత్వంచే నామినేట్ చేయబడిన అయిదుగురు అనధికార సభ్యులు వుంటారు వైస్‌ఛైర్మన్ పూర్తికాలపు ఆఫీసరుగాను, కార్యనిర్వహణ అధికారిగాను వ్యవహరించును

3 ప్రతి అధారిటీకి ఒక సెక్రటరీని, ఛీఫ్ అక్కౌంటెంటు ఆఫీసరు, టౌన్‌ప్లానర్, ఇంజనీరు నియమింతురు

**అధారిటీ యొక్క ఉద్దేశం, అధికారాలు :**

1 ఏ ప్రాంతానికైతే యీ అధారిటీ ఏర్పర్చబడిందో, ఆ ప్రాంతాభివృద్ధికి కృషి చేయాలి ఇందుకొరకు అవసరమయిన భూములను సేకరించుట, అమ్ముటకు, తనిఖీలు చేయుటకు, భవనాల నిర్మాణం, ఇంజనీరింగు పనులు నిర్వహించటం, మంచినీటి సరఫరా, డ్రయినేజి వసతులు కల్పించటం, విద్యుత్ దీపాలు ఏర్పాటు, కాలుష్యనివారణ చర్యలు చేపట్టుట, గృహ సముదాయాలు, పార్కులు నిర్మించుట - వగైరా కార్యక్రమాలు చేపట్టుట

2 పట్టణాలకు, నగరాలకు మాష్టరుప్లానులను రూపొందించి అమలు జరుపుట

3 జోనింగ్ నిబంధనలను రూపొందించుట, అమలుజరుపుట

పై వాటివల్ల పట్టణాలు, నగరాలలో, నివాసిత ప్రాంతాలు వ్యాపార, వాణిజ్యప్రాంతాలు, పారిశ్రామిక ప్రాంతాలు, ప్రధానమైన రోడ్ల ఏర్పాటు వగైరా సూచించుట

ఈ ప్లాన్లను రూపొందించి, ప్రజాభిప్రాయాన్ని, ఆయా పురపాలక, నగరపాలక సంస్థల

అభిప్రాయాలను తెలుసుకుని ప్రభుత్వ ఆమోదాన్ని పొందాలి యీ చట్టం అమలులోనికి వచ్చిన పిదప, ఏ ప్రాంతంలోనైతే, యీ అభివృద్ధి అధారిటీ ఏర్పర్చడబడిందో ఆ ప్రాంతంలో అధారిటీ అనుమతి పొంది మాత్రమే పరిధిలోని వ్యక్తులు, స్థానిక సంస్థలు, లేదా ప్రభుత్వ శాఖలు అభివృద్ధి పనులను చేపట్టవచ్చు ఈ అధారిటీ అనుమతిలేనిదే నిబంధనలకు, మాస్టరుప్లాను, జోనింగ్ రెగ్యులేషన్లకు లోబడి భవన నిర్మాణాలుగాని, తదితర అభివృద్ధి పనులను చేపట్టరాదు

డెవలప్మెంట్ అధారిటీ పరిధిలోగల ప్రభుత్వ భూములను అధారిటీకి అమలులోని నిబంధనలకు లోబడి ప్రభుత్వం దఖలుపరచాలి

**అథారిటీ నిధులు :**

1 కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నుండి లభించే గ్రాంట్లు, అప్పులు వగైరా

2 తన స్వంత నిర్ణయంతో అభివృద్ధి కార్యక్రమాలకు తీసుకునే అప్పులు

3 చట్ట నిబంధనల ప్రకారం వసూలయ్యే భవన నిర్మాణఫీజులు

4 భవనాలు, భూములు అమ్మకంవల్ల లభించే నిధులు, షాపులు, వగైరాల నుండి వచ్చే అద్దెలు

ప్రతి సంవత్సరం తన ఆదాయ వ్యయాల పట్టికను రాష్ట్ర ప్రభుత్వ ఆమోదానికి పంపాలి ఆడిట్ జరగాలి సాంవత్సరిక నివేదికను తయారుచేయాలి

**రాష్ట్ర ప్రభుత్వ ప్రత్యేక అధికారాలు :**

స్థానిక సంస్థలు - పంచాయతీలు, మునిసిపాలిటీలు, నగరపాలక సంస్థలకుగల కొన్ని అధికారాలను సస్పెండుచేసి, అథారిటీకి అప్పగించు అధికారం కలదు ఆ విధంగా బదిలీ చేసినప్పుడు పట్టణాభివృద్ధి సంస్థ ఛైర్మన్ - కార్పొరేషన్ స్థాయి సంఘ అధ్యక్షులు మునిసిపాలిటీ, పంచాయతీ అధ్యక్షులుగా వ్యవహరించగలరు

ఏ కారణంచేతనైనా పట్టణాభివృద్ధి సంస్థను ఏర్పాటు రాష్ట్ర ప్రభుత్వం చేయని సందర్భాలలో ప్రత్యేక అధికారిని నియమించి, వారికి సంస్థ అధికారాలను కల్గించవచ్చు

ప్రస్తుతం రాష్ట్రంలో హైద్రాబాద్ పట్టణాభివృద్ధి సంస్థ, విశాఖపట్నం పట్టణాభివృద్ధి సంస్థ, కాకతీయ పట్టణాలభివృద్ధి సంస్థ (వరంగల్), తిరుపతి పట్టణాభివృద్ధి సంస్థ, విజయవాడ - గుంటూరు- తెనాలి-మంగళగిరి పట్టణాభివృద్ధి సంస్థలు మరియు కుల్ కుతుబ్ అభివృద్ధి సంస్థ - ఆరు దీర్ఘకాలంగా ఏర్పడి, తరతమస్థాయిలలో అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించుచున్నవి

హైద్రాబాద్, విశాఖపట్నం సంస్థలు చాలా పెద్దస్థాయిలో యీ కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి

# 2. ఆంధ్రప్రదేశ్ టౌన్‌ప్లానింగు చట్టం - 1920

1 ఈ చట్టం మునిసిపాలిటీలకన్నింటికి వర్తించును దిగువ అంశాలను టౌన్‌ప్లానింగ్ స్కీము పరిధిలోనికి వచ్చును

1 ఖాళీగా వున్నాగాని, లేదా నిర్మాణంలో కొనసాగుతున్న భూములకు లే-అవుట్లు తయారుచేయుట

2 వీధులు, రోడ్లు, అభివృద్ధి లేదా మూసివేయుట

3 భవనాల నిర్మాణం, మార్పులు, లేదా తొలగింపు, కూలద్రోయుట

4 అవసరమయిన భూముల స్వాధీనపరుచుకొనుట

5 భూములను, భవనాలను, స్థలాలను అమ్మేట, మార్పిడిచేసుకొనుట

6 వ్యక్తుల స్థలాలకు సరిహద్దులను సరిచేయుట

7 రవాణా సౌకర్యాలు ఏర్పాటు

8 మంచినీటి సరఫరా, లైటింగ్, మురుగునీటి కాలువల, పథకాల అమలు

9 వీధులు, రోడ్ల కూడళ్ళ సెంటర్లు ఏర్పాటు, మతసంబంధమైన, ధర్మకార్యాలకు బహిరంగ స్థలాలు, పార్కులు, తోటలు, వినోద కాలక్షేపాలకు, విద్యాలయాలు, మార్కెట్లు, షాపులు, ఫ్యాక్టరీలు, ఆసుపత్రులు, ప్రభుత్వ లేదా మునిసిపల్ భవనాలకు అవసరమయిన స్థలాలను కేటాయించుట లేదా రిజర్వుచేయుట

10 భవనాల నిర్మాణం

11 చారిత్రక, పురాతన, ప్రకృతి అందచందాలకు, ప్రజలు ఆరాధించే స్దలాలను గుర్తించి, పరిరక్షించుట

12 భవనాల స్వరూపాలను, ఎత్తులను ఏఏ ప్రాంతాలలో ఎంతవరకు పరిమితిచేయాలో నిర్ణయించుట

13 పై లక్ష్యాల అమలుకు మునిసిపాలిటీ చట్టం లేదా పంచాయతీల నిబంధనలను సస్పెండు చేయుట - వగైరా

2 ఈ చట్ట లక్ష్యాలను అమలు జరుపుటకు రాష్ట్ర ప్రభుత్వం డైరెక్టర్ ఆఫ్ టౌన్‌ప్లానింగ్ అధికారిని నియమించును

3 మునిసిపాలిటీలో ఏ ప్రాంతాన్నైనా ఈ స్కీము క్రింద మునిసిపల్ కౌన్సిలు

ప్రకటించుటకు తీర్మానించగలదు అట్లు చేయుటకు ముందుగా ఆ స్కీముకు తగు ప్రచారం చేసి, ప్రజల నుండి అభ్యంతరాలు స్వీకరించి, పరిశీలించవలయును పరిశీలన తర్వాత, కౌన్సిలు చేసిన విధంగా స్కీమును ప్రభుత్వామోదానికి పంపవలెను

రాష్ట్ర ప్రభుత్వానికి ఏ దశలోనైనా స్కీములను రద్దు చేసే అధికారం కలదు

4 టౌన్‌ప్లానింగ్ స్కీము వల్ల, ఆ ప్రాంత భూముల విలువ పెరిగిన కారణంగా మునిసిపల్ కౌన్సిలు ఆ పరిసర భూముల యజమానుల నుండి నిర్ణయించిన కాలానికి, నిర్ణయించిన అభివృద్ధి రుసుమును విధించి వసూలు చేయవచ్చు స్కీము అమలులో ఏర్పడే వివాదాల సత్వర పరిష్కారానికి రాష్ట్ర ప్రభుత్వం ఒక ఆర్బిట్రేటరును నియమించాలి

**టౌన్‌ప్లానింగ్ కమిటి ·**

ప్రభుత్వ నిబంధనలకు లోబడి, మునిసిపల్ కౌన్సిలు టౌన్‌ప్లానింగు కమిటీని నియమించును అందులో కౌన్సిలర్లుకాని వారిని కూడా చేర్చుటకు అవకాశం గలదు ఆ కమిటీకి కొన్ని అంశాలపై నిర్ణయం చేయు అధికారాన్ని కౌన్సిలు బదలాయించవచ్చు ఇతర శాఖలతో కలిపి జాయింటు టౌన్‌ప్లానింగ్ కమిటీ ఏర్పాటు చేయుటకు కూడా అవకాశం వుంది

**టౌన్‌ప్లానింగ్ ట్రస్టులు ఏర్పాటు :**

మునిసిపాలిటీలో ఏదైనా ఒక ప్రాంతం అభివృద్ధికి ట్రస్టు ఏర్పాటు మిక్కిలి ప్రయోజనకరంగా వుంటుందని ప్రభుత్వం భావించినచో ఆ మునిసిపల్ కౌన్సిలును సంప్రదించి, ఇంప్రూవ్‌మెంటు ట్రస్టును నియమించవచ్చు

ఈ ట్రస్టుకు ప్రభుత్వం నియమించిన ఒకరు ఛైర్మన్‌గాను, కౌన్సిలు నుండి సభ్యులు, ప్రభుత్వం నియమించు యితర శాఖల ప్రతినిధులు, కొన్ని సందర్భాలలో రైల్వే, ట్రాంవే సంస్థల ప్రతినిధులు సభ్యులుగా వుందురు

ట్రస్టులో వుండవలసిన సభ్యుల సంఖ్య ప్రభుత్వమే నిర్ణయించుతుంది పదవీకాలాన్ని కూడా 5 సంవత్సరాలకు మించకుండా ప్రభుత్వం నిర్ణయించుతుంది ఈ ప్రాంతానికి యిదే స్థానిక సంస్థగానూ, కౌన్సిలుగాను, ఛైర్‌పర్సన్‌గాను వ్యవహరింతురు

ఈ ట్రస్టు నిర్వహణకు ఆయా కౌన్సిలు నుండి నిధులు చెల్లించబడాలి

ట్రస్టు తనకు నిర్ణయించబడిన కర్తవ్యాలు పూర్తి చేసిన పిదప, ట్రస్టును ప్రభుత్వం రద్దు చేస్తుంది ట్రస్టు ఏరియా తిరిగి కౌన్సిలు పరిధిలోకి చేరుతుంది

## 3. హైదరాబాద్ మెట్రోపాలిన్ వాటరు సప్లయి, సూయరేజ్ చట్టం 1989

మన రాష్ట్రంలో యీ చట్టం క్రింద ఒక్క హైదరాబాద్ నగరంలోనే యీ బోర్డు పనిచేస్తుంది (మిగతా పట్టణాలు, నగరాలలో ఆయా మునిసిపాలిటీలు, కార్పొరేషన్లు యీ బాధ్యతలు నిర్వహిస్తున్నాయి ఈ బోర్డులో

1 రాష్ట్ర ముఖ్యమంత్రి -ఎక్స్ అఫిషియో ఛైర్మన్

2 రాష్ట్ర పురపాలకశాఖామంత్రి ఎక్స్అఫిషియో వైస్‌చైర్మన్

3 రాష్ట్ర ప్రభుత్వ పురపాలకశాఖ కార్యదర్శి ఎక్స్ అఫిషియో డైరెక్టర్

4 ఫైనాన్స్, నీటిపారుదలశాఖల సెక్రటరీల డైరెక్టరు

5 ఛైర్మన్,రాష్ట్ర కాలుష్యనివారణాశాఖ డైరెక్టరు

6 రాష్ట్ర ఆరోగ్యం, మెడికల్ శాఖా డైరెక్టరు

7 ప్రభుత్వంచే నియమించబడిన ఒక చీఫ్ ఇంజనీరు

8 ఆడిట్ సర్వీసు నుండిగానీ లేదా చార్టర్డు అక్కొంటెంటుగాని ప్రభుత్వంచే నియమించబడిన డైరెక్టరు

9 మేనేజింగు డైరెక్టర్ ఐ ఎ ఎస్ కాడరు అధికారి

### బోర్డు బాధ్యతలు

ఎ) రక్షిత మంచినీటి సరఫరా ఏర్పాట్లు

బి) మురుగునీటి పథకాలు అమలు, నిర్వహణ

సి) రు 10 కోట్లకుపైగా వ్యయం అయ్యే పథకాలకు రాష్ట్రప్రభుత్వం ఆమోదం కావాలి

**బోర్డు** బోర్డు ఖర్చులకుగాను, వినియోగదారుల నుండి రేట్లు, ఫీజులు, అద్దెలు డిపాజిట్లు, కంట్రిబ్యూషన్‌లు ఎప్పటికప్పుడు నిర్ణయించి, వసూలుచేయుట, ప్రతి సంవత్సరం ఫిబ్రవరి నెలలో తన ఆదాయ వ్యయాల స్టేట్‌మెంట్‌ను ప్రభుత్వామోదానికి పంపించాలి

బోర్డుకు అవసరమయిన నిధులకొరకు ప్రభుత్వం నుండిగాని, యితర ఆర్థిక సంస్థల నుండిగాని అప్పులుపొందుట

నగర ప్రజలకు రక్షిత మంచినీటి సరఫరాకు అవసరమయిన నీటి ఉత్పాదన, రిజర్వాయర్ల, ఫిల్టరేషన్ ప్లాంట్లు, వాటర్ మెయిన్లు వగైరా ఏర్పాట్లన్నీ చేయవలయును

అన్ని మంచినీటి కుళాయిలు బోర్డు అధీనంలో వుండును సరఫరా చేసిన మంచినీటికి బోర్డు నిర్ణయించిన ఛార్జీలు వినియోగదారులు క్రమంగా చెల్లించవలయును గృహావసరాల, వ్యాపార, వాణిజ్య అవసరాలకు, పరిశ్రమలకు వివిధ రేట్ల ప్రకారం సరఫరా చేయబడును నీటి వినియోగ పరిమాణం కొరకు అన్ని కనెక్షన్లకు మీటర్లు తప్పనిసరిగా ఏర్పాటుకావాలి

### మురుగునీటి ట్రీట్‌మెంట్ వర్క్స్ ·

నగరంలోని అన్ని ప్రాంతాలకు భూగర్భ మురుగునీటి పథకాన్ని విస్తరించుట, సక్రమ

నిర్వహణకు చర్యలు తీసుకొనుట, వినియోగదారుల నుండి క్రమంగా ఫీజులు వసూలు చేయుట గృహ యజమానులు విధిగా తమ భవనానికి అవసరమయిన డ్రైనేజి సౌకర్యం ఏర్పాటు చేయుట

## 4. ఆంధ్రప్రదేశ్ హౌసింగ్ బోర్డు చట్టం - 1956

ఈ చట్టం రాష్ట్ర వ్యాపితంగా 1962 నుండి అమలు జరుగుతుంది

హౌసింగ్‌బోర్డు ఛైర్మన్‌ను ప్రభుత్వం నియమించుతుంది వైస్‌ఛైర్మన్, మరియు హౌసింగు కమిషనరు సోషల్ వెల్ఫేర్ శాఖా కార్యదర్శి

రాష్ట్ర పురపాలకశాఖ నుండి ఒక ఆఫీసరు, ఫైనాన్స్,ప్లానింగ్ శాఖల నుండి ఒక్కొక్కరు పబ్లిక్ హెల్త్ ఛీఫ్ ఇంజనీరు

బిల్డింగ్స్ ఛీఫ్ ఇంజనీరు

టౌన్‌ప్లానింగ్ డైరెక్టర్

డైరెక్టర్ ఆఫ్ మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్, ఎ పి స్టేట్‌ఎలక్ట్రిసిటి బోర్డు సెక్రటరీ, హైద్రాబాద్ మునిసిపల్ కమిషనర్ రాష్ట్రంలోని పట్టణాభివృద్ధి సంస్థలనుండి ఒకరిని

బోర్డుకు ఆర్థిక సహకారం అందించు సంస్థల నుండి ఒకరు రాయలసీమ, తెలంగాణా, కోస్తా ఆంధ్రాల నుండి ముగ్గురు ప్రజా ప్రతినిధులు

హైదరాబాద్, సికింద్రాబాద్ నగరాల నుండి ఒకరు

పై రాష్ట్రస్థాయి బోర్డు ఆయా స్థానిక ప్రాంతాలలో ఒకటిగాని లేదా ఎక్కువ కమిటీలను నియమించి వాటికి విధులు, బాధ్యతలను నిర్ణయించును

నెలకొకసారయినా యీ బోర్డు సమావేశం కావాలి లేదా అవసరమనుకొన్నప్పుడు, ఛైర్మన్ ప్రత్యేక సమావేశాన్ని పిలువవచ్చు

కోరం - సగం మంది సభ్యులు

ఈ బోర్డు కార్యనిర్వహణాధికారిగా వైస్ ఛైర్మన్, మరియు హౌసింగ్ కమిషనరు వ్యవహరిస్తారు హౌసింగ్ స్కీములు ప్రభుత్వ ఆదేశాలననుసరించిగాని లేదా బోర్డు నిర్ణయాల ప్రకారంగాని హౌసింగు స్కీములను రూపొందించాలి ఇందుకొరకు స్థలాలను సేకరించుట, వాటికి అవసరమయిన లే -అవుట్లు సిద్ధం చేయుట స్కీం పరిధిలో మురికివాడల అభివృద్ధిపరచుట,స్కీముకు అభ్యంతరకరంగా వున్న భవనాలను అమ్ముట లేక వాయిదా పద్ధతుల్లో అమ్మకే ఏర్పాటు, స్కీం పరిధిలొ రోడ్లు, డ్రయిన్లు, వాటర్‌సప్లయి, లైటింగు ఏర్పాట్లు చేయుట, పార్కులు, ఆటస్థలాలు, ఓపెన్ ప్రదేశాలు అభివృద్ధి చేయుట, శానిటరీ, డ్రైనేజి ఏర్పాట్లు చేయుట స్కీం అమలుకు ధనాన్ని మంజూరు చేయుట వగైరాలు,

ప్రతి సంవత్సరం ఒకటవ డిసెంబరు నాటికి రానున్న సంవత్సర కార్యక్రమాలు రూపొందించును

ఆదాయ వ్యయాలు పట్టిక తయారుచేయుట

నిర్ణయించిన హౌసింగ్ స్కీముల వివరాలు వాటిని తుదిరూపం యివ్వటం

పై వాటినన్నింటికి ప్రభుత్వ ఆమోదం పొందాలి

ఏదైనా స్కీంను అమలు జరపాలంటే, ఎ పి గెజెట్‌లో ప్రచురించటం, అభ్యంతరాలు, సూచనలు స్వీకరించటం, వాటిని పరిశీలనచేసి, స్కీము తుదిరూపంలొ బహిరంగపర్చాలి.

బెటర్‌మెంటు ఛార్జీలు విధింపు, వసూలు చేయుటకు చర్యలు తీసుకుంటుంది

ఏదేని ప్రాంతంలో హౌసింగ్‌స్కీం అమలు జరుపుటవల్ల, సహజంగానే ఆ ప్రాంత భూముల విలువ పెరిగే అవకాశాలుంటాయి అలాంటి సందర్భాలలో ఆ భూ యజమానుల నుండి బెటర్‌మెంట్ ఛార్జీలు విధించి వసూలు చేసుకునే అధికారం ఆ మునిసిపాలిటీకి వుంది

తనకున్న భూములను అమ్ముటకు, మార్పిడికి, లేదా తనఖా పెట్టుటకు అధికారం కల్గివుండును

బోర్డు భవనాల నుండి అద్దెదారులను వెళ్ళగొట్టుటకు బోర్డుకు అధికారం వుంటుంది రెండు నెలలు వరుసగా అద్దెలు చెల్లించకపోయినా, తాను అద్దెకు తీసుకున్న భవనాన్ని బోర్డు అనుమతి లేకుండా వేరొకరికి అద్దెకు యిచ్చినా వారికి తగిన నోటిసిచ్చి, వారిని ఏ విధంగానైనా ఖాళీ చేయించు అధికారం కలదు

ఇంకా, దిగువ చట్టాలు కూడా అమలులోనున్నవి

1 ఎ పి అపార్ట్‌మెంట్సు (ప్రమోషన్ ఆఫ్ కన్‌స్ట్రక్షన్, ఓనర్‌షిప్) చట్టం - 1987

2 ఎ పి లోకల్‌బాడీస్ ఎలోక్టరల్ రిఫార్మ్‌చట్టం - 1989

3 ఎ పి టాక్స్ ఆన్ ప్రొఫెషన్స్, ట్రేడ్స్, కాలింగ్స్, ఎంప్లాయ్‌మెంట్‌చట్టం - 1987

4 మల్టీ స్టోరీడ్ బిల్డింగ్ రెగ్యులేషన్స్ - 1981



# 24. ఆంధ్రప్రదేశ్‌లో హడ్కో సంస్థ కార్యకలాపాల వివరాలు

1970లో భారత ప్రభుత్వం రు 2 కోట్ల మూలధనంతో హౌసింగ్ అండ్ అర్బన్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్‌ను (హడ్కో)ను ఏర్పర్చింది దీని ప్రధాన లక్ష్యాలు పెరుగుతున్న పట్టణాలు, నగరాలకు మౌలిక సదుపాయాల ఏర్పాటుకు, గృహనిర్మాణ కార్యక్రమాలకు దీర్ఘకాల రుణ సదుపాయం, సాంకేతికపరమైన సలహాలు, సహాయం అందించటం

గత 30 సంవత్సరాలలో ఈ సంస్థ పెట్టుబడులు,చేపట్టిన పథకాలు గణనీయంగా పెరిగాయి 1999 మార్చినాటికి దేశ వ్యాపితంగా 123055 కోట్ల రూపాయల రుణాలు మంజూరు చేయగా, అందులో 15509 కోట్ల రూపాయలు గృహనిర్మాణానికి, రు 7519 కోట్లు పట్టణాలలో మౌలిక సదుపాయాల ఏర్పాటుకు ఇవ్వబడినవి ఈ కాలంలో హడ్కో మంజూరు చేసిన పథకాలు - 14264

| | | |
|---|---|---|
| పథకాల వ్యయం | 38,416 | కోట్ల రూపాయలు |
| రుణం భాగం | 23,015 | ,, |
| విడుదల చేసింది | 15,473 | ,, |

**నివాస గృహాలు**

| | | |
|---|---|---|
| అర్బన్ | 28,11,939 | గృహాలు |
| రూరల్ | 41,91,089 | ,, |
| గృహాల అభివృద్ధి అర్బన్ | 9,06,133 | ,, |
| (Upgradation) రూరల్ | 4,48,982 | ,, |
| నివాసేతర భవనాలు | 20,380 | ,, |
| అభివృద్ధి చేసిన ప్లాట్లు | 4,95,934 | ,, |
| ఇంటిగ్రేటెడ్ లోకాస్ట్ | | |
| శానిటేషన్ యూనిట్లు | 37,71,206 | |
| ఇతరములు | 11,05,898 | |

**ఈ ఆర్థిక సహాయం పొందిన రాష్ట్రాలు**

| | |
|---|---|
| యూనియన్ టెరిటరీలు | 30 |
| పట్టణాలు, నగరాల సంఖ్య | 1726 |

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో హడ్కో చేపట్టిన పథకాల వివరాలు

**గ్రామీణ గృహవసతి**

| | |
|---|---|
| చేపట్టిన పథకాలు | 436 |
| పథకాల మొత్తం విలువ | 2475 14 కోట్ల రూపాయలు |

| | | |
|---|---|---|
| ఋణం మంజూరు | 1394 54 | కోట్ల రూపాయలు |
| ఇప్పటికి విడుదల చేసింది | 919 97 | ,, |

**అర్బన్ హౌసింగ్**

| | | |
|---|---|---|
| పథకాలు | 1210 | |
| అంచనా వ్యయం | 1175 30 | కోట్ల రూపాయలు |
| ఋణం మంజూరు | 877 00 | ,, |
| విడుదల చేసింది | 624 95 | ,, |

**పట్టణాల మౌలిక సదుపాయాలకు పథకాలు -86**

| | | |
|---|---|---|
| విలువ | 1441 82 | కోట్ల రూపాయలు |
| ఋణం మంజూరు | 851 22 | ,, |
| విడుదల చేసింది | 472 70 | ,, |

| | పథకాల సంఖ్య | పథకాల విలువ | ఋణం మంజూరు | ఋణం విడుదల |
|---|---|---|---|---|
| నెహ్రూ రోజ్‌గార్ యోజన | 115 | 79 49 | 59 58 | 51 13 |
| వ్యక్తిగత మరుగుదొడ్లు | 77 | 231 63 | 145 43 | 94 42 |
| బేసిక్ శానిటేషన్ | 37 | 196 03 | 107 79 | 77 79 |
| భూస్వాధీనం | 4 | 7 11 | 5 22 | 4 97 |
| ఇతరములు | 25 | 85 52 | 32 17 | 21 84 |
| ఫుట్‌పాత్ డ్వెల్లర్లు | 10 | 1 69 | 0 67 | |
| మొత్తం | 2003 | 5697 10 | 3475 16 | 2269 91 |

హడ్కో ఋణాలతో లక్షలాది కుటుంబాలు ప్రయోజనం పొందాయి 23,05,000 కుటుంబాలు శానిటేషన్ యూనిట్స్ - 13,38,001

వివిధ పథకాలు 200 పట్టణాలు, నగరాలలో మంచినీటి సరఫరా, మురుగునీటి పథకాలు, ఘన వ్యర్థ పదార్థాల నిర్మూలన లాంటి పథకాలు అమలు జరిగాయి

## బీడీ, చేనేత, మత్స్య కార్మికుల గృహవసతి ఋణాల మంజూరు

బీడీ కార్మికులకు - 10901 ఇండ్ల నిర్మాణానికి 7 18 కోట్ల రూపాయలు

చేనేత పనివారికి

| | | | |
|---|---|---|---|
| (వర్క్‌షెడ్, నివాసం) 9440 | ,, | ,, | 4 39 కోట్ల రూపాయలు |
| మత్స్య కార్మికులకు 6791 | ,, | ,, | 7 50 కోట్ల రూపాయలు |

హడ్కో నివాస్‌పథకం క్రింద హైదరాబాద్ నగరంలో 962 వ్యక్తిగత దరఖాస్తుదారులకు 28 95 కోట్ల ఋణాలు మంజూరయ్యాయి 2000-2001 సంవత్సరానికి రు 12 కోట్ల

రూపాయల రుణాలు 351 దరఖాస్తుదారులకు మంజూరయినాయి

## పట్టణాల మౌలిక సదుపాయాల కల్పనకు

ఇప్పటివరకు 2007 పథకాల అమలుకు 3740 కోట్ల రూపాయలు రుణ సదుపాయం మంజూరైంది ఇందులో గ్రామీణ గృహనిర్మాణానికి-1395 కోట్లు పట్టణాల గృహ నిర్మాణానికి రు 877 కోట్లు మౌలిక వసతుల కల్పనకు - 1124 కోట్ల రూపాయలు శానిటేషన్ - 253 కోట్ల రూపాయలు మిగతావి 98 కోట్ల రూపాయలు

పై పథకాలకుగాను లోన్ విడుదలకు 2362 కోట్ల రూపాయలకు పైగానే వుంది హడ్కో రుణాల వల్ల లక్షలాది మందికి గృహవసతి, తలదాచుకోటానికి నీడ - 23,05,000 కుటుంబాలకు శానిటేషన్ యూనిట్లు 13,38,000 కుటుంబాలకు లభించింది రాష్ట్రంలో మెజారిటీ పట్టణాలకు యీ సౌకర్యం విస్తరించింది

అర్బన్ మౌలిక సదుపాయాలకుగాను 90 పథకాలకు 1124 00 కోట్ల రూపాయలు మంజూరుకాగా 472 70 కోట్ల రూపాయలు విడుదలయింది ఇందులో ముఖ్యంగా మంచినీటి పథకాలకు, ఘనవ్యర్థ పదార్థాల మేనేజిమెంటుకు, షాపుల నిర్మాణానికి ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు, సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రులు, ప్రాంతీయఅభివృద్ధి పథకాలు వగైరాలు వున్నాయి

★ నరసరావుపేట మంచినీటి స్కీము- ప్రాజెక్టు వ్యయం రు 20 49 కోట్లు అందులో హడ్కో రుణం - 13 49 కోట్లు

## హైలెవెల్ రిజర్వాయర్లు, వాటర్ ట్రీట్‌మెంటు ప్లాంటు వగైరా

★ భూగర్భ మురుగునీటి పథకాలు విశాఖపట్నం, విజయవాడ, తిరుపతి, గుంటూరు నగరాలకు ప్రాజెక్టు విలువ - రు 95 26 కోట్లు

★ హైదరాబాద్ నగరంలో వాటరు సప్లయి, స్వ్యూయరేజి బోర్డుకు పై సర్వీసుల విస్తరణకు 137 కోట్ల పథకానికి రు 68 40కోట్లు మంజూరు

★ హైదరాబాద్ సిటీలోని 9 మునిసిపాలిటీలలో మంచినీటి డ్రైనేజీ పనులకు రు 63 16 కోట్లు రుణాల మంజూరు

★ మరుగుదొడ్ల నిర్మాణానికి (పాకీ పనివారిని యీ నీచవృత్తి నుండి తప్పించటానికి గాను) - పట్టణాలు - 114

మంజూరయిన యూనిట్స్ - 603944

రుణం మంజూరు - రు 156 55 కోట్లు

కేంద్ర ప్రభుత్వ సబ్సిడీ - రు 79 01 కోట్లు

★ విద్యుత్ ఉత్పత్తి ప్లాంట్సు = రు 28 కోట్ల రుణభాగంతో 25 మెగావాట్ల శక్తిగల 3 పథకాలు మంజూరయ్యాయి

★ హడ్కో రుణంతొ రాష్ట్ర ప్రభుత్వం మండల కేంద్రాలలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు - పరిసర ప్రాంతాల పేదలకుగాను నిర్మాణం చేయబడుచున్నవి

★ రు 14 కోట్ల హడ్కో సదుపాయంతో విజయవాడ సమీపంలో మల్టీ స్పెషాలిటీ ఆసుపత్రి ఏర్పాటయింది

★ 9 71 కోట్లతో గాచ్‌బౌలిలో ఈతకొలను, సరూర్‌నగర్‌లో రు 9 కోట్లతో ఇండోర్‌స్టేడియం యూసప్‌గూడాలో ఇండోర్‌స్టేడియం రు 8 76 కొట్లతో

2000-2001 గృహ నిర్మాణ టార్గెట్స్ = 19 1 01 నాటి పరిస్థితి

టార్గెట్ - రు 390 కోట్లు = 386 కోట్ల 70 లక్షల రూపాయలు రుణం విడుదలైంది

మౌలిక సదుపాయాలకు = రు 31 కోట్ల 69 లక్షలు విడుదల

రూరల్ శానిటేషన్ - టార్గెట్ - 100 కోట్ల రూపాయలు విడుదల - 31 కో 70లక్షలు

**హడ్కో వారి రుణాలకు వడ్డీరేటు .**

గృహ నిర్మాణం

బలహీనవర్గాలకు - 10 %

యల్ ఐ జి - 13 నుండి 13 5 %

యం ఐ జి- 15 నుండి 15 5%

హెచ్ ఐ జి - 16%

**మౌలిక వసతుల రుణాలకు**

వాణిజ్య సముదాయాలు - ప్రైవేటు సంస్థలకు - 19%

జాయింటు సెక్టారు - 16 5%

కార్పొరేట్ ఆఫీసులు, పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలకు - 17%

సామాజిక సదుపాయాలకు - 16 నుండి 17 5%

అర్బన్ మౌలిక సదుపాయాలకు - 15 5 నుండి 16%

మంచినీటి సరఫరా, డ్రైనేజి, ఘనవ్యర్థ పదార్థాల మేనేజిమెంటు వగైరా - 15 నుండి 15 5%

**ఎ) వ్యక్తిగత భవన నిర్మాణానికి**

రు 50,000 రూపాయల లోపు - 11 5%

రు 50000 - 2,00,000 వరకు - 12 %

రు 2 నుండి 5 లక్షల వరకు - 13 75%

రు 5 నుండి 8 లక్షల వరకు - 14 50 %

రు 8 నుండి 15 లక్షల వరకు - 14 75 %

**బి) ప్లాటు కొనుగోలుకు**

రు 5 లక్షల వరకు - 13 75%

సి) భవన విస్తరణకు, అభివృద్ధికి

ఒక లక్ష రూపాయల వరకు - 12 %

1 నుండి 5 లక్షల వరకు - 13 75%

5 నుండి 8 లక్షల వరకు -14 5%

1982 వరకు ఢిల్లీ ఆఫీసు ఒక్కటే అయితే యీనాడు జోనల్ కార్యాలయాలు - 4

రీజనల్ కార్యాలయాలు - 15

డెవలప్‌మెంట్ కార్యాలయాలు - 7 పనిచేస్తున్నాయి

**దేశం మొత్తంలో - హడ్కో కార్యక్రమాలు .**

85 లక్షల 60 వేల కుటుంబాలకు గృహవసతి

48 లక్షల - 60 వేల కుటుంబాలకు పారిశుద్ధ్య సౌకర్యాలు

815 పట్టణ మౌలిక సదుపాయ పథకాలకు - రు 12,687 కోట్ల హడ్కోరుణాలు

**ఆంధ్రప్రదేశ్‌లో హడ్కో ·**

20 లక్షల 50 వేల కుటుంబాలకు గృహవసతి కల్పన 5 లక్షల 66 వేల కుటుంబాలకు పారిశుద్ధ్య సౌకర్యాలు 86 పట్టణ మౌలిక సదుపాయాల కల్పన పథకాలకు రు 851 19 కోట్ల రుణ సహాయం

పట్టణ మౌలిక సదుపాయాల పథకాల్లో సంచయిత కార్యక్రమాలు

| | పథకాల సంఖ్య | రుణం మొత్తం | ప్రాజెక్టుల మొత్తం విలువ |
|---|---|---|---|
| 1 నీటి సరఫరా | 45 | 373 కోట్ల 54 లక్షలు | 591 12 కోట్లు |
| 2 మురుగునీటి పారుదల | 4 | రు 64 20 కోట్లు | 95 26 కోట్లు |
| 3 సమగ్ర పట్టణాభివృద్ధి | 2 | 13 47 కోట్లు | 19 25 కోట్లు |
| 4 ఘన వ్యర్థ పదార్థాలు నిర్వహణ | 1 | 10 41 కోట్లు | 14 87 కోట్లు |
| 5 రవాణా/ రహదారులు | 1 | 1 16 కోట్లు | 1.16 కోట్లు |
| 6 వాణిజ్యపరమైన మౌలిక సదుపాయం | 3 | 115 22 | 193 25 కోట్లు |
| 7 సామాజిక మౌలిక సదుపాయాలు | 7 | 78 56 | 138 12 కోట్లు |
| 8 ఇంటిగ్రేటెడ్ మీడియం, చిన్నపట్టణాల అభివృద్ధి పథకాలు | 17 | 31 00 కోట్లు | 46 70 కోట్లు |
| 9 ప్రాంతీయఅభివృద్ధి | 3 | 135 53 | 303 76 కోట్లు |
| 10 ఇతర మౌలిక సదుపాయాలు | 3 | 28 10 | 42 03 కోట్లు |
| **మొత్తం** | **86** | **851 19** | **1445 52** |

గమనిక  హడ్కో సంస్థ రుణ సదుపాయంతో అనేక మౌలిక సదుపాయలు పట్టణాల్లో, నగరాల్లో ఏర్పర్చుకోగలుగుచున్నవి అంతకుముందు యీ సదుపాయాల కల్పనకు ప్రభుత్వంగానీ, లేదా ఎల్ ఐ సి నుండి గానీ రుణాలు పొందేవి అయితే హడ్కో రుణాల తిరిగి చెల్లింపు గడువు ప్రస్తుతం 7 సంవత్సరాలుగా వుంది అందుచేత సాలుసరి వాయిదాల చెల్లింపుకు పెద్ద మొత్తం ధనం అవసరం అవుతుంది దీని కాలపరిమితి 12 నుండి 15 సంవత్సరాల వరకు పెంచాలని కోరటం జరుగుతుంది

2) పట్టణ మౌలిక సదుపాయాలు - మంచినీటి సరఫరా, మురుగునీటి పథకాలు, రోడ్లు అభివృద్ధి, వంతెనలు వగైరా పథకాలకు యిచ్చే రుణంపై కూడా 15 నుండి 16% వరకు వడ్డీ వసూలు చేస్తున్నారు ఈ వడ్డీలు స్థానిక సంస్థలకు భారంగా వుంటున్నాయి అందుచేత యీ వడ్డీరేట్లను 8 నుండి 10% లోపుకు తగ్గించాలని, ఒకవేళ హడ్కో తగ్గించుటకు అంగీకరించినచో కేంద్ర ప్రభుత్వం యీ తేడాను సబ్సిడీ రూపంలో యిస్తేనే, ఈ సదుపాయాలను వినియోగించుటకు అవకాశం వుంటుంది

3) రుణభాగం  పథకాల విలువలో 70% హడ్కో రుణంగా ఇస్తుంది మిగతా 30% స్థానిక సంస్థలు భరించాలి జీతభత్యాలే సరిగా యివ్వలేని మున్సిపాలిటీలు, నగరపాలక సంస్థలు - పథకాల వ్యయంలో 30% భరించటం సాధ్యంకాదు అప్పుడు పథకాల అమలువుండదు అభివృద్ధి సాధ్యంకాదు అందుచేత, హడ్కో రుణభాగం 80%కు పెంచి, మిగతా 20% రాష్ట్ర ప్రభుత్వం గ్రాంటుగా లేక అప్పుగా యివ్వాలి

4) పనుల పురోగతి బట్టి రుణం కొన్ని వాయిదాలలో ఇస్తుంది హడ్కో కొన్ని అనివార్య కారణాలవల్ల ఎప్పుడో తయారు చేసి ప్రభుత్వం మంజూరు చేసిన పథకాలు అమలు జరగటంతో బాగా కాలహరణం జరుగుతుంది ఈలోగా ధరలు, రేట్లు, ఛార్జీలు పెరిగి అంచనాలు - 30 నుండి 50 శాతం వరకు పెరిగి, స్థానిక సంస్థలు భరించలేని స్థితి కలుగుతుంది ఈ అదనపు వ్యయం మంజూరు, సేకరణ, విడుదల సమస్యలు స్థానిక సంస్థలు ఎదుర్కొంటున్నాయి వీటి నివారణకు మార్గాలు వెతకాలి

# ౨౫. డి.ఎఫ్.ఐ.డి.

## డిపార్టుమెంటు ఆఫ్ ఇంటర్నేషనల్ డెవలప్‌మెంట్ (బ్రిటన్)

ఇది బ్రిటీష్ ప్రభుత్వం వారి అంతర్జాతీయంగా పేదరికాన్ని నిర్మూలించేందుకు కృషి చేస్తున్న సంస్థ ఇది లోగడ ఓవర్సీస్ డెవలప్‌మెంట్ అసోసియేషన్ (ఒ డి ఎ) పేరుతో మన ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ నగరాలలో మురికివాడల అభివృద్ధి పథకాలను గత 20 సంవత్సరాలుగా పూర్తి గ్రాంటుగా అమలు పరిచి, వందలాది మురికివాడల అభివృద్ధికి, అందులో వుంటున్న లక్షలాది పేద ప్రజల అభ్యున్నతికి కృషి జరిపి అందరి మన్ననలను అందుకుంది

డి ఎఫ్ ఐ డి సంస్థ భారతదేశ వ్యాపితంగా అనేక నగరాలలో పేదరిక నిర్మూలన కార్యక్రమాలను అమలు జరుపుతూ, ప్రస్తుతం ఢిల్లీ, భోపాల్, భువనేశ్వర్, కోల్‌కతా, హైదరాబాద్‌లలో ప్రాంతీయ కార్యాలయాలు కలిగివుంది 21 వ శతాబ్దిలో ప్రపంచ వ్యాపితంగా పేదరిక నిర్మూలనా కార్యక్రమాలను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలద్వారా తదితర సేవాసంస్థల ద్వారా తన కార్యక్రమాలను అమలు జరుపుతుంది వారి ప్రధాన ఆశయాలలో - 2015 నాటికి ప్రపంచంలో అతి పేదరికంలో వున్న జనాభా సంఖ్యను సగానికి పైగా తగ్గించటం 2015 నాటికి అందరికీ ప్రాథమిక విద్యను అందించటం స్త్రీ పురుషుల మధ్య అసమానతలను తొలగించి, మహిళలను సమభాగస్వాములుగా అభివృద్ధి పరచటం ఆ జనాభాకు ఆరోగ్యం, విద్య, ప్రాథమిక సౌకర్యాలు కల్గించటం వగైరా

భారతదేశంలో ప్రస్తుత అంచనాల ప్రకారం 42 కోట్ల 50 లక్షల మంది ప్రజలు కడు పేదలుగా, రోజుకు ఒక డాలరు (అనగా రు 46) కంటే తక్కువ ఆదాయం కలవారున్నారు నేడు పేద దేశాలలో భారతదేశం మూడవది ఇప్పుడు ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలో యీ కార్యక్రమాలను నిర్వహిస్తుంది

ఇప్పటికి జనాభాలో 30 కోట్ల మంది నిరక్షరాస్యులు 4కోట్లమంది 6-14 సం మధ్యగల పిల్లలు స్కూలుకు వెళ్ళటంలేదు గత 50 సంవత్సరాలలో 19 శాతం నుండి 64 శాతానికి అక్షరాస్యతాశాతం పెరిగినా, ఇంకా 36 శాతం నిరక్షరాస్యులే భారతీయుని సగటు ఆయుర్ధాయం 62 సంవత్సరాలు ఇప్పటికి ప్రతి 1000 జననాలలో పుట్టగానే మరణించేవారు 77గాను, బాల్యంలో మరణించేవారి సంఖ్య 102 గాను రికార్డయింది అనారోగ్యానికి మూలహేతువు అంటువ్యాధులు ఊపిరితిత్తుల వ్యాధులు, అతిసార వ్యాధులు పోషకాహారలోపం వల్ల కలుగుతున్నవే అందుచేత పేద ప్రజలను పై రుగ్మతల నుండి కాపాడటానికి డి ఎఫ్ ఐ డి 1239 కోట్ల రూపాయలను మంచినీటి సరఫరా, శానిటేషన్ మెరుగుదలకు యిస్తుంది

బ్రిటిష్ సహాయకసంస్థ డి ఎఫ్ ఐ డి వారు ఆంధ్రప్రదేశ్‌లో దిగువ క్లాసు 1 అనగా లక్ష జనాభా పై గల పట్టణాలలో పేదలు నివసించే ప్రాంతాల అభివృద్ధికి రు 745 కోట్ల పూర్తి గ్రాంటుగా యిస్తుంది దీనినే మన రాష్ట్రప్రభుత్వం 'వెలుగు' పథకంగా నామకరణం చేసి, అమలు జరుపుటకు పూనుకుంటుంది

## ఆంధ్రప్రదేశ్ పట్టణ పేదల సదుపాయాల పథకం (ఎ పియు ఎస్ పి)

### 1 ఎ పి యు ఎస్ పి అంటే ఏమిటి ?

పురపాలక మరియు పట్టణాభివృద్ధిశాఖ రాష్ట్రంలోని 32 పట్టణాల్లో పేద వర్గాలకు సహాయం అందించేందుకుగాను బ్రిటిష్ ప్రభుత్వ అంతర్జాతీయ అభివృద్ధిశాఖ (డి ఎఫ్ ఐ డి) భాగస్వామ్యంతో ఆంధ్రప్రదేశ్ పట్టణ పేద సదుపాయాల పథకం (ఎ పి యు ఎస్ పి) చేపట్టడం జరిగింది ఈ పథకానికి రానున్న ఏడు సంవత్సరాలలో బ్రిటిష్ ప్రభుత్వం సుమారు రు 745 39 కోట్లు (94 4 మిలియన్ పౌండ్లు) గ్రాంటుగా అందచేస్తోంది ఇందులో సదుపాయాల ఏర్పాటు కోసం 71 శాతం ఆర్థిక సహాయం, మిగతా 29 శాతం కౌన్సిళ్ళు, అధికారులు, సామాజిక సంస్థలు, తదితరుల శిక్షణకు సాంకేతిక సహాయంగా లభిస్తుంది

పట్టణ పేద ప్రజలకు అవసరమైన సదుపాయాలు అందించడంలో, నిర్వహించడంలో మిగతా సేవల నిర్వహణలో పురపాలక సంఘాల పనితీరును మెరుగుపరచడం ఈ ప్రాజెక్టు ముఖ్య ఉద్దేశ్యం పేదల అవసరాలను చూసే పురపాలక సంఘాల్లో సంస్కరణల పట్ల దృఢ సంకల్పాన్ని పెంపొందించాలన్నది ఎ పి యు ఎస్ పి కీలక లక్ష్యాల్లో ఒకటి ప్రాజెక్టు నిధుల విడుదల పురపాలకసంఘాలు చేపట్టే సంస్కరణలు, వారు చూపిస్తున్న అభివృద్ధి మీద ఆధారపడటం ఈ ప్రాజెక్టులోని వినూత్న అంశం వివిధ సామాజిక సంస్థలకు భాగస్వామ్యం కల్పించడం, మున్సిపల్ పాలనకు, పౌర సమాజానికి, ప్రభుత్వేతర సంస్థలకు మధ్య సంబంధాలను అభివృద్ధి చేయటం, ఈ ప్రాజెక్టులోని మరో ముఖ్య ఉద్దేశ్యం

### 2 ఈ ప్రాజెక్టులోని మూడు పథకాలు

ఎ పి యు ఎస్ పి లో పరస్పర సంబంధం గల మూడు పథకాలు వున్నాయి

★ మొదటి పథకం (సి1) పురపాలకసంస్కరణలపై దృష్టి కేంద్రీకరిస్తుంది పురపాలక నిధుల పరిపుష్టి, ఆర్థిక ప్రణాళిక, అకౌంటింగ్, సిబ్బంది శిక్షణలను మెరుగుపరచడం, నిర్వహణ సంరక్షణ (ఒ అండ్ ఎమ్) పద్ధతుల మెరుగుదల, మరింత ప్రతిభావంతమైన ప్రణాళిక వంటివి ఇందులో వుంటాయి పురపాలక సంఘాలు పురపాలక పేదరిక నిర్మూలన కార్యాచరణ ప్రణాళికలు (ఎం ఎ పి.పి) రూపొందిస్తాయి ఈ పథకం క్రింద సుమారు 121 10 కోట్ల రూపాయలను ఖర్చు చేస్తారు

★ రెండవ పథకం (సి 2) మురికివాడల్లో నీటి సరఫరా, మురుగునీటి పారుదల, పారిశుద్ధ్యం, రోడ్లు, ఫుట్‌పాత్‌లు మరియు వీధి దీపాలు వంటి సౌకర్యాలు కల్పించబడతాయి

ఈ పథకం క్రింద సుమారు 525 33 కోట్ల రూపాయిలను ఖర్చు చేస్తారు

★ మూడవ పథకం (సి3) పేదల అవసరాలపై మెరుగైన అవగాహనను, పురపాలక సంఘాల నిర్ణయ ప్రక్రియలను మెరుగుపరచేందుకు, మంచి సేవలకు మద్దతు సాధించేందుకు సామాజిక సంస్థల చురుకైన పాత్రకు ఈ పథకం దోహదం చేస్తుంది అర్బన్ ఇనీషియేటివ్స్ ఫండ్ (యు ఐ ఎఫ్ ) ద్వారా సామాజిక ప్రాజెక్టులకు కూడా గ్రాంటులు అందజేస్తుంది

| | | |
|---|---|---|
| పురపాలక సంఘాల పనితీరు మెరుగుదలకు దోహదం చేసే సంస్కరణలు | పేదలకు మౌలిక సదుపాయాల కల్పనకై నిధులు | సామాజిక సంస్థల (CSOs & CBOs) పటిష్టత |

**3 ఈ పథకం కాల పరిధి 7 సంవత్సరములు**

ఈ ప్రాజెక్టు 32 క్లాస్ 1 పట్టణాల్లో (1991 జనాభా లెక్కల ప్రకారం లక్షకు మించి జనాభా గలవి) అమలవుతుంది అవి

విజయనగరం, గాజువాక, ఏలూరు, భీమవరం, కాకినాడ, రాజమండ్రి, మచిలీపట్నం, గుడివాడ, గుంటూరు, తెనాలి, నెల్లూరు, ఒంగోలు, హిందూపురం, అనంతపురం, గుంతకల్, కడప, ప్రొద్దుటూరు, చిత్తూరు, తిరుపతి, కర్నూలు, నంద్యాల, ఆదోని, నిజామాబాద్, ఖమ్మం, కరీంనగర్, వరంగల్, రామగుండం, మహబూబ్‌నగర్, మల్కాజిగిరి, కూకట్‌పల్లి, ఎల్ బి నగర్, కుత్బుల్లాపూర్

**4 ఎ పి యు ఎస్ పి అమలు బాధ్యత ఎవరిది?**

ప్రాజెక్టు అమలుకు పురపాలక మరియు పట్టణాభివృద్ధి శాఖ ప్రత్యక్ష బాధ్యత వహిస్తుంది ఇందుకోసం రెండు కొత్త విభాగాలు, అనగా పురపాలక పటిష్టతా విభాగము (MSU) పర్యవేక్షణ విభాగము (AMU) ఏర్పాటయ్యాయి

ప్రాజెక్టుకు సంబంధించిన అన్ని నిర్ణయాలనూ పురపాలక మరియు పట్టణాభివృద్ధిశాఖ ముఖ్య కార్యదర్శి అధ్యక్షతన గల సాధికారిక కమిటీ (Empowered Committee) తీసుకుంటుంది కమిటీలో డి ఎఫ్ ఐ డి కి ప్రాతినిధ్యం వుంది కమిటీలో ఈ క్రింది వారు సభ్యులుగా వుంటారు

కార్యదర్శి, ఆర్థికశాఖ, కార్యదర్శి, ప్రణాళికాశాఖ, ఇంజనీర్ ఇన్ చీఫ్, ప్రజారోగ్య సాకేంతిక శాఖ, సంచాలకులు, పట్టణ మరియు గ్రామీణ ప్రణాళిక శాఖ, సంచాలకులు, పట్టణ పర్యావరణ అధ్యయనాల ప్రాంతీయ కేంద్రం, బ్రిటన్ ప్రభుత్వ అంతర్జాతీయ అభివృద్ధి శాఖ ప్రతినిధి (డి ఎఫ్ ఐ డి ), కమిషనర్ మరియు సంచాలకులు, పురపాలక శాఖ - నాన్ మెంబర్ సెక్రటరీ

**సాధికారిక కమిటీ యొక్క విధులు, బాధ్యతలు**

★ ప్రాజెక్టుకు సంబంధించిన అన్ని నిర్ణయాలు తీసుకుంటుంది

★ పురపాలక పేదరిక నిర్మూలనా కార్యాచరణ ప్రణాళికల సాంకేతిక మదింపు, పర్యవేక్షణ మార్గదర్శక సూత్రాలను ఆమోదిస్తుంది

★ పురపాలక పేదరిక కార్యాచరణ ప్రణాళికలకు ఆమోదం ఇస్తుంది

**పురపాలక మరియు పట్టణాభివృద్ధి శాఖ**

| | | |
|---|---|---|
| కమీషనర్ మరియు సంచాలకులు పురపాలక శాఖ పురపాలక పటిష్టతా విభాగం(MSU) | పర్యవేక్షణ విభాగం (AMU), ప్రాజెక్టు సలహా బృందాలు | (Long term Technical Assistance) దీర్ఘకాలిక సాంకేతిక సహకారం |
| ★ పురపాలక సంఘాలకు ఆసరాగా వుండి అవి నిధులు పొందేందుకు సహకరిస్తాయి | ఎం ఎ పి పి లను మదింపు చేసి వాటి అమలును పర్యవేక్షిస్తాయి | ★ సామాజిక, కమ్యూనిటి అభివద్ధి |
| అధిపతి అదనపు సంచాలకులు, మున్సిపల్ పరిపాలన, ప్రజారోగ్య ఇంజనీరింగ్ మేనేజర్, కమ్యూనిటీ అభివృద్ధి మేనేజర్, మున్సిపల్ సంస్కరణల మేనేజర్, మానవవనరుల అభివృద్ధి మేనేజర్, ఫైనాన్స్ మరియు అకౌంట్స్ ఆఫీసర్, మేనేజర్, కంప్యూటర్ మరియు ఆఫీసు సిబ్బంది | అధిపతి అదనపు సంచాలకులు, మున్సిపల్ పరిపాలన, మున్సిపల్ ఇంజనీర్, మున్సిపల్ ఫైనాన్స్ ఆఫీసర్, టౌన్ ప్లానింగ్ ఆఫీసర్, కమ్యూనిటీ అభివృద్ధి ఆఫీసర్, ఎం ఐ ఎఫ్ ఆఫీసర్, కంప్యూటర్ మరియు ఆఫీసు సిబ్బంది, మూడు క్షేత్ర బృందాలు | ★ పట్టణ ప్రణాళిక<br>★ సామర్థ్య నిర్మాణం<br>★ మౌలిక సౌకర్యాలు<br>★ పాలన |

మూడవ పథకం (C3) క్రింద పురపాలక, స్వచ్ఛంద, ప్రభుత్వేతర, సామాజిక సంస్థలు, ప్రైవేటు రంగాల ప్రతినిధులతో పట్టణస్థాయి వర్కింగ్ గ్రూపులు(TLWG) ఏర్పాటు చేస్తారు

ప్రాజెక్టు ప్రయోజనాలను ప్రజలకు విస్తృతంగా చాటి చెప్పేందుకు సమాచార వ్యూహాన్ని అభివృద్ధి చేస్తారు మార్పు ఎజెండా పట్ల రాజకీయ, సామాజిక దృష్టిని పెంపొందించడం దీని ఉద్దేశ్యం

★ రాష్ట్రస్థాయిలో ప్రాజెక్టు లక్ష్యాలు, నిర్ణయ వ్యవస్థల పట్ల విస్తృత అవగాహన కల్పించడం

★ పురపాలక స్థాయిలో వివిధ రాష్ట్ర స్థాయి ఏజెన్సీలు, పురపాలక సంఘాల పాత్రలు, బాధ్యతలపై అవగాహన కలిగించడం

★ పురపాలక స్థాయి వివిధ రాష్ట్ర స్థాయి ఏజెన్సీలు, పురపాలక సంఘాల పాత్రలు, బాధ్యతలపై అవగాహన కలిగించడం

★ కమ్యూనిటీ స్థాయిలో ప్రాజెక్టుపై అవగాహన కల్పించి ప్రాజెక్టు ప్రయోజనాలకు తమ అర్హతను అన్నివర్గాలూ గుర్తించేలా చూడటం

★ ప్రోగ్రాముల కొరకు కాంట్రాక్టులు (C/fp) ఈ పథకం క్రింద పేద ప్రజలకు శిక్షణ వారి అవసరాలు గుర్తించుట, కన్సల్టన్సీ, ప్రచార సామాగ్రి తయారీ మొదలగు కార్యక్రమముల కొరకు సామాజిక సేవాసంస్థలకు సహాయము అందజేయబడుతుంది

★ సర్వీసుల కొరకు కాంట్రాక్టులు (CFS) ఈ పథకం క్రింద పేద ప్రజలకు శిక్షణ వారి అవసరాలు గుర్తించుట, కన్సల్టన్సీ, ప్రచార సామాగ్రి తయారీ మొదలగు కార్యక్రమముల కొరకు సామాజిక సేవాసంస్థలకు సహాయము అందజేయబడుతుంది

★ సత్వర సహాయ నిధి (RRF) ఈ పథకం క్రింద సామాజిక గ్రూపులకు, సామాజిక ఆస్తులు మరియు అవసరాలు, మొదలగు కార్యక్రమాల నిమిత్తము సహాయము అందజేయబడుతుంది 4 లక్షల రూపాయలు గరిష్ట పరిమితిగల ప్రాజెక్టులకు సహాయం అందజేయబడుతుంది

5 ప్రయోజనాలు

ఎ పి యు ఎస్ పి వలన మౌలిక సౌకర్యాలు పేదలకు మరింతగా అందుబాటులోకి వస్తాయి దీని వలన జీవన ప్రమాణం, నాణ్యత మెరుగుపడుతుంది ఉదాహరణకు మెరుగైన ఆరోగ్యం వంటి అంశాల ఆధారంగా జీవన నాణ్యతను అంచనా వేయవచ్చు ఆరోగ్య ప్రయోజనాలతో పాటు వివిధ సామాజిక, పర్యావరణ, ఆర్థిక ప్రయోజనాలు కూడా పేదలకు చేకూరుతాయి

**సామాజిక ప్రయోజనాలు** భాగస్వామ్య ప్రక్రియలను ప్రోత్సహించడంవల్ల పట్టణ పేదరికంపై అవగాహన, పట్టణ పేదల సమస్యలపై స్పందన అధికమవుతుది

★ పురపాలక సంఘాలు సిటిజన్స్ చార్టర్ల స్థాపన మరియు కౌన్సిలర్లకు శిక్షణ మొదలైన చర్యలతో పేదలకు మరింత చేరువగా మరియు బాధ్యతాయుతంగా వ్యవహరిస్తాయి

★ పురపాలక సంఘాలలో సామాజిక అభివృద్ధి సిబ్బందిని ఏర్పాటు చేయడం ద్వారా సామాజిక కార్యక్రమాలను నిర్వహిస్తుంది

★ మురికివాడల్లో అదనపు మౌలిక వసతుల కల్పన దీనివలన సామాజిక సేవలు మరింతగా అందుబాటులోకి వస్తాయి అంతేకాక పచ్చదనం పరిశుభ్రతకు అవకాశం కల్పిస్తాయి

**పర్యావరణ ప్రయోజనాలు .** మౌలిక వసతుల్లోనూ, పట్టణ ప్రణాళికలోనూ పర్యావరణ పరిరక్షణ ప్రమాణాలకు తగిన సామర్ధ్యాన్ని ఎ పి యు ఎస్ పి లోని సి 1 విభాగం కలగచేస్తుంది సి2 విభాగంలో, మురికివాడల్లో మౌలిక వసతుల కల్పనకు ప్రతిపాదించిన అంతర్గత పెట్టుబడులవల్ల తగిన ప్రయోజనం చేకూరుతుంది

**ఆర్థిక ప్రయోజనాలు** పురపాలక సంఘాలలో ఆర్థిక వనరుల పరిపుష్టిత పెంపొందించడం ద్వారా పురపాలక సంఘాలలో చేపట్టే కార్యక్రమాలను విస్తరించడానికి, మౌలిక వసతులు, సేవలపై ఎక్కువ నిధులు ఖర్చుపెట్టడానికి వీలవుతుంది

**6 పురపాలక పేదరిక నిర్మూలన కార్యాచరణ ప్రణాళిక (Municipal Action Plan for Poverty Reduction - MAPP)**

ఈ క్రింది లక్షణాలు గల కార్యాచరణ ప్రణాళిక రూపొందిస్తాయి

★ పేదరిక నిర్మూలనకు దోహదం చేయాలన్న ఉద్దేశ్యం

★ ఆర్థిక పనితీరును మెరుగుపరిచే చర్యలు

★ ప్రస్తుత మౌలిక వసతుల పునరావాసం, సమర్థ నిర్వహణ, సంరక్షణల ద్వారా మెరుగైన కనీస వసతులు అందించడం

★ ప్రజలు, ప్రత్యేకించి పేదల అవసరాలను తీర్చే విధంగా వ్యవస్థాగత సంస్కరణలు చేపట్టటము

ఇది పురపాలక సఘాలు రూపొందించాల్సిన కీలకపత్రం మౌలిక సదుపాయాలు, పురపాలక సంస్కరణలు, పనితీరు మెరుగుదలపై వాటి ప్రతిపాదనల ప్రణాళిక ఇది ఎం ఎ పి పి ప్రధాన లక్షణాలు ఇలా వుంటాయి

★ పురపాలక సంఘాల బడ్జెట్ సైకిల్‌కు అనుగుణంగా వాటి పనితీరులో మెరుగుదలకు గల అవకాశాలు, అవసరాలను దృష్టిలో పెట్టుకోవటం

★ సిబ్బంది అభివృద్ధి, సేవలు, నిర్వహణ మరియు సంరక్షణ పద్ధతుల మెరుగుదల, ఆర్థిక పనితీరు మెరుగుదలకు ప్రతిపాదనలు

★ భాగస్వామ్య ప్రక్రియ ద్వారా అభివృద్ధి, తద్వారా పురపాలక సేవలకు సంబంధించిన నిర్ణయాల్లో పేదలకు పాత్ర కల్పించడం

★ వివిధ మార్గాల (భారత, రాష్ట్రప్రభుత్వం, ప్రభుత్వేతర మార్గాలు, బదుళ్ళు) ద్వారా వచ్చే నిధులు, వనరుల ఏకీకరణకు సంబంధించిన ప్రణాళికా రచన చేసేందుకు ఇదొ సాధనంగా ఉపయోగపడుతుంది మురికివాడల అంతర్గత అభివృద్ధికి, మురికివాడల్లోని వసతులను సమీప పట్టణ వ్యాప్త మౌలిక వసతులలో అనుసంధానం చేయడానికి ప్రాజెక్టు నిధులు లభిస్తాయి

మౌలిక సదుపాయాలకు నిధులు పొందాలంటే పురపాలక సంఘాలు తమ పనితీరు

మెరుగుదలపట్ల చిత్తశుద్ధి, ఆసక్తిని కనబరచాల్సి వుంటుంది మున్సిపల్ సంస్కరణలు తీసుకురావలసి వుంటుంది

## పనితీరు మెరుగుపరచుకోవలసిన రంగాలలో కొన్ని అంశాలు

**ఆర్థిక నిర్వహణ** ఆదాయం పెంచుకోవడం, మెరుగైన అకౌంటింగ్ పద్ధతులు, ప్రక్రియలను అనుసరించడం మొదలైనవి

**ప్రణాళిక** ఎం ఎ పి పి ల ద్వారా పనులకు తగినట్టుగా అవసరాల ప్రాధాన్యతలను నిర్ణయించడం, ఇంజనీరింగ్ సేవలు అందించే విషయంలో నిర్వహణ, సంరక్షణ పద్ధతులను మెరుగుపరచుకోవడం మొదలైనవి

**పురపాలన** పురపాలక సంఘంలో, పరిపాలనలో పేదవర్గాల పట్ల జవాబుదారీతనం పెంచడం మొదలైనవి

**7 ప్రాజెక్టు ఫలితాలు - ప్రాజెక్టు వల్ల ఏం జరుగుతుంది?**

32 క్లాస్ 1 పట్టణాల్లో నివసించే సుమారు 22 లక్షల మంది పేదవారికి ఈ ప్రాజెక్టు వల్ల లాభం చేకూరుతుంది పట్టణ సదుపాయాలను వారికి మరింతగా అందుబాటులోకి తేవడం ద్వారా ఈ లక్ష్యం నెరవేరుతుంది ప్రాజెక్టులోని మూడు పథకాల ద్వారా సేవలు అందించే తీరు అభివృద్ధి చెందుతుంది

**సి 1 విభాగం** పురపాలక సంస్కరణల మరియు పనితీరు మెరుగుదల ఈ ప్రాజెక్టు వల్ల ఈ క్రింది విధాలుగా పురపాలక సంఘాల పనితీరు మెరుగవుతుంది

★ పురపాలక సంఘాల ఆదాయం పెరుగుతుంది

★ మరింత సమర్థమైన ఆర్థిక ప్రణాళిక, అకౌంటింగ్, బడ్జెటింగ్ ప్రక్రియలు అమలులోకి వస్తాయి

★ పేదరికం నిర్మూలనకు పురపాలక సంఘాల కార్యాచరణ ప్రణాళిక (MAPP) ప్రవేశపెట్టబడుతుంది

★ పురపాలక సంఘాల ప్రణాళిక, నిర్ణయ ప్రక్రియలో విస్తృత భాగస్వామ్యం, ముఖ్యంగా పేదల భాగస్వామ్యం ఉంటుంది

★ సర్వీసుల ప్రణాళిక, నిర్వహణ, సంరక్షణలలో పురపాలక సంఘాల ఇంజనీర్లు, ప్రజారోగ్య సాంకేతిక శాఖ సామర్థ్యం పెరుగుతుంది

పురపాలక సంఘంలోని అధికారులలో, అనధికారులలో జవాబుదారీతనం పెరుగుతుంది

**సి 2 విభాగం** మౌలిక సదుపాయాల్లో పెట్టుబడి

32 క్లాస్ -1 పట్టణాల్లోని పేద ప్రజలకు, ఈ క్రింది పేర్కొన్న మెరుగైన మౌలిక సదుపాయాలు లభిస్తాయి నీటి సరఫరా, మురుగునీటి పారుదల, పారిశుద్ధ్యం, రోడ్లు, ఫుట్‌పాత్‌లు, చెత్త, ఇతర వ్యర్థాల యాజమాన్య పద్ధతులు, వీధి దీపాలు మెరుగుపడతాయి

**సి 3 విభాగం** పౌరసమాజ పటిష్టతకు చర్యలు దీనివల్ల పేదలకు వివిధ సేవల కల్పన మరియు వాటి నాణ్యత పెరుగుతుంది పేద ప్రజల విస్తృత ప్రాధాన్యాల (నాన్-ఇన్‌ఫ్రాస్ట్రక్చర్, తత్సంబంధిత సర్వీసులు)కు ఉద్దేశించిన కార్యక్రమాలపై ఈ విభాగం దృష్టి కేంద్రీకరిస్తుంది వీటిలో ఈ క్రింది అంశాలు వున్నాయి

★ పేదరిక నిర్మూలనకు పౌర సేవా సంస్థలు (CSOs) ప్రభుత్వేతర సంస్థలు (NGOs) సామాజిక సంస్థలు (CBOs) చేపట్టే కార్యక్రమాలకు మద్దతుగా అర్బన్ ఇనీషియేటివ్స్ ఫండ్ (UIF) నుంచి నిధులు అందజేయడం, ఇందులో వివిధ ఉద్దేశ్యాలు, ప్రయోజనాల కోసం, మూడు రకాల ప్రాజెక్టులు అమలు చేయవచ్చు

★ పట్టణాల్లో పేదరికం విశ్లేషణ, పట్టణస్థాయి నెట్‌వర్క్‌ల ఏర్పాటు సామర్థ్యాన్ని పెంపొందించేందుకు వీలుగా భాగస్వామ్యాత్మక పేదరిక అంచనాలు (PPA) రూపొందించడం

★ పౌరసేవాసంస్థలు, పురపాలక సంఘాలు ప్రాజెక్టుల రూపకల్పన, అమలు, పర్యవేక్షణ సామర్థ్యాన్ని పెంపొందించడం



# 26. యునిసెఫ్ (UNICEF)

## (ఐక్యరాజ్యసమితి ఎమర్జెన్సీ చిల్డ్రన్స్ ఫండ్)

1946లో ఐక్యరాజ్యసమితి యీ సంస్థను నెలకొల్పింది ప్రపంచవ్యాపితంగా - బాల బాలికలు అభ్యున్నతికొరకు ఆయా దేశ ప్రభుత్వాల సహకారంతో కృషిచేయుట దీని ప్రధానలక్ష్యం జాతీయాభివృద్ధి క్రమంలో భావిపౌరులు మంచి ఆహారం, విద్య, ఆరోగ్యం వగైరా సౌకర్యాలు పొంది, మంచి పౌరులుగా ఎదగటానికి యీ సంస్థ తోడ్పడుతుంది

1990 సెప్టెంబరులో 70 దేశాధినేతలు, 152 దేశాల నుండి ప్రతినిదులు పాల్గొన్న ప్రపంచ అత్యున్నత మహాసభ ద్వారా, ప్రతిదేశం తన వనరులలో పిల్లల క్షేమం అభ్యున్నతి కొరకు ప్రాధాన్యత నిచ్చి, అవసరమైన నిధులు కేటాయించగలమని ప్రకటన చేశారు

ఆంధ్రప్రదేశ్, కర్నాటక రాష్ట్రాలలో ఆయా రాష్ట్ర ప్రభుత్వాల సహాయ సహకారాలతో దిగువ కార్యక్రమాలు చేపట్టాలని నిర్ణయించింది

★ స్త్రీలు, పిల్లల అభ్యున్నతికి తగిన పథకాలు రూపొందించి అమలు జరపడం

★ వ్యక్తిత్వ శక్తిని పెంపొందించుట, ప్రాథమిక విద్య, మహిళల సమానహక్కుల కొరకు అన్ని రంగాలలో మహిళలు సమాన అవకాశాలు పొందుటకు

★ ఆరోగ్య పరిరక్షణకు, ఉపాధ్యాయులు, పిల్లల అభివృద్ధికి సంక్షేమానికి తగిన తర్ఫీదు ఏర్పాటు చేయుట

★ బాలల హక్కులను పరిరక్షించుటకు, పౌరుల బాధ్యతలను గురించి చైతన్యపరచుట

★ సాంకేతిక పరికరాల సప్లయి, సహాయ చర్యలు చేపట్టుట

**ఆదాయ వనరులు**

ఈ సంస్థ ఆదాయం ప్రధానంగా దేశ ప్రభుత్వాల నుండి ప్రభుత్వేతర సేవా సంస్థల నుండి విరాళాల ద్వారా సేకరించుకుంటుంది ప్రభుత్వాలు, వారి సంస్థల ద్వారా ఆదాయంలో 68శాతం లభించగా, మిగతా ఆదాయం ప్రభుత్వేతర సంస్థల నుండి పొందుతుంది (మిగతా ఆదాయం ప్రభుత్వేతర సంస్థల నుండి పొందుతుంది ) గ్రీటింగు కార్డుల అమ్మకం నిధుల సమీకరణ ఉద్యమాల ద్వారా ఆదాయాన్ని సమకూర్చుకుంటుంది భారతదేశంలో గణనీయమైన రీతిలో సంస్థల కార్యకలాపాలకు రు 2200 కోట్ల రూపాయలు వ్యయం 1991-95 కాలానికి వినియోగించింది

# 27. పట్టణాభివృద్ధి సంస్థలు

# (అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీస్)

## హైదరాబాద్

## విశాఖపట్నం

## వి.జి.టి.ఎమ్. ఉడా

## కాకతీయ

# హైదరాబాద్ పట్టణాభివృద్ధి సంస్థ

## హైదరాబాద్ అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ

హైదరాబాద్ పట్టణాభివృద్ధి సంస్థ 2-10-1975న ఏర్పడింది నగరానికి మాస్టరు ప్లానులు తయారుచేయటం, వివిధ అభివృద్ధి పథకాలను జోనల్ విధానంతో ఇతర సంస్థల సహకారంతో చేపట్టడం, నగరాభివృద్ధి పథకాలను స్వయంగానే చేపట్టడం, ఇతర పౌరవసతులు కల్పించటం లక్ష్యాలుగా యీ సంస్థను ప్రభుత్వం ఏర్పర్చింది హైదరాబాద్ నగరం రంగారెడ్డి, మెదక్ జిల్లాల్లో కొంత భాగాలతో చేరి 1865 చ కి మీటర్ల వైశాల్యానికి యీ సంస్థ విస్తరించింది

1991 జనాభా లెక్కల ప్రకారం ఈ సంస్థ పరిధిలో 44 98 జనాభా లక్షలు కాగా, 2011 నాటికి 113 39 లక్షలుగా వుంటుందని అంచనా హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్ చట్టం క్రింద 1930లో నగర మాస్టర్‌ప్లాను ఆమోదించారు ఈ ప్లానులో భూ వినియోగం, రోడ్లు, విధానాలు, పథకాలు నిర్దేశించబడ్డాయి 29 ప్లానింగ్ జోన్లుగా విభజించగా, ఇందులో ఇప్పటికి 18 జోనల్ ప్లాన్లు అమలు జరపగా, ఇంకా 11 రూపకల్పనలో వున్నాయి

శరవేగంతో పెరుగుతున్న నగర జనాభా, పరిశ్రమలు, వాణిజ్య, వ్యాపారరంగాలను పరిగణనలోనికి తీసుకొని, 1980 మాస్టరుప్లానును 2020 నాటికి తగిన విధంగా మార్పులు చేస్తున్నారు ప్రజాసహాయక, సెల్ ప్రజలకు అవసరమయిన సమాచారం - పర్మిషన్‌లు ఎలా పొందాలి, భూవినియోగ వివరాలు, ప్లాట్ల కేటాయింపులు, వేలం పద్ధతులు - అందించటం కొరకు హుడా కార్యాలయంలో యీ ప్రత్యేక కౌంటరు ఏర్పాటు చేశారు వీరు ప్లాన్ల, ఇతర డాక్యుమెంట్లు అమ్మకం కూడా చేస్తారు

ఈ విభాగం కంప్యూటరీకరణ జరిగి, విచారణలు (enquiries) టెలిఫోన్ ద్వారా కూడా లభించుటకు ఏర్పాటు చేస్తున్నారు దీనిని వెబ్‌సైట్‌కు సంధించుట ద్వారా, మరింత వేగంగా అవసరమయిన అన్ని సమాచారాలు లభ్యం కావటానికి అవకాశాలు ఏర్పడుచున్నవి

అన్ని రకాల అనుమతులు, క్లియరెన్సులకు నిర్దిష్ట కాలపరిమితి నిర్ణయించబడింది దీని కొరకు ప్రత్యేక బిల్డింగ్ కమిటీ యీ బాధ్యతలు నిర్వహిస్తుంది ఈ సంస్థ పరిధిలోని 9 మున్సిపాలిటీల కమిషనర్లతో తరచూ సమావేశాలు నిర్వహించి, వారి బాధ్యతల నిర్వహణకు తోడ్పడుతూ వుంటుంది

నగరం, పరిసరాలలో 137 చారిత్రక ప్రాముఖ్యంగల భవనాలను, స్థలాలను గుర్తించి, వాటి రక్షణకు తగు చర్యలు తీసుకొంటుంది వీటి రక్షణలో ఆసక్తి కలిగించుటకు సాంవత్సరిక అవార్డులు (బహుమతులు) ఏర్పాటు చేసి, ప్రజా సహకారం పొందుటకు కృషి చేస్తుంది

## చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలు

ఈ సంస్థ పరిధిలో 4800 ఎకరాల భూమిని సేకరించింది ఇందులో నివాస కాలనీలు, వాణిజ్య సముదాయాలు, ప్రజోపయోగ సర్వీసులు - పార్కులు, ఆటస్థలాలు వగైరాలకు యీ భూములు వినియోగం జరుగుతుంది

**1 గృహ నిర్మాణ పథకాలు** ఈ కాలంలో 10120 భవనాలను నిర్మించింది 15000 ఖాళీ స్థలాలను అభివృద్ధి పరచింది నివాస కాలనీల్లొ పై వసతులు ఏర్పాటుకు 25 కోట్ల రూపాయలు వ్యయం చేసింది ఇందులో ప్రముఖమైనవి - వనస్థలిపురం, చందనగర్, తానీషానగర్, మధుబిన్, మాదాపూర్-జూబిలీహిల్స్, హుడా హైట్స్, ప్రసిద్ధి పొందాయి

**2 వాణిజ్య సముదాయాలు** తార్నాక, మైత్రీవనం, సరూర్‌నగర్, రామచంద్రపురం వాణిజ్య సముదాయాలు 5 కోట్ల 40 లక్షల రూపాయల వ్యయంతో నిర్మించబడి, అనేక విధాలైన వ్యాపార సదుపాయాలు, షాపులు, హోటల్స్, ఆఫీసు కార్యాలయాలు, మార్కెట్లు కల్పించబడ్డాయి

మెగా సిటి ప్రాజెక్టు కమర్షియల్ కాంప్లెక్స్‌లు మైత్రివిహార్, అమీర్‌పేటలో స్వర్ణ జయంతి, మరొకటి 'వాకా' భవనం వద్ద ప్రస్తుత నిర్మాణంలో వున్నది ఈ సముదాయాల్లో రు 31 కోట్లు వ్యయంతో 50,000 చ మీటర్ల వైశాల్యంతో యీ సముదాయిలు నిర్మాణ మవుతున్నాయి

## ప్రజోపయోగ సర్వీసులు

బుద్ధపూర్ణిమ ప్రాజెక్టులో భాగంగా, 5 ఎకరాల స్థలంలో హుసేన్‌సాగర్ తటాకంలో 'లుంబినీ పార్క్' ఏర్పాటు చేయబడింది ప్రతినిత్యం వేలాది ప్రజలు పార్కును సందర్శిస్తూ ఆనందిస్తున్నారు ఇదొక పెద్ద విహారకేంద్రంగా, సాగర్‌లోని 'బుద్ధ విగ్రహం' వరకు బోట్ విహారం కూడా ఆకర్షిస్తుంది

**నెక్‌లెస్‌రోడ్** 28 కోట్ల రూపాయల వ్యయంతో మరొక విహారకేంద్రంగా యీ నెక్‌లెస్ రోడ్‌ను అభివృద్ధి పరిచారు హైదరాబాద్-సికింద్రాబాద్‌లకు మరొక లింక్‌రొడ్డుగా గూడా ఉపయోగపడుతుంది 3 కిలోమీటర్ల దూరం తగ్గింది

**యన్ టి ఆర్ గార్డెన్స్** పూర్వపు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారకరామారావు స్మృత్యర్థంగా హుసేన్‌సాగర్ అంచున 55 ఎకరాల విస్తీర్ణంలో 22 కోట్ల రూపాయల వ్యయంతో యీ పార్కు నిర్మించబడుతుంది ఇందులో ఆకర్షణీయ - ఎన్ టి ఆర్ మెమోరియల్, మంచన్‌చెట్టు, ఆంఫి థియేటరు, మిని రైల్వే ట్రాక్, స్టేషన్, రెస్టారెంటు, ప్రకృతి రమణీయత రకరకాల నీటి ఫౌంటెన్స్ వగైరాలతో ఒక్క సంవత్సరంలో పూర్తి చేయసంకల్పించారు

**నెక్‌లెస్‌గార్డెన్** హుసేన్‌సాగర్ రైల్వే జంక్షన్ వద్ద కొండగుట్టలపై 14 ఎకరాల స్థలంలొ రు 6 కోట్ల రూపాయల అంచనా వ్యయంతో, ఈ తోట నిర్మాణం జరుగుతుంది

**ఫ్లై-ఓవర్లు** నగరంలో ట్రాఫిక్ రద్దీ నివారణకు, ముఖ్యమైన జంక్షన్లలో, 16 ప్రాంతాలలో - నయాపూర్, సంజీవయ్య పార్కు, విమానాశ్రయం వద్ద, సిటి ఓ జంక్షన్, హరిహర కళాభవన్, బషీర్‌బాగ్, తార్నాక, ఫ్లై-ఓవర్లు నిర్మాణం పూర్తయి వినియోగంలోనికి తేబడ్డాయి ఈ పథకం మొత్తం వ్యయం రు 136 కోట్ల రూపాయలు, మెగాసిటి పథకంలో భాగంగా వీటి నిర్మాణం జరిగింది సెక్రటేరియట్, మాసాబ్ ట్యాంక్, నారాయణగూడ, సంజీవయ్య పార్కు వద్ద నిర్మాణంలో వున్నాయి

**లేక్ బ్యూటిఫికేషన్** ప్రకృతి అందించిన పర్యావరణ రక్షణలో భాగంగా నగరంలోని 20 తటాకాల అభివృద్ధి కార్యక్రమం రు 195 కోట్ల రూపాయల వ్యయంతో చేపట్టుటకు పథకాలు రూపొందించబడుతున్నవి

ఇందులో భాగంగా రు 5 కోట్ల 20 లక్షల వ్యయంతో సరూర్‌నగర్, సఫిల్‌గూడలోని లేక్స్ (తటాకాలు/చెరువులు) అభివృద్ధి పనులు చేపట్టడం జరిగింది ఈ పథకంలో ప్రధాన అంశాలు - నీటిని శుభ్రపరచుట, లోతు, విస్తీర్ణాన్ని పెంచటం, కాలి నడక బాటలు ఏర్పాటు, తదితర విహార, ఆకర్షణలు కల్గించుట, వగైరా, దుర్గం చెరువు అభివృద్ధి పనులు (మాధాపురం వద్ద)పూర్తి చేయబడినవి కొండ అంచులపై వివిధ రకాల చెట్లు నాటటం, వినోద, సౌకర్యాలు, బోటింగ్, రెస్టారెంట్లు, మొదలగు వసతులతో పూర్తిచేయబడింది

కాసు బ్రహ్మానందరెడ్డి నేషనల్ పార్కు అభివృద్ధి కార్యక్రమంలో భాగంగా, 150 అడుగుల వెడల్పు గల రోడ్డు నిర్మాణం, 80 అడుగుల వెడల్పు గల గ్రీనరీ (పచ్చదనం పెంపుదల) సైకిలు ట్రాక్, కాలిబాటల నిర్మాణం చేపట్టబడినవి కూకట్‌పల్లి వద్ద పటేల్‌కుంట అభివృద్ధి పథకం కూడా చేపట్టబడింది

**గ్రీన్ బెల్టు ప్రాజెక్టు** 1994 ఏప్రిల్ 1న ఇండోడచ్ హైదరాబాద్ గ్రీన్ బెల్టు ప్రాజెక్టు నిర్మాణం అత్యంత జయప్రదంగా చేపట్టబడింది అత్యధిక పచ్చదనం, రోడ్డు మార్గాలు, నివాస కాలనీలు, పారిశ్రామిక ఖాళీస్థలాలు పచ్చదనం, వగైరా హంగులతో చేపట్టబడిన యీ బృహత్తర పథకం - 9 కోట్ల 96 లక్షల వ్యయం కాగలదని అంచనా ఇందులో 7 కోట్ల 51లక్షలు గ్రాంటుగా రాయల్ నెదర్లాండు ప్రభుత్వం నుండి లభించగా, మిగతా ధనం హుడా, హైదరాబాద్ మున్సిపల్ కార్పొరేషన్, కులీకుతుబ్ అభివృద్ధి సంస్థ హైదరాబాద్ వాటర్, డ్రైనేజి బోర్డు, రాష్ట్ర అటవీ శాఖలు భరించుచున్నాయి

**ఇతర విజయాలు :**

1 80 రకాల వివిధ రకాల మొక్కలను నూతనంగా అభివృద్ధిపరచటం, గృహ నిర్మాణంలో నూతన సాంకేతిక విధానాలను రూపొందించి, అమలుజరపటం

2 ముఖ్యంగా మురికివాడలు, పేదలు నివసించే ప్రాంతాలలో ఆ ప్రాంత మహిళలను భాగస్వాములను చేయటం ద్వారా, 1995 నుండి నర్సరీలను పెంచు కార్యక్రమాలు చేపట్టడం

3 ఇప్పటి వరకు 1480 హెక్టార్ భూములలో మొక్కలు పెంపకం చేపట్టడం జరిగింది

4 120 కిలోమీటర్ల పొడవుగల, జాతీయ రాష్ట్ర రహదార్ల, హైదరాబాద్ నగరాన్ని కలుపు అంతర్గత మార్గాల అభివృద్ధి చేయుట

5 చెరువులు, తటాకాల గట్లు మీద 277 హెక్టార్ల వైశాల్యంలో గ్రీన్ బెల్టులు ఆయా గ్రామ ప్రజల సహకారంతో పెంచటం

6 577 హెక్టార్ల భూములలో రైతులకు, ప్రజలకు విత్తనాల సరఫరా ద్వారా అటవీ ప్రాంతాన్ని పెంచటం

7 15 లక్షల జనాభా గల ప్రాంతాల్లో 527 ప్రాంతీయ సంక్షేమ సంఘాల భాగస్వామ్యంతో పచ్చదనాన్ని పెంచటం

8 విద్యార్థులు, మహిళలు, మహిళా గ్రూపులు, రక్షణ, సైన్యశాఖలను చైతన్య పరిచేందుకు 90 క్యాంపులు నిర్వహించటం

9 1997, 1998లలో ఒకేరోజు ఒక లక్ష మొక్కలు నాటే కార్యక్రమం జయప్రదం చేయటం

10 నగరంలోని 11 వైద్యాలయాలను దత్తత తీసుకొని పచ్చదనం పెంచటం సామాజిక అటవీ పెంపుదల, వేస్ట్‌ల్యాండ్ అభివృద్ధి కార్యక్రమాలకు గాను కేంద్రప్రభుత్వం వారి 1997 "ఇందిరా ప్రియదర్శిని వృక్షమిత్ర" అవార్డును హుడా గెలుచుకోవటం ప్రశంసనీయం

11 ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ఆదేశానుసారంగా మాదాపూర్‌లో బాపూబొమ్మల కొలువు (బాపు ఆర్ట్ గ్యాలరీ)ను ఏర్పాటుకు అంగీకరించి, ఒక కోటి రూపాయల వ్యయంతో యీ పథకాన్ని అమలు చేయుటకు హుడా అంగీకరించింది

2000 జనాభా 59 లక్షలు గానూ, 8 లక్షల వాహనాలుంటాయని అంచనా

15000 పరిశ్రమలు, 3 లక్షల పారిశ్రామిక కార్మికులు, రు 3000 కోట్ల పెట్టుబడులు-పరిశ్రమల్లో, 15000 హెక్టార్ల భూమిని రానున్న 5 సంవత్సరాలలో 30 కోట్ల రూపాయలతో పచ్చదనంతో నింపనుంది

## విశాఖపట్నం అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ (VUDA)

ఈ పట్టణాభివృద్ధి సంస్థను 1978లో రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసింది దీని పరిధిలో 1721 చ కి మీటర్ల వైశాల్యంతో విశాఖపట్నం మునిసిపల్ కార్పోరేషన్ మరియు అనకాపల్లి, గాజువాక, భీమిలి, విజయనగరం పురపాలక సంఘాలు మరియు 287 గ్రామాలున్నాయి

ఈ సంస్థలో ప్రధానంగా 5 విభాగాలున్నాయి

1 పరిపాలన (2) ప్లానింగ్ (3) ఇంజనీరింగ్ (4) అకౌంట్సు (5) అటవీ విభాగం

ఇందులో

280 మంది ఉద్యోగులు - శాశ్వత ప్రాతిపదికపైన

96 మంది రెగ్యులర్ యన్ యం ఆర్ లు

65 మంది రోజువారి కూలీలు

వీరందరి జీతభత్యాలు సంవత్సరానికి సుమారు 5 కోట్ల రూపాయలు అవుతాయి

**చేపట్టి, పూర్తి చేసిన పథకాలు**

1 లాభసాటివి

గృహనిర్మాణం - 28 పథకాలు

నిర్మించిన ఇండ్లు - 6846

నిర్మాణం చేసిన భూమి విస్తీర్ణం - య 313 24

పెట్టుబడి వ్యయం - 62 50 కోట్ల రూపాయలు

2 స్థలాల అభివృద్ధి చేసినవి

లే అవుట్లు - 34

ప్లాట్ల సంఖ్య - 12085

వ్యయం - రు 27 20 కోట్లు

విస్తీర్ణం - 1718 06 యకరాలు

3 వాణిజ్య సముదాయాలు సంఖ్య - 35

షాపులు సంఖ్య - 626

స్టాల్స్ - 103

ఆఫీసు వసతి - 1,59,000 చ అ

వ్యయం 5 70 కోట్లు రూపాయలు

4 సమాజ ప్రయోజక పథకాలు

1 పార్కులు 7

అభివృద్ధి వ్యయం - 2 88 కోట్లు రూపాయలు

2 రహదారులు - రోడ్ వెడల్పు - 119 84 కి మీటర్ల

వ్యయం ం రు 6 78 కోట్ల రూపాయలు

3 వినోద, వైజ్ఞానిక, క్రీడాసౌకర్యాలు సమాజాభివృద్ధి పథకాలు

పథకాలు - 10 వ్యయం - రు 4 85 కోట్లు

5 1999-2000లలో పూర్తి చేసి, లబ్ధిదారులకు కేటాయించినవి

1 బుచ్చిరెడ్డిపాలెం గృహ సముదాయం ప్లాట్సు - యం ఐ జి -120 వ్యయం-రు 4కోట్లు

2 కనకపాక అయ్యన్నపేట - (4వ దశ)

3 ఉద్యోగభవన్ - 5 6 అంతస్థులు - శిరిపురం, విశాఖపట్నం

4 బాలచెరువు గృహసముదాయం, విశాఖపట్నం

(యింక అలాట్ చేయాలి) యిం ఐ జి 81 వ్యయం 2 40 కోట్ల రూపాయలు

6 సమీకృత ఆరోగ్య, మౌలిక సౌకర్యాల పథకం

రాష్ట్రప్రభుత్వ ఆదేశాల మేరకు ప్రస్తుత మానసిక (మెంటల్) ఆసుపత్రి కాంపౌండ్‌లో 13 ఎకరాల స్థలంలో మానసిక, గుండెజబ్బుల, అంటువ్యాధుల నివారణ వైద్యశాల సముదాయాన్ని రు 18 కొట్ల రూపాయల వ్యయంతో చేపట్టుటకు చర్యలు తీసుకుంటుంది అనువైన డిజైన్ల కొరకు దేశవ్యాపితంగా సమాలోచనలు చేస్తుంది ఈ పథకం అమలు, నిర్వహణకు ఒక ఉపసంఘం గూడ ఏర్పడింది

7 ఇరవై సంవత్సరాల నుండి నిర్మించి, కేటాయించిన గృహాలను, అభివృద్ధి పరచిన స్థలాలకు అంతిమ విలువను నిర్ణయించటంతో దీర్ఘకాలయాపన జరిగింది అలాంటి 16 పథకాలకు సంబంధించి, తుది విలువలు నిర్ణయించి, లబ్దిదారుల నుండి ఒక కోటి యాభై లక్షల రూపాయల (తేడా సొమ్మును) వసూలు చేయటం జరిగింది

8 ఇంటర్నెట్‌తో వెబ్‌సైట్‌ను అనుసంధానం చేయుట ద్వారా, ఉడా కార్యక్రమాలు అందరికి అందుబాటులోనికి వచ్చాయి

9 పర్యాటక పనులు పర్యాటక శాఖ వారి పనులు - తొట్లకొండ బాలికొండకు (బౌద్ధకేంద్రాలు) రోడ్ల నిర్మాణం, ఒక కోటి రూపాయల వ్యయంతోనూ, రు 40 లక్షల వ్యయంతో హనమంతవాక నుండి సింహాచలం కొండలకు ఒక రోడ్‌ను నిర్మాణం పూర్తిచేశారు

10 డైక్స్ టాంకు - వైశాఖి జల ఉద్యానవనం

వినోద, విజ్ఞాన దాయకమైన పర్యాటక కేంద్రంగా పాతబస్తీ ప్రాంత ప్రజలకు గాను డైక్స్ టాంకు అభివృద్ధి డిజైన్లు తయారు చేయబడినవి 2 6 2000న వైశాఖ జల ఉద్యానవనానికి రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు

11 నీటి నిల్వల పథకం (Water Shed) క్రింద 20 చెక్‌డాంలు, మధురవాడ చెరువు అభివృద్ధి, కైలాసహిల్ వద్ద కాంటర్, ట్రెంబింగ్ సాగర్ నగర్‌లో వర్షపు నీరు నిల్వలకు పనులు చేపట్టబడినవి నూటికి 75 వంతులు పూర్తయ్యాయి

## ప్లానింగ్ విభాగం :

1 1989లోనే పట్టణాభివృద్ధి సంస్థ పరిధిలోని 1721 చ కి మీ విస్తీర్ణానికి మాస్టర్ ప్లాను రూపొందించి, ప్రభుత్వ మంజూరు కూడా పొందింది శరవేగంతో పారిశ్రామికీకరణ పెరుగుతున్న దృష్ట్యా, మాస్టరు ప్లానును తదనుగుణ్యంగా మార్చవలసిన స్థితి ఏర్పడింది 2021 టార్గెట్‌గా పెట్టుకొని, ఆ దిశగా చర్యలు చురుకుగా సాగుతున్నాయి

2 పై మాస్టరు ప్లానులో చొప్పించుటకుగాను, ట్రాఫిక్, రహదారి, రవాణా సర్వే

జరుపుటకు ప్రతిపాదనలు తయారు చేస్తున్నారు

3 జోనల్ అభివృద్ధి ప్లానులు, విశాఖపట్నం, విజయనగరం, అనకాపల్లి, భీమునిపట్నం, గాజువాక, మధురవాడ, రుషికొండలకు జోనల్, డిపార్ట్‌మెంట్లు, ప్లాన్లు సిద్ధం చేయబడి, ప్రభుత్వ ఆమోదం కూడా పొందడం జరిగింది

4 కూర్మన్నపాలెంలో 39 17 ఎకరాలు, అక్కిరెడ్డిపాలెంలో 17 78 ఎకరాలు, కుమ్మరిపాలెంలో 17 78 ఎకరాల ప్రభుత్వ భూమి ఏదుల పాకలో 19 62 ఎకరాలు స్వాధీనం చేసుకోవటంతో, వాటికి తగిన లే అవుట్లు మౌలిక సదుపాయాల ఏర్పాటుకు చర్యలు ప్రారంభమయినాయి

5 సంస్థ పరిధిలోగల పురాతన, చారిత్రక, భవనాల గుర్తింపు రక్షణకు ప్రత్యేక డివిజన్ ఏర్పాటు చేయబడింది

6 1999 వరకు 334 లే-అవుట్స్‌ను ఖరారు చేసింది 1999-2000 సంవత్సరాలలో మరొక 28 లే అవుట్స్ అప్రూవ్ చేసింది 1987 నుండి బలహీనవర్గాలకు చెందిన 837 లే-అవుట్లు - 1,00,876 ప్లాట్లతోనూ 1999-2000 సం॥ మరొక 152 లే-అవుట్లు 12678 ప్లాట్లుతో అనుమతినిచ్చింది

7 భవనాల రెగ్యులరైజేషన్ పథకం క్రింద 569 దరఖాస్తులు అందాయి అపరాధ రుసుం క్రింద రు 18,50,5971 వసూలయింది

8 విశాఖపట్నం శిరిపురం జంక్షన్‌లో (కూడలి) హైటెక్ ప్లాజా పలు అంతస్తుల భవనాన్ని నిర్మించటానికి చర్యలు తీసుకుంటుంది

## 1. గృహనిర్మాణ పథకం :

1 మాధవధార (మర్రిపాలెం) పథకం 160 యూనిట్లు

2 వేపగుంట యల్ ఐ జి హౌసింగ్ స్కీము 49 20 లక్షల వ్యయం

3 అనకాపల్లి హౌసింగ్ స్కీము వ్యయం అంచనా రు 2.16 కోట్లు

4 మధురవాడ హౌసింగ్ స్కీము వ్యయం అంచనా రు 2.16 కోట్లు

## 2 నివేశన స్థలాల అభివృద్ధి .

1 కూర్మన్నపాలెం - 6వ దశ, విస్తీర్ణం - 12 09 ఎకరాలు ప్లాట్లు - 110 వ్యయం రు 52/-లు

2 కూర్మన్నపాలెం విస్తీర్ణం - 2090 ఎకరాలు - ప్లాట్లు 234 వ్యయం రు 1 02 కోట్లు

## 3. మౌలిక సదుపాయాలు కొరకు - మంజూరు :

భీమిలి రు 30 లక్షలు

విజయనగరం - రు 52 లక్షలు

అనకాపల్లి - రు 50 లక్షలు

గాజువాక - రు 50 లక్షలు

విశాఖపట్నం - రు 100 లక్షలు

పంచాయతీ ప్రాంతాల అభివృద్ధికి రు 150లక్షలు

## ఉడా ఆర్థిక పరిస్థితి - 1999 - 2000 జమా ఖర్చులు

| జమలు | ఖర్చులు |
|---|---|
| ప్లాట్ల అమ్మకం - రు 650 లక్షలు | భూములు కొనుగోలు - రు 25 లక్షలు |
| ఇండ్ల అమ్మకం - రు 868 లక్షలు | మిగిలిన పనులకు - రు 577 లక్షలు |
| జనరల్ పద్దులు - రు 20లక్షలు | 2000-2001 కొత్త పనులకు-రు 767లక్షలు |
| ఇతర సంస్థల నుండి-రు 158 లక్షలు | జీతభత్యాలు - రు 421 లక్షలు |
| అడ్వాన్సుల రికవరి - రు 150లక్షలు | అవసర ఖర్చులు - రు 68 లక్షలు |
| | యితర ఖర్చులు - రు 49లక్షలు |
| | అప్పులు, అడ్వాన్సులు -రు 99 లక్షలు |
| | హడ్కో అప్పు తీర్చుట - రు 292 లక్షలు |

## 2000-2001 ఆదాయ వ్యయాల అంచనాలు

వ్యయం

| | |
|---|---|
| అభివృద్ధి పనులకు | రు 30 00 కోట్లు |
| నడుస్తున్న పనులకు | రు 9 00 కోట్లు |
| కొత్త పనులకు | రు 21 00 కోట్లు |
| బడ్జెట్ లోటు | రు 1 93 కోట్లు |

వనరుల సమీకరణ

| | |
|---|---|
| గృహపథకాల ద్వారా | రు 13 18 కోట్లు |
| ప్లాట్లు అమ్మకం ద్వారా | రు 8 66 కోట్లు |
| ఇతర ఆదాయాలు | రు 5 00 కోట్లు |

## అటవీ విభాగం

1 సముద్ర ఒడ్డున 50 ఎకరములలో నిర్మించిన ఉడా పార్కు, ఇందులో స్కేటింగ్ రింక్స్, ఫౌంటెన్స్, డెస్టినిటవర్, బోటింగ్ ఏర్పాట్లు ముఖ్య ఆకర్షణలు

2 కైలాసగిరి పార్కు-50 ఎకరాల భూమిలో (మరొక 50 ఎకరాల విస్తరణకు వీలుంది) 582 అడుగుల ఎత్తున వుండటంతో, బహు ఆకర్షణీయంగాను, విశాఖపట్నం నగర దృశ్యాన్ని తిలకించటానికి వీలుగా అభివృద్ధి చేయబడింది

3 వైశాఖ జల ఉద్యానవనం నగర మధ్యభాగంలో 3 48 ఎకరాల విస్తీర్ణంతో నిర్మించబడింది

4 నగరంలో తెన్నేటి పార్కు, ఆదిభట్ల నగర్ కార్తికవనం సముద్రపు ఒడ్డున నిర్మాణం జరుగుతుంది

క్లీన్ అండ్ గ్రీన్ కార్యక్రమంలో - పలు చోట్ల వేలాది రకరకాల మొక్కలు నాటబడి, పోషించబడుచున్నవి మరికొన్ని ప్రాంతాలలో పార్కులు, వనాలు పెంచటానికి పథకాలు రూపొందించబడుచున్నవి

# విజయవాడ, గుంటూరు, తెనాలి, మంగళగిరి అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ

ఈ పట్టణాభివృద్ధి సంస్థను 7 12 1978న రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసింది దీని పరిధిలో 7 పట్టణ ప్రాంతాలు, 154 గ్రామాలు వున్నాయి 1991 నాటికి జనాబా 24 34 లక్షలు ప్రస్తుతం 35 44 లక్షలుంటుంది రెండు మునిసిపల్ కార్పొరేషన్లు, విజయవాడ, గుంటూరు, రెండు మునిసిపాలిటీలు - తెనాలి, మంగళగిరి, మూడు పెద్ద పంచాయతీలు - గన్నవరం, కొండపల్లి, తాడేపల్లి, ఇబ్రహీంపట్నం లున్నాయి ఈ సంస్థ పరిధి విస్తీర్ణం 1665 చ కి మీ

**1 ఈ సంస్థ చేపట్టిన ప్రధాన కార్యక్రమాలు**

1 సంస్థ పరిధిలోని నాల్గు పట్టణ ప్రాంతాలు పోను, మిగతా ప్రాంతానికంతా మాస్టరు ప్లాను తయారుచేయగా 1988లో ప్రభుత్వ ఆమోదం పొందింది కొండపల్లి, కానూరు జోన్లకు జోనల్ అభివృద్ధి ప్లానును ప్రభుత్వానికి పంపించబడినవి మంగళగిరి, నిడమానూరు, గన్నవరం, నున్న, గొల్లపూడి, తాడేపల్లి జోన్లకు ప్లాన్లు పంపబడినవి ప్రభుత్వం మంజూరు ఇంకా రాలేదు

**2 పునరావాస కార్యక్రమాలు**

1 నగరంలోని కాల్వ వొడ్డున గల ఆక్రమణదారులకు పాయికాపురంలో పునరావాసం కల్పించబడింది

2 భాస్కరరావుపేటలోని ఆక్రమణలు తొలగించి, వారందరికి చలసానినగర్‌లో పునరావాసం చేయటం

3 తూర్పు పాకిస్తాన్ నిర్వాసితులకు పాయకాపురంలో పునరావాసం

4 1977లో గుంటూరు సంగడిగుంట ప్రాంతంలో తుపాను కారణంగా యిళ్లు కోల్పోయిన వారికి సంగడిగుంటలో పునరావాసం

**3 సామాజిక అడవుల పెంపుదల**

ఈ పదకంలో భాగంగా రోడ్ల వెంట, చెరువుకట్టలు, కాల్వగట్లు, కొండలు, ఖాళీస్థలాల్లో రు 120 48 లక్షల రూపాయల వ్యయంతో విరివిగా చెట్లు పెంపకం చేపట్టబడింది

4 **రోడ్ల అభివృద్ధి**

విజయవాడ నగరంలోను, మంగళగిరి, గుంటూరు, తెనాలి పట్టణాలలో ముఖ్యమైన 12 రోడ్లను అభివృద్ధి పరచటం, మరికొన్ని రోడ్లను వెడల్పు చేయటం, మరికొన్ని కొత్త రోడ్లు నిర్మించటం, తారు, కంకరరోడ్లు-మొత్తం పట్టణాభివృద్ధి సంస్థ పరిధిలో 34 రోడ్లను అభివృద్ధి చేసింది

**1 తెనాలి - చెంచుపేటలో** 1982లో 97 42 ఎకరాల భూమిని స్వాధీనపరచుకొని, దానిని 1333 ప్లాట్లుగా విభజించి, అభివృద్ధిపరచి, అమ్మకం చేయబడినవి

**2 విజయవాడ - పాయికాపురం ఏరియాలో** 160 49 ఎకరాల భూమిని స్వాధీన పరచుకొని, 835 తక్కువ ఆదాయం గలవారికి, 483 మధ్యరకం ఆదాయంగలవారికి, 483 మధ్యరకం ఆదాయం కలవారికి 247 హెచ్చు ఆదాయాలు వచ్చేవారికిగాను రూపొందించబడినవి 1989లో 582 ప్లాట్లు అమ్మబడినవి కాని ఆ ప్రాంతం బుడమేరు వరద ముంపుకు గురౌతున్నందున, లే అవుట్‌ను మార్చటం వల్ల, పైన తెల్పిన ప్లాట్ల సంఖ్య తగ్గినది పర్యవసానంగా బలహీనవర్గాల వారికి 100 చ గ చొప్పున, 484 ప్లాట్లు, తక్కువ ఆదాయవర్గాలకు 165 చ గ చొప్పున, 406, మధ్య ఆదాయం గల వారికి266 చ గ చొప్పున 120 ప్లాట్లు లభించాయి

**3 గృహనిర్మాణం - పాయికాపురంలో** హడ్కో రుణంతో గృహనిర్మాణం చేపట్ట బడింది మొత్తం 706 గృహాలను రు 7 కోట్ల 34 లక్షల వ్యయంతో (అందులో హడ్కో వాటా 5 కోట్లు)

ఎల్ ఐ జి ఇళ్లు - 110 చ గ - 184 చ అ ప్లింత్ ఏరియా వెల 65,000 రూపాయలు
ఎల్ ఐ జి 1-266చ గ -351 1/2 చ అ ప్లింత్ ఏరియా 1,60,000 రూపాయలు
" 11 - " 485 95 చ అ ప్లింత్ ఏరియా 2,10,000 రూపాయలు

4 **మంగళగిరి సమీపంలో అమరావతి టౌన్‌షిప్** మంగళగిరి సమీపంలో నవులూరు గ్రామంలో (స్థలాలు, విజయవాడ - మంగళగిరి - గుంటూరు రోడ్ సమీపంలో వున్నాయి ) 1986లోనే 390 ఎకరాల భూమి స్వాధీనపరచుకున్నా, 10 సం॥పాటు తదుపరి చర్యలు తీసుకోబడలేదు ముఖ్యంగా మంచినీటి సరఫరాకు తగిన ఏర్పాటు లేక సమీపంలోని కృష్ణాయపాలెం వద్ద నున్న నీటి మార్గాన్ని-సిమెంటు పైపు గొట్టాల ద్వారా యీ టౌన్ షిప్‌కు రోజుకు 15 లక్షల గాలన్ల సరఫరా ఏర్పడింది ఈ లే అవుట్‌లో 943 వివిధ విస్తీర్ణాలు గల ప్లాట్లు గానూ, విశాలమయిన రోడ్లు, సామాజిక అవసరాలకు ఖాళీస్థలాలు కేటాయించారు ఈ భూమిలో 50,000 వివిధ రకాల చెట్లు నాటబడి, మంచి పోషణతో బాగా పెరిగాయి మొత్తం యీ పథకం వ్యయం 24 27 కోట్ల రూపాయలు

**5. గుంటూరు వద్ద నందమూరి తారక రామారావు మానససరోవరం-ప్రకృతి ఉద్యానవనం** 53 ఎకరాల ఏరియాలో 2 కోట్ల 24 లక్షల రూపాయల వ్యయంతో యీ ఉద్యానవరం సర్వాంగ శోభితంగా అభివృద్ధి చేయబడింది బోటింగ్ ఛానల్, జింకల పార్కు, కాటేజెస్,

ఫౌంటైన్లు, వాచ్‌టవర్ వగైరా ఆకర్షణలు ఏర్పాటు దీనిని ఇటీవల గుంటూరు నగర పాలక సంస్థకు ప్రభుత్వ ఉత్తర్వుల ద్వారా అప్పగించబడింది

**6 మంగళగిరి వద్ద 'మిని జూ' ఏర్పాటుకు 148 13 ఎకరాలు కేటాయింపు** 2కోట్ల 50 లక్షల రూపాయల వ్యయంతో పట్టణాభివృద్ధి సంస్థ విజయవాడ నగర పాలకసంస్థ సంయుక్త యాజమాన్యాన్ని ఏర్పాటుకు పథకాలు సిద్ధం చేయబడినవి దీని నిర్మాణానికి సెంట్రల్ జూ అథారిటీ వారి ఆమోదం కొరకు ఎదురుచూస్తున్నారు

7 విజయవాడ ఔటర్ రింగ్‌రోడ్ నిర్మాణానికి కిర్లోస్కర్ కన్సల్టెంట్సు నివేదిక కొరకు అప్పగించబడింది అదే విధంగా గుంటూరు నగరానికి కూడా ఔటర్ రింగ్‌రోడ్ పథకం పరిశీలనలో వుంది

8 అనేక ప్రాంతాల్లో అనేక రోడ్ల నిర్మాణం పూర్తి చేయబడింది

9 విజయవాడ - గుణదల ఏరియాలో మినిటౌన్‌షిప్‌కు 98 48 ఎకరాల భూమి స్వాధీనం చేసుకునే దశలో వుంది నగరపెరుగుదలకు ఈ దిక్కు అనుకూలంగా వున్నందున, మరొక 1000 ఎకరాల స్వాధీనానికి ఆలోచనలు జరుగుతున్నవి ఈ పథకానికి మొత్తం రు 168 85 కోట్లు అంచనాలు సిద్ధం అయినవి

10 రు 30లక్షల రూపాయల వ్యయంతో తెనాలిలో కాల్వలపై మూడు బ్రిడ్జీలు నిర్మించబడినవి

11 25 లక్షల రూపాయల వ్యయంతో సంస్థ కార్యాలయ భవనంలో మొదటి అంతస్తు నిర్మాణం పూర్తి అయింది 2వ అంతస్తు నిర్మాణం త్వరలో చేపట్టనున్నారు

12 కొండపల్లికోట అభివృద్ధి ఈ కోట అభివృద్ధి పనులకు ప్రధమదశలో 85లక్షల రూపాయలు మంజూరు చేయబడినవి

ఈ పథకం రాష్ట్రప్రభుత్వ పర్యాటక శాఖతో సంయుక్తంగా చేపట్టబడినది రెండు దశలలో పునరుద్ధరణ ద్వారా , ఆర్చీలు, మరమ్మతులు, పర్యాటక ఏర్పాట్లకు రు 4 కోట్లు రూపాయల మంజూరు

13 ఎనికేపాడు వద్ద రైవీసు కాల్వపై వంతెన నిర్మాణానికి రు 4 లక్షలు కంట్రీబ్యూషన్‌గా మంజూరు చేసింది

14 భవనాల రెగ్యులరైజేషన్ పథకం క్రింద - యీ సంస్థకు 86 43 లక్షల రూపాయల ఆదాయం లభించింది

15 ఇబ్రహీంపట్నంవద్ద 30 ఎకరాల స్థలంలో సుమారు 3 కోట్ల రూపాయల వ్యయంతో ఆధునిక ట్రక్‌స్టాండు పథకాన్ని యిటీవల ఆమోదించారు హైదరాబాద్ రోడ్‌లో ప్రతిదినం విజయవాడకు వచ్చిపోయే వందలాది లారీలు నగరంలోనికి వెళ్లి, ట్రాఫిక్ రద్దీ హెచ్చు చేస్తున్నందున, ఇక్కడ ఎగుమతి, దిగుమతి, గోడౌన్, గెస్ట్‌హౌస్ కార్మికుల విశ్రాంతి, కాంటీన్ వగైరా సౌకర్యాలతో యీ పథకం పూర్తి చేయబడుతుంది

# కాకతీయ అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ, వరంగల్ (కుడా)

కాకతీయ పట్టణాభివృద్ధి సంస్థ పరిధిలో వరంగల్ నగర పాలక సంస్థతో పాటు 171 పరిసర గ్రామాలతో-1865 చ కి మీటర్ల వైశాల్యంతో 1982లో ఏర్పాటు చేయబడింది ఈ సంస్థ నిర్మాణ, పరిపాలనా సౌలభ్యం కొరకు 1) పరిపాలన 2) అక్కౌంట్సు 3) అభివృద్ధి 4) ప్లానింగ్, భూస్వాధీన విభాగాలుగా కార్యక్రమాలు నిర్వహించుతుంది

ఆదాయ వ్యయాలు గత అయిదు సంవత్సరాల కాలంలో

| | ఆదాయం | వ్యయం |
|---|---|---|
| 1995-96 | 49 56 లక్షలు | 110 14 లక్షలు |
| 1996-97 | 89 16 | 56 41 |
| 1997-98 | 98 34 | 64 41 |
| 1998-99 | 155 80 | 79 91 |
| 1999-2000 | 175 61 | 119 12 |

ఈ సంస్థ వరంగల్ నగరపాలక సంస్థ ప్రాంతంతో సహా తన పరిధిలోని ప్రాంతాలలో జోనింగ్ రెగ్యులేషన్స్, బైలాలు, భవనాల నిర్మాణం అనుమతితోపాటు ఆ ప్రాంతాల సమగ్ర అభివృద్ధికి తన పరిమితులలో కృషి చేస్తుంది

**ఈ కాలంలో సాధించిన అభివృద్ధి**

1 ట్రాన్స్‌పోర్టు పెరుగుతున్న నగర జనాభా, వాహనాల రాకపోకలకు ఇబ్బందికరంగా వున్న రోడ్లను, డ్రయిన్లను 157 10 కిలోమీటర్లను 124 90 లక్షల వ్యయంతో అభివృద్ది చేసింది

2 రు 37 60 లక్షల వ్యయంతో ట్రాఫిక్ రద్దీ వున్న చోట్ల 5 కి మీటర్ల పొడవు రోడ్డును వెడల్పు చేసింది

3 రు 28 16 లక్షల వ్యయంతో నగరంలో 12 జంక్షన్లను అభివృద్ధి పరిచింది

4 రు 19 85 లక్షల వ్యయంతో రైల్వే అండర్ బ్రిడ్జి నిర్మాణం పూర్తి చేసింది

5 రు 172 45 లక్షల వ్యయంతో, జవహర్ రోజ్‌గార్ యోజన సహకారంతో 42 80 కి మీ రోడ్లను అభివృద్ధి చేసింది

6 క్లీన్ అండ్ గ్రీన్ కార్యక్రమం క్రింద సామాజిక అడవిని పెంచేందుకు 21 648 ఎవెన్యూచెట్లను పెంచి పోషిస్తుంది దీనికిగాను రు 38 47 లక్షల వ్యయం చేసింది

7 కుడా కార్యాలయ సముదాయం నిర్మాణం రు 66 95 లక్షల వ్యయంతో పూర్తిచేసింది ఇందులో కూడా కార్యాలయంతో పాటు, యితర ప్రభుత్వ శాఖల కార్యాలయాలు కూడా వున్నాయి

8 రు 20 లక్షల వ్యయంతో జవహర్‌లాల్ నెహ్రూ స్టేడియం అభివృద్ధికి చర్యలు కూడా వున్నాయి

9 డాక్టరు బి ఆర్ అంబేద్కర్ కమ్యూనిటీ సెంటరు మరియు పరనాలయాన్ని రు 10లక్షల వ్యయంతోను, రు 5 లక్షల వ్యయంతో పి వి నరసింహారావు ఇండోర్ స్టేడియంకు ప్రహరీగోడ నిర్మాణం పనులు పూర్తి చేసింది

10 ప్రతిష్ఠాకరమైన, ఆకర్షణీయమైన కాకతీయ మ్యూజికల్ గార్డెన్ పధకం 15 ఎకరాల స్థలంలో నిర్మించబడి, ప్రజోపయోగంగా వుంది ప్రక్కనే వున్న ప్లానిటోరియం (నక్షత్రశాల) పురావస్తుశాఖ వారి మ్యూజియంలు, పోతన విజ్ఞానపీఠం, ఆడిటోరియం, భద్రకాళి ట్యాంకులతో అలరారుతుంది అన్నివర్గాల ప్రజలను విశేషంగా ఆకర్షిస్తుంది

ఈ భారీ పధకానికి రు రెండుకోట్లు ఖర్చుకాగలదనియు, యిది రెండు దశలుగా పూర్తిచేయాలని నిర్ణయించబడింది ప్రధమ దశ సుమారు ఒక కోటి రూపాయల వ్యయంతో దాదాపు పూర్తి అయింది

ఇవేగాక, అంబేద్కర్ జంక్షన్‌లో ఫ్లోరల్‌క్లాక్‌గార్డెన్, హనుమకొండ, చౌరస్తాలో బాల్‌ఫౌంటెన్, వడ్డేపల్లి జంక్షన్‌లో క్వెస్టుపార్కు, వరంగల్ అండర్‌బ్రిడ్జివద్ద 'నోరష్' పార్కు, పోచమ్మ మైదాన్ జంక్షన్‌లో ఇక్బల్ మినార్ ఏర్పాటు, పూర్తయ్యాయి రాణి రుద్రమదేవి కాంశ్య విగ్రహాన్ని ప్రతిష్టించుటకు చర్యలు తీసుకుంటున్నారు

11 నీరు-మీరు, జన్మభూమి, ప్రజల భాగస్వామ్యంతో చేపట్టబడుచున్నవి ఈ సందర్భంగా ఆయా వర్గాల ప్రతినిధులతో అనేక వర్క్‌షాపులు నిర్వహించబడుచున్నవి

12 కదిరెడ్డి కుంట స్థలాన్ని అభివృద్ధి చేసి, ప్లాట్లుగా విభజించి అందులో 48 ప్లాట్లను బహిరంగవేలం ద్వారా అమ్మగా రు 116 లక్షల ఆదాయం లభించింది లక్ష్మీసాగర్ ప్రాంతంలో 5 ఎకరాలు దూరదర్శన్ కేంద్రానికి, 5 ఎకరాలు, బలహీనవర్గాల గృహ నిర్మాణానికి యివ్వగా మిగిలిన 20 ఎకరాలలో 136 ప్లాట్లను అభివృద్ధిపరచి, యిప్పటికి 49 ప్లాట్లను 123 లక్షల రూపాయలను విక్రయించగా మిగతావి కూడా అమ్మే కృషి సాగుతుంది

నిధుల పరిమితులను బట్టి ఆయా ప్రాంతాలలో అభివృద్ధి కార్యక్రమాలు కొనసాగిస్తున్నారు ప్రస్తుత పాలక బోర్డు కాలపరిధిని మార్చి 2000తో ముగిసింది. కాని కొత్త బోర్డు ఏర్పాటు కాలేదు



